# యుగసంధి

రచయిత

భాస్కరభట్ల కృష్ణారావు

తెలంగాణా రాజకీయ సాంఘిక వాతావరణము ప్రాతిపదికగా
రచించిన సామాజిక నవల.

# పరిచయము

నిండుమనమ్ము నవ్యనవనీతసమానము. పల్కుమాత్రము దారుణాఖండలశస్త్రతుల్యము కాదు. మనిషి చూడడానికి ఎంత నిండుగా కనిపిస్తాడో అంతనిండుగానూ చేపట్టినపని జయప్రదంగా నిర్వహిస్తాడు. భాస్కరభట్ల కృష్ణారావు భాగ్యనగర వాస్తవ్యుడు. ప్రఖ్యాతిచెందిన పండిత వంశంలో జన్మించినాడు. తండ్రి తాతలు నిత్యాగ్నిహోత్రులు దేవీపూజానిరతులు; సనాతనధర్మపరాయణులు. అయితే తానుమాత్రం వింశతిశతాబ్ది విలాసపురుషుడు. కలకత్తా విశ్వవిద్యాలయంలో బి. యస్. సి., ఉస్మానియాలో యల్. యల్. బి. ప్యాసుచేసి డక్కన్ రేడియోలో కొలువుకుదిరి నాటకాలు వేయించాడు, పాటలు పాడించాడు, మాటలు చెప్పించాడు. పోలీసుచర్య అనంతరం, ఆలిండియా రేడియో హైదరాబాదును తనలో లీనంచేసుకొన్నప్పుడు, కృష్ణారావుకూడ ఎ. ఐ. ఆర్. లో కలిసిపోయాడు. కొన్నాళ్లు మద్రాసు ప్రవాసం అనుభవించి ప్రస్తుతం స్వగ్రామం చేరుకొన్న యీ యదృష్టశాలి నలభైయేండ్లు నిండకుండానే నిండు జీవితం అనుభవించి తన యనుభవాలను అక్షరరూపంలోనికి అనువదించాడు. జీవితాన్ని విజ్ఞానాన్ని చదువుకొన్నవాడు; సంస్కారం కలవాడు. నిండుకుండలాగ తొణకడు, బెణకడు. తాను చూచింది చూచినట్లు సునిశితంగా సుస్పష్టంగా చెప్పగలడు. మనకనులయెదుట మారిపోతూన్న లోకం ఇతని సంస్కరణ సులోచనాలలో వర్చస్విగా సువర్ణగా సాక్షాత్క-

రిస్తున్నది. తన మనస్సు కనుగొన్న సత్యాలను మనయెదుట మనోహరంగా మంజుల వ్యాఖ్యతో ఈ రచయిత ప్రతి పాదిస్తున్నాడు. అనుకరణలు లేవు; అనుసరణలు లేవు. యథార్థం తానుచూచినట్లు మనకు నివేదిస్తున్నాడు. అందుకే ఈతని పాత్రలు మనకి సన్నిహితంగా కనిపిస్తారు. ఇతడు వర్ణించిన దృశ్యాలూ సన్నివేశాలూ మనం కన్నవీ విన్నవీ యనే భ్రాంతి కలిగిస్తాయి. ఈ పాత్రలు పరిస్థితుల ప్రభావానికి అతీతులుకారు. పరిస్థితులబట్టి ప్రవర్తిస్తారు. అందుకే వారు నీతి నియమాలను అతిక్రమించినా సంఘచట్రానికి హద్దుమీరినా మన సానుభూతి సంపాదించుకొంటారు. వారి కన్నీళ్ళు మనల్ని కరగించివేస్తాయి. వారి నవ్వులు మనల్ని నవ్విస్తాయి. వారి అనుభవాలు మనల్ని రసప్రబుద్ధుల్ని చేస్తాయి.

'భాస్కరభట్ల' తాను సాహిత్యవేత్తనని చెప్పుకోడు. ఎవరైనా తన్ను రచయితగా పరిగణిస్తే సిగ్గుపడిపోతాడు. కాని అతనిజీవితానందానికి సాధనమార్గంసాహిత్యమొక్కటే! అది ఆయన ఆత్మానందంకోసం చేసుకొన్న సృష్టి. పాఠకుల ప్రశంసలకోసం వ్రాసిందికాదు. తెలంగాణాలో సాహిత్య మహోదయం సాగించడానికి కారణమైన సంస్థలతో కృష్ణారావుకి ప్రత్యక్షసంబంధం ఉన్నది. ఆంధ్రసారస్వతపరిషత్తు' విజ్ఞానవర్ధనీపరిషత్తు, సాధనసమితి ఇటువంటి సంస్థలకు పాదు పెట్టినవారిలో ఈయన ఒకరు. సాహిత్యప్రియులతో సహృదయులతో సారస్వతవ్యాసంగంచేసి చక్కని అభిరుచులను అలవరచుకొన్నాడు. అందరిరచనలూ చూచి ఆకళించుకొ

న్నాడు; ఆస్వాదించాడు. కాని అనుకరణప్రయత్నం చేయ లేదు. అందుచేతనే 'భాస్కరభట్ల' రచనలు కొన్నిఅయినా, వాటిలో తన ప్రత్యేకప్రజ్ఞ నిలుపుకొన్నాడు. తన స్వయం ప్రభ చాటుకొన్నాడు. సహృదయదృష్టి నాకర్షించాడు.

కథలు, నాటికలూ వ్రాయడం వేరు, సామాజికకథ కలిగిన ఇతివృత్తం వ్రాయడం వేరు. 'భాస్కరభట్ల' తొలినవల 'వింతప్రణయం'. అందులో ఆతడు చిత్రించిన ఆధునిక విద్యావతుల ప్రవర్తనలు ఆంధ్రపాఠకలోకాన్ని సంభ్రమాశ్చర్యాలతో ముంచివేశాయి ఆ యితివృత్తం చిన్నది– పరిధిపెద్దది చేసిన కథానిక అనిపించింది. కాని అందులో పాత్రలుమాత్రం ఒక ప్రత్యేకత గడించుకొని ఒకవిశిష్టతతో రచయితముద్రను ప్రస్ఫుటంగా వ్యక్తపరచాయి. తెలంగాణా సాంఘికవాతావరణం తీరుతెన్నులతో దృగ్గోచరమయింది.అది మంచి నవల. దానితర్వాత ఇది రెండవది.

మన మొక యుగసంధిలో జీవిస్తున్నాము. పాతకాలపు దురాచారాల కట్టుబాట్లు మూలగోడలు కూలిపోయి కొత్త పునాదులమీద గట్టికట్టడాలు లేస్తున్నాయి. భావాల పరివర్తనలో సంకల్పాల సాధనలో, సమాలోచనల సిద్ధిలో యుగసంధి. దీనిలో మన రాజకీయాలూ, సాంఘిక వ్యవస్థలూ, మన ఆచారవ్యవహారాలూ, అలవాట్లూ తారుమారై పోయాయి. ఈ వాతావరణంలో మన తెనుగుజీవనంలో అతలాకుతలమైన కేంద్రం హైదరాబాదురాష్ట్రం. ఈ రాష్ట్రంలోని కుటుంబాలచరిత్రలో మరీ హెచ్చుమార్పులు వచ్చాయి. ఈమార్పులుపొందిన తెనుగుజీవితచరిత్రకి

'యుగసంధి' దర్పణంపట్టి కొన్ని రూపురేఖలు చూపి కొత్త వెలుగులు ప్రసరిస్తూఉన్నది. ఈ నవలలో ఇతివృత్తం 1923-48 సంవత్సరాలమధ్య — రెండుపుష్కరాలసాంఘికగాధకు సంబంధించినది. అయితే ఇందులో రాజకీయాలూ, సాంఘిక పరివర్తనలు కేవలం ప్రాతిపదికలు మాత్రమే. ఈ పార్శ్వభూమిపైన నవలకి వీలైన పెద్దపటం తీసుకొని చక్కని పాత్రలను రచయిత సృష్టిచేశాడు. ఈ నవలలో స్త్రీలు రుక్మిణి, పద్మ, రవణ ఎవరికివాళ్ళే విచిత్రవ్యక్తులు. హైదరాబాదులో జరిగిన సంక్షోభాల బీభత్సానికి గురియైన మానవసంకేతాలు. వారిలో పాతకొత్తల మేలుకలయిక కలిగించిన సంగమం పవిత్రజ్యోతిలాగ ప్రకాశిస్తున్నది. ఆ కాంతి చూపిన రచయిత ధన్యుడు.

తెనుగు స్వతంత్రలో అసంపూర్తిగా వెలువడిన ఈ నవల పూర్తిపాఠం యీరూపంలో అందజేసిన ప్రకాశకుల్ని అభినందనచేస్తూ యీ పుస్తకాన్ని సహృదయపాఠకలోకానికి సమర్పిస్తున్నాము

హేమలంబ; భాద్రపదచతుర్థి
వినాయకచవితి
విజయవాడ.

శ్రీవాత్సవ

# యుగసంధి

పడుకుంటే నిద్రపడుతుందేమోననే భయంకొద్దీ రుక్మిణి పక్కమీద లేచి కూర్చున్నది. గదంతా ఒకమాటు కలయచూసింది. దండెంపైన చీరలు ఏమీ లేవు. చిలక్కొయ్యల పైన రవికలు కనపడలేదు. ఆముదం దీపపు గుడ్డివెలుతురులో, ఒక చిలక్కొయ్యకు వ్రేలాడగట్టిన, తన పెళ్ళినాటి ఫొటో కనపడింది. రుక్మిణి మంచంమీదినించి లేచి ఆముదం ప్రమిద తీసుకొని, అలికిడిలేకుండా ఫొటోని సమీపించింది. దీపం దగ్గరగాపెట్టి, ఫొటోని తదేకదీక్షగా చూచింది. ఎందుకో కళ్ళల్లో చప్పున నీళ్ళు కమ్మాయి. నీళ్ళ పొరలతో, ఫొటోని చిలక్కొయ్య నించి తీసింది. కన్నీళ్ళు బుగ్గలపైన చింది, నెమ్మదిగా చెంపలమీదుగా జారాయి. గూట్లో దీపం పెట్టి రుక్మిణి ఫొటోని కొంగుతో తుడిచింది. తిరిగి నీళ్ళకళ్ళతో ఫొటోని చూచింది. ఫొటోలో లీనమైంది.

ఒక కుర్చీలో పెళ్ళిదుస్తుల్లో తను - తన కుడిప్రక్కన వున్న కుర్చీలో తన భర్త. తన కుర్చీని ఆనుకొని, ఎడమ పక్కన తన తల్లి నిలబడివుంది. భర్త కుడివేపున తన తండ్రి, ఆ పక్కన పెద్దనాన్న నిలబడివున్నారు. తన తల్లి పక్కన పెత్తల్లి నిలబడివుంది. తాతయ్య, రెండు కుర్చీల వెనకాల రెండింటికి మధ్యగా నిలబడి ఉన్నాడు. ముందు జంపుఖానా పైన పెద్దనాన్న కూతురు రమణ, ఆ పక్కన మేనత్తకొడుకు రఘు కూర్చుని ఉన్నారు.

రమణ మొహమంతా అల్లరి పులుముకొని, చిలిపి కళ్ళతో బావని క్రీగంట చూస్తూ, అతని చొక్కా లాగి ముసి ముసి నవ్వులు నవ్వుతున్నట్లు తోచింది. పెదనాన్న 'ఏమి టా అల్లరి?' అన్నట్టు రమణని రూక్షణంగా చూస్తు న్నాడు. ఈ సంఘటనకి, తన తల్లి అమాయకంగా చిరునవ్వు నవ్వుతున్నది. తన చూపులు తన తల్లిపైన పడడంతోనే, ఆమె జాలిగా తన వేపు తిరిగింది. తల నిమిరింది. గట్టిగా తన తలని హృదయానికి హత్తుకున్నది. గట్టిగా... ఇంకాగట్టిగా...

బిగ్గరగా హత్తుకోవడంతో, ఫొటోకు అమర్చిన అద్దం పుటుక్కున విరిగింది. అద్దానికి తోడుగా కుడిచేతికి వున్న నల్ల గాజులు నాలుగు, ముక్కలు ముక్కలు అయినాయి - గాజుముక్కలు చేతికి గుచ్చుకపోవడంతో కౌగిలి సడలింది. రుక్మిణి నిజ ప్రపంచంలో పడ్డది. ఒడి దులిపింది. గాజు పెంకులు చిరు చప్పుడుతో నేలమీద పడ్డాయి. ఫొటో అద్దం నిలువుగా విరిగింది. విరుగుడు గీత ఫొటోపైన తల్లి మొహం మీదుగా జారి, రఘు రమణలను రెండుగా విడదీసింది. 'ఇది దుశ్శకునం కాదు గద?' అని రుక్మిణి హృదయం మూల్గింది. ఏమో? ఎవరు చెప్పగలరు? రుక్మిణికళ్ళల్లో తిరిగి నీళ్ళు కమ్ముకొచ్చాయి. ఆమె వెంటనే ఫొటోను, మేకుకు తగి లించబోయింది. ఎందుకో చప్పున ఆగింది. తన పెట్టె తాళం తీసి, చీరల మడతల మధ్య ఫొటోని భద్రంగా దాచి, పెట్టెకు తాళం వేసింది. పెట్టెపైన తాళంచెవులు పడవేసి, ఎంతో సేపు అక్కడే ఏదో ఆలోచిస్తూ కూచుంది. ఇంతలోకే, కుడి చేతికున్న నాలుగు గాజులు అంతకు క్రితమే విరగడంవల్ల

చెయ్యి బోడిగా కనుపించింది. ఎడమచేతినించి రెండుగాజులు తీసి రుక్మిణి కుడిచేతికి వేసుకుంది.

ఎన్ని గంటలు వేశారో తెలియదు. పోనీ, చతుశ్శాల భవంతిలోకి వెళ్ళి గడియారం చూసి వస్తే? నిజమే, కొంత మనస్సు కుదుటపడుతుంది. కాగా ఎన్ని వేశారు అనే సమస్యే ఉండదు.

రుక్మిణి లేచి పిల్లి అడుగులు వేస్తూ చతుశ్శాల భవంతి లోకి వెళ్ళింది. ఇంట్లో ఎక్కడా ఏ అలికిడి లేదు. ఊరంతా నిశ్శబ్దంగా వుంది. నిశ్శబ్దాన్ని చీలుస్తూ, గడియారం 'టిక్కు' 'టిక్కు' మని చతుశ్శాల భవంతిలో ధ్వని చేస్తున్నది. ఒంటి గంట దాటింది- ఇంకా చంద్రోదయం ఎప్పుడౌతుందో? మూడు గంటలు దాటితేనే గాని, ఈ రోజు చంద్రోదయం కాదని మామయ్య ఉదయం అన్నట్లు రుక్మిణికి జ్ఞాపకం వచ్చింది. పక్కింట్లో బావ గాఢనిద్రలో వుండి వుండాలి. బావ శలవులకి వచ్చి, ఈ వూళ్ళోనే కొన్ని రోజులనించి వుంటున్నాడు. అతనితోపాటు అతని తల్లిదండ్రులుకూడా వచ్చారు... ఒకటీ... రెండు... వెన్నెల రావడానికి ఇంకా రెండు గంటలు కావాలి! ఈ రెండు గంటల కాలాన్ని ఎల్లా వెళ్ళబుచ్చడం? రుక్మిణికి ఏమీ తోచింది కాదు. బట్టలు సర్దుకుంటే? చీరలూ అవీ సర్దేఉన్నాయి. ఇక మిగిలింది పక్కబట్టలు. వాటిని సర్దడానికి ఏమంత టైం అవుతుందని? క్షణంలో సర్దుకోవచ్చు. రుక్మిణి, ఒకమాటు ఇల్లంతా కలయ జూచి రావాలనుకుంది. చతుశ్శాల భవంతిలో వ్రేలాడవేసిన లాంతరు తీసుకొని బయల్దేరింది. తన ప్రస్తుతపు పడకగది,

తన పుట్టుక గదట - అది చతుశ్శాల భవంతికి దక్షిణంగా వుంది. కుటుంబీకుల సంఖ్య పెరిగిన కొద్దీ నర్సయ్య తాత, దక్షిణాభిముఖంగా ఇల్లు పెంచుకూ వెళ్ళాడట - ప్రధాన గృహం తూర్పుముఖంగా వుంది. చతుశ్శాల భవంతికి నాల్గుమూలలా నాలుగు గదులు ఉన్నాయి. ఇందులో ఒకటి వంటగది-దాని పక్కన ఒక నీళ్ళ అర- ఒక సామాను గది ఉన్నాయి. వండే యింట్లో ఒకేమాటు పాతికమంది భోజనం చేయవచ్చు. అది అంత విశాలంగా ఉంటుంది. కాని నర్సయ్యతాత కాలంలో వండే యిల్లు భోజనాలకోసం ఎప్పుడూ వాడుకునేవారుకారట - ఇల్లు ఎప్పుడూ, అతిథీ అభ్యాగతులతో క్రిక్కిరిసి వుండేదట. వంటయిల్లు, ఎన్నడూ భోజనాలకు సరిపోయేదికాదట- భోజనాలు ఎప్పుడూ చతు శ్శాల భవంతిలోనే జరిగేవట. నర్సయ్య తాతకు రామయ్య, క్రిష్ణయ్య అని యిద్దరు అన్నలు. ముగ్గురు అన్నదమ్ములూ చతుశ్శాల భవంతికి మూడువేపులా వున్న మూడుగదుల్లో వుండేవారు. ఆ గదుల్లోనే సంసారాలు చేసేవారు. తన ప్రస్తుతపు పడకగది నర్సయ్య తాత పడకగది అని వినికిడి. రుక్మిణి కుడివేపున వున్న రామయ్యతాతగదిలోకి వెళ్ళింది. రామయ్య తాతకు ఒక్కడే ఒక్క కొడుకు. పేరు నారాయణ. ఎక్కడో జిల్లాలలో ఉద్యోగంచేస్తున్నాడు. ఉద్యోగంలోచేరి తనపేరు నారాయణరావుగా మార్చుకున్నాడు. రమణ ఎల్లా వుందో? ఇటీవలనే పెద్దమనిషి అయిందని వినికిడి. పెళ్ళి సంబంధాలు కూడా వస్తున్నాయట. ఈమధ్య, రమణ తన అల్లరిఏమైనా తగ్గించుకుందా? ఏమో? ఎందుకో రుక్మిణికి పెదనాన్ననీ,

పెత్తల్లి లక్ష్మమ్మనీ, రమణనీ చూస్తే బాగుండుననిపించింది- కాని, కాని... రుక్మిణి, కిష్టయ్యతాత గదిలోకి వెళ్ళింది. కిష్టయ్య తాత చాలా కాలం క్రితమే అన్నదమ్ములతో వేరు పడ్డాడట. ఎందుకు వేరుపడ్డాడో రుక్మిణికి కారణం తెలియదు. నలుగురూ నాలుగు కారణాలు చెప్పడం రుక్మిణి విన్నది. తన తాత నర్సయ్య చాలా పిసిని కొట్టు అనీ, ఇంటికి నలుగురుమనుషులు వస్తే చూచి సహించే వాడు కాడనీ, ఈ సంకుచితత్వాన్నీ పిసినికొట్టుతనాన్నీ భరించలేక కిష్టయ్యతాత వేరుపడ్డాడనీ కొందరు చెబుతారు. కిష్టయ్యతాత తన మొదటి భార్య పోవడంతోనే రంగిని ఉంచుకున్నాడనీ, నలుగురు వచ్చిపోయే ఇంట్లో భోగందానిని పెట్టుకొనివుంటే అపవాదులపాలవుతానని వెరచి, వేరేఒకఇల్లు కట్టించుకొని దానితో అక్కడ కాలక్షేపంచేస్తూ వచ్చాడని మరికొందరు అంటారు. రంగి ఆ వూళ్ళోనే వుంది. ఇప్పటికీ బ్రతికే వుంది. ఎప్పుడు కనపడినా 'మనుమరాలా! బాగు న్నావా?' అని నిండు హృదయంతో పలకరిస్తుంది. రంగి కూతురు యశోదపట్నంలో ఎక్కడో వృత్తిలోనేవుంటే పొట్ట పోసుకుంటున్నది. దానికి రఘుబావ అంటే ఎంతో యిష్టం. బావని కన్నకొడుకులాగా చూసుకుంటుంది. ఎక్కడవున్నా సంవత్సరానికి రెండుమూడుసార్లు అయినా బావని చూడంది వుండలేదు. కిష్టయ్య తాత రెండవసారి ఒక మహారాష్ట్రి అమ్మాయిని పెళ్ళిచేసుకున్నాడు. ఆమె పేరు జిజియాబాయి. కిష్టయ్యతాతకు ఎంతోకాలంవరకు సంతానం కలుగలేదట. భార్యాభర్తలిద్దరూ అనేక తీర్థయాత్రలు చేశారట. తీర్థయా

త్రలుచేయగా చేయగా, ఒక్కతే ఒక్కకూతురు కలిగిందట. పేరు 'వరలక్ష్మి' అని పెట్టుకున్నారట. ఈ వరలక్ష్మి రుక్మిణి మేనత్త. వరలక్ష్మికి యిద్దరుపిల్లలు-రఘూ, రామలక్ష్మి. రామలక్ష్మి పెళ్ళి ఇటీవలనేఅయింది. రఘు పట్నంలో చదువుకుంటున్నాడు. శలవుల్లో ముత్తవతల్లి జిజియాబాయిదగ్గరికి వచ్చిపోతుంటాడు. రుక్మిణికి ఎందుకో తన మేనమామ వెంకటరామయ్య అంటే ఎంతోయిష్టం. కిష్టయ్యతాత గదిలోకి వెళ్ళడంతోనే ఎందుకో చప్పున రఘు ఆమె కళ్ళల్లో మెరిశాడు. అమాంతంగా కళ్ళు చెమ్మగిల్లాయి. వెంకటరామయ్యమామ, శుభ్రమైన తెల్లని ధోతీ, ఉత్తరీయం ప్రత్యక్షమైనాయి. అతని ప్రశాంతమైన గంభీరవదనం కళ్ళకు కట్టింది. ఎందుకో రుక్మిణి వెంకటరామయ్యమామకి రెండుచేతులెత్తి నమస్కారంచేసింది. వెంకటరామయ్యమామ ప్రస్తుతం ఆ వూళ్ళోనే, ఆ పక్కయింట్లోనే ఉన్నాడు. అతనిదగ్గరికి వెళ్ళి, ఆరోజైనా తాను అతనికి నమస్కారంచేసిరానందుకు తననితానే ఎంతోనిందించుకుంది రుక్మిణి—ఎంతో బాధపడింది. ఈ జన్మలో తనకు మళ్ళీ ఆ దైవాంశసంభూతుడి దర్శనం లభిస్తుందా? ఏమో... రుక్మిణి కిష్టయ్యతాత గదిలో నిలువలేకపోయింది. వెంటనే వెలుపలికి వచ్చేసింది. లాంతరు చేతితో చతుశ్శాల భవంతి దాటింది. తూర్పుద్వారంలోంచి నడిచింది. తూర్పుముఖంగా వున్న ప్రధానగృహంలో ప్రవేశించింది. పెద్దహాలు, ఎడమ కుడివేపుల రెండు గదులు-కుడివేపునవున్న గదిలో ఏవో విరిగిన కుర్చీలు, మంచాలు పడివున్నాయి. ఆ గది వెలుపలికి గొళ్ళెం వేసివుంది. గొళ్ళెంతీసి ఆ గదిలోకి వెళ్ళడం, రుక్మిణి

అనవసర మనుకుంది. గదిలో ఏదైనా పురుగు బూచి వుంటుంది. కాగా, ఈమధ్య యింట్లో నాగుపాము ఎక్కువగా తిరుగుతున్నది. అది తన తాతలనాటి పాము -- పెరట్లో దానికి ఒక పెద్ద పుట్ట వుంది. ఇంట్లో ఏ అరిష్టం జరుగనున్నా, అది తరచూ కనపడడం పరిపాటి. అది ఎవ్వరినీ ఏమీ అనదు - పడగ విప్పి, జరగనున్న ప్రమాదాన్ని గూర్చి హెచ్చరిక చేస్తుంది. నమస్కారం చేస్తే వెళ్ళిపోతుంది. కిష్టయ్యతాత వేరుపడిన క్రితంరోజున, అది మొదటిమాటు కనపడిందట. తన తల్లి విశాలాక్షి రేపు మరణిస్తుందనగా కూడా కనపడిందట. తనకు నిన్న కనపడింది - నమస్కారం చేస్తే వెళ్లిపోయింది. మళ్ళీ ఈరాత్రి కనపడదు కదా! రుక్మిణికి భయంతో కాళ్ళు చేతులు వణికాయి. భయం దేనికి, అది ఏమీ చేయదుకదా! అని మెదడు మూల్గింది. అయినా వణుకు మాత్రం రెండు నిమిషాలవరకు ఆగలేదు. రుక్మిణి కొంచెం తేరుకుని ముందడుగు వేసింది. ఎడమవేపు గదిలోంచి వెంకమ్మ గుర్రు వినపడుతున్నది. ఈ వెంకమ్మ ఎవరు? తనకు తెలిసినంతవరకు ఈ వెంకమ్మకీ తమకీ ఏమీ బంధుత్వంలేదు. పాపం, భర్త చిన్నతనంలోనే పోయాడట-ఈ యింట్లోకి ఏ విధంగా వచ్చిందో వచ్చిపడింది. చివరకి యింట్లో ఒకభాగమైంది. ఆమెకు ఏ కోరికలూ లేవు. ఏ ఆవేదనలూ లేవు. చేసిన పనేపదిసార్లుచేస్తుంది, గంటలతరబడీ చేస్తుంది. మనిషికిచాదస్తం ఎక్కువ - స్నానంచేసివస్తుంటే, మైలపడ్డావని ఎవరైనాఅంటే మళ్ళీ కాలువకో, బావికో వెళ్ళి తిరిగి స్నానంచేసివస్తుంది. అల్లా ఎన్నిసార్లు అంటే అన్నిసార్లు బావికి గాని కాలువకు

గాని వెడుతుంది. అనేవాళ్ళే, చివరికి జాలిదల్చి, లేక విసుగెత్తి ఊరుకోవాలి. రుక్మిణి ఎన్నడూ ఆమె ఏడ్వటంగాని, నవ్వడం గాని చూడలేదు. మెదడు ఉన్నదన్న మాటే కాని, అది పని చేయదు. ఆమెకు హృదయం కూడా వుండి వుండాలి- అంటే అది శరీరంలోని ఒకభాగమే. దానికి జాలిపడడంగాని, దుఃఖించడంగాని, కలతచెందడంగాని, ఆనందించడంగాని తెలియదు. ఆమె మోడుగా పుట్టింది - మోడుగా పెరిగింది- మోడుగా జీవితాన్ని గడుపుతున్నది. కళ్ళముందు జరుగు తున్న విషయాన్ని గ్రహించలేదు. పిచ్చిదా అంటే అంత కన్నా కాదు. చెప్పినపని ఆలస్యంగానో, చాదస్తంగానో చేస్తుంది. గంటలతరబడి ఆ పనిలో నిమగ్నమై వుంటుంది. ఇల్లు అలకమని ఉదయం చెపితే, మధ్యాహ్నంవరకూ అలుకు తూనే వుంటుంది. అలికిన చోటనే తిరిగి అలుకుతుంది. కడుపు నిండా అన్నం తింటుంది. కంటినిండా నిద్రపోతుంది - పలుక రిస్తే పలుకుతుంది - లేకపోతే లేదు. కాని పిచ్చిగా ఎన్నడూ వాగదు - గోడలు గీకదు. కూర్చుంటే గంటలతరబడి కూర్చుంటుంది - పడుకుంటే గంటలతరబడి పడుకుంటుంది. సుఖదుఃఖాలు, నిమ్నోన్నతాలు, ఒడిదుడుకులు ఆమెని ఎన్నడూ అంటవు. చిన్నతనంలో, మొగుడు చనిపోయిన పసికందుని—ఆమె తండ్రి కాశీకి వెడుతూ, ఆమెను ఈ యింట్లో దిగబెట్టి వెళ్ళాడట. అతను మళ్ళీ తిరిగి రాలేదు. తన కూతురిని తనతో తీసుకువెళ్ళలేదు. అప్పటినించీ యీ యింట్లో వెంకమ్మ ఒకభాగమైంది. ఆమె ఇంట్లో ఉన్నా లేనట్టే, లేకపోయినా ఉన్నట్టే. రుక్మిణి హాలులోంచి ముందుకు

నడిచింది. గుమ్మం దాటడంతోనే ఒకవసారా- వసారాలో ఒక ఆవు ఒక గుంజకు కట్టేసివుంది. ఆవు పడుకొని నెమరు వేస్తున్నది. దాని పక్కన, దాని దూడ పడుకొని కునికిపాట్లు పడుతున్నది. రుక్మిణి నెమ్మదిగావెళ్ళి ఆవునీ దూడనీ కుడి చేత్తో దువ్వింది. దూడ కునికిపాట్లనించి తేరుకొని, రుక్మిణి చెయ్యి నాకింది. ఎందుకో రుక్మిణికి, ఆ దూడని ముద్దుపెట్టుకోవాలనిపించింది. ఎడమచేతిలోవున్న లాంతరు కిందపెట్టి మరీ వంగి దూడని నొసట్లో ముద్దుపెట్టుకుంది. తిరిగి లేచి లాంతరు అందుకుంది. రుక్మిణి కదిలివెడుతుండగా, ఆవు లేచి నిలబడి 'అంబా' అని అరిచింది. రుక్మిణి ఉలికిపడి వెనక్కివెళ్ళి, ఆవు వీపు నిమిరి, దాని వీపు కుడిచంకలోకి వచ్చేట్లుగా కావలించుకుంది. వసారాకి అభిముఖంగా, ఇంకొకవసారా. మధ్య కప్పులేని ఖాళీస్థలం: అభిముఖంగా వున్న వసారా పక్కన తండ్రి ఈశ్వరరావుగది. గదితలుపు బార్లా తెరచివుంది. కిరసనాయిల్ బుడ్డి దీపపు వెలుగు గది మెట్లపైన గుడ్డిగా పడుతున్నది. తండ్రి గది రాత్రిళ్ళు ఎప్పుడూ తెరిచి వుండదు. తండ్రి గదిలో లేడా! రుక్మిణి ఒకమెట్టు ఎక్కి గదిలోకి తొంగి చూచింది. పట్టెమంచం ఖాళీగావుంది. తండ్రి చంద్రమ్మ దగ్గరికి వెళ్ళలేదుకదా! దానికి నిదర్శనంగా వాకిలి దగ్గరగా వేసివుంది. తలుపు గడియవేసిలేదు. ఇంక తనతండ్రి తెల్లవారితే గాని రాడని తెలుసుకొని, రుక్మిణి వాకిలితలుపు గొళ్ళెం వేసింది. తలుపుదగ్గరగావున్న సొరంగంలోంచి మొద్దు లాగి తలుపుకి అడ్డంగా, లాగిన చివర్ని మొదటి సొరంగానికి అభిముఖంగా వున్న గోడలోని ఇంకొక సొరంగంలోకి దూర్చింది.

రుక్మిణి తిరిగి లాంతరుతో వెనుకకు మళ్ళింది. ఎందుకో తలుపుపక్కన వున్న దివాన్‌ఖానాలోకి వెళ్ళడానికి ఆమెకు మనస్కరించలేదు. దివాన్‌ఖానాలో బంధువులు కాని అతిథులకు సత్కారాలు జరుగుతూ వుంటాయి. లోగడ తన తాతయ్యదగ్గరికిగాని, ప్రస్తుతం తన తండ్రిదగ్గరికిగాని వచ్చే అతిథులు ఆ గదిలో కూర్చొని వారితో మాట్లాడడం కద్దు. తను ఆ గదిలోకి ఈమధ్య ఎన్నడూ వెళ్ళలేదు. ప్రస్తుతం ఆ గదిలో, తన తాతలకాలంనాటి తివాసీ పరిచివుంది. విరిగిపోగా మిగిలిన కుర్చీలు కొన్ని, అక్కడ పడివున్నాయి. తన చిన్నతనంలో ఆ గదిలోవుండే సోఫాలు ప్రస్తుతం విరిగి, పూర్వాకారాన్ని కోల్పోయి, వెంకమ్మగదికి ఎదురుగావున్న గదిలో పడివున్నాయి. వెంకమ్మ ఇంటికి ఎంత ఉపయోగంగా ఉందో, అవీ ప్రస్తుతం అంత ఉపయోగపడుతున్నవని రుక్మిణి అనుకుంది. మరి వృద్ధాప్యంలో, తాతయ్య దివాన్‌ఖానాలోకి వెళ్ళి కూర్చోవడం మానేశాడు. ప్రస్తుతం అవును కట్టేసిన వసారాలో, వాకిలితలుపుకి ఎదురుగా, ఒక బల్లపీటమీద కూర్చొని అతను తనవ్యవహారాలు చూసుకోవడం రుక్మిణికి జ్ఞాపకంవచ్చింది. నర్సయ్యతాత ఏనుగంతమనిషి. పెద్దబొర్ర. తెల్లటి ధోతీ కట్టుకొని, పొడుగాటి చొక్కా వేసుకొని, రుమాలు వీపూ మోకాళ్ళుచుట్టూ బిగించి కూర్చుంటే, సగానికి పైగా బల్లపీట ఆక్రమించేవాడు. ఉదయం కావడంతోనే రైతులూ, ఆసాములూ (పాలికాపులు) వచ్చి, రెండు వసారాలకు మధ్యనున్న ఖాళీస్థలంలో, బల్లపీట కెదురుగా వాకిలి తలుపువరకు కూర్చొని, ఆయనతో వివిధ వ్యవహారాలు

మాటాడుకునేవారు. అతనితోపాటు ఇంట్లోవాళ్ళకి తప్ప, ఆ బల్లపీటమీదకూర్చొని మాట్లాడడానికి ఎవరికీ అర్హతఉండేది కాదు. తనకు మించిన అధికారి ఎవరయినా వస్తే, అతనిని దివాన్‌ఖానాలో కూర్చోబెట్టి మాట్లాడేవాడు నరసయ్యతాత.

రుక్మిణి ఖాళీస్థలంలో మధ్యగావున్న తులసికోట దగ్గరికి వెళ్లింది. లాంతరు కిందపెట్టింది. కోటచుట్టూ మూడు సార్లు ప్రదక్షిణ చేసి, కళ్ళుమూసుకొని దీర్ఘనమస్కారం చేసింది. తులసిపాదులోని మృత్తిక కొద్దిగా తీసుకొని, నోట్లో వేసుకుంది. మృత్తికతీసిన చేతిని కళ్ళకి రాచుకుంది. కళ్ళు మూసి లెంపలువేసుకొని, ఎడమచేత్తో లాంతరు అందుకొని, సరాసరీ చతుశ్శాల భవంతిలోకి వెళ్ళింది. లాంతరు గోడకున్న పెద్దగడియారానికి ఎదురుగా దూలంనించి వ్రేలాడుతున్న ఇనుపమేకువంకెకి తగిలించింది. ఇంకా రెండుగంటలు దాటలేదు. ఏమిచేస్తే ప్రొద్దు గడుస్తుందా అని ఆమె ఆలోచించింది. పోనీ ఓమనగుంతలు ఆడితే. ఓమనగుంతల పీట బహుశా వెంకమ్మగదిలో వుండి వుంటుంది. తిరిగి లాంతరు పుచ్చుకొని వెంకమ్మగదిలోకి వెళ్ళింది. చింతగింజలతో వున్న ఓమనగుంతలపీటని కుడిచేతితో అందుకొని లాంతరు యుక్తంగా, పీటతో తన గదిలోకి వచ్చింది. పీట పక్కమీద పెట్టి, గూట్లోలాంతరుపెట్టి, ఓమనగుంతలు ఆడడం మొదలు పెట్టింది....

కాలచక్రం తిరుగుతున్నది...ఆట సాగుతున్నది. ఆట మీద రుక్మిణికి ఏమాత్రం మనస్సులేదు. కాలయాపనకోసం

రుక్మిణి తన మనస్సుకు తానే ఎదురుతిరిగి అడుతున్నది. కూర్చొని, కూర్చొని నడుంనొప్పిపుట్టినట్లు తోచింది. ఓమన గుంతలపీట పక్కకు నెట్టి, పక్కపైన మేనువాల్చింది. మంచం కిర్రుమన్నది. ఇంటికప్పుకేసి ఒకటేపనిగా చూస్తూ, రుక్మిణి పడుకుంది. ఎంతసేపు పడుకుందో ఏమో, ఆమెకు తెలియదు. ఇంతలోకే ఏదో 'సర, సర' చప్పుడు వినపడింది. రుక్మిణి దిగ్గున లేచి మంచంలో కూర్చుంది. గడంతా, ఒక్కమాటు కలయ చూసింది. గడపలో నాగుపాము. గడపదాటి గది లోకి వస్తున్నది. పాము చాంతాడుపొడుగుంది. రుక్మిణి లేచి కూర్చోవడంతోనే, లోపలికి రావడం మానేసి బుస్సుమని పడగవిప్పింది. పడగ వెడల్పాటి తామరాకంత వుంది. రుక్మి ణికి ఏమీ తోచలేదు. తృటికాలంవరకు పడగకి కళ్ళు అప్ప గించి నిశ్చేష్టురాలై చూస్తూ కూర్చుంది. వెంటనే స్పృహ తెచ్చుకొని, మంచంమీదినించి క్రిందికిదిగి, రెండుచేతు లెత్తి నమస్కారంచేసింది. నాగుపాము ఉత్తరక్షణంలో గిరుక్కన వెనక్కి తిరిగి, చతుశ్శాలభవంతిలోకి వెళ్ళింది. ఆ తరువాత ఎక్కడికి వెళ్ళిందో, ఏమైందో రుక్మిణికి కనపడలేదు. పాము వెళ్ళిపోవడంతోనే రుక్మిణికి వళ్ళు ఝల్లుమన్నది. కంపరం పుట్టుకొచ్చింది. హృదయంలో ఏదో దడ- ఏదో చెప్పడానికి కూడా అలవికాని భయం- తాను కొత్తగా ఏదైనా దుష్కృ త్యానికి పాల్పడ్డదా? జరుగవలసిన దుష్కృత్యం ఎన్నడో వళ్ళు తెలియకుండానే జరిగిపోయింది. కొత్తగా ఇప్పుడు తాను చేయబూనిన దుష్కృత్యమేమీ ఆమెకు కనపడలేదు. రుక్మిణి, తనకు తెలియకుండానే, మెడవెనకాల చేతులుకట్టి

వళ్లు విరిచింది. దీర్ఘంగా ఆవలించింది. కొద్దిగా భయం తగ్గినట్లు తోచింది శరీరకంపరంకూడా తగ్గింది. పడుకొని లాభం లేదని తెలుసుకొని, పక్కచుట్టింది. పక్కచుట్టని నూలు తాడుతో బిగించింది. ఇనుపపెట్టెమీద పెట్టింది. ఇంక తను చేయవలసిన పని ఏమీ మిగిలివున్నట్లు రుక్మిణికి తోచలేదు. ఏమీ తోచక చతుశ్శాల భవంతిలోకి వెళ్ళింది. ఎక్కడా ఏమీ అలికిడిలేదు. తిరిగి గదిలోకి వచ్చింది. మంచంమీద పక్కలేకపోవడంవల్ల, అది బోసిగా కనపడింది. తను ప్రేక్షకురాలిగా మారి, గదిలో తను లేకపోవడంవల్ల కలిగే లోటుని, తానే ఊహించుకుంది. గది వెలవెలపోయినట్లు తోచింది. ఒకటి రెండు రోజులు గది వెలవెలపోయి, ఆ తరువాత తను దానిలో ఉండకపోవడమే సహజమన్నట్లు కనపడుతుంది. తను చనిపోతేకూడా, ప్రపంచం తనులేని లోటునీ, తద్వారా కలిగే విచారాన్ని తాత్కాలికంగా అనుభవించి, కొంత కాలానికి క్రమంగా మరిచిపోతుందా ? ఎందుకో రుక్మిణికి సరిగ్గా అంతే జరుగుతుందనిపించింది. తను పోతే, తన తండ్రి ఒకటి రెండు రోజులు తనకోసం దుఃఖిస్తాడు. కాలం గడిచిన కొద్దీ ఉపశాంతి పొందుతాడు. కొంతకాలానికి తన కూతురు పోవడమే చివరకి మంచిదనుకుంటాడేమో ? కాని వెంకటరామయ్యమామ తనుపోతే విచారించడు. దుఃఖించడు. తను చేసిన పాపాలన్నిటినీ పొట్టబెట్టుకుంటాడు. తనని తలచుకొని అసహ్యించుకోడు. తను చేసిన దుష్కృత్యాలని అతని ఆత్మ సంతృప్తికోసం, లోకానికి చాటడు. తను పాపపంకిలంలో విధిలేక పడినందుకు జాలిపడుతాడు – తనను కరుణిస్తాడు.

తన పాపాల్ని క్షమించి, చెయ్యెత్తి ఆశీర్వదిస్తాడు. ఆయనది ఎంత గొప్ప హృదయం. ఎంత ఉదారస్వభావం. రఘు, రమణలు తాను పోయినందుకు విచారిస్తారు. అమాయిక హృదయాలతో దుఃఖిస్తారు. తన నీతి, అవినీతులతో వాళ్ళకి ఏమాత్రం సంబంధం ఉండదు. తను తనుగా మాత్రమే వాళ్ళ చిరుహృదయాల్లో హత్తుకపోతుంది. రఘు, రమణలతో తనకు గల సంబంధాన్ని తలచుకొని, రుక్మిణి హృదయం ఉప్పొంగింది. ఆనందాతిశయంతో లాస్యం చేసింది. మరి విశో ?...ఇంతలోకే దక్షిణభాగంవేపు ఉన్న తలుపు తేలికగా చప్పుడైంది. రుక్మిణి, తన నడకనే పరుగుగా మార్చి వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా విశ్వేశ్వరరావు కనపడ్డాడు. అతన్ని చూడడంతోనే గంటలతరబడి కాస్తున్న దారులు మూసుకున్నాయి.

'చాలా ఆలస్యమైందే!'

'అవును, కూలి మనుషుల్ని కుదిర్చి, హైదాబాద్‌కు వెళ్ళి టాంగా తీసుకొచ్చేసరికి ఈవేళ అయింది.'

'మనుషులు ఈ ఊరివాళ్ళు కారు గద?'

'కారు; ఎక్కడో పశ్చిమటినించి వచ్చి, ఫార్మ్‌లో పని చేస్తున్నారు.'

'అయితే, లోపలికివచ్చి, ఇనప్పెట్టె, పక్కచుట్టా పట్టు కెళ్ళమని చెప్పండి.'

'నీ సామానంతా సరిగ్గా సర్దుకున్నట్టేనా?'

'బోళ్ళేమీ తీసుకోలేదు—అవితప్ప, తక్కిన సామా నంతా సర్దాను.'

'బోళ్ళు అక్కరలేదు-అక్కడ కావలసినన్ని ఉన్నాయి.'

'అయితే, ఇంక ఆలస్యం దేనికి? మనుషుల్ని వచ్చి, సామాను పట్టుకెళ్ళమని చెప్పండి.'

విశ్వేశ్వరరావు, గృహ దక్షిణభాగంలో వున్న దిడ్డి తలుపుద్వారా మనుషుల్ని లోపలికి పిలుచుకువచ్చాడు. ఇద్దరు మనుషులూ చెరి ఒకవస్తువు తలలపైకి ఎత్తుకున్నారు. పక్కచుట్ట తీసుకున్న మనిషి, పెట్టె ఎత్తుకోవడంలో రెండవ మనిషికి సహాయంచేశాడు. ముందు మనుషులు నడుస్తున్నారు. వారి వెనకాల రుక్మిణి నడుస్తున్నది. వెనకాల లాంతర్‌తో విశ్వేశ్వరరావు ఉన్నాడు. రెండు హాళ్ళు దాటి దిడ్డితలుపుని సమీపించేసరికి, రుక్మిణి బ్రేకుపడ్డట్టు ఆగిపోయింది.

'ఏం, అట్లా ఆగిపోయావేం?'

'ఏమీ లేదు. మీరు ముందు నడవండి.'

ఇంతలోకే ఇద్దరు కూలిమనుషులూ దిడ్డిగుమ్మం దాటారు. రుక్మిణి పక్కకు తప్పుకుంది. విశ్వేశ్వరరావు కూడా రెండు అడుగులు ముందుకువేసి, దిడ్డిగుమ్మం దాటాడు. రుక్మిణి విశ్వేశ్వరరావుని అనుసరించబోయి ఒక అడుగు ముందుకు వేసింది. ఇంకొక రెండడుగుల్లో ఆమెకూడా గడప దాటేసేది. కాని ఇంతలోకే గడపలో రుక్మిణికి నాగుపాము కనపడ్డది. బుస్సుమని పడగవిప్పి, తలుపు మధ్యలో నిటారుగా నిలిచింది. రుక్మిణిగుండె ఝల్లుమన్నది. తత్తరపాటుతో ఆమె ఒకఅడుగు వెనక్కి వేసింది. 'పాము,' 'పాము' అని గట్టిగా అరుద్దామనుకుంది. కాని నోటిమాట పెకల్లేదు. గొంతులోనిమాట గొంతులోనే నిలిచిపోయింది. గుండెల్లో ఏదో దడ, ఏదో భయం.

రుక్మిణి శ్వాస బిగబట్టి వశంతప్పుతున్న అవయవాల్ని బలవంతంగా తన స్వాధీనంలోకి తెచ్చుకొని, నాగుపాముకు రెండు చేతులెత్తి నమస్కారంచేసింది. అయినా నాగుపాము దిడ్డి గుమ్మంలోంచి కదలలేదు. ప్రతిసారీ నమస్కారంచేసేసరికల్లా వెళ్ళిపోయే పాము, ఆరోజు ఎందుకల్లా మొండితనం చేస్తున్నదో రుక్మిణికి అర్థంకాలేదు. తనవల్ల అపచారమేమైనా జరిగిందా? లేక దానికి తాను ఇంట్లోంచి లేచిపోవడం యిష్టం లేదా? అపచారం ఏదైనా జరిగివుంటే, క్షమించమని ప్రార్థిస్తూ రుక్మిణి తిరిగి నమస్కారంచేసింది. మరుక్షణంలో పాము బుసలుకొడుతూ తన వెడల్పాటి పడగని నేలకేసి కొట్టింది. భయంతో రుక్మిణి కళ్ళల్లోంచి మిణుగుళ్ళుచిమ్మాయి. పాము నేలకి తల బాదుకోవడం, రుక్మిణీ ఇదివర కెన్నడూ చూడలేదు. ఏదో గొప్ప అపాయం త్వరలో తనకు జరుగనున్నదని ఆమె వెంటనే గ్రహించింది. పోనీ వెనక్కి మళ్ళితే... ఇంతవరకు వచ్చి తిరిగి వెనక్కి మళ్ళడం, ఆమెకి ఏమాత్రం మనస్కరించలేదు. పాము ఇంకొకసారి తన పడగని గట్టిగా నేలకు బాదింది. రుక్మిణికళ్ళల్లో చీకట్లు సుళ్ళుతిరిగాయి. క్షణ క్షణానికీ ఆ చీకట్లు మరీ దట్టమవుతున్నాయి. క్రమంగా శరీరం వశంతప్పిపోతున్నది——రుక్మిణీ ఉత్తరక్షణంలో స్పృహ తప్పి, నిలువునా కుప్పగా కూలింది...

వెనకాల ఏదో చప్పుడుకావడంతో విశ్వేశ్వరరావు, ఇద్దరు కూలీలు గిరుక్కున మళ్ళారు. రుక్మిణీ చైతన్యరహితంగా పడివుండడం దూరంనుంచి చూశారు. వాళ్ళు పట్టుమని పది అడుగులైనా ముందుకు వేయలేదు. ఇంతలో ఏమి

జరిగివుంటుందా అని విశ్వేశ్వరరావుకు ఆశ్చర్యమేసింది. త్వరితగతిని అతనులాంతర్‌తో ముందుకు పరుగెత్తుకొచ్చాడు. ఆతొందరలో, పాము గడపలోంచి వెళ్లిపోవడం అతను గమనించ లేదు. పనిమనుషుల దృష్టికూడా రుక్మిణిపైననే కేంద్రీకరించి వుంది. వాళ్ళుకూడా గోడపక్కగా వెలుపలికి వెళ్ళిపోతున్న పాముని చూడలేకపోయారు. విశ్వేశ్వరరావు రుక్మిణిని సమీపించి, లాంతరు నేలమీదపెట్టాడు. పక్కగా కూర్చొని రుక్మిణిని ఒళ్ళోకి తీసుకున్నాడు. గదువపట్టుకొని నెమ్మదిగా రుక్మిణి మొహాన్ని కదిపాడు. స్పృహ రాలేదు. తిరిగి ఆమెని నేలమీద పడుకోపెట్టి లోపలికి నీళ్ళకోసం పరుగెత్తాడు. గ్లాసులో నీళ్ళు తీసుకొని తిరిగి వచ్చాడు. వంగి రుక్మిణి మొహంమీద నీళ్ళు చల్లాడు. చల్లని నీటి స్పర్శకు ఆమె కళ్ళు విప్పింది. 'పాము' 'పాము' అని అరిచింది. 'ఎక్కడ?' అని అడిగితే ఏమీ సమాధానం చెప్పదు. ఆమె దృష్టి మాత్రం గడపలో కేంద్రీకరించి వుంది. ఆమె బిత్తర చూపులు విశ్వేశ్వరరావుని ఎంతో కలవరపెట్టాయి. విశ్వేశ్వరరావు ఆమెపక్కన కూర్చుని, ఆమెతలని తన ఒళ్ళోకి తీసుకున్నాడు. రుక్మిణి, వెల్లకిలా ఉన్నదల్లా బోర్లి బొక్కల తిరిగి, అతని కడుపులో తల దూర్చి రెండు చేతులతో అతని నడుముని గట్టిగా కావలించుకుని వెక్కి వెక్కి ఏడ్వడం మొదలెట్టింది. 'రుక్కూ! ఏంజరిగింది చెప్పవూ?' అని విశ్వేశ్వరరావు, రుక్మిణితల నిమురుతూ లాలనగా అడిగాడు. ఆ లాలనకి రుక్మిణిదుఃఖం మరీ ఎక్కువైంది; వివశమై, గట్లు తెగి పొంగి పొరలింది. 'రుక్కూ, మా

తల్లివి కదూ, చెప్పవూ నీకేం బాధో?' అని విశ్వేశ్వరరావు రుక్మిణి మొహం పైకిలేవనెత్తి, మొహంలో మొహం పెట్టి అడిగాడు. రుక్మిణి భయంతో కంపించిపోతూ, 'పాము' 'పాము' అనిమాత్రం అనగలిగింది. 'పామా ! పామేమిటి ?' అని తిరిగి అడిగాడు విశ్వేశ్వరరావు. 'గడపలో పాము' అని రుక్మిణి అతి కష్టంపైన సమాధానం చెప్పింది. విశ్వేశ్వరరావు, ఆ గదికివున్న రెండు గడపలూ కలయజూచాడు. పాము ఎక్కడా కనపడలేదు. మతిచలించి రుక్మిణి 'పాము ! పాము !' అని అరుస్తున్నదా ? అని అతనికి సందేహం కలిగింది. 'పాము ఎక్కడాలేదు. కావలిస్తే నువ్వే చూచుకో' అని అన్నాడు విశ్వేశ్వరరావు రుక్మిణితో. రుక్మిణి విశ్వేశ్వరరావు మాటల్ని నమ్మలేకపోయింది. దిగ్గున ఒడిలోనించి లేచి దిడ్డి గుమ్మం వేపు తదేకదీక్షగా చూచింది. ఎక్కడా పాము కనపడలేదు. రుక్మిణికి కొంచెం మనస్సు స్థిమితపడింది. ఇంతలోకే వెళ్ళి పోయిందా ?...ఏమో ? పామునిగూర్చి చెబితే తనను ఎవ్వరూ విశ్వసించనట్లు ఆమెకు తోచింది. తనకి కనపడి, వాళ్ళకి కనపడకపోవడం - ఆశ్చర్యాన్ని కలిగించింది. గడపదాటుతూ తాను విశ్వేశ్వరరావుని అనుసరించ దలచు కున్నది. తన సర్వస్వాన్నీ అతనికి అర్పించి అతనిపట్ల తనకు గల విధేయతని నిరూపించదలచుకున్నది... కాని నాగుపాము అడ్డుపడి, తన మనోవాంఛితాన్ని మొదలంట నరికింది... కాగా అతన్ని అనుసరించడం, అనర్థదాయకమని పడగ నేలకుకొట్టి పదేపదే చెప్పింది...

'ఇంత దూరంవచ్చి ఇప్పుడు వెనుదీయడమా ?' అని

ఆమె తనని తాను ప్రశ్నించుకుంది, 'నిండా మునిగినదానికి, ఇంకా చలేమి'టని సాహసంచేసి, ముందుకు నడిచింది - కీలుబొమ్మలాగా, ఎదురుగా శూన్యంలోకి చూస్తూ గడప దాటింది. రుక్మిణి నడిచి ముందుకు వెళ్ళడం చూచి విశ్వేశ్వరరావు లాంతరుతో ఆమెను అనుసరించాడు. గడప దాటి దిడ్డితలుపు దగ్గరగా వేశాడు. నలుగురూ తిరిగి నడక ప్రారంభించారు. రుక్మిణికి కనుచూపుమేరలో ఎక్కడా 'టాంగా' కనపడలేదు. ఆమె వెంటనే తనపక్కనే నడుస్తున్న విశ్వేశ్వరరావుని 'టాంగా ఏదీ ?' అని అడిగింది. 'గాణీ' అవతలవుందని విశ్వేశ్వరరావు క్లుప్తంగాసమాధానంచెప్పాడు.

ప్రేమావతీపేట పూర్వం ఒక జాగీరు గ్రామం. బహామనీ రాజుల కాలంలో అప్పటి ఒక సైనికాధికారికి ఆ గ్రామం అరణంగా లభించింది. అతను యుద్ధకౌశలం క్షుణ్ణంగా తెలిసిన అధికారి కనక, ఆ గ్రామంచుట్టూ ఒక పెద్ద ప్రహారీగోడ కట్టించాడు. ఆ రాతి ప్రహారీగోడ నేటికికూడా చెక్కుచెదరని స్థితిలో వుంది. ఆ కోట తూర్పు, పడమర, దక్షిణ దిశల్లో మూడు సింహద్వారాలు ఉన్నాయి. బహామనీ రాజుల కాలంలో హైందవ రాజనీతిజ్ఞులప్రాబల్యం ఎక్కువగా ఉండడంవల్ల, ఉత్తరదిశని ఆ సైనికాధికారి, నాల్గవ సింహద్వారం పెట్టించలేదని మనం అనుకోవాల్సివస్తుంది. గ్రామం మధ్యలో, అతను ఒక చావుడీ కట్టించాడు. పోలీసులు ఈ చావుడీలోవుండి, ఆ రోజుల్లో గ్రామాన్ని కాపాడుతుండేవారని వినికిడి. ఆ చావుడీ నేడు శిథిలావస్థలో వుంది. గ్రామం తూర్పుభాగంలో నివసిస్తున్న

వారు ఆ చావుడీ దాటి, పడమటిద్వారం ద్వారా హైద్రాబాద్‌కు వెళ్ళవలసివస్తుంది. పడమటి ద్వారానికి ఒక ఫర్లాంగు లోపుగా, హైద్రాబాదుకు వెళ్ళే రోడ్డు ఉంటుంది. ఇది చింతలమెట్టు, కిషన్‌బాగ్, పాత వాల్మాద్రి మీదుగా హైద్రాబాద్‌కు వెళుతుంది. చింతలమెట్టు దగ్గర రోడ్డు రెండు గుట్టలమధ్యనుంచి వెడుతుంది. అక్కడ దొంగల భయం ఎక్కువ. అక్కడికి రాత్రిళ్ళు ఎవ్వరూ వెళ్ళరు. పట్నం వెళ్ళదలచిన ఆ చుట్టుప్రక్కల గ్రామాలవాళ్ళు ఉదయం సూర్యోదయంతో కాలినడకని పట్నానికి బయలుదేరి, మధ్యాహ్నానికల్లా పట్నంచేరుకొని, ఒకటిరెండుగంటల్లో పట్నంలో తమపనులు చూసుకొని, సాయంత్రానికల్లా తమ తమ గ్రామాలకి తిరిగి వస్తారు. ఇటీవల నిజాం ప్రభుత్వం ప్రేమావతీపేట సమీపంలో ఒక వ్యవసాయిక పరిశోధనా కేంద్రాన్ని స్థాపించింది. ఆ కేంద్రంలో గొప్ప గొప్ప అధికారులకి బంగళాలు కట్టించి యిచ్చింది. గుమాస్తాలు, చిన్న చిన్న ఉద్యోగస్తులకోసం అక్కడ వసతి సౌకర్యాలేమీ లేకపోవడంవల్ల, హైద్రాబాద్‌నించి వారి రాకపోకల కోసం ఒక బస్సుని ఏర్పాటుచేసింది. అది ఉదయం పది గంటలకు వ్యవసాయపరిశోధనా కేంద్రానికి వచ్చి, సాయంత్రం అయిదు గంటలకి హైద్రాబాద్‌కి వెడుతుంది. రోజూ రాకపోకల యిబ్బందులు పడలేక కొందరు గుమాస్తాలు, చిన్న చిన్న ఉద్యోగస్థులు వ్యవసాయకేంద్రానికి చుట్టుప్రక్కలవున్న రెండు గ్రామాలు—బుద్వేలు, ప్రేమావతీపేటలలో యిళ్ళు బాడుగలకి కుదుర్చుకొని వుంటున్నారు.

రుక్మిణీ, విశ్వేశ్వరరావులు కూలిమనుషులతో చావు డీని సమీపించారు. చావుడీముందుగా వెడుతుంటే, "పోలీసులు తనని పట్టుకోరు గదా !" అనే భ్రమ రుక్మిణికి కలిగింది. ఆ భ్రమకి దోహదంగా, చావుడీపక్కనించి నడుస్తుండగా శిథిలపార్శ్వం కొంత కూలి కింద పడింది. ఆ చప్పుడుకి నలుగురూ నాలుగువేపులా పరుగెత్తారు. జీర్ణావస్థలోనున్న చావుడీ కొద్దిగా మాత్రమే కూలింది. కొన్ని ఇటుకలు ఒకటి రెండు రాళ్ళు క్రిందపడ్డాయి. ఇంతమాత్రానికే తాము కలవరంచెందినందుకు, రుక్మిణి తనలో తాను నవ్వుకుంది. విశ్వేశ్వరరావు దగ్గరికి వచ్చి, "రెండు యిటుకలు క్రిందపడి, ఎంత కంగారుపెట్టాయి" అన్నాడు. రుక్మిణి వినీ విననట్లు మౌనంవహించింది. తనభర్త పోయినరోజున చావుడీ కూలిందట. చావుడీ కూలడం మంచిదికాదని, ఆ గ్రామ ప్రజల నమ్మకం. ఈ సంగతి జ్ఞాపకానికివచ్చి, రుక్మిణికి కొద్దిగా కష్టమేసింది. నలుగురూ తిన్నగా నడిచి పడమటి ద్వారం చేరుకున్నారు. ఆ పల్లెప్రజలు ఈ ద్వారాల్ని 'గౌణీ' అంటారు. గౌణీ దాటడంతోనే కట్టెదుట టాంగా కనపడింది. టాంగాకు పర్దాలు వేసివున్నాయి. 'టాంగా'ని గ్రామంలోకి తీసుకొస్తే, దానిచప్పుడుకి ఎవరైనా లేవవచ్చునని ఊహించి విశ్వేశ్వరరావు గ్రామంవెలుపలే 'టాంగా' వదిలి వచ్చాడు. ఈ నలుగుర్ని చూడడంతోనే 'టాంగా'వాడు విడిగావున్న గుర్రాన్ని "టాంగాకి" కట్టాడు. కూలిమనుషులిద్దరూ తమ తమ బరువుల్ని 'టాంగా'వాడికి అందించారు. వాడు తను కాళ్ళుపెట్టేచోట గుంతలో మొదట పెట్టె పెట్టి, దానిమీద

పక్కచుట్ట పెట్టాడు. రుక్మిణి టాంగా ఎక్కింది. విశ్వేశ్వర రావు టాంగా ఎక్కడంతోనే, టాంగావాడు పరదాలని కింది మేకులకి బిగించాడు. టాంగావాడు టాంగా ఎక్కి, 'టాంగా పైకి లేస్తున్నది, ముందుకు జరగ" మని లోపల కూర్చున్న యిరువురినీ హెచ్చరించాడు. టాంగా కదిలింది. కూలిమనుషు లిద్దరూ టాంగాకు చెరి ఒక పక్కన నడుస్తున్నారు. విశ్వేశ్వరరావు నెమ్మదిగా పోనివ్వమని టాంగావాడికి హెచ్చరిక చేసి, రుక్మిణిని దగ్గరికి లాక్కున్నాడు. టాంగావాడికీ, రుక్మిణీ విశ్వేశ్వరరావులకీ మధ్య ఒక పరదా వుంది. మిగిలిన మూడు వేపులా పర్దాలు ఉన్నాయి. రుక్మిణి విశ్వేశ్వరరావుకి మరీ దగ్గరగా జరిగి, పక్కపక్కన కూర్చొని ఉండడంవల్ల తన తలని అతనిబుజానికి ఆనించి, కొద్దిగా అతనిపైన జేరగిలబడ్డది... టాంగా నడుస్తున్నది... కూలిమనుషులు టాంగాకి చెరి ఒక పక్కన నడుస్తున్నారు.... చంద్రోదయమైంది... చీకటితెరల్లో దాక్కొనివున్న ప్రేమికులు చంద్రోదయాన్ని గమనించలేదు.... టాంగా రోడ్డుఎక్కింది... కొంతదూరం వెళ్ళిన తరువాత టాంగావాడు 'టాంగా'ని ఆపివేశాడు. "ఆపావేం, పోనివ్వ" మని విశ్వేశ్వరరావు హెచ్చరిక చేశాడు. "ఇంకా ఒకఝాముర్రాత్రి వుంది. ఇప్పుడప్పుడే చింతలమెట్టుమీదుగా వెళ్ళడం ప్రమాదకర" మని టాంగావాడు సమాధానం చెప్పాడు. గుర్రాన్ని విప్పకుండానే, టాంగాను రోడ్డుపక్కగా నిలిపాడు.... బుజంపైన విశ్వేశ్వరరావుకి బరువెక్కువైంది. మెడ పక్కకుతిప్పి చూస్తే, రుక్మిణి నిద్రపోయినట్లు కనపడింది. రుక్మిణిని తనపైకి నెమ్మ

దిగా లాగుతూ, తనూ టాంగావార్శ్వానికి తల ఆనించి కళ్లుమూసుకున్నాడు. ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు... ఎంతఆందోళనకరపరిస్థితుల్లోనైనా మనుషులు నిద్రకి తట్టుకోలేరు. నిద్రరానంతవరకే పక్కవిషయంలో శ్రద్ధతీసుకుంటారు. మెత్తని పరుపులు వేసుకుంటారు. చక్కని దిండ్లు అమర్చుకుంటారు. కొందరికి క్రిందపడుకుంటే నిద్రపట్టదు. మరికొందరికి హంసతూలికాతల్పం ఉంటేనేకాని నిద్రరాదు. కాని ఒకమాటు నిద్రవచ్చేస్తే, పడుకోవడానికి సరిపోయే చోటు ఉందా అని కూడా గమనించకుండా చోటు ఉన్నా, లేకపోయినా, చివరికి కూర్చొని అయినా నిద్రపోతారు... రుక్మిణి, విశ్వేశ్వరరావులకి టాంగా కదలిందీ తెలియదు; చింతలమెట్టూ, కిషన్‌బాగ్‌లు దాటిందీ తెలియదు. పాతవాలాద్రి సమీపిస్తుండగా మొదట రుక్మిణికి మెలకువవచ్చింది. ఆమె కళ్ళు నలుపుకొని, విశ్వేశ్వరరావుని లేపింది. టాంగా ఆగినప్పుడు తాను నిద్రపోయినసంగతి జ్ఞాపకంలేక విశ్వేశ్వరరావు 'ఎంతవరకు వచ్చా'మని టాంగావాడిని అడిగాడు. 'పాతవాలాద్రి సమీపిస్తున్నా'మని అతను సమాధానం చెప్పాడు. విశ్వేశ్వరరావు టాంగా ఆపమని చెప్పి, తోడు వచ్చి పట్నానికి తమని సురక్షితంగా చేర్చిన మనుషులకి చెరి రెండు రూపాయలిచ్చి వాళ్ళని తిరిగి ఫార్మ్‌కి వెళ్ళమని చెప్పాడు. తమసంగతి ఎవ్వరితోను చెప్పవద్దని మరీమరీ హెచ్చరికచేశాడు. వాళ్ళు చెరి రెండు రూపాయలు అందుకొని, సంతృప్తిగా వెనుకకు మళ్ళారు. టాంగా ముందుకు సాగింది. ఒకగంటలోపుగా చుడీబజార్ చేరుకుంది.

# 2

ఈశ్వరరావు ఉదయం చంద్రమ్మయింటినించి తిరిగివచ్చి 'రుక్మిణి ఏ'దని వెంకమ్మ నడిగాడు. వెంకమ్మకి ఆ ప్రశ్న ఏమీ అర్థంకానట్టువుంది. సమాధానంగా ఆమె ఈశ్వరరావు కేసి బిత్తరచూపులు చూసింది. ఈశ్వరరావు రుక్మిణికోసం ఇల్లంతా వెతికాడు. కాలువ, నూతులు వెతికించాడు. ఎక్కడా రుక్మిణి ఆచోకీ దొరకలేదు. గృహ దక్షిణభాగం లోకి వెళ్ళాడు. అక్కడ విశ్వేశ్వరరావుగాని, అతనిసామాను గాని కనపడలేదు. 'రుక్మిణిని, విశ్వేశ్వరరావు లేవదీసుకు పోలేదుకద? అనే అనుమానం అతనికి కలిగింది. 'తిన్నయింటి వాసాలు లెఖ్ఖపెట్టడమంటే దీనినే అంటారుకాబోలు' నను కున్నాడు. 'ఇంట్లో అద్దెకుండి, ఇదా విశ్వేశ్వరరావు చేయ గలిగిన ఉపకారం' అని ఈసడించుకున్నాడు. ఇప్పుడు తను నలుగురిలో ఏవిధంగా మొహంఎత్తుకొని తిరగగలడు. సమాన హోదాలో నలుగురితో ఏవిధంగా మాట్లాడగలడు. ఫలాని వాడి కూతురు ఎవడితోనో లేచిపోయిందని తనని చూడడం తోనే ప్రజలు పరోక్షంగా అవహేళన చేస్తారు. ఈ అవహేళ నల్ని తాను ఏవిధంగా తట్టుకోగలడు? ఆలోచించినకొద్దీ, 'రుక్మిణిని విశ్వేశ్వరరావే లేవదీసుకుపోయా' డనే సంగతి అతనికి ధృవపడుతున్నది. తన విరోధి రామిరెడ్డి ఈ సంగతి వింటే ఏమవుతుంది? విని సంతోషిస్తాడు. అంటే, తన సంతో షాతిశయాన్ని అంతగా అణచుకోలేకపోతే, నలుగురిని పిలిచి

విందు చేస్తాడు. విందులో తన కూతురు ప్రసక్తి తెచ్చి, నలుగు రిలో తనని అవమానిస్తాడు. సాయంత్రం భాగవతుల్ని ఆడి స్తాడు. అంతకన్నా అతను చేసే దేమిటి? ఏవిధంగా ఆలోచిం చినా, ఈ అవమానాన్ని తను భరించకతప్పదని ఈశ్వర రావుకు తోచింది. ఎల్లాగూ తప్పనప్పుడు, ఈ సమస్యని ధైర్యంగా ఎదుర్కోవడమే ఉచితమని అతను ఒక నిశ్చయా నికి వచ్చాడు.

రుక్మిణి లేచిపోయినసంగతి ఈ నోటా ఆ నోటా పడి, ఊరంతా పాక్కిపోయింది. 'కలిగింది తిని ఉండలేక, దీనికి ఏమి పోయేకాల మొచ్చిందమ్మా!' అని ఒక ముసలావిడ ఇంకొక ముసలావిడతో ముక్కుమీద వేలేసుకుంటూ అంది.

'మంచీ చెడూ విచక్షణాజ్ఞానం పోయింతర్వాత ఏమి చేస్తుందమ్మా!' రెండవ ముసలావిడ మొదటి ముసలావిడతో చూపుడువేలితో తన బుగ్గ నొక్కుకుంటూ అంది.

'విన్నావా, రంగమ్మత్తా! రాత్రి రుక్మిణి ఎవడితోనో లేచిపోయిందట' అని ఒక యువతి ఒక నడియీడు మనిషికి ఉదయం పళ్ళుతోముకుంటూ ఈ సువార్త అందజేసింది.

'నాకేమి తెలుసునమ్మా, నేను ఎక్కడకైనా వెడు తానా ఏమన్నానా, ఏ సంగతీ తెలియడానికి' అని నడిఈడు మనిషి అప్పటికి ఆ వార్త రెండుసార్లు విన్నా - తన కేమీ తెలియనట్లు నటిస్తూ, యువతికి సమాధానంచెప్పింది. కాసేపు ఉండి 'ఇంతకూ ఎవరితో లేచిపోయిందని?' తాను లోగడ విన్నవార్తని దృఢపరుచుకోవడానికి గుసగుసగా అడిగింది.

'వాళ్ళఇంట్లో అద్దెకున్న అబ్బాయితోనట.'

'ఆ అబ్బాయి బ్రాహ్మడేనా?'

'ఏమో, మంగమ్మత్త మాత్రం బ్రాహ్మడు కాడని చెప్పింది.'

'తక్కువకులంవాడితో లేచిపోవడం ఎంత అపకీర్తి!'

'లేచిపోదలచుకున్నప్పుడు, ఏ కులమైతేనేం, చెప్పు?' అంది యువతి, యువరక్తం పొంగిపోతూ.

'కులస్థుడైతే, సమయమొచ్చినప్పుడు పిడికెడు మెతుకులైనా పడేస్తాడు' అంది రంగమ్మ, ఈడు తనకు సమకూర్చిన అనుభవాన్ని వినియోగిస్తూ.

'దానికి లేని తప్పు పిడికెడుమెతుకులకు వచ్చిందా!' అంది యువతి దుసుసుగా.

'కాలానికితగ్గ బుద్ధులు, ఎవ్వరినని ఏం లాభం?' అనుకుంటూ చరచరా తనయింట్లోకి వెళ్ళిపోయింది రంగమ్మ.

రుక్మిణి లేచిపోయిందనడంతోనే, 'ఎవరితో?' 'ఎక్కడికి?' అనే రెండు ప్రశ్నలు బయల్దేరాయి ఆ గ్రామంలో.

'తురకవాడితో'

'దూదేకులవాడితో'

'రెడ్డితో'

'నాయుడుతో'

'బ్రాహ్మడితో'

విభిన్న చిత్తప్రవృత్తులు, విభిన్నరీతుల ఊహాగానం చేశాయి.

'హైద్రాబాద్'

'బొంబాయి'

'కలకత్తా'
'మద్రాస్'
'ఢిల్లీ'

భారతదేశంలో నగరాలకు కొదువలేదు. ఏ నగరానికి యిష్టమొస్తే ఆ నగరానికి పంపించివేశారా గ్రామప్రజలు-ఆ ప్రేమికులిద్దర్నీ, ఉదారంగా.

రుక్మిణియింట్లో అంట్లుతోమే ముత్తి పనికట్టుకొని జిజియాబాయి ఇంటికి వెళ్ళి, వరలక్ష్మిని పక్కకి పిలిచి 'నీ కోడలు లేచిపోయిందమ్మా!' అని చెప్పింది.

'ఎవరితోనే?' అని అడిగింది వరలక్ష్మి, ఆతురతగా పనిమనిషిని.

'ఇంట్లో అద్దెకున్నాడే ఆయనతో' అంది ముత్తి క్లుప్తంగా.

'ఎప్పుడు జరిగిందే ఈ తతంగమంతా?' అని అంది వరలక్ష్మి కుతూహలంగా.

'ఇంతకు ముందు నేను అంట్లు తోమడానికి వెళ్ళేసరికల్లా, రుక్కమ్మగారు ఇంట్లో కనపడలేదు. వెంకమ్మగారిని బోళ్ళు (అంట్లు) వెయ్యమని అడిగితే, నాకు తెలియదు పొమ్మన్నది. ఈశ్వరరావుగారు దిగాలుపడి తమ గదిముందు మెట్లుమీద కూర్చున్నారు. బోళ్లు అని అడిగితే, బోళ్ళు వేసేది ఎక్కడికో లేచిపోయింది. నీకు ఇవ్వాళ్ళ బోళ్ళు ఎవ్వరూ వెయ్యరు. వెళ్ళిపొమ్మని కసిరారు' అని ముత్తి వివరంగా జవాబు చెప్పింది.

'అయితే ఈ పని రాత్రే జరిగివుంటుందన్నమాట' అని వరలక్ష్మి, ముత్తి చెప్పిన విషయాల్ని సమన్వయం చేసుకున్నది.

'ఇంకా సందేహం దేనికమ్మా. రాత్రే ఇద్దరు కూడ బలుక్కొని లేచిపోయి ఉంటారు' అని ముత్తి, వరలక్ష్మి ఊహని బలపరిచింది.

'సాయంత్రం ఒకమాటు కనపడు, అన్నమేమైనా మిగిలితే వేస్తాను' అని నెమ్మదిగా ముత్తితో అని 'ఆ పాడు ముండ నాకు కోడలు ఎందు కవుతుందే - నా కోడలు పుట్టడంతోనే చచ్చిపోయిం' దని గట్టిగా అరుస్తూ వరలక్ష్మి లోపలికి వెళ్ళింది. జిజియాబాయి ఆ అరుపులు విని 'ఏం జరిగిం' దని వరలక్ష్మిని అడిగింది. 'పొద్దున లేవడంతోనే ఎవరిమొహం చూచానో, ఈ పాడువార్త వినాల్సి వచ్చిం' దని అరిచి, తన భర్త అక్కడ లేకపోవడం గమనించి, తనభర్తకి ఆ వార్త ఇప్పుడే అందజేయడమా, లేదా అనే సందిగ్ధావస్థలో త్రుటికాలం పడి, చివరకి ఒక నిశ్చయానికివచ్చి, 'ఏమండీ విన్నారా?' అంటూ దేవతార్చనగదిలోకి వెళ్ళింది వరలక్ష్మి. వేంకటరామయ్య పార్థివం చేసుకుంటున్నాడు. అతను భార్యపిలుపుకి కళ్ళు తెరిచి 'ఏమిటి?' అనిఅడిగాడు.

'మీ మేనకోడలు రుక్మిణి రాత్రి ఎవరితోనో లేచి పోయిందట' అని వరలక్ష్మి తాను మోసుకొచ్చిన వార్తని కుండబద్దలుకొట్టినట్టు చెప్పింది. కూతురుని అనుసరించి లోపలికి వచ్చిన జిజియాబాయి, 'ఎంతటి సద్వంశంలో పుట్టి

ఎంతటి పాడుపని చేసిందీ' అని మనుమరాలి దుష్కృత్యాన్ని గూర్చి వ్యాఖ్యానించింది. 'నట్టింట్లో ఉప్పలం పుట్టినట్లు పుట్టింది మా వంశంలో' అంది వరలక్ష్మి, అక్కడలేని మేనకోడలి పైన కళ్ళతో నిప్పులు చెరుగుతూ.

'అయ్యో పాపం!' అన్నాడు వేంకటరామయ్య జాలిగా.

'ఇంకా పాపం అంటారేమిటండీ' అని విరుచుకుపడింది వరలక్ష్మి వేంకటరామయ్యపైన.

'నీకు తెలియదులే' అని భార్యకు సమాధానం చెప్పాడు, ఆయన ప్రశాంతంగా.

'ప్రపంచమంతా ఒక దారి - మీది ఒకదారి. నా రాతకొద్దీ మీరు నాకు దొరికారు' అంటూ వరలక్ష్మి కోపంతో గబగబా అక్కడనించి వెళ్ళిపోయింది.

* * * *

దేవతార్చనగదిముందు కూర్చొని, టీ తాగుతున్న రఘుకి, తన తల్లి ధోరణి ఏమాత్రం నచ్చలేదు. తండ్రి ఉదారస్వభావం అతన్ని మంత్రముగ్ధుణ్ణి చేసింది. ఎప్పుడూ కలిసి మెలిసి ఒకేఇంట్లో జీవితాల్ని గడిపే యిరువురు వ్యక్తులు ఇంత విభిన్నస్వభావాలు కలిగిఉండడం చూచి అతనికి ఆశ్చర్యంవేసింది. అనువంశికంగా ప్రవృత్తులు ఏమైనా సంక్రమిస్తాయా? అతనిలో ఏదో వితరణ ప్రారంభమైంది. అతను తన తండ్రివంశాన్ని గూర్చి ఆలోచించడం మొదలెట్టాడు. తన ముత్తాత అగయ్య గొప్ప పండితుడూ, ఉదార

స్వభావుడూ అని వినికిడి. అతడు నిరతాగ్నిహోత్రుడట. అతనుఏవో యజ్ఞయాగాదులు చేసినట్లు కూడా వినికిడి.

అతనికొడుకు రామయ్య. రామయ్య వైద్యంలో గొప్ప ఘటికుడు. నాడీపరీక్షలో అతనికి అతనే సాటి. అతను వైద్యంచేసి, రాజ బంధువుల ప్రాపకం సంపాదించాడట. అతను హైద్రాబాద్‌లో పెద్ద బంగళా కట్టాడు. జీవితాంతం వరకూ రాజబంధువుల ప్రాపకంతో ఠీవిగా బ్రతికాడట.

అతనికొడుకు రఘురామయ్య. మంచికార్యశూరుడూ వ్యవహారదక్షతకలవాడూనని చెబుతారు. చుట్టుపట్ల గ్రామాల్లోని పెద్దపెద్ద దేశముఖులదగ్గర వైద్యంచేసి, ఎంతో భూమి సంపాదించాడు. అతనికి ముగ్గురు కొడుకులు. పెద్దవాడు తన తండ్రి వేంకటరామయ్య. మధ్యతను వివాహమైన తరువాత కొంతకాలానికి సంతానరహితంగా చనిపోయాడు. మూడవ అతనికి ముగ్గురు కొడుకులు. తన తండ్రికి ఈ వంశవృక్షంలో ఎవరి సుగుణసంపత్తి అబ్బినట్లు? ఎవరి ఉదారబుద్ధి అలవడినట్లు? రఘుకి ఏమీ సమాధానం తట్టలేదు. పోని తన తల్లి వంశాన్నిగూర్చి ఆలోచిస్తే, తనకు ఏదైనా కిటుకు దొరుకుతుందేమో. తనతల్లి తాత ఈశ్వరయ్యకు ముగ్గురు కొడుకులు, ఒక కూతురు. అందరికన్నా పెద్దతను రామయ్య. అతను సద్గుణసంపన్నుడనివినికిడి. అతనికొడుకు — తన మేనమామ నారాయణరావు. ఇతనికి చిన్నతనంలోనే తల్లి పోయింది. రామయ్య ప్రాపంచిక వ్యవహారాలకి దూరంగా ఉండి, తన కొడుకుసంగతే పట్టించుకోలేదు. నారాయణరావు మేనత్త

చిన్నతనంలో భర్తని కోల్పోయి, పుట్టింటి ఆశ్రయం పొంది నారాయణరావుని పెంచిందట.

నారాయణరావు యువకుడుగా పరపంచల్ని ఆశ్రయించి, మొదట గిర్దావరీ ఉద్యోగం సంపాదించాడట. ఉద్యోగరీత్యా జిల్లాలన్నీ తిరిగి, క్రమంగా పైకివచ్చి, అతను ప్రస్తుతం పేష్కార్ (డిప్యూటీ తాసిల్దార్) ఉద్యోగం చేస్తున్నాడు. రఘుకి నారాయణరావునుగూర్చి అంత ఎక్కువగా తెలియదు. తన చిన్నతనంలో అతను గిర్దావరీ చేస్తూ రోజూ నగరానికి టాంగాపైన వెళ్ళడంమాత్రం అతనికి జ్ఞాపకం ఉంది. తన తాత కిష్టయ్యకూడా పేష్కార్ ఉద్యోగం చేశాడని వినికిడి. అతను మొదటిభార్య పోతే, రెండవ భార్యను చేసుకున్నాడు. ఇది చాలక రంగి అనే ఒక భోగం స్త్రీని ఉంచుకున్నాడు. తను పుట్టకముందే అతను చనిపోవడంవల్ల, తన తాత కిష్టయ్య ప్రవృత్తినిగూర్చి రఘు ఒక అభిప్రాయానికి రాలేకపోయాడు. మనిషి అంత మంచివాడు కాడేమోననే అనుమానం రఘుకు కలిగింది. కాని రంగి కూతురు యశోద చాలా సౌమ్యురాలు. శాంతచిత్త. రఘుకి యశోద అంటే ఎంతో యిష్టం. కనపడినప్పుడల్లా, ఆమెని 'అమ్మా' అని నోరారా పిలుస్తాడు. చిత్తప్రవృత్తుల్లో యశోదకి, తనతల్లికీ హస్తిమశకాంతరభేదం ఉంది. ప్రవృత్తులు ఆనువంశికంగా సంక్రమిస్తే ఈ విభేదాలు ఎందుకుండాలి?

రఘు తలవనితలంపుగా నర్సయ్యతాతని గూర్చి ఆలోచించడం మొదలెట్టాడు. నర్సయ్యతాత ఈర్ష్యాళువు, లోభి, సంకుచితహృదయుడు అని చెబుతారు. ఇతరులు పైకి

రావడంచూచి అతను సహించేవాడుకాడట. కర్ణీకం[వాస్తూ ఉన్నతాధికారులసహాయంతో ఎందరో పెద్దరైతులభూముల్ని భుక్తంచేసుకున్నాడట. అన్నకొడుకు నారాయణరావు తన కొడుకు ఈశ్వరరావుకన్నా మొదటనించీ చురుకుగాఉండడం చూచి సహించేవాడుకాడట. గుమాస్తాదగ్గర కర్ణీకం నేర్చుకుని పరాశ్రయాన్నిపొంది, ఏదో పైకిరావడానికి నారాయణ రావు ప్రయత్నిస్తే, అతని ప్రయత్నానికి ఓర్వలేక అడ్డుతగిలే వాడట. నారాయణరావు మొదట తాలూకాఆఫీసులో ఏదో గుమాస్తా ఉద్యోగం సంపాదిస్తే, మహారాజులాగా ఇంట్లో కాలుమీద కాలువేసుకొని ఠీవిగా బ్రతకక, ఆ ఉద్యోగం చేయడం తమ వంశమర్యాదకే లోటని, అప్పట్లో ఉద్యోగం రాకండా పడగొట్టాడట. ఈశ్వరరావు మొదటి నించీ చిన్న జాగిర్దార్ ఠీవిలో బ్రతకడం నేర్చి, ఎట్టి ఉద్యోగ్యాలకీ ప్రయత్నించక కర్ణీకంతో సంతృప్తిచెందాడట. ఆ తరువాత నారాయణరావు తన పినతండ్రికి చెప్పకుండా గిర్దావర్ ఉద్యోగం సంపాదించాడట. ఆరోజుల్లో నర్సయ్య తాత అంటే ఆ గ్రామప్రజలకి సింహస్వప్నంగా ఉండేది. అతను తలలుమార్చడంలో గొప్పచెయ్యి. తనకి గిట్టని వాళ్ళపైన ఏవేవో వ్యాజ్యాలువేసి, కోర్టులచుట్టూ తిప్పి, మూడుచెరువుల నీళ్ళు తాగించేవాడట.

వైర్వాలు చెయ్యడంలో అతనికి అతనే సాటి అట. ఉన్నతాధికారులకు అడిగిన లంచాలు యిచ్చి, తాను పెట్టిన కేసులన్నీ తనవేపు తిప్పుకునేవాడట. ఈశ్వరరావు యిట్టి వాతావరణంలో పుట్టాడు. ఈ వాతావరణంలో పెరిగాడు.

చిన్నప్పటినించీ రాజభోగంతో బ్రతికాడు. ఎంతమంది ఉపాధ్యాయుల్ని పెట్టి చదివించినా, చదువు అట్టే అబ్బలేదు. కర్ణీకం వ్రాయడంమాత్రం నేర్చుకున్నాడు. పండితపుత్రుడుపండితుడు కానట్టే, వ్యవహారదక్షత గల తండ్రికి పుట్టి, అతనికి జన్మతః వచ్చిన లౌక్యాన్ని ఇతను నేర్చుకోలేకపోయాడు. నరసయ్యా తాత కాలంలో ఆ వూరి పటేలు రాజిరెడ్డికీ, ఇతనికీ పడేది కాదు. వా రుభయులమధ్య పూచికపుల్లవేస్తే భగ్గుమనమండేది. నరసయ్యాతాత సిరిసంపదలతో తూగుతున్న రాజిరెడ్డి సంసారాన్ని, కెలికి కయ్యం పెట్టుకొని, వ్యాజ్యాలువేసి కన్న కోర్టుల వెంటా రాజిరెడ్డిని తిప్పి, నేలమట్టంచేశాడు. నరసయ్యా పోవడంతోనే రామిరెడ్డి తండ్రులనాటి కక్ష ఈశ్వరరావుపై సాధించడానికి పూనుకున్నాడు. వ్యాజ్యాలువేయడంతో సంతృప్తిజెందక చేతులుచేతులుకలపడానికి ప్రారంభించాడు. ఆ రోజుల్లో గ్రామం రెండుగా చీలి, పటేలుపార్టీ పట్వారీపార్టీలుగా మారిందట. కాగా చింతలమెట్టు వీరికి అనుకూలంగా దొరికింది. రామిరెడ్డి పట్నంనించి ఒంటరిగా గ్రామానికి తిరిగిరావడం చూచి, కర్ణంపార్టీవాళ్ళు అతన్ని చింతలమెట్టు దగ్గర మెత్తగా తన్నేవారట.

ఈశ్వరరావు అదేవిధంగా ఒంటరిగారావడం గమనించి, పటేలుపార్టీవాళ్ళు అతనిని మెత్తగా బాదేవారట. ఈ ద్వంద్వయుద్ధాలతో సంతృప్తిజెందక, అప్పుడప్పుడు ఈ యుద్ధాల్లో పాల్గొనడానికి రోమీలాలనూ, అరబ్బులనూ నియమించేవారట. రోమీలాలు, అరబ్బులు పాల్గొన్నప్పుడు తలకాయలు తలకాయలు ఎగిరేవట. హత్యలు జరిగేవట.

రామిరెడ్డి ఈశ్వరరావులు ఒకరిపై ఒకరు కోర్టులలో హత్యా నేరాలు మోపుకునేవారట. ఆ తరువాత వారంట్లూ, అరెస్టులూ కొల్లలుగా జరిగేవట. ఈ కేసులలోఒకరిది పైచెయ్యి, ఇంకొకరిది కిందిచెయ్యి కావడం తథ్యం. కిందిచెయ్యి అయిన వాళ్ళు పరారీఅయి, కొంతకాలం అజ్ఞాతంగా వుండి, డబ్బు గుప్పుతూ కేసులు నడిపేవారట. తిరిగి అనుకూలసమయం చూసుకొని అజ్ఞాతవాసంనించి బయటకు వచ్చేవాళ్ళట. ఎంత పెద్ద నేరమైతే, అంత ఎక్కువధనం గుప్పాల్సివచ్చేది. ఎన్ని ఎక్కువ కేసులుంటే, అంత ఎక్కువధనం ఖర్చుపెట్టాల్సి వచ్చేది.

ఒకరికి ఒకరోజు కర్ణీకం పోతే మరుసటిరోజున ఇంకొకరికి పటేలెగిరిపొయ్యేది. ఒకొకసారి ఉభయుల దస్తరాలు జప్తుఅయ్యేవి. కేసులతో, వ్యాజ్యాలతో ఈశ్వరరావు పిత్రార్జితం నేలమట్టమైంది. కర్ణీకంపోయింది. రామిరెడ్డికి పటేలెగిరి పోయింది. ప్రస్తుతం ఉభయులమధ్య విరోధాలు మాత్రం మిగిలివున్నాయి. ఈశ్వరరావుకు రుక్మిణి ఒక్కతే కూతురు. తండ్రి నరసయ్య బ్రతికివుండగా తల్లిలేనిపిల్ల అని ఈశ్వరరావు రుక్మిణిని ఎంతో అల్లారుముద్దుగా పెంచాడు. ఆరోజుల్లో అతనికి స్త్రీలంపటత్వం, కూతురుపైన వ్యామోహం తప్ప ఇతర వ్యాపకాలు ఉండేవి కావు. తండ్రి యింటివ్యవహారాలు చూసుకునేవాడు. ఈశ్వరరావు కంటికి ఇంపుగా కనపడిన స్త్రీనల్లా వేటాడి పట్టుకునేవాడని ప్రతీతి. అతనికీ, రామిరెడ్డికీ ఒక స్త్రీ విషయంలో తగాదా వచ్చిందనీ, తండ్రుల

నాటి కక్షకి, ఈ తగాదా అగ్నిహోత్రంలో ఆజ్యం పోసినట్లు దోహదంచేసిందని ప్రజలు చెప్పుకుంటారు.

రుక్మిణికి ఎనిమిదిపళ్ళు వచ్చాయి. సంబంధాలకోసం వెతకటం ప్రారంభించారు. ఇంతలోకే ఈశ్వరరావు తండ్రి పోయాడు. గోరుచుట్టుపైన రోకటిపోటు అన్నట్లు ఆ వెంటనే రామిరెడ్డితో వ్యాజ్యాలు ప్రారంభమైనాయి. వ్యవహార దక్షతలేని ఈశ్వరరావుకు అన్నిబాధ్యతలూ ఒక్కసారే నెత్తి పైన పడ్డాయి. ఆరోజుల్లో వ్యాజ్యాలతో ఊపిరి పీల్చుకోవడా నికికూడా అతనికి ఓపిక ఉండేదికాదు. ఇట్టిపరిస్థితుల్లో అతను కూతురికి మంచిసంబాధాలు ఎక్కడినించి తేగలడని? కూతురు రోజుకురోజు పెద్దదైపోతున్నది. ఆ ఊళ్లోనే ఇంటిముందర పౌరోహిత్యంచేసి పొట్టపోసుకునే ఒకబ్రాహ్మడు ఉండేవాడు. అతనిపేరు బండయ్యా. బండయ్యా రోజూ ఈశ్వరరావు ఇంట్లో దేవతార్చనచేసేవాడు. తనకు తీరికలేనిరోజుల్లో, తనకొడుకు రామకిష్టయ్యను ఈశ్వరరావుయింట్లో దేవతార్చనచేయడం కోసం పంపించేవాడు. ఆ యింట్లోకి కావలసిన నీళ్ళుకూడా బండయ్యో, లేక అతనికొడుకు రామకిష్టయ్యో తెచ్చి పోసే వారు. వాళ్ళని నీళ్ళ బ్రాహ్మలనీ, పౌరోహిత్యం బ్రాహ్మ లనీ ఆ ఊళ్ళో పిలవడం వాడుక.

ఒకరోజు ఈశ్వరరావు రామకిష్టయ్యకు తన కూతురు రుక్మిణిని ఇచ్చి వివాహంచేయడానికి నిశ్చయించుకున్నాడు. బంధువులూ, గ్రామప్రజలూ ససేమిరాకూడదన్నారు. ఈశ్వ రరావు వారిమాటల్ని పెడచెవినిపెట్టాడు. కాగా తాను తన కూతుర్ని వదిలివుండలేననీ, ఈ సంబంధంచేస్తే, తన కూతురు

తన కళ్ళముందు వుంటుందనీ వాదించాడు. ఈశ్వరరావుకు తల్లిదండ్రులు లేరు. ఈ సంబంధం వద్దని గట్టిగా చెప్పడానికి చివరకి అతనిభార్య కూడా లేదు. గ్రామప్రజలూ, బంధువులూ చేసేదేమీలేక రుక్మిణి వివాహవిషయంలో మౌనంవహించారు. ఈశ్వరరావు జరిగిందంటే జరిగిందనేధోరణిలో, ఒక్కనాటి పెళ్ళి చేసి తనభారాన్ని దించుకున్నాడు. రామకిష్టయ్య చాలా అమాయకుడు. ఏదో శాస్త్ర పౌరోహిత్యం నేర్చుకున్నాడు. ఏ కార్యాలూ స్వతంత్రంగా చేయించలేక పోయినా, తండ్రి బండయ్య పక్కన వుంటే వాటిని వెళ్ళదీసేవాడు. అతనికి అల్లుడిదర్జా అంటే ఏమిటో తెలియదు. పెళ్ళి అయిన తరువాత కూడా అత్తవారింటికి కావల్సిన నీళ్ళు మొయ్యటం చూచి గ్రామప్రజలు అతనిని గేలిచేసేవారు. పెళ్ళిఅయిన ఆరునెల్లలోగా, ఒకనాడు రామకిష్టయ్యకు బ్రహ్మాండమైన జ్వరంవచ్చింది. వచ్చినజ్వరం ఎనిమిదిరోజులవరకూ వదలలేదు. ఒకనాటిసాయంత్రం అపస్మారకం పుట్టుకొచ్చింది. రామకిష్టయ్య రాత్రంతా పలవరించి, తెల్లవారేసరికల్లా చనిపోయాడు. రుక్మిణి పెళ్ళిఅయిన ఆరునెల్లలోపుగా విధవ అయింది. ఆరునెలల్లో ఆమెకు అన్నిముచ్చట్లూ తీరాయి. బండయ్య చేతికి అందివచ్చిన కొడుకు పోయిన దుఃఖానికి తట్టుకోలేక, కష్టల్లోపడి గిలగిల తన్నుకుంటున్న ఆ గ్రామంలో భుక్తిగడవక, తన కుటుంబంతో కొత్తగూడెం వెళ్ళిపోయాడు. పుత్రవియోగంతో మంచమెక్కి, చాలాకాలంవరకు నవిసి, అతనుకూడా పోయాడని వినికిడి...

రఘు తను విన్న సంగతుల్నీ, చూచినసంగతుల్నీ ఒకమాటు మననంచేసుకున్నాడు. ...

'ఎవరి పాపఫలం ప్రస్తుతం రుక్మిణి అనుభవిస్తున్నదా?' అనే శంక, మెరుపుకుమల్లే రఘుమెదడులో పొడచూపింది. తను చేసుకున్న పాపఫలమైతే, ఎన్నటికీ కాదు. ఈ జన్మలో ఆమె అసలు చేసుకున్న పాపమేమిటి? 'నిన్నటి సంఘటన పాప కారణం కాదా?' అనే ఆలోచన వెంటనే రఘుకి కలిగింది. అయితే కావచ్చు. కాని ఈ పాపానికి ఫలం ఎన్నడో ముందు ముందు అనుభవించాలిగాని, పాపం జరుగకపూర్వమే అనుభ వించి కూర్చోవడమేమిటి? రుక్మిణి వైధవ్యం అనుభవించడం తను చేసుకున్న పాపానికి ఫలితం ఎన్నటికీ కాజాలదు. చిన్న తనంలో తల్లిని కోల్పోవడం ఆమెచేసుకున్న పాపఫలం అని ఎవ్వరూ అనజాలరు. అసలు తొమ్మిదిఏండ్ల పిల్ల తను చేయ దలుచుకున్నా ఏమి పాపం చేయగలుగుతుంది గనక? తండ్రి తాతల పాపాలు ఆమెని చుట్టుకొని వేధిస్తున్నాయా? మంచీ చెడూ, పాపమూ పుణ్యమూ వ్యక్తిగతమైన విషయాలని చెబుతారు. వ్యక్తిగతమైన విషయాలైతే ఎవరిపాపం వాళ్లు అనుభవించవలసిందేగాని, పూర్వీకుల పాపాలు ఆమెని చుట్టేసి ఎందుకు బాధపెడతాయి. నరసయ్యతాత ఎన్నో పాపాలు చేశాడని చెబుతారు. అతను చేసిన పాపాలకి, అతను ఆ జన్మ లో ఫలితం అనుభవించలేదే? భార్యావియోగం తప్ప అతను ఆ జన్మలో అనుభవించిన దుఃఖమేమీ లేదు. కాగా, సిరిసం పదలతో తులతూగాడు. అధికారదర్పంతో బ్రతికాడు. మనుమల్ని చూశాడు. అతను ఈ జన్మలో చేసిన పాపానికి

ఫలితం ముందు జన్మలో అనుభవిస్తాడా? ఈశ్వరరావు ఈ జన్మలోనే తన దుష్కృత్యాలకి ఫలితం అనుభవిస్తున్నాడే? భార్య పోయింది, సిరిసంపదలు పోయాయి, ఆస్తి పోయింది, ఉద్యోగం లేదు. కొందరు ఈ జన్మలో ఫలితం అనుభవిస్తే మరికొందరు ముందుజన్మలో అనుభవిస్తారా? రుక్మిణి ఈ జన్మలో పూర్వజన్మ పాపఫలితాల్ని అనుభవిస్తున్నదా? ఏమో, అంతా అయోమయం. రుక్మిణి ఎంతో సౌమ్యురాలు. అంతటి సౌమ్యురాలు పూర్వజన్మలో మాత్రం పాపాలు ఎలా చేయగలిగిందో రఘుకి అర్థంకాలేదు.

ఒకనాడు తనూ, రుక్మిణీ చిన్నతనంలో ఆలుమగల ఆటలు ఆడుకుంటున్నారు. ఇంతలోకే రమణ వచ్చి, తను కూడా ఆడతానంది. ఆలుమగల ఆటలో ఇద్దరికన్నా ఎక్కువ ఉండడానికి వీలులేదు, వల్లకాదు, వెళ్ళమని తను రమణని బెదిరించాడు. రుక్మిణి 'మీరిద్దరు ఆడుకోండి, నేను ఆడ' నని చెప్పింది. రుక్మిణి ఆడకపోతే తానుకూడా ఆడనని రఘు నొక్కి చెప్పాడు. 'రుక్మిణి మొగుడివి కావడం నీకు యిష్టం కాని, నా మొగుడివి కావడం నీకు యిష్టంలేదా?' అని రఘుని రమణ దెప్పిపొడిచింది. 'రఘుకి ఇద్దరుపెళ్లాలు' అని రుక్మిణి తీర్పు చెప్పడానికి ప్రయత్నించింది. తాను ఈ గయ్యాళి పెళ్లాం రమణతో వేగలేనని, రఘు గట్టిగా అరిచాడు. తనని గయ్యాళి పెళ్ళాం అన్నందుకు రమణకి కోపం వచ్చింది. వెంటనే వచ్చి రఘుపైన పడి 'నేను గయ్యాళి దాన్నా!' అంటూ తన బుగ్గ కసిగా కొరికింది. బుగ్గనించి నెల్లువగా రక్తం ప్రవహించింది. పెద్ద గాయమయింది.

ఎన్నో రోజులకిగాని అది మానలేదు. ఇప్పటికీ, కుడి బుగ్గ పైన, గాయం మానిన మచ్చ, రఘుకి అలానే ఉంది. రఘుకి ఈ సంఘటన రుక్మిణి సౌమ్యతకి తార్కాణంగా జ్ఞాపకంవచ్చింది. అల్లాంటి సద్గుణసంపన్న పూర్వజన్మలో ఎట్టిపాపాలూ చేసివుండజాలదని, అతను ఒక నిశ్చయానికి వచ్చాడు. 'మరి క్రితంరోజున జరిగిన దుష్కృత్యాన్ని ఎలా సమర్థించటమా' అనే ఆలోచన అతనికి కలిగింది. 'విషమ పరిస్థితులు ప్రోద్బలంచేసిఉండకూడదా?' అన్న ఆలోచన విద్యుల్లతకుమల్లే అతనిబుర్రలో మెరిసింది. రుక్మిణి ఇంట్లో ఒక్కతె. వెంకమ్మ ఉన్నా, లేనిదానితో సమానమే. యావనవతి, కాగా విధవ. రాత్రిళ్ళు తండ్రి చంద్రమ్మదగ్గరికి వెళతాడని వినికిడి. వయస్సుమళ్ళినతండ్రే స్త్రీసౌఖ్యంలేకుండా ఒక్కనాడు కూడా గడపలేనప్పుడు నిండుయావనంలోవున్న రుక్మిణికి తన బ్రహ్మచర్యం నిలుపుకోవడం ఎంత దుర్భరంగా వుంటుందో రాత్రిళ్ళు రోజూ తండ్రి ఇంట్లో లేకపోవడం చూచి ఆమె మనస్సు ఎంత కలతచెందేదో? ఇట్టి దుర్భరపరిస్థితుల్లో ఆమె నిగ్రహంతో ఎలా వుండగలుగుతుంది? ఇంతలోనే ఒక విద్యావంతుడైన యువకుడు గృహదక్షిణభాగంలో అద్దెకు ప్రవేశించాడు. అతను దక్షిణభాగంలో ఒంటరిగా జీవితం గడుపుతున్నాడు. తూర్పుభాగంలో రుక్మిణి తన బ్రతుకు వెళ్ళబుచ్చుకుంటున్నది. బహుశా అతనికి పెళ్ళి అయివుండదు. పెళ్ళి అయివుంటే వెంటనే కాపురంపెట్టేవాడే. ఉభయుల్లో యువరక్తం ప్రవహిస్తున్నది. ఉభయులూ ఒకేయింట్లో వున్నారు. కలయికకు అవకాశాలు మెండు.

తండ్రి రాత్రిళ్ళు ఉండకపోవడం వాళ్ళకలయికను మరీ ప్రోత్సహించి వుండవచ్చు. ఇట్టి పరిస్థితుల్లో ఒక జరుగరాని సంఘటన జరిగింది. దీనికి ఎవర్ని నిందిస్తాం. ఉభయులనూ ఒక చోటికి సమకూర్చి, వారిని ఆవిధంగా ప్రేరేపించిన శక్తులనీ, పరిస్థితులనీ దూషించాల్సిఉంటుంది, అంతే. ఆ యువకుడు ఆ ఇల్లు బాడుగకు కుదుర్చుకున్నప్పుడు, ఆ ఇంట్లో ఒక తరుణ వయస్క ఉంటుందని అతను కలగన్నాడా? దైవికంగా వచ్చి ఇల్లు బాడుగకు ఇవ్వమని ఈశ్వరరావు నడిగాడు. ఎట్టి సంపాదనా లేక వ్యాజ్యాలతో ఆర్థికంగా గొప్ప దెబ్బతినిఉండటం మూలాన, ఈశ్వరరావు ఇల్లు బాడుగకు యివ్వకండా వుండ లేకపోయినాడు. చేతిలో నాలుగురాళ్లు ఆడుతున్నకాలంలో వచ్చి అడిగితే, అతను యిల్లు అద్దెకివ్వడానికి ఒప్పుకునేవాడు కాడు. పరిస్థితులన్నీ కూడివచ్చాయి. చివరకి జరుగవలసిందేదో జరిగిపోయింది. రుక్మిణి లేచిపోకపోతే ఈ రభసఅంతా బైటికి వచ్చేది కాదు. అంతా గుట్టుగా రహస్యంగా వుండిపోయేది. అప్పుడు రుక్మిణిని ఎవ్వరూ నిందించేవాళ్ళు కారు. ఖర్మంచాలక ఎవరికంట్లోనైనా పడితే, ఏదో మొగుడులేనిపిల్ల తమకెందుకని ఊరుకునేవాళ్ళు. బహుశా రుక్మిణికి ఆ రహస్య జీవితం నచ్చిఉండకపోవచ్చు. ముసుగులో గుద్దులాట ఎందుకని ధైర్యంచేసి అతనితో లేచిపోయి వుండవచ్చు. లేచిపోయినవెంటనే అందరూ ఆమెని తూలనాడారు. నడవడిని దూషించారు. ఎట్టిపరిస్థితుల్లో ఆమె ఆవిధంగా ప్రవర్తించవలసివచ్చిందో ఏఒక్కరూ గమనించరు. పరిస్థితులప్రోత్సాహంవల్ల ఆవిధంగా జరిగివుంటుందని ఒక్కరూ ఊహించరు.

పరిస్థితులవల్ల పాపపంకిలంలో పడినవారినిచూచి, జాలి పడి, కరుణించి, పాపపంకిలంలోంచి చేయూతనిచ్చి బైటికి లేవనెత్తడానికి ఏ ఒక్కరూ ప్రయత్నించరు. కావలిస్తే నాలుగు రాళ్ళు వేస్తారు. తద్వారా పాపపంకిలంలో పడినవ్యక్తి శాశ్వతంగా దానిలో కూరుకుపోయేట్లు దోహదంచేస్తారు. ఆ గ్రామంలో ఒక్క తనతండ్రి వేంకటరామయ్యతప్ప— రుక్మిణి పడిన ఆవేదననీ, ఆమె ఎదుర్కోవలసివచ్చిన పరిస్థితుల్నీ ఎవరూ అర్థంచేసుకున్నట్లు కనపడదు. రుక్మిణిపట్ల 'అయ్యో! పాపం!' అని సానుభూతి కనపరచినవ్యక్తి కూడా తనతండ్రి ఒక్కడే. అట్టితండ్రికి తను కొడుకుగా పుట్టినందుకు తనజన్మ సఫలమైందని రఘు భావించాడు.

## 3

ఒకరోజు ఉదయం నారాయణరావు తన భార్య సుభద్ర, కూతురు రమణలతో, సకుటుంబంగా ప్రేమావతీపేట వచ్చాడు. ఈశ్వరరావు అన్న రావడంతోనే కుశలప్రశ్నలడిగి, ఇంట్లోలేని వస్తువులు తెప్పించడంకోసం బజారుకు వెళ్ళాడు. కోమటికొట్టుకు వెళ్ళి అవసరమైన వస్తువులు పంపించమని జాబితా యిస్తే, 'మీరు ఇప్పటికే రెండువందల రూపాయలు ఇవ్వాలి. ఆ డబ్బు యిస్తేనే కాని వస్తువులు యివ్వడానికి వల్లకా' దన్నాడు. తన భూమి కౌలుకుచేస్తున్న ఆసామిని వందరూపాయలు అప్పు అడిగితే, 'గింజలైతే పోస్తాను - డబ్బుమాత్రం నాచేత కా'దన్నాడు. ఈశ్వరరావుకు ఏమీ తోచిందికాదు. 'వడ్లు పోయించుకుంటే వాటిని

ఎప్పుడు దంపించడం, ఎప్పుడు బియ్యం ఇంట్లోకి రావడం' అనే విచారం పట్టుకుంది ఈశ్వరరావుని. ఇంట్లో మానెడు బియ్యంకన్నా ఎక్కువ లేవు. అవి పట్టుమని రెండురోజులైనా చాలవు. ఈశ్వరరావు ఈమధ్య ఉప్పుంటే పప్పు లేని సంసారం చేస్తున్నాడు. ఇంట్లో అన్ని వస్తువులూ నిండుకున్నాయి. చంద్రమ్మదగ్గర ఏమైనా డబ్బువుందేమో కనుక్కుందామని ఆమెదగ్గరకు వెళ్ళాడు. ఆమె ససేమిరా డబ్బులేదంది. కాగా తనపైన ఒట్టుపెట్టుకుంది. 'పోసి, ఒక నగైనా యివ్వు, తాకట్టుపెట్టి కొంత డబ్బు అయినా తీసుకొస్తా' నని అడిగాడు. 'నీకు అడగటానికి నోరెట్లా వచ్చింది. నాకు నీవు ఏమి నగలు చేయించా' వని ఎదురుప్రశ్న వేసింది. దానితో ఈశ్వరరావు నవనాడులూ క్రుంగాయి. తాను మంచిస్థితిలో ఉన్నప్పుడు అది అల్లా నోరుపారేసుకోగలిగేదా? ఆరోజుల్లో అది అల్లా మాట్లాడితే, తాను దాన్ని చీల్చి కాకులకు వేసి ఉండేవాడు. కాగా అది తనదగ్గిర ఎంత డబ్బు కొల్లగొట్టిందని? జేబులో వున్న నోట్లకట్టలు తెల్లవారేసరికి మాయమయ్యేవి. ఆ రోజుల్లో డబ్బులంటే తనకు లక్ష్యం ఉండేది కాదు. ఎంతో దుబారాఖర్చు చేసేవాడు. పిత్రార్జితమంతా వ్యాజ్యాలకి, దుబారాఖర్చులకి చెల్లుఅయింది. ఆరోజుల్లో ఈ చంద్రి తనదగ్గర ఎంతడబ్బు లాగిందో! దానికి కృతజ్ఞత అన్నమాట ఏకోశానా లేదు. అలగాజనంతో సహవాసం చేయడం తనదే తప్పని, ఈశ్వరరావుకి ఆనాడు మొదటిసారిగా తెలిసివచ్చింది. గట్టిగా డబ్బు యివ్వమని అడిగితే, చంద్రి నానాహంగామాచేసి, తనని నలుగురిలో నవ్వుల

పాలుచేస్తుంది. ఈ ఉద్దేశం కలగడంతోనే ఈశ్వరరావు అక్కడినించి బయల్దేరాడు.

దారిలో వేంకటరామయ్యబావని అడిగిచూస్తే ఎల్లా వుంటుందనే భావం కలిగింది. ఆయన నిజంగా ధర్మాత్ముడు–డబ్బు వుంటే యిస్తాడు, లేకపోతే లేదని చెబుతాడు. కాని తాను ఆయనని డబ్బు ఎన్నడూ అడుగలేదు. ఇప్పు డెట్లా అడగడమూ అనే సందేహం వచ్చింది. ఈశ్వరరావు తన దగ్గిర డబ్బున్నరోజుల్లో తనబావనికాని, తన చెల్లెల్నికాని తానుకానినాడా? వేంకటరామయబావ పూర్వం సంగతులన్నీ మరచి, తననినమ్మి డబ్బు యిస్తాడా? అతను యిచ్చినాతనకు ఆ అప్పుతీర్చేమార్గమేదీ కనపడలేదు.

అన్న ఊళ్ళో లేకపోవడంవల్ల తానే అన్నపక్షాన దొంగసంతకాలుపెట్టి, ఉన్నభూముల్లో చాలాభాగం ఇదివరకే అమ్మేశాడు. మిగిలినభూములన్నీ ఈఊళ్ళో ఇతరత్రా గిర్వీ (తాకట్టు) ఉన్నాయి. గిర్వీదారులు ఆ భూములు చేసుకుంటున్నారు. కాలువక్రిందవున్న భూమి మాత్రం ఎక్కడా గిర్వీ పెట్టలేదు. అది ఒక ఆసామికి కౌలుకిచ్చి, ప్రస్తుతం ఏదో విధంగా భుక్తి గడుపుకుంటున్నాడు. గిర్వీదారుల నించి ఇంక భూములు విడిపించుకోవడం కలలోనివార్త. కౌలుకిచ్చిన భూమి గిర్వీపెడితేగాని, వేంకటరామయ్యబావదగ్గిర తీసుకునే అప్పు తీరేమార్గం కనపడదు. అయినా ఇప్పుడు వంద రూపాయలు ఆయనదగ్గిర తీసుకోవడం దేనికి? యాభై రూపాయలు తీసుకుంటే ప్రస్తుతపుచిక్కులు గట్టెక్కుతాయి. ఈ యాభైరూపాయలు వేంకటరామయ్యబావకి తిరిగి ఈజన్మలో

యివ్వగలుగుతే ధన్యుణ్ణి అని ఈశ్వరరావు అనుకున్నాడు. లేకపోతే ఆయనఅప్పు వచ్చేజన్మలో తను ఏవిధంగానైనా తీర్చుకుంటాడు. ఈ ఆలోచనలతో ఈశ్వరరావు జిజియాబాయిఇల్లు సమీపించాడు. ఈమధ్య ఎన్నడూరాని ఈశ్వరరావు ఆనాడు తమయింటికిరావడం గమనించి జిజియాబాయి వరలక్ష్మిలకు ఆశ్చర్యంవేసింది. ఇంటిల్లిపాది అందరూ చాలా మర్యాదచేశారు. టీ ఇచ్చారు. అందరిముందరా డబ్బు అడగడం యిష్టంలేక, వేంకటరామయ్యని పక్కకు తీసుకొనివెళ్ళి ఈశ్వరరావు డబ్బుప్రస్తావన తెచ్చాడు. వేంకటరామయ్య ఇంట్లో ఎవ్వరికీ తెలియకండా యాభైరూపాయలు రహస్యంగా ఈశ్వరరావుకి ఇచ్చాడు. ఈశ్వరరావు డబ్బుతీసుకొని కోమటికొట్టుకువెళ్ళి, ఇంట్లోకికావల్సినవస్తువులన్నీ తెచ్చాడు.

* * * * *

రమణ స్నానంచేసి, చక్కగా ముస్తాబై, టీ తాగి, వరలక్ష్మిఅత్తయ్య ఇంటికి బయల్దేరింది. వాకిలికి ఎదురుగా వున్న వసారాలో రఘుబావ కనపడ్డాడు. పడకకుర్చీలో పడుకొని ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు. ఎందుకో బావని చూడడంతోనే రమణకి వల్లమాలిన సిగ్గు ముంచుకొచ్చింది. బావకి కనపడకుండా ఇంట్లోకి దూరితే బాగుండుననిపించింది. ఇంతలోకే బావ పుస్తకంపైనించి దృష్టి మరల్చి తనవేపు చూశాడు. దూరంనించి అతను తనని గుర్తించినట్లులేదు. ఈ మధ్య బావని చూడక నాలుగు సంవత్సరాలు దాటింది. అతను తనని అసలు గుర్తిస్తాడో లేదో—తన బావ తనని గుర్తించడేమో అని రమణకి కొద్దిగా దిగులువేసింది. ఎంత

సేపు అల్లా తనని కళ్లు అప్పగించి చూస్తాడు. ఇంకా గుర్తిం చలేదా? అబ్బ! చివరకి గుర్తించినట్లున్నాడు. అదిగో, పడకకుర్చీలోంచి లేస్తున్నాడు. ఇంతలోకే తను వాకిలిగుమ్మం వరకు వచ్చింది. తల కిందికివంచుకొని లోపలికి వెడుతుండగా 'పిల్లా! బాగున్నావా?' అని పలకరించాడు. తను మౌనంగా లోపలికి వెడుతుండగా, వెంటబడి చెయ్యి అందుకున్నాడు. ఎందుకో బావ ముట్టుకోవడంతోనే, తన శరీరం ఝుల్లు మన్నది. శరీరంలో విద్యుచ్ఛక్తి ప్రవహించినట్లైంది. పైగా చెయ్యిఅందుకొని ముందుకు కదలనివ్వడు. ఇక తను మాట్లా డక తప్పిందికాదు. 'ఛీ! బావా! ఏమిటీపని?' అని చెయ్యి దులిపింది. బావ చెయ్యి వదలలేదు. కాగా తనని ఇంకా దగ్గరికి లాక్కుంటున్నాడు. ఏమీతోచక తను 'ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు బావా?' అని అడిగింది. 'ఏమను కుంటారు? తన పెళ్ళాంచెయ్యి పట్టుకున్నాడనుకొంటారు. అంతేనా?' అని పెంకిగా సమాధానం చెప్పాడు. అతని పెంకి తనానికి తను నిలువునా నీరైంది. 'నిన్నెవరు పెళ్ళిచేసుకుం టారు ఫో, బావా!' అని తను అతనిని విసిరికొట్టింది. ''చిన్న తనంలో పెళ్ళిచేసుకుంటానని బుగ్గ కొరికి, ఇప్పుడు చేసుకోక పోతే ఊరుకుంటానా?' అని బావ ఇంకొకచెయ్యి కూడా అందుకున్నాడు. రెండుచేతులుపట్టుకొని తనని దగ్గరికిలాక్కు న్నాడు. చేతులు విడిపించుకోవడానికి ప్రయత్నించి రమణ విఫలం పొందింది. రఘు రెండుచేతులూ తన ఒక్కచేతితో గట్టిగా పట్టేసి, ఇంకొకచెయ్యి వీపుమీదుగా పోనిచ్చి రమ ణని దగ్గరికి తీసుకున్నాడు. ఆమెచేతులు వదిలి రమణని

కౌగిలిలో బంధించాడు. రమణ ఇంక పెనుగులాడి లాభం లేకపోయింది. కాగా, శరీరంకూడా వివశం పొందుతున్నది. కౌగిలి బిగించి, అమాంతంగా రమణపెదవుల్ని, తన పెదవులతో గట్టిగా అదిమి ముద్దుపెట్టుకున్నాడు. రమణ, 'ఇంక వదిలేసెయ్యి బావా, ఎవరైనా చూస్తారు' అనిమాత్రం గుసగుసగా అనగలిగింది. రమణని వదలి అతను వసారాలోకి వెళ్లిపోయాడు. రమణ సరసరా లోపలికి వెళ్ళింది.

రమణకి ఇంట్లో ఎవరూ కనపడలేదు. అదీ కొంత మేలేననుకుంది. దేవతార్చనగదిలోకి తొంగిచూస్తే వేంకటరామయ్యమామ దేవతార్చనచేస్తున్నట్లు కనపడింది. ఆయన్ని చూడడంతోనే ఎందుకో రమణకి వేంకటరామయ్యకి నమస్కారం చేయాలనిపించింది. దేవతార్చనగదిలోకి వెళ్ళి మామయ్యకి దూరంగావుండి వంగినమస్కారంచేసింది. మామయ్య 'కృష్ణార్పణం' అని, 'ఎప్పుడు వచ్చినావమ్మా?' అని అడిగాడు. 'ఇంతకుముందే వచ్చాను మామయ్యా' అని రమణ సమాధానం చెప్పింది. 'అత్తయ్యా, అమ్మమ్మా ఏరి మామయ్యా?' అని తిరిగి ప్రశ్నించింది. 'మంచినీళ్ళు తేవడానికి బావికి వెళ్ళినట్లున్నా'రని చెప్పి, 'అవతల రఘు లేడూ?' అని ఎదుప్రశ్న వేశాడు. రమణ క్లుప్తంగా 'ఉన్నా'డని సమాధానం చెప్పింది. 'ఇప్పుడే మీఅత్తయ్యా వాళ్ళూవస్తారు-ఇంతలో బావతో మాట్లాడుతూ వుండ'మని చెప్పి, ఆయన దేవతార్చనలో నిమగ్నుడైనాడు.

రమణకి ఏమీతోచలేదు. వాకిలి తలుపుదగ్గిరికి వెళ్ళి 'బావ ఏమి చేస్తున్నాడా?' అని వెలుపలికి తొంగిచూచింది.

బావ చదువుకోవడంలేదు. ఊరికేనే పడకకుర్చీలో పడు కొని ఉన్నాడు. 'ఉదయమే ఆ నిద్రేమిటి బావా?' అని రమణ రఘుని పలకరించింది. రఘు రమణ పలకరించిందే తడవుగా లోపలికి వచ్చాడు. రమణ గదిలోంచి వెళ్ళిపోతున్నట్లు నటించింది. రఘు జడపట్టి రమణని వెనక్కి లాగాడు. 'అబ్బా!' అంటూ, రమణ గిలకమీద చేంతాడు లాగా వెనక్కి జర్రున వచ్చేసింది. రఘు తిరిగి రమణని రెండుచేతులతో బంధించి, 'ఎన్నాళ్ళకి ఎన్నాళ్ళకి కనపడ్డావు నా రాణీ!' అన్నాడు. రమణచెక్కిళ్ళు సిగ్గుతో ఎర్రబారాయి. తల క్రిందికి వాల్చడానికి ప్రయత్నిస్తుండగా, రఘు రమణగదువ పట్టుకొని ఆమెమొహం పైకిలేవనెత్తాడు. రమణ సిగ్గుతో కళ్ళుమూసేసింది. మొహాన్నీ, మూసినకళ్ళనీ, గదువనీ, చెక్కిళ్ళనీ, పెదవుల్నీ రఘు వళ్ళు తెలియని ఆవేశంతో ముద్దుపెట్టుకున్నాడు. ఆ ఆవేశంలో రమణ వోణీ క్రిందికి జారింది. ఓణీ అందుకోవడానికి క్రిందికి వంగి, రఘు కౌగిలిలోంచి తప్పించుకొని, కిలకిల నవ్వుతూ లోపలిగదిలోకి పరుగెత్తింది. రఘు తనను వెంబడించడం గమనించి 'నీవు లోపలికి వస్తే, దొడ్డిదారినించి పరిగెత్తిపోతా'నని అతనిని భయపెట్టింది. రఘు లోపలిగదిలోకి వెళ్ళక అక్కడే నిలబడి పోయాడు. 'అత్తయ్యా, అమ్మమ్మలు ఏక్షణంలోనైనా రావచ్చు'నని రమణ అతనికి హెచ్చరికచేసింది. దానితో రఘు లోపలికివెళ్ళే ప్రయత్నాన్ని మానుకున్నాడు.

ఎర్రని సిల్కులంగా వేసుకొని, ఎర్రని పట్టు జాకెటు తొడుక్కొని, రమణ ఆ ఉదయం వికసించిన పద్మంలాగా

రఘుకళ్ళకి కనపడింది. ఆమె అందాన్ని తన చూపులతో స్పృశిస్తూ 'పిల్లా! నీవు ఎంతఅందంగావున్నావో తెలుసునా?' అని అన్నాడు రఘు.

'పిల్లా ! పిల్లా ! పిల్ల ఏమిటి బావా? ఇంకా నీ కళ్ళకి నేను చిన్నపిల్లలాగానే కనపడుతున్నానా ?' అంది రమణ, పిల్ల అని పిలవడం తనకి గొప్ప అవమానమైనట్లు.

'నిన్నటివరకూ నీవు నాకు పిల్లవే - కాని ఈరోజు నించే నా అభిప్రాయాన్ని మార్చుకోవాల్సివస్తున్నది.' అని అన్నాడు రఘు, కొంటెగా క్రీగంటిచూపులతో రమణకేసి చూస్తూ.

*　　*　　*　　*

రమణ రఘు ఉద్దేశాన్ని గ్రహించింది. నిలుచున్న పాటున సిగ్గుతో కుదించుకుపోయి, పమిట సరిగ్గా వేసుకుంది. రమణకు మహావుంటే పదిహేను సంవత్సరాలుంటాయి. తనకన్నా మూడేళ్లు చిన్నది. మూడు నాలుగుసంవత్సరాల్లో రమణ ఎంత ఏపుగా పెరిగింది! అనుకున్నాడు రఘు.

'నువ్వు ఇంకా నా అందాన్నిగూర్చి మాట్లాడి ఏం ప్రయోజనం బావా ?' అంది రమణ, తల క్రిందికి వాల్చి కాలిబొటనవ్రేలుతో నేలని గీరుతూ.

'ఏమిటి రమా, ఎందుకు అల్లా అంటున్నావు ?' అని అడిగాడు రఘు ఆతురతగా.

'మావాళ్ళు నాకు ఒక సంబంధం నిశ్చయించారు' అంది రమణ, కంఠంలో గొప్ప విచారం ఉట్టిపడుతూ.

రఘు తన చెవులని తానే నమ్మలేకపోయాడు. ఇంతకు క్రితమే తనదిగా భావించి, ప్రేమించి, ఆరాధించిన ఒక అమూల్యాభరణాన్ని దారినవెళ్ళే దొంగలెవరో కొల్లగొట్టి నట్లు తోచింది అతనికి. అతను తన రిక్తహస్తాల్ని చూచు కొని, నిర్ఘాంతపోయాడు. తన చేతుల్లోని ఒక వస్తువు తనది కాదని చెబితే, ఏమీ చేయలేక భోరున ఏడ్చే కుర్రవాడి స్థితిలో పడ్డాడు. రఘు చిన్నప్పటినుంచీ రుక్మిణినీ, రమణనీ ప్రేమించాడు. రుక్మిణివివాహం చిన్నతనంలో జరగడంవల్ల తనూ, రమణా దైవికంగా దంపతులు అయినారు. తనని ఎవరైనా చిన్నతనంలో 'ఎవరిని పెళ్ళిచేసుకుంటా' వని అడిగితే జంకూగొంకూలేకండా 'రమణని' అని సమాధానం చెప్పేవాడు. రమణకూడా అంతే—'బావనితప్ప ఎవరినీ పెళ్ళిచేసుకో'ననేది. తన తలి దండ్రులు, మేనత్త మేన మామలు, తదితర బంధువులు ఈ భావాన్నే చిన్ననాటి నించీ తమ చిరు హృదయాల్లో నాటి, పెంచి పోషించారు. దానినే నేడు కొందరు ఆత్మీయులు కూకటివేళ్ళతో పెల్ల గించివేయడానికి సమకట్టారు. రఘుకి తన భవిష్యత్తు అంధ కారబంధురంగా కనపడింది. ఏమిచేయడానికీ తోచలేదు. రమణ ఈ పెళ్ళి చేసుకోవడానికి నిరాకరిస్తే? నిరాకరించినంత మాత్రాన వదులుతారా? బలవంతంగా పెళ్ళిచేస్తారు. పోనీ, రమణని ఎక్కడికైనా లేవదీసుకుపోతే? లేవదీసుకుపోయ్యి! ఇంటర్ చదువుతున్న తను ఆమెని పోషించగలుగుతాడా? తనకి ఎవరైనా ఉద్యోగమిస్తారా? పద్ధెనిమిదేళ్ళు అయినా సరిగ్గా దాటని తనకు ఉద్యోగం దొరకడం అసాధ్యంగా

తోచింది. పోనీ, ఉద్యోగం దొరుకుతుందనుకున్నా, దొరికే వరకూ రోజులు గడుపుకోవడం ఎల్లా? రమణని తనతో ఏవైనా నగలు తీసుకురమ్మంటే? మామయ్య తనపైన దొంగతనం క్రింద కేసు పెడితే? అరెస్టు చేయిస్తే? అంతే కాక, ఏ నగలు ఎత్తుకపోకండానే వాళ్ళు కేసు పెట్టవచ్చు. ఇద్దరికీ మైనారిటీ దాటలేదు!

'ఏమిటి బావా ఆలోచిస్తున్నావు?' అని అడిగింది రమణ.

ఎంత ఆలోచించినా మార్గమేమీ కనపడకపోతే, చెప్పిమాత్రం ఏం ప్రయోజనం?' అన్నాడు రఘు నిర్లిప్తంగా. రఘుకి ఆలోచనలతో బుర్ర వేడెక్కింది. కొంచెం సేదతీర్చుకోవడానికి, తన కుడిచేతితో తల దువ్వుకున్నాడు. చెయ్యి కుడిచెంపమీదినించి జారుతుండగా మునివేళ్ళు అనాలోచితంగా, కుడిబుగ్గపైనున్న మచ్చని తడుముతూ ఆగిపోయినాయి. మునివేళ్ళు మచ్చని తాకడంతోనే రఘుకి ఎందుకో అమాంతంగా దుఃఖం ముంచుకొచ్చింది. కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి. రమణ మెకానికల్‌గా మునివేళ్ళు తడుముతున్న మచ్చని చూచింది. ఆమె కళ్ళుకూడా అమాంతంగా చెమ్మగిల్లాయి. 'ఎన్నడో చిన్నతనంలోనే, బావని నావాణ్ణిగా చేసుకున్నాను. దానికి నిదర్శనంగా ఒక స్మృతిచిహ్నాన్ని అతని బుగ్గపైన వదిలాను. ఆ చిహ్నం, అతని జీవితాంతంవరకూ చెరగదు. అది మా ప్రేమకి ఒక స్మారకచిహ్నంగా, శాశ్వతంగా నిలిచిపోతుంది!' అని ఆలోచిస్తూ రమణ, పొంగిపొరలివస్తూన్న దుఃఖాన్ని ఆపుకోవడం

కోసం తన వోణీ కొంగుని వుండచేసి నోట్లో పెట్టుకుంది. ఒక త్రుటికాలం ఎవ్వరూ మాట్లాడలేదు.

'నేను ఒక సంగతి చెబుతాను, వింటావా బావా?' అని అడిగింది రమణ తనదుఃఖాన్ని అణచుకోవడానికి విశ్వ ప్రయత్నం చేస్తూ.

రమణవాక్యం ప్రవాహంలో కొట్టుకపోతున్నవాడికి పూచికపుల్ల దొరికినంతపని చేసింది. రఘు తనమొహంలో ఆశని బలవంతంగా పులుముకుంటూ రమణకేసి చూచాడు.

'మా రఘు ఉండగా ఇతరత్రా సంబంధాలు చూడడం దేనికని అత్తయ్య, నాన్నని అడిగిచూస్తే–' అని రమణ ఒక సూచనచేసింది. 'బాగానే వుంటుంది. కాని, అమ్మకి చెప్పడం ఎల్లా?' అని తన సందేహాన్ని తనకంఠంలో ధ్వనింపజేశాడు రఘు.

'నువ్వు చెప్పలేకపోతే, నేను చెబుతాను' అంది రమణ తన నిశ్చయాన్ని వెలిబుచ్చుతో.

ఇంతలోకే వరలక్ష్మి, జిజియాబాయి నీళ్ళబిందెలతో వచ్చారు. జిజియాబాయి రమణని చూడడంతోనే, 'ఇంకా పెళ్ళిఅయినా కాలేదు–అప్పుడే భార్యాభర్తలు ఏవో గుసగుసలు చెప్పుకుంటున్నారే!' అంది. ఆ మాటలకి వరలక్ష్మి చిరునవ్వుతో లోపలికి వెళ్ళింది. ఆ మాటలు రఘు రమణలకి ములుకుల్లాగా గుండెల్లో గుచ్చుకున్నాయి. రమణ వరలక్ష్మి, జిజియాబాయ్‌లతోబాటు లోపలికి వెళ్ళిపోయింది.

రమణ వెళ్ళిపోవడంతోనే రఘుకి ప్రపంచమంతా చీకటి కమ్మింది. ఆ చీకటిలో తాను రమణని రెండుసార్లు దగ్గరికి లాక్కుని ముద్దుపెట్టుకోవడం తప్పని అతనికితోచింది. రమణ పరకీయ. పరకీయని కౌగలించుకొని,ముద్దుపెట్టుకోవడం గొప్పనేరం. కాని, తెలియకచేసిన నేర మది. ముద్దుపెట్టుకున్న తరువాతకాని తెలిసివచ్చింది కాదు. పోనీ, రమణ ముందుగా అయినా చెప్పలేదు. ఎల్లా చెబుతుంది? తాను చెప్పడానికి అవకాశమిస్తే కదూ? నిండుహృదయాలు కెరటాల్లాగా పైకి లేచాయి. ఒండొంటిలో మహావేగంతో లీనమైనాయి. ఎవరి దా తప్పు? ఫలానికెరటాని దని ఎల్లా నిర్ణయించగలం? తప్పుజరిగితే ఉభయులదీ తప్పే. లేకపోతే ఉభయులూ నిర్దోషులే.

తనతండ్రి నారాయణరావు తనకి ఒక సంబంధాన్ని నిశ్చయించారనీ, త్వరలో తన పెళ్ళి జరుగనున్నదనీ రమణ వరలక్ష్మితో చెప్పింది. వరలక్ష్మి ఈ విషయం విని కంట తడిపెట్టింది. 'అయినసంబంధం వదలుకొని, మీానాన్న పరాయిసంబంధం ఎల్లాచేస్తాడో చూస్తా' నన్నది రమణతో. ఆమె ఈ విషయం వేంకటరామయ్య, జిజియాబాయిలతో చెప్పింది. నారాయణరావు నిర్ణయానికి అందరూ ఆశ్చర్య చకితులైనారు. విచారించారు. 'విచారించి ఏమాత్రం లాభం లేదు. ఈ విషయాన్నిగూర్చి అటో, ఇటో నిక్కచ్చిగా తేల్చుకోవాల్సిందే' నని తనభర్తకు హెచ్చరికచేసింది వరలక్ష్మి. 'పోనీ, ఇవ్వకపోతే మానే, అంతమాత్రాన రఘుకి

పెళ్ళికాదా?...'అని వేంకటరామయ్య అన్నాడు. వరలక్ష్మి 'అల్లా వదలివేయడానికి వీలులే' దని మొండికేసింది.

*   *   *

ఒకనాడు వేంకటరామయ్య భార్యాసమేతంగా నారాయణరావుని చూడడానికి వెళ్ళాడు. కుశలప్రశ్నల తరువాత రమణ వివాహప్రస్తావన తెచ్చారు.

'పిల్ల పెద్దదవుతున్నది—ఇంకా వివాహం ఎప్పుడు చేస్తావు బావా ?' అని అడిగాడు వేంకటరామయ్య.

'దైవానుగ్రహం వుండాలికాని, మనప్రయత్నాలవల్ల ఏ మవుతుం'దన్నాడు నారాయణరావు, ఆ ప్రస్తావనని తప్పించివేసే ఉద్దేశంతో.

'ఏవో ప్రయత్నాలు చేస్తున్నావని విన్నాను నిజమేనా ?' అని అడిగాడు వేంకటరామయ్య.

నారాయణరావుకు గొంతులో పచ్చి వెలక్కాయ ఇరుక్కుపోయినంతపని జరిగింది.

'రఘు వుండగా ఇంకా సంబంధాలు వెతకడమేమిటి అన్నయ్యా ?' అని అడిగింది వరలక్ష్మి. ఈ ప్రశ్న గోరుచుట్టుపైన రోకలిపోటుపడ్డట్టు తోచింది, నారాయణరావుకి.

'ఈడు కుదరదేమో ?' అన్నాడు నారాయణరావు వినీ వినపడనట్లు.

'మూడుఏళ్ళ తేడా వుంటే, ఇంకా ఈడు కుదరక పోవడ మేమిటి బావా?' అన్నాడు వేంకటరామయ్య.

'రమణ ఏపుగా ఎదుగుతున్న పిల్ల—రఘు ఏమో కొద్దిగా పొట్టి. అందువల్ల జోడు కుదరదేమో అని నా

భయం' అన్నాడు నారాయణరావు, వ్యవహారాన్ని సౌమ్యంగా దాటించివేతామనే ఉద్దేశంతో.

'ఇద్దరికీ ఎత్తులో బెత్తెడు తేడా వుంది—కావలిస్తే నువ్వొకొలిచిచూసుకో.' అంది వరలక్ష్మి నిర్మోహమాటంగా.

'ఏమోనమ్మా, నా మనస్సు ఒప్పటంలేదు' అన్నాడు నారాయణరావు, తన నిశ్చయాన్ని సూచించేకంఠంతో.

'పరాయి సంబంధాలపైన దృష్టి నిలిపితే, మనస్సు ఎల్లా ఒప్పుకుంటుంది?' అంది వరలక్ష్మి ధూకుడుగా.

'కావలిస్తే ఒకటి రెండురోజులు నింపాదిగా ఆలోచించి సమాధానం చెప్పు. ఇప్పుడప్పుడే ఒక నిశ్చయానికిరావల్సిన పని లేదు' అన్నాడు వేంకటరామయ్య.

'ఇంకా ఆలోచించడం దేనికి బావా — ఇంతకు ముందే చెప్పానుగా, నా మనస్సు ఒప్పుకోవడంలేదని' అని అన్నాడు నారాయణరావు, వేంకటరామయ్య ప్రశ్నకి సమాధానంగా.

వరలక్ష్మికి నారాయణరావు సమాధానంతో కళ్ళ నీళ్ళపర్యంతమైంది.

'అయితే కావాల్సిన సంబంధం చేతులారా వదులుకోవడమేనా?' అని అడిగింది, గద్గదస్వరంతో.

'కావాల్సిన సంబంధం అయితేమట్టుకు, ఇవ్వాకతప్పదని ఎక్కడైనా వ్రాసివుందా?' అని అడిగాడు నారాయణరావు వరలక్ష్మిని, తీక్షణంగా చూస్తూ.

'అయితే దీనికికూడా సనదులూ, దస్తావేజులూ కావాలా?' అని అడిగింది వరలక్ష్మి, ఒక చెంపన ఏడుస్తూ,

ఇంకొక చెంపన రూక్షంగా మాట్లాడుతో. 'తప్పనిసరి అయి నప్పుడు సనదులూ, దస్తావేజులూ చూపించవలసిందే!' అన్నాడు నారాయణరావు నిక్కచ్చిగా.

వరలక్ష్మి గొల్లున ఏడుస్తూ, 'సనదులూ, దస్తావేజులూ ఉన్ననాడే నీదగ్గరికివచ్చి పిల్లనడుగుతా' నని చెప్పి, అక్కడి నించి గిరుక్కున మళ్ళింది.

దారిలో రమణ కనపడితే, ఆ అమ్మాయిని గట్టిగా కావలించుకొని 'బావకి, నిన్ను మీ నాన్న ఇవ్వడటమ్మా' అని తిరిగి గొల్లుమన్నది. తనధోరణిలో పడి, ఆ అమ్మాయి నిశ్శబ్దంగా ఏడ్వడం వరలక్ష్మి గమనించలేదు. కాసేపటికి ఆ అమ్మాయిని అక్కడే వదలి, ఏడుస్తూ తన యింటికి వెళ్ళింది. వేంకటరామయ్య కొంచెంసేపు మౌనంగా కూర్చొని 'వస్తాను బావా' అని అక్కడినించి బయల్దేరాడు. ఆయన కళ్ళల్లో నీళ్ళుతిరగడం ఎవ్వరూ గమనించలేదు.

# 4

విశ్వేశ్వరరావు చుడీబజార్‌లోని ఒకఇంట్లో రెండు గదులు అద్దెకు తీసుకొని, రుక్మిణిని ఆ గదుల్లో దించాడు. రుక్మిణి టాంగా దిగడంతోనే, ఆరెండుగదులు కలయచూచ్చి వచ్చింది. గదులు చాలీచాలని వెలుతురుతో యిరుకుగా ఉన్నాయి. లంకంత కొంపలో ఉండడం అలవాటుఅయిన రుక్మిణికి, ఆ రెండుగదుల్లో సంసారంచేయడం కష్టసాధ్యంగా తోచింది. విశ్వేశ్వరరావుకు నలభై అయిదు రూపాయలజీతం. ఆ నలభైఅయిదులో ఏడు రూపాయలు ఇంటిఅద్దెకింద ఇచ్చి

కోవాలి. ఇక మిగిలిన ముప్పైఎనిమిదిలో తమసంసారం గడుస్తుందో, లేదో, రుక్మిణికి ఏమాత్రం తెలియదు. జీవితం సుఖవంతంగా గడపాలి అంటే డబ్బు అవసరమని ఆమెకు తెలుసు. కాని స్వయంగా ఎన్నడూ డబ్బు ఖర్చుపెట్టివుండకపోవడం మూలాన నెలపేరిట ఇద్దరు మనుషులకి ఎంత ఖర్చవుతుందో ఆమె అంచనా వేయలేకపోయింది. ముప్పైఎనిమిది రూపాయలు, తన సంసారానికి సరిపోవేమో అనే సందేహం కలిగినది. మీదుమిక్కిలి ఆ గదులు చూడడంతోనే తమబీదరికం ఆమెకు కళ్ళకుకట్టినట్లయింది. కాగా కళ్ళనీళ్ళపర్యంతమైంది. తన తండ్రి ఈశ్వరరావు అప్పట్లో ఎంతదుస్థితిలో ఉన్నాడో ఎప్పుడూ డబ్బుతో సంబంధంలేకపోవడంవల్ల ఆమె ఊహించుకోలేకపోయింది. అతను ఇప్పటికి మంచిస్థితిలోనే ఉన్నాడని ఆమెభావం.

'పోనీ, ఈపూటకి వంట మానేసెయ్యి-హోటల్‌నించి భోజనం తెచ్చుకుందాం' అన్నాడు విశ్వేశ్వరరావు, చుడీబజార్‌కు వెళ్ళినరోజున. హోటల్ ఏమిటో, ఆ భోజనం తెచ్చుకోవడ మేమిటో రుక్మిణికి బొత్తిగా అర్థంకాలేదు. ఎన్నడూ నగరంలో ఉండకపోవడంవల్ల, నగరపద్ధతులు మొదట ఏమీ బోధపడలేదు. 'హోటలు ఏమిటీ? భోజన మేమిటీ?' అని ఆమె విశ్వేశ్వరరావుని అమాయికంగా అడిగింది. విశ్వేశ్వరరావు ఆవిషయాలన్నీ బోధపరిచాడు. కాగా, హోటలు బ్రాహ్మలదేననీ, బ్రాహ్మలే వంటచేస్తారనికూడా చెప్పాడు. చిన్నప్పటినించీ శ్రోత్రియానికీ, ఆచారానికీ అలవాటుపడ్డ రుక్మిణి, 'ఆ మాలకూడు నేను తినలేను - కావలిస్తే మీరు తెచ్చుకొని

తినం'డని నిక్కచ్చిగా చెప్పింది. విశ్వేశ్వరరావు వంటకి కావల్సిన వస్తువులు పనిమనిషితో తెప్పించి వాటిని బాగు చేయించేలోపల, తను స్నానంచేసి మడికట్టుకుంది. మడికట్టుకోవడమంటే ఆ రోజుకి తడిబట్ట చుట్టుకోవడమన్నమాట. వంటిమీద తడిబట్టతో, రెండు ఇనుపపొయ్యిలు రాజేసింది. ఒకదానిమీద అన్నానికి అత్తెసరు పెట్టింది. రెండవ పొయ్యిమీద పప్పు పెట్టింది. వంట అవుతుండగా కాసేపు ఏదో జపం చేసుకుంది. విశ్వేశ్వరరావు బ్రాహ్మణపుట్టుక పుట్టినా, సంధ్య వార్చడం ఎన్నడో మానుకున్నాడు. పైగా చొక్కాతో అన్నంతింటాడు. ప్రేమావతీపేటలో ఉండగా, ఇంటికి కావల్సినసీళ్ళు పనిమనిషితో తెప్పించుకునేవాడు. రుక్మిణికి అతని పద్ధతులు ఏమీ నచ్చలేదు. ఒకనాడు ఏదో సందర్భంలో ప్రేమావతీ పేటలో ఉండగా అతన్ని హెచ్చరికచేస్తే, 'కాలం మారింది. కాలాన్నిబట్టి ఆచారాలు మారక తప్ప'వని అన్నాడు. అతని ఉద్దేశ మేమిటో రుక్మిణికి అర్థంకాలేదు. ఆనాడు వంట పూర్తిఅయినతరువాత 'నీళ్ళుకాగాయి, లేచి స్నానంచెయ్యండి' అని విశ్వేశ్వరరావుతో చెప్పింది. విశ్వేశ్వరరావు చొక్కా, బనీనులు విప్పి స్నానానికి వెళ్ళాడు. స్నానంచేసి, టవల్‌తో తలతుడ్చుకుంటుండగా, రుక్మిణి అతని వంటిపైన జంధ్యం లేకపోవడం గమనించింది. 'మీ జంధ్యమేది?' అని చప్పున అడిగింది. విశ్వేశ్వరరావు జంధ్యం వేసుకోవడం ఎన్నడో మానేశాడు. కాని ఆ సంగతి రుక్మిణితో చెప్పడానికి సాహసించలేకపోయాడు. వంటిమీద జంధ్యం వెతుకుతున్నట్టు నటించి, 'ఎక్కడో పడిపోయినట్టుంది'

అన్నాడు. 'బనీను విడిచినప్పుడు దానితోపాటు వచ్చేసి వుంటుంది. చొక్కా, బనీను బాగా ఝాడించిచూడండి' అంది రుక్మిణి, ఏదో కొంపమునిగిపోయినట్లు. విశ్వేశ్వరరావు చొక్కా బనీను ఝాడించాడు. అసలు వుంటే కదూ, అది కనపడడానికి. 'జంధ్యంసంగతి సాయంత్రం చూచుకోవచ్చు. అకలేస్తున్నది, ప్రస్తుతం అన్నమైతే పెట్టు' అన్నాడు విశ్వేశ్వరరావు. 'జంధ్యంలేంది అన్నం ఎల్లా తింటారండీ? అయినా సాయంత్రం ఎల్లా వేసుకుంటారు. రేపు ఉదయానికిగాని వేసుకొనడానికి వీలుపడదు' అని మొండికేసింది రుక్మిణి. వెంటనే పనిమనిషిని బజారుకు పంపించి, ఒక జంధ్యం తెప్పించింది. ఆరుపోగులు వేసుకుంటుండగా 'అదేమిటండీ పెళ్ళికాకండానే ఆరుపోగులు వేసుకుంటా'రని హెచ్చరికచేసింది. 'నాకు పెళ్ళికాకపోవడ మేమిటి? లక్షణంగా భార్యతో సంసారంచేస్తుంటే' అన్నాడు విశ్వేశ్వరరావు, కొంటెగా నవ్వుతూ. రుక్మిణికి ఎందుకో వల్లమాలిన సిగ్గు ముంచుకొచ్చింది. 'ఆ మూడుముళ్ళు వేసిన తరువాత, ఆరుచాలకపోతే తొమ్మిదిపోగులు వేసుకోండి' అంది, వాల్చినతలని పైకి ఎత్తకండా. విశ్వేశ్వరరావు మూడుపోగులజంధ్యం వేసుకున్నాడు. రుక్మిణి విశ్వేశ్వరరావుకు వడ్డిస్తూ 'ఆర్యసమాజంవాళ్ళదగ్గరికి ఎప్పుడు వెళ్ళి వస్తా'రని అడిగింది. 'ఇంకా ఆలస్యం దేనికి? ఈ సాయంత్రమే వెళ్ళి, అన్నిసంగతులూ మాట్లాడి వస్తా' నన్నాడు విశ్వేశ్వరరావు. భోజనాలైనాయి.

భోజనాల అనంతరం అన్నివస్తువులపైన మూతలు పెట్టి రుక్మిణి మైలపడింది. విశ్వేశ్వరరావు రెండు తాంబూలాలు బజారునించి తెప్పించాడు. అందులో ఒకటి తను వేసుకొని ఇంకొకటి రుక్మిణికోసం గూట్లో పెట్టాడు. పెళ్ళిఅయినకొత్తలో ఒకటి రెండుసార్లుతప్ప రుక్మిణి తాంబూలం ఎన్నడూ వేసుకోలేదు. నోరు ఎర్రబడి, ఇతరుల దృష్టిని ఆకర్షిస్తుంది. అది రుక్మిణికి వెగటుగా తోస్తుంది. అందువల్ల ఆమె బీడాకున్న లవంగంమాత్రం తీసి వేసుకుంది. విశ్వేశ్వరరావుకు రాత్రి అంతా నిద్రలేదు. 'వళ్ళు బడలికగా వుండివుంటుంది. పక్క వేస్తే కాసేపు పడుకోనైనా పడుకుంటా'డనుకొని, రుక్మిణి అతనికి పక్క వేసింది. పక్కపైన మేనువాల్చిందే తడవుగా అతను నిద్రపోయాడు. రుక్మిణికి ఏమీ తోచలేదు. తనూ, వండేయింట్లో ఒక తుంగచాప వేసుకొని, తలగడగా ఒకచీర ఉపయోగించి మేను వాల్చింది. రాత్రంతా మేలుకుని వున్నా ఆమెకు కన్నుపొడుచుకున్నా నిద్రపట్టలేదు.

రుక్మిణి తన భవిష్యత్తునిగూర్చి ఆలోచించడం మొదలుపెట్టింది. ఒకటి రెండు రోజుల్లో తనకి వివాహమవుతుంది. తను ఒక కొత్తజీవితాన్ని ప్రారంభిస్తుంది. ఇంకా ప్రారంభించడ మేమిటి? వివాహానికి నాంది ప్రస్తావనగా అది ఎన్నడో ప్రారంభమైంది. ఇంక ఆ జీవితానికి అలవాటు పడడమే తరువాయి. మొగుడుపోయిన స్త్రీ రెండవసారి వివాహం చేసుకోవచ్చునని రఘుబావ ఇటీవలనే తనకు చెప్పాడు. కాగా, ఇది శాస్త్రసమ్మతమట. వేద వేదాంగాలు, ధర్మశాస్త్రాలు, పురాణాలు— అన్నీ ఒప్పుకుంటాయట.

హిందువులు ఇటీవలివరకూ, ఈ విషయాన్ని గుర్తించలేదట. రాజమహేంద్రవరంలో ఎవరో వీరేశలింగం పంతులుగారని ఉండేవారట. వారు విధవావివాహాలు శాస్త్రసమ్మతమని రుజువుచేశారట. కుల వివక్షత లేకుండా, ఎన్నో విధవా వివాహాలు చేయించారట. ఎందరో విధవలకు ఆశ్రయమిచ్చి, వారిని ధర్మమార్గానువర్తినులుగా చేశారట. వారి చల్లని చలువక్రింద ఈ ఉద్యమం దేశమంతటా వ్యాపించిందట. అసంఖ్యాకంగా వివాహాలు జరిగాయట. ఆకాలంలో ఈ ఉద్యమం చివరకి హైద్రాబాద్‌కు కూడా•పాకిందట. 'తన స్నేహితుడి అన్న ఒకతను, ఆరోజుల్లో విధవావివాహం చేసుకొని, ఇప్పటికీ సుఖంగా ఆ భార్యతో కాపురం చేస్తు న్నా'డని రఘుబావ తనకి ఒకనాడు చెప్పాడు. మొదట కొన్ని రోజులవరకూ, వాళ్ళ యింటికి ఎవ్వరూ బంధువులు రాలేదట. కాలం గడిచినకొద్దీ, బంధువులురావడం మొదలు పెట్టారట. ఇప్పుడు వాళ్ళు ఏ వెలీ లేకుండా సుఖంగా జీవితాన్ని గడుపుతున్నారట.

తమది చాలా శ్రోత్రియకుటుంబం. తను పెళ్ళి చేసుకుంటే, తన యింటికి ఎవ్వరూ బంధువులు రారు. కాగా, వెంటనే తమని కులంలోనించి వెలివేస్తారు. కాని, ఆ వెలి ఎన్నిరోజులు నిలుస్తుంది? కాలక్రమేణా అది మాసిపోతుంది. రఘుబావకి ఈ పట్టింపులన్నీ ఏమీ లేవు. అతను తన యింటికి పిలువకపోయినా వస్తాడు. రఘుబావ పెళ్ళికి పిలిచినా వస్తాడు. కాని అతనిముందే తను తిరిగి పెళ్ళిచేసుకోవడం, ఏదో తనకు వెగటుగా వుంటుంది. రమణ తప్పక రఘు

బావనే పెళ్ళి చేసుకుంటుంది. అందువల్ల రమణకూడా తన యింటికి రాకతప్పదు. దానికీ తనదగ్గరికి రావడమంటే సంతోషమే. ఎంత శుద్ధశ్రోత్రియుడైనా వేంకటరామయ్య మామకి, ఎంతటి తప్పులైనా క్షమించివేయగల సామర్థ్యం వుంది. ఆయనా తన యింటికి వస్తాడు. తమతో భోజనం చేయకపోవచ్చు. కాని ప్రేమాదరణలకి మాత్రం, ఏమీ లోటు వుండదు. 'కాలం మారింది-కాలంతోపాటు విలువలు మారాయి. మీరు కట్టే విలువలు తప్పని నేను అనను. వాటిపట్ల.నాకు పూర్తిగా సానుభూతి వుంది. నాకు సంబంధించినంతవరకు, వ్యక్తిగతంగా ఆ విలువలతో నాకు నిమిత్తంలేదు-'ఇదీ ఆయనవాదన. ఈ వాదనని అర్థంచేసుకోవడానికి రుక్మిణి రఘుసహాయాన్ని పొందవలసివచ్చింది. వేంకటరామయ్య మామని అర్థంచేసుకోవడానికి కూడా రుక్మిణికి రఘు కారకుడైనాడు. గాంధీమహాత్ముడుకూడా విధవావివాహాల్ని అంగీకరిస్తాడు. ఈ సంగతికూడా రుక్మిణికి రఘు చెప్పాడు. వీరేశలింగం పంతులుగారి ఉద్యమ ఫలితంగా స్థాపితమైన విధవావివాహసంస్థ నేడు పనిచేయడం లేదట. అందువల్ల రుక్మిణి, తన వివాహంవిషయంలో ఆర్య సమాజంపైన ఆధారపడవల్సివచ్చింది. ఆర్యసమాజంవారు కులమతవివక్షతల్ని పాటించరట. గాంధీ మహాత్ముడు కూడా కులాలకి వ్యతిరేకమట. కులతత్వంలో ఏముందని రఘుబావ కూడా అంటాడు. ఎందుకో బ్రాహ్మణీకం వదులుకోవడానికి తన మనస్సు ఒప్పుకోదు. విధవావివాహానికి ఎందుకు ఒప్పుకుంటున్నది? అవసరం వచ్చింది కనుకనా? కులాలకి స్వస్తి

చెప్పవలసిన అవసరం, తన జీవితంలో ఇంతవరకు రాలేదు కనకనా? ఆ అవసరంవస్తే, కులతత్వానికి వ్యతిరేకంగాకూడా తనమనస్సు మారుతుందేమో! ఏమో, ఎవరు చెప్పగలరు?

ఆలోచనలతో రుక్మిణికి నిద్ర తేలిపోయింది. ఊరికే చాపమీద మేనువాల్చిందేకాని, అసలు పడుకోవడానికి ప్రయత్నించిందనా, నిద్రరావడానికి? దీనికి తోడుగా ఆలోచనలబుట్ట విప్పుకుకూర్చుంది. ఆ బుట్టలోని ఆలోచనలన్నీ, దారాలకిమల్లే చిక్కులుపడి ఉన్నాయి. మొదటినించీ జీవితం సాఫీగా నడిస్తేకదూ, ఏ దారానికి ఆదారం విడివిడిగా ఉండడానికి? బుట్టలో ఎన్నోరకాల దారాలు ఉన్నాయి. దారపు ఉండలన్నీ విడిపోయి బుట్టలో కలగాపులగం అయినాయి. ఉండగా ఏ రంగు దారం కూడా మిగలలేదు. అన్నిరంగులూ కలిసి, ఏరంగుకూ విశిష్టతలేకుండా, దారాలన్నీ చిక్కులు పడ్డాయి. ఈ చిక్కుల్ని విడదీయడం రుక్మిణికి సాధ్యపడుతుందా? విడదీయడానికి పూనుకున్నా, చిక్కుల్లో దారాలు ఎక్కడికక్కడ తెగి, చివరకి ఒక గజం దారమైనా చేతికి వస్తుందా? ఏమో!

రుక్మిణి ఇంక ఆలోచించలేకపోయింది. పడుకున్నదల్లా లేచి కూర్చుంది. కూర్చున్నా, తిరిగి ఆలోచనలు ముసురుకు రావచ్చు. అందువల్ల లేచి చాప చుట్టింది. చీర ఒకకొయ్యకు వేసింది. వెళ్ళి సబ్బుతో మొహం కడుక్కుంది. ఒక ఇనుప పొయ్యి కడిగి, దానిలో బొగ్గులువేసి అంటించింది. టీకి నీళ్ళు పెట్టింది. ఎన్ని గంటలైందో ఏమో? బహుశా నాలుగు దాటివుంటుంది. ఇంట్లో గడియారం లేదు, సరి

అయిన టైం తెలియడానికి. విశ్వేశ్వరరావు ఇంకా గుర్రు పెట్టి నిద్రపోతున్నాడు. నీళ్ళు ఎంతలోకి కాగుతాయి? ఈ లోపున విశ్వేశ్వరరావుని లేపుదా మనుకుంది రుక్మిణి. వెళ్ళి విశ్వేశ్వరరావు బుజాన్ని తట్టి కాస్త కుదిపింది. విశ్వేశ్వర రావు నిద్రనించి మేల్కోలేదు. మొగవాళ్ళు చీకూచింతా లేకుండా ఎంతచక్కగా నిద్రపోతారని కాస్త ఈర్ష్యపడింది రుక్మిణి. ఈసారి కొంచెం గట్టిగా కుదిపింది.

'అబ్బ! కాసేపు ఉండు' అని వత్తిగిలి పడుకున్నాడు విశ్వేశ్వరరావు. 'ఏమిటా నిద్ర! నాలుగు దాటింది' అంది రుక్మిణి. విశ్వేశ్వరరావు విధిలేక కళ్ళు తెరచి, వంగి తనని తట్టుతున్న రుక్మిణిచెయ్యి అందుకొని, ఆమెని తన వేపుకు లాక్కున్నాడు. రుక్మిణి కుప్పగా అతనిపక్కలో కూలింది.

పైన చెయ్యివేసి, "కాసేపు పడుకో' అని ఆమెని తన మీదికి లాక్కున్నాడు. 'ఎవరైనా చూస్తే నవ్విపోతారు. ఈ మిట్టమధ్యాహ్నం పడ కేమిటండీ?' అంది రుక్మిణి. 'ఎవ రున్నారు చూడడానికి?' అని విశ్వేశ్వరరావు వాకిలి తలుపు కేసి చూశాడు. వాకిలి తలుపు లోపల గడియవేసి వుంది. రుక్మిణి విశ్వేశ్వరరావు ఉద్దేశాన్ని గ్రహించి, మచ్చికపడి నట్టే నమ్మించి, అతనికౌగిలి కాస్త సడలిపోగానే అదను చూసుకొని దిగ్గున లేచి చిరునవ్వుతో పరుగెత్తిపోయింది. 'ఎంతసేపు తప్పించుకు పోతావో, చూస్తా' నన్నాడు విశ్వేశ్వరరావు ఉక్రోషంతో. 'తప్పించుకుపోవడ మెక్కడికి? ఎన్నడో మీ చేతుల్లో పడ్డాను. ఇంక నీట

ముంచినా, పాలముంచినా మీరే నాకు గతి' అంది రుక్మిణి, కొంచెం డగ్గుత్తికతో.

ఇంతలోకే నీళ్లు మసిలాయి. పొయ్యిమీద 'కుయ్యి' మని చప్పుడు చేస్తున్నాయి. రుక్మిణి టీ పొడి వేసి, నీళ్ళు కిందికి దించింది. విశ్వేశ్వరరావు మొహం కడుక్కుని వచ్చే లోపుగా వడియపోసి, పాలు చక్కెర కలిపి టీ సిద్ధంచేసింది. ఇద్దరూ టీ తాగారు.

విశ్వేశ్వరరావు టీ తాగి, సిగరెట్టు ముట్టించి, తిరిగి బద్ధకంగా పక్కపైన కూర్చున్నాడు. 'ఆర్యసమాజానికి వెళ్ళి రారూ?' అని రుక్మిణి హెచ్చరికచేసింది. ఏదో మరిచి పోయిన సంగతిని రుక్మిణి జ్ఞప్తికి తెచ్చినట్లు నటిస్తూ, విశ్వేశ్వరరావు గబగబా దుస్తులు వేసుకున్నాడు. చెప్పులు వేసు కుంటూ 'వాళ్ళతో మాట్లాడి వచ్చేసరికి కాస్త ఆలస్యం కావచ్చు' నని చెబుతూ, ఇంట్లోనించి త్వరగా బయల్దేరి వెళ్ళాడు. రుక్మిణి రెండడుగులు ముందుకువేసి కళ్ళతో అతన్ని సాగనంపి, కాసేపు శూన్యంలోకి చూస్తూ నిలబడిపోయింది.

'ఏమమ్మా! అల్లా నిలబడిపోయావు?' అని పక్కింటి రంగనాయకమ్మ కుదిర్చిన పనిమనిషి మంగి లోపలికివస్తూ అడిగింది.

'ఏమీలేదే! ఏదో ఆలోచిస్తూ నిలబడిపోయాను' అంది రుక్మిణి ఏసమాధానం చెప్పడానికీ తోచక.

'మీ ఆయన ఇంట్లో లేడా?' అని అడిగింది ఏదో విధంగా సంభాషణ కొనసాగించే ఉద్దేశంతో.

'లేరు, ఇప్పుడే ఎక్కడికో పనిమీద వెళ్ళా' రని రుక్మిణి క్లుప్తంగా జవాబు చెప్పింది.

'అంట్లు వెయ్యమ్మా! ఇప్పటికే చాలా ఆలస్యమైంది' అని మంగి హెచ్చరికచేసింది.

రుక్మిణి రెండు గిన్నెలు, ఒకతప్పాలా, ఒకస్తాంబాళం వెలుపలికి తీసుకొచ్చి వేసింది. 'కొంచెం శుభ్రంగా కడుగ' మని చెబుతూ, రెండు చెంబులు కూడా వేసింది. మంగి వంగి అంట్లు అందుకోబోతూ. తప్పాలలో కొంత అన్నం మిగిలి వుండడం చూచి, సంతృప్తిగా రుక్మిణిమొహంలోకి చూసింది. మంగికి రుక్మిణినొసట్లో బొట్టు కనపడలేదు.

'మీ నొసట్లో కుంకుమ లేదమ్మా!' అంది మంగి, వంగినదల్లా లేచి నిలబడుతో.

ఆ వాక్యం రుక్మిణిహృదయానికి ఫెల్లున తాకింది. దాని తాకిడికి, శరీరం నిలువునా కొయ్యబారింది. అమాంతంగా కళ్ళలో నీళ్లుకమ్మాయి. రుక్మిణికి ఏమి చేయడానికి తోచలేదు. ఏ సమాధానం చెప్పడానికికూడా నోరు పెకల్లేదు. చప్పున వంటఇంట్లోకి వెళ్ళింది. ఉత్తరక్షణంలో ఏకాంత వాతావరణంలో కొంత తేరుకొని, ఏదో వెతుకుతున్నట్లు, గూట్లో వస్తువులు ఇటూ అటూ కదిపి, వాటిని చప్పుడు చేయడం మొదలెట్టింది.

"కుంకుమభరణి కనపడడం లేదా అమ్మా!" అని అడిగింది మంగి వెలుపలనించి.

ఒకొకసారి మనకు ఏదో ప్రేరేపణ కలుగుతుంది. ఆ ప్రేరేపణ ఏమిటో మనం గుర్తించలేము. మనస్సులో

ప్రచ్ఛన్నంగా వున్న ప్రేరేపణ, మనని బలవంతపెట్టి ఏదో పనిచేయిస్తుంది. మనం చేస్తున్న పనిని గమనించి, మన ప్రేరేపణ ఏమిటో ఎదుటివారు ఇట్టే గ్రహించివేస్తారు. మన మార్గం సుగమంచేస్తారు. రుక్మిణివిషయంలో కూడా సరిగ్గా అంతే జరిగింది. ఏమీతోచక రుక్మిణి లోపలికి వెళ్ళి ఏదో వెతుకుతున్నట్లు నటించింది. ఆమె కుంకుమభరణికోసం వెతుకుతున్నదని సహజంగా మంగి అనుకుంది. ఆ మాటే పైకి అనేసింది. మంగి నోసట్లో కుంకుమ లేదనడంతోనే రుక్మిణి వెంటనే భరణికోసం వెతుకుతున్నట్లు నటించాలి. రుక్మిణి మెకానికల్‌గా వెతకడ మేదో వెతికింది. కాని దేని కోసం వెతుకుతున్నదో మంగి అందించేవరకు రుక్మిణికి సమాధానం తెలియదు. సమాధానం దొరకడంతో ఆమె మార్గం సుగమమైంది.

'ఎక్కడ పెట్టానో ఏమో, ఎంత వెతికినా కనపడడం లేదు' అంది రుక్మిణి, ఒకవేపున చేతికి దొరికిన అవకాశాన్ని జారవిడువకుండా, రెండవవేపున కంఠంలోని జీర వినపడకండా వుండడానికి తగు ప్రయత్నంచేస్తో.

'అయితే, రంగనాయకమ్మగారియింట్లో కాస్త కుంకుమ పట్టుకురానా?' అంది మంగి జవాబుకోసం ఎదురుచూడకండానే అవతలికి వెళ్ళిపోతో.

మంగి తిరిగివచ్చేలోపున రుక్మిణి నీళ్ళతో కళ్లు తుడుచుకొని కొంగుతో పూర్తిగా మొహం తుడుచుకుంది. దానికి ఎదురుగా వెళ్ళి కుంకుమభరణి అందుకుని కుడిచేతి మధ్యవేలుతో బొట్టు పెట్టుకుంది. కుంకుమ పెట్టుకుంటూ

వుంటే, ఎందుకో చెయ్యి వణికింది. కళ్ళల్లో నీళ్ళు కమ్ము కొచ్చాయి. రుక్మిణి చప్పున వెనక్కి—మళ్ళీ పక్క—దగ్గరికి వెళ్ళి దాన్ని చుట్టడం మొదలెట్టింది. మంగి అంట్లు తీసుకొని వెలుపలికి వెళ్ళిపోయింది.

రుక్మిణి సగం చుట్టిన పక్క— అల్లాగే వదిలేసి, వంట యింట్లోకి వెళ్ళింది. కుంకుమ తుడ్చేతా మనుకుంది. కాని మంగి మళ్ళీవచ్చి అడిగితే, తను ఏం సమాధానం చెప్ప గలుగుతుంది? రుక్మిణికి తన నిస్సహాయస్థితి చూచి మరీ దుఃఖం పొంగివచ్చింది. ఎంతోసేపు ఏడుస్తూ కూచుంది. ఏడ్వడంతప్ప తను ఈ విశాల విశ్వంలో చేయగలిగిందేమీ లేదా? రుక్మిణికి అప్పట్లో ఏమీలేదనే తోచింది. తన జీవిత సర్వస్వాన్ని ఒకరిచేతిలో పెట్టింది. అతనే ఇంక తన జీవి తానికి మార్గదర్శి. అతని చెప్పుచేతలలో మెలగడం తప్ప, అన్యథా స్వతంత్రించి వ్యవహరించడానికి తనకి అధికారం ఎక్క—డ వుందని? అతను తన జీవితాన్ని సుఖప్రదంచేస్తే సరేసరి. లేక దుఃఖభాజనం చేశాడో, జీవితాంతంవరకూ దుఃఖిస్తూ చివరకి తనే దుఃఖంగా మారి బ్రతుకుని ఈడ్వాల్సి వస్తుంది.

విశ్వేశ్వరరావు రాత్రి బాగా ప్రొద్దుపోయిన తరువాత వచ్చాడు. వచ్చీరావడంతోనే రుక్మిణి, 'ఏమైంఁ'దని అడిగింది. 'అయ్యేదేమిటి? ఎవ్వరూ కనపడకపోతే!' అన్నాడు విశ్వేశ్వరరావు సంభాషణని తుంచివేస్తో. 'మ రింత అలస్యం ఎందుకైంది?' అని అడిగింది రుక్మిణి తన హృదయంలోని ఆ రాటాన్ని అణచుకోలేక. 'ఆర్యసమాజం కార్యదర్శికోసం

ఒకచోటినించి ఇంకొకచోటికీ, ఆ ఇంకొకచోటినుంచి మరొక చోటికీ తిరిగేసరికి ఇంత ఆలస్యమైం'దన్నాడు విశ్వేశ్వరరావు విసుగుతో. రుక్మిణి ఆ విషయం మళ్ళీ కదపలేదు. అంతటితో ఆ సంభాషణ ఆనాటికి కట్టుబడి పోయింది.

ఆరాత్రి వడ్డిస్తుండగా విశ్వేశ్వరరావు కళ్ళు జ్యోతుల్లాగా వుండడం రుక్మిణి గమనించింది. నోట్లోనించి ఏదో వాసనకూడా కొడుతున్నది. అది ఏంవాసనైందీ ఆమె పోల్చుకోలేకపోయింది. భోజనంచేసి అతను చెయ్యికడుక్కోడానికి వెడుతూ కాస్త తూలడం, అడుగులు సరిగ్గా వెయ్యకపోవడం రుక్మిణి గమనించింది. తాగినవాళ్లు తూలుతారట. కొంపదీసి విశ్వేశ్వరరావు తాగలేదుకద? బ్రాహ్మణజన్మ ఎత్తి తాగుతాడా? అది అసంభవంగా తోచింది. అకారణంగా తనకి ఆ ఆలోచన కలిగినందుకే రుక్మిణి తనని తాను నిందించుకుంది. 'క్రితంరాత్రి అతనికి బొత్తిగా నిద్రలేదు. మీదుమిక్కిలి సాయంత్రం ఆర్యసమాజం కార్యదర్శికోసం నగరమంతా గాలించాడు. పాపం! బాగా వేడిచేసివుంటుంది. అలసి కాళ్ళు తడబడివుంటాయి. ఆ వాసన తన బుర్రలో పుట్టిన వాసనేమో?' అని తనకు తాను సమాధానం చెప్పుకుంది. తను వడ్డించుకొని భోజనం చేస్తున్నప్పుడు 'ఏం ఇంకా కాలా?' అని ఒకటి రెండుసార్లు అడిగాడు. తను చెయ్యి కడుక్కొని ఇవతలికి వచ్చి చూసేసరికి అతను పక్క దొర్లించుకొని దానిపైన పడుకొని గుర్రుకొడుతున్నాడు.

రోజులూ, మాసాలూ గడిచిపోతున్నాయి. రోజూ సాయంత్రం విశ్వేశ్వరరావు హిమాయత్ నగర్‌లోని వ్యవసాయ పరిశోధనా కేంద్రంనించి వచ్చి, ఆర్యసమాజానికి వెళ్ళే నెపంతో ఎక్కడికో వెడతాడు. 'ఏమైం'దని అంటే విసుక్కుంటాడు. ఒకరోజున సమాధానమే చెప్పడు. తూలుతూ వస్తాడు. రుక్మిణికి ఆ జ్యోతులకళ్ళు చూసేసరికి భయమేస్తుంది. రాత్రిళ్లు మడి సాగదు. ఒకటి రెండు రోజులు మడిలేకుండా అన్నంతినడం ఇష్టంలేక రుక్మిణి భోజనంకూడా మానేసింది. కాని ఎన్నిరోజులని మానేయగలదు ? ఒకొక రోజున అతను భోజనంచేయకండానే విజృంభిస్తాడు. నానా గల్లంతుచేస్తాడు. ఈ గల్లంతుఅంతా పక్కయింటివాళ్ళకివినపడుతుందేమోనని రుక్మిణిభయం. వాళ్ళకి వినపడితే ఇంకేమైనా ఉందా ? తాము ఒక్కక్షణమైనా ఆ యింట్లో నిలువగలుగుతారా ? తాను నోరు నొక్కుకొని, ప్రతిరాత్రీ అతని అడుగులకి మడుగులెత్తితే తప్ప, ఆ గల్లంతు తగ్గదు. కాని ఎన్ని రోజులని నోరు నొక్కుకొని పడిఉండడం ? ఎన్నిరోజులని అడుగులకి మడుగులెత్తడం ? రాత్రిళ్లు అతనితో మాట్లాడి లాభంలేదని, ఒకరోజున ఉదయమే 'పెళ్ళిసంగతి ఏమి'టని అతన్ని నిలేసి అడిగింది. 'ఇప్పుడప్పుడే తొందరేమొచ్చింది? చూతాములే ?' అన్నాడు విశ్వేశ్వరరావు. 'చూతాములెమ్మంటే కాదు. వెంటనే మీరు నన్ను పెళ్ళిచేసుకోక తప్ప'దని రుక్మిణి నిక్కచ్చిగా చెప్పింది 'పెళ్ళేమిటి, పెళ్ళి ? ఇంక నీ బ్రతుకు అవొక్కటే తక్కువైందా ?' అని అతను గొల్లున నవ్వాడు. రుక్మిణికి అమాంతంగా భూమి కంపించి

నట్లు తోచింది. భూకంపపుచీలికల్లో తాను కూరుకుపోవడం లేదుకదా ? గొప్పగా గాయపడ్డ సింహానికిమల్లే కళ్ళల్లోంచి చింతనిప్పులు కక్కుతూ, 'అయితే నేను మీ ఉంపుడుకత్తె ననుకున్నారా ?' అని ఉక్రోషంకొద్దీ అడిగింది. 'మరి కాక?' అని విశ్వేశ్వరరావు వెటకారంగా నవ్వుతూ సమాధానం చెప్పాడు. రుక్మిణి ఆ నవ్వులోనివిషాన్ని భరించలేకపోయింది. గొల్లున ఏడుస్తూ, 'ఇంతమాత్రానికి నన్ను ఎందుకు లేవ దీసుకొచ్చా'రని అడిగింది రుక్మిణి. 'నే నెక్కడ లేవదీసు కొచ్చాను ? నీవే వళ్లు కొవ్వెక్కి నా వెంటబడ్డావు' అని విశ్వేశ్వరరావు సమాధానం చెప్పాడు. 'నిజం చెప్పండి, ఎందుకు అబద్ధాలు ఆడుతారు ? నన్ను వెంటనే పెళ్ళి చేసుకుంటానని మీరు అనలేదా ?' అని రుక్మిణి జాలిగా అడిగింది. 'పెళ్ళిచేసుకొమ్మని వెంటబడితే, చూతాము లెమ్మని అన్నాను. అంతేకాని, నేను పెళ్ళి చేసుకుంటానని నీ కెన్నడూ వాగ్దానంచెయ్యలేదు' అన్నాడు విశ్వేశ్వరరావు రూక్షంగా.

రుక్మిణి, ఆవిధంగా విశ్వేశ్వరరావు ఒకటి తరువాత ఇంకొకటి చొప్పున, అనేకంగా అబద్ధాలుఆడేయడం చూచి సహించలేకపోయింది. 'నమ్మకున్నవాడే చివరకి తనని మోస గిస్తే ఇంక తనగతేమి కాను?' అని వగర్చింది. 'ఈ రహస్య జీవితం ఎన్నిరోజులు గడుపుతాం. హాయిగా పెళ్ళి చేసు కొని, సుఖంగా కాలంగడుపుదామని మీరు కాదండీ నన్ను మీతో లేచిరావడానికి ప్రోత్సహించింది?' అని చివరిప్రశ్నగా అడిగింది.

'ఆఫీసుకు దగ్గరగా యిల్లు బాడుగకు తీసుకొని నేను సుఖంగా కాలం గడుపుతుంటే, నీవే వళ్ళు కొవ్వెక్కి, నా వెంటబడి, నన్ను నా ఆఫీసుకు దూరంచేశావు. నీ మూలకంగా నేను రోజూ పన్నెండుమైళ్ళు డబ్బుదండుగచేసుకొని బస్సులో ఆఫీసుకు వెళ్ళవలసివస్తున్న'దని అన్నాడు విశ్వేశ్వరరావు, తను చేసిననేరమంతా రుక్మిణితలపైనవేస్తూ. 'చివరకి నాగతి ఇంతేనా?' అని రుక్మిణి, ఉండబట్టలేక జాలిగా అడిగింది. 'గతేమిటె, గతి? రెండుపూటలా హాయిగా మెక్కుతూ, ఇంక గతి అనడానికి నోరు ఎట్లావచ్చిం'దని అడిగాడు విశ్వేశ్వరరావు, ఎక్కడలేని ఈసడింపుతో.

రుక్మిణి, ఇంక ఏమి మాట్లాడగలుగుతుంది? పచ్చి అబద్ధాలాడే మనిషితో ఇంక ఎంతకని వాదించగలుగుతుంది? చేసేదేమీలేక చివరకి కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూ కూచుంది.

విశ్వేశ్వరరావు దుస్తులు వేసుకొని ఎక్కడికోవెళ్లాడు. పప్పుకోసం పెట్టిన నీళ్ళు కాసుండీలో మరిగిపోతున్నాయి. ఇంకొక పొయ్యిమీద ఉడికిన అన్నం కిందినించి మాడుతున్నది. మాడువాసనకొట్టడంతో రుక్మిణి వెళ్ళి పొయ్యిమీదినించి అన్నం దించింది. నీళ్ళకాసండీ దించింది. అన్నంమీద మూతపెట్టి, తలుపేసి వచ్చి పక్కమీద పడుకున్నది.

ఆనాడు మిగిలిన వంట చేయలేదు. అన్నంతినలేదు. తనదైన్యస్థితినితలచుకొని వుండుండి ఏడ్వడం మొదలుపెట్టింది. ఒక తప్పుఅడుగుతో, తన జీవితమంతా తారుమారైనట్లు తోచింది రుక్మిణికి. ఆ అడుగువేసి వుండకపోతే, తను ఇంత

దురవస్థకి లోనయ్యేది కాదు. ఏదో మోడుగానైనా, ప్రశాంతంగా జీవితశేషం గడిపిఉండేది. ఒక తాగుబోతుతో సంసారంచేయవలసిన అగత్యం ఉండేది కాదు. ఒక క్రూరుడి క్రౌర్యానికి బలికావల్సిన అవసరం ఏర్పడేది కాదు. గతజల సేతుబంధనం. దానికి ఇప్పుడు విచారించి ఏం లాభం? ఇప్పుడు ఈ విషమపరిస్థితుల్లోంచి తప్పించుకునేమార్గం ఏమైనాఉంటే ఆలోచించాలి. పోనీ, ఏమీ ఎరగనట్లు ప్రేమావతీపేటకు వెళ్ళిపోతే? తాను లేచిపోయినసంగతి ఇదివరకే గ్రామమంతా వ్యాపించి ఉంటుంది. తాను చుడీబజారుకు వచ్చి అప్పుడే రెండునెలలైంది. ఈ రెండునెలల్లో, తననిగూర్చి గ్రామంలో ఎన్ని వదంతులు బయల్దేరి వుండవు? తాను ఆ వదంతుల్ని ఎల్లా తట్టుకోగలదు? తనని నీచంగాచూచే ప్రజల్ని తను ఏవిధంగా ఎదుర్కోగలదు?

గ్రామానికి తిరిగివెళ్ళి లాభంలేదని రుక్మిణికి తోచింది. పోనీ, విశ్వేశ్వరరావు వచ్చేలోపున, తను ఎక్కడికైనా వెళ్ళిపోతే? వెడితే తనకు ఆశ్రయ మెవరిస్తారు? పెద్దనాన్న దగ్గరికి వెడితేనో? ఇంట్లో పెళ్ళీడుపిల్ల వుంది. మాయింటికి ఎందుకు తగులడినావని నిలేసి అడుగుతారు. అప్పుడు తను ఏమి సమాధానం చెప్పగలుగుతుందని? పోనీ, వేంకటరామయ్యమామ యింటికి వెడితేనో? ఎక్కడికి వెళ్ళినా తన అపకీర్తి తనని వెన్నాడుతుంది. ఈ అపకీర్తితో, తను ఇతరుల నెత్తిమీదికి వెడితే ఏం బాగుంటుంది? అందులో తనని ప్రేమించి, మన్నించినవాళ్ళదగ్గరికి వెళ్ళడమా? లాభం లేదు. ఎక్కడికి వెళ్ళడానికి వీలులేదు.

పోనీ, ఆత్మహత్య చేసుకుంటే? జీవితంలో ఒక తప్పు టడుగు వేసినంతమాత్రాన, ఇక ఆత్మహత్యతప్ప వేరే శర ణ్యమేమీ లేదా? రుక్మిణికి ఏమీ లేదనే తోచింది. కాని తెలిసీ తెలియక చేసిన ఇంత చిన్న తప్పుకి, అంత పెద్దశిక్షా? రుక్మిణికి ప్రపంచంలో న్యాయమంటూ ఒకటి లేదనిపించింది. ఆత్మహత్య చేసుకోదలుచుకుంటే ఉరిపోసుకోవడమో, లేక వంటిపైన కిరసనాయిల్ పోసుకొని నిప్పంటించుకోవడమో చేయాలి. రుక్మిణికి ఆ రెండుపద్ధతులూ చాలా దారుణంగా కనపడినాయి. సునాయాసంగా ప్రాణంపోయే మార్గమేదైనా వుంటే బాగుండుననుకుంది. కాని, అటువంటి మార్గమేమీ తనకు తెలియదు. అంత క్రౌర్యానికి పాల్పడి ఆత్మహత్య చేసుకోవడంకూడా అర్థరహితంగా కనపడింది రుక్మిణికి. చావ దలుచుకున్నా, చావడానికి వీలులేదు; బ్రతకదలుచుకున్నా బ్రతకడానికి వీలులేదు! ఇటువంటి విషమపరిస్థితుల్లో పడింది రుక్మిణి. విశ్వేశ్వరరావే తనని ఆ పాపానికి ప్రోత్సహించాడు. తనని పెళ్ళిచేసుకుంటానని నమ్మించాడు. దూరాలోచనలేక, మనిషి ఎటువంటివాడో కూడా తెలుసుకోక, తను అతను పన్నిన పన్నాగంలో పడ్డది. అతనికి తన శరీరాన్ని అప్పగిం చింది. ముందు పెళ్ళిచేసుకుంటేతప్ప, తాను స్వాధీనంకానని నిక్కచ్చిగా చెప్పివుంటే, ఏమి జరిగేదో? తను అమాయ కంగా అతనిమాటల్ని నమ్మేసింది. పెళ్ళికిముందే అతనికి స్వాధీన మైంది. ఆ కొంపలో ఆ రహస్యజీవితాన్ని గడపడంకంటే, పెళ్ళిచేసుకొని ఎక్కడైనా సుఖంగా వుందామని అతను తనని ప్రోత్సహించాడు. దానికికూడా అంగీకరించి తాను అతనితో

లేచిరావడానికి సిద్ధపడింది. లేచివచ్చిన రెండు నెలల్లోనే తన ఆశలు అడియాసలైనాయి. భవిష్యత్తునుగూర్చితను నిర్మించుకున్న దివ్యభవనాలు పిడుగులుపడి నేలమట్టమైనాయి. రెండు నెలల్లోనే, తాను జీవితంలో అనుభవించదగ్గదంతా అనుభవించివేసింది. సుఖపడవలసినదంతా సుఖపడింది. ఈ రెండు నెల్ల అనుభవంకోసమేనా, తను ఈ జన్మఎత్తింది? తనని ప్రోత్సహించి, లేవదీసుకువచ్చిన విశ్వేశ్వరరావుకి తనుచేసిన పాపంలో కొంతభాగమైనా లేదా? తననేరంలో అతను భాగస్వామి కాడా? అయితే శిక్షకూడా కొంత అతనుఅనుభవించవలసిందేనే? అటువంటిమీదే జరుగుతున్నట్టులేదు. తానే పూర్తిశిక్ష అనుభవిస్తున్నది. ఈ శిక్షనించి బయటపడ్డ తరువాత, తనకేమైనా భవిష్యత్తు ఉంటుందా? ఏమో, ఎవరు చెప్పగలరు?

ముందు ముందు ఏదో మంచి జరుగుతుందనే ఆశతో, రుక్మిణికిమల్లేనే ప్రపంచంలో నూటికినూరుమంది జీవిస్తారు. నిస్తేజమైన జీవితాన్ని గడుపుతూ, భవిష్యత్తునిగూర్చి కమ్మని కలలుకంటారు. ఏదో పుస్తకాల్లోతప్ప, జీవితం ఎన్నడూ సుఖవంతంగా వుండదని గుర్తించరు. తాత్కాలిక ఉపశమనాల్ని చూచుకొని తాము ఏదో సుఖాన్ని, మహదానందాన్ని అనుభవిస్తున్నామని భ్రమపడుతారు. తాత్కాలిక ఉపశమనాలు నీడగా జారిపోవడంతోనే, తమకు ప్రస్తుతం గ్రహచారంచాలడంలేదని వాపోతారు. జీవితం ఒక మోనాటనీ అనీ, గుడ్డిఎద్దు చేలోపడ్డట్టు అర్థరహితంగా అది గడచిపోతుందనీ ఎన్నడూ గ్రహించరు. జీవితం ఒక సంఘర్షణఅని

వాళ్ళకి ఎన్నడూ తట్టదు. పడకకుర్చీల్లో పడుకొని, సంఘర్షణ పడవలసిన అగత్యాన్ని మరచిపోతారు. సంఘర్షణని తప్పించుకొని తిరుగుతారు. సంఘర్షణని తప్పించుకొని తిరుగుతే, జీవితం మరీ దుర్భరంగా, నిస్తేజంగా, మొనాటనస్‌గా మారుతుందని గుర్తించరు. సంఘర్షణలో పడితే జీవితం కొంతవరకైనా, ఒక ఉద్దేశానికి కట్టుబడివుంటుంది. కొంత కాకపోయినా, కొంతైనా మొనాటనీ తగ్గుతుంది. అలసత్వం జీవితానికి విషతుల్యం. సంఘర్షణ జీవితానికి ప్రాణపదం. ఈ అమరసత్యాన్ని గ్రహిస్తే, జీవితం సంఘర్షణలోపడి కొంత వరకు చైతన్యవంతంగా మారుతుంది. లేకపోతే అలసత్వంలోకి దిగజారి దుర్భరంగా రూపొందుతుంది.

విశ్వేశ్వరరావు ఆసాయంత్రం ఆఫీసునుంచి తిరిగివచ్చి దుస్తులు మార్చుకొని, ఎక్కడికో బయల్దేరి వెళ్ళాడు. రుక్మిణిని మాటవరుసకైనా పలుకరించలేదు. 'భోజనం చేశావా?' అనికూడా అడగలేదు. అతను వచ్చినప్పుడు, రుక్మిణి పడుకున్నదల్లా పడుకొనే ఉండిపోయింది. యధాప్రకారం విశ్వేశ్వరరావు రాత్రి తూలుతూ యింటికి వచ్చాడు. అప్పటికి పదిగంటలు దాటిఉంటుంది. వచ్చీరావడంతోనే, అతికష్టం మీద జోళ్ళువిప్పాడు. తూలుతూ వెళ్ళి వాకిటితలుపు వేశాడు. పక్కయింటివాళ్ళంతా నిద్రపోయినట్టున్నారు. ఎక్కడా ఏ చప్పుడూ లేదు. ప్యాంటు విడిచి ధోతి కట్టుకోకుండానే, అతను పక్కమీద వచ్చిపడ్డాడు. రుక్మిణి తన పక్కన అతను పడుకోవడంచూచి, కొంచెం అవతలికి జరిగి, లేచి అక్కడినించి వెళ్ళిపోవడానికి ప్రయత్నించింది. అతను

రుక్మిణివంటిమీద చెయ్యివేసి, ఆమెని దగ్గరికి లాక్కోవ డానికి ప్రయత్నించాడు. ఆమె పక్కకి తప్పుకొని లేచికూర్చు న్నది. అతనుకూడా లేచి కూర్చున్నాడు. రుక్మిణిదగ్గరికి జరి గాడు. రెండుచేతులతో ఆమెను తనకౌగిలిలో బంధించ డానికి ప్రయత్నించాడు.

'నన్ను ముట్టుకోకండి' అని ఆమె తీక్షణంగా హెచ్చ రికచేసింది. 'నువ్వెవరు నాకు చెప్పడానికి? నాయిష్టం!' అని అతను, ఒక ఆటగా జవాబు చెప్పాడు. 'ఇంక మీ ఆటలు నాదగ్గర సాగవు. ఈనాటితో మీకూ నాకూ ఛెల్లు!' అని ఆమె తెగతెంపులుచేసుకుంటున్న ధోరణిలో మాట్లా డింది. 'ఛెల్లు ఏమిటి ఛెల్లు! అంతా నీ యిష్టమేనా?' అని అతను తీవ్రంగా మాట్లాడాడు. 'మరి కాక?' అని ఆమె సమాధానం చెప్పింది. 'నీ యిష్ట మేమిటో చూస్తానుగా?' అని అతను నిర్దాక్షిణ్యంగా ఆమెరెక్కపట్టి తనవేపుకు లాగాడు. 'మీ మర్యాద దక్కదు, నన్ను వదిలివేయండి' అని ఆమె హెచ్చరికచేసింది. కాని అతను వినలేదు.

ఇరువురూ లాంతరు గుడ్డివెలుతురులో పెనుగు లాడారు. అతనికి విసుగెత్తింది. పట్టరాని కోపం వచ్చింది. ఫెళ్ళున రెండవచేతితో చెంపపైన దెబ్బవేశాడు. ఆమె కళ్ళల్లోంచి నిప్పురవ్వలు రాలాయి. ఆమె బాధతో పెనుగు లాట మాని, కొట్టినచెంపని ఒకచేత్తో రాస్తూ "అబ్బా!" అంది. "మీ యిష్టమొచ్చినంత కొట్టండి, తన్నండి, కాని నేనుమాత్రం ఇక ఒప్పుకునేది లే"దని నిక్కచ్చిగా సమా ధానం చెప్పింది. ఆ మూర్ఖానికి అతనికి వళ్ళుమండింది.

తిరిగి రెండవచెంపమీద ఫెళ్ళున వేశాడు. చెలమల్లో నీళ్ళు వూరినట్టు ఆమెకళ్ళల్లో కన్నీరు వూరింది. చెంపలమీదుగా ఏకధారగా ప్రవహించడం మొదలెట్టింది. 'కొట్టండి, ఇంకా కొట్టం' డని ఆమె మూర్ఖంగా అంది. అతనికి మరీ ఆవేశం ఎక్కువైంది. రెండుచెంపలూ తిరిగి ఫెళ్ళుమన్నాయి. ఆమె ఏడుస్తో, శోకమూర్తిగా కూచుంది. ఆమె అక్కడినించి కదలలేదు. అతన్ని పల్లెత్తుమాట అనలేదు. సహనంతో అతను కొట్టినదెబ్బలన్నీ కిక్కురుమనకండా భరించింది. ఆ యింట్లో ఎవరైనా వింటారేమోనని నోరునొక్కుకొని ఏడ్చింది. అతనికి మరీ ఆవేశం ఎక్కువైంది. లేచి డొక్కలో తన్నాడు. ఆమె చేపలాగ కొట్టుకున్నది. తిరిగి ఇంకొకతన్ను ఝూడించి తన్నాడు. సహనమూర్తి నోరు కదపలేదు. 'నేను చెప్పినమాట వినకపోతే, నీవు నాఇంట్లో వుండడ మెందు' కని జుట్టుపట్టుకొని, ఆమెని తంతో, వాకిలిగుమ్మంవేపు బరబరా లాగాడు. ఆమె ఆ దార్జన్యాన్ని ఇంక భరించలేకపోయింది. ఆ దౌష్ట్యంముందు తలెత్తుకొని నిలువలేకపోయింది. గొల్లున ఏడుస్తూ 'నన్ను వదలండి. మీయిష్టమొచ్చినట్టు చేసుకోండి' అని కుప్పగా అతని పాదాలపైన కూలింది. అతను ఆమె జుట్టు వదిలాడు. మగసింగానికిమల్లే, ఆ వాకిలితలుపుపక్కనే అతను విజృంభించాడు. వళ్ళు తెలియని ఆవేశంలో, రవిక ఫర్రున చింపాడు... ఆమె ఏడుస్తూనే వుంది... కంటికీమంటికీ ఏకధారగా ఏడుస్తోనే వుంది... అతను వెళ్ళి పక్కమీద పడుకున్నాడు... ఆమె అక్కడే ఏడుస్తో పడుకుంది. కొంచెంసేప

టికి, అతను గుర్రుపెట్టి నిద్రపోవడం ఆమెకి వినపడింది... ఆమెకు నిద్ర రాలేదు... ఆమె ఏడుస్తూనే వుంది...

ఆ పక్కనున్న లాంతరుకూడా ఏడుస్తో, గుడ్డివెలుతుర్ని నలువేపులా విరజిమ్ముతూనే వుంది. ఆ రాత్రి ఆమె పడుకో లేదు... ఆ యింట్లో ఆ రాత్రి ఆలాంతరుకూడా పడుకోలేదు...

# 5

మానవప్రకృతి చాలా విచిత్రమైంది. విధిలేకపోతే దారుణపరిస్థితికి తల ఒగ్గుతుంది. ఆ పరిస్థితులకి మచ్చికపడు తుంది. చివరకి వాటికి అలవాటుపడి, తన అస్తిత్వాన్నే కోల్పోతుంది. ఆ పరిస్థితులే తనుగా రూపాంతరం పొందు తుంది. విజృంభించడం జరిగితే పరిస్థితుల్నే మారుస్తుంది. తల ఒగ్గడం జరిగితే పరిస్థితులకే దాస్యం చేస్తుంది. ఎదురుతిరగడం జరిగితే గొప్పవిప్లవాన్ని లేవనెత్తి ఎంతటి విషమపరిస్థితుల నైనా అనుకూలంగా మార్చేస్తుంది. ప్రకృతుల్నిబట్టి మానవుల్నికూడా రెండువిధాలుగా విభజింపవచ్చు—పరిస్థితులకి ఎదురుతిరిగేవారూ, పరిస్థితులకి తలఒగ్గేవారు. పరిస్థితులకి ఎదురుతిరిగేవారు ధీరోదాత్తులు. తలలు ఒగ్గేవారు భీరువులు. ధీరోదాత్తులు జీవితంలో తమఆశయాన్ని సాధిస్తారు—తమ ధీరోదాత్తతవల్ల తమకే కాక ప్రపంచానికికూడా మేలు కలగ జేస్తారు. కాని ధీరోదాత్తతతోపాటు వారిఆశయం కూడా పవిత్రమైనదిగావుండడం అవసరం. భీరువులకి జీవితంలో ఒక ఆశయమంటూ వుండదు. ఆశయమంటూ ఒకటి వున్నా అది విషమపరిస్థితులవలయంలో పడి, నామరూపాలు లేకుండా

పోతుంది. కాలవోషంపట్టి ఆ ఆశయానికి అపవిత్రత కూడా సంక్రమిస్తుంది. చివరకి ఆశయాన్నే విస్మరించడం కద్దు. భీరువులు తమజీవితాన్నే భారంగా మార్చుకొని ప్రపంచానికి భారంగా తయారవుతారు.

రుక్మిణి వివాహంచేసుకొని సుఖజీవితం గడుపుదామనే పవిత్రాశయంతో, ప్రాచీనసంప్రదాయసంకుచితత్వంలోనించి ఈ విశాల విశ్వంలో కాలిడింది. తన జీవన విధాతగా ఎన్నుకున్న వ్యక్తి ఎటువంటివాడో ఆమె పరిశీలించలేదు. తొందరపడి అతనిఅడుగులకి మడుగులెత్తింది. అతనే తనసర్వస్వంగా భావించింది. అమాయకంగా, విచక్షణలేకండా అతన్ని విశ్వసించింది. అతనితో లేచివచ్చింది. తన ఆత్మీయులకీ బంధువులకీ దూరమైంది.జీవితంలో 'నా' అనేవాళ్ళు లేకుండా చేసుకుంది. విధిలేక అతని క్రౌర్యానికి తల ఒగ్గింది. ఏ పవిత్రాశయంతో ఆమె ఇంటినించి బయల్దేరిందో, క్రౌర్యానికి తట్టుకోలేక దానినే విస్మరించింది. జీవితంలో ఒక్క తప్పటడుగు వేసి, యావజ్జీవితాన్నే మలినం చేసుకుంది. అర్థరహితంగా మార్చుకుంది. తనకి తానే భారమైంది. తద్వారా చివరకి లోకానికే భారంగా మారింది. రుక్మిణిరూపంలో అమాయకత్వం, ప్రపంచపరిజ్ఞానం లేక విశ్వేశ్వరరావు ఆకృతిలోవున్న స్వార్థపరత్వానికి బలిఅయింది. పరిస్థితులకి ఎదురీదడం అవసరమనే లోకానుభవం లేని అమాయక హృదయం గొప్పగా దెబ్బతిని భీరువుగా మారింది. పరిస్థితులకి తలఒగ్గి, తన ఓటమిని అంగీకరించింది.

ఆనాటిరాత్రి దారుణసంఘటనతరువాత రుక్మిణి విశ్వే శ్వరరావుచేతుల్లో కీలుబొమ్మగా మారింది. మెకానికల్‌గా ఉదయం లేస్తుంది. టీ కాస్తుంది. వంట చేస్తుంది. వడ్డిస్తుంది... మళ్ళీ సాయంత్రం ఇదే రొటీన్. పలుకరిస్తే పలుకుతుంది. ఏదైనా పని చెబితే చేస్తుంది. ఎన్నడూ పెళ్ళిఊసు ఎత్తదు. సుఖాన్నికోరితే, శారీరకంగా సుఖాన్ని యిస్తుంది. ఉత్సాహంగా సంతోషంగా ఎన్నడూ కనపడదు. నిరుత్సాహంగా విచారంగా వుంటుందా అంటే అదీ లేదు. మనిషే కొయ్యబొమ్మగా మారింది.

*　　　*　　　*

'విశ్వేశ్వరరావుగారూ! విశ్వేశ్వరరావుగారూ!' ఎవరో వాకిలితలుపు తట్టుతూ, గట్టిగా పిలుస్తున్నారు.

'లేరండీ' అని రుక్మిణి సమాధానం చెప్పింది.

'ఎప్పుడు వస్తారండీ?' వెలుపలిగొంతుక ప్రశ్నించింది.

'ఏమో తెలియదండీ. వస్తే సాయంత్రం అయిదు ఆరు గంటల మధ్య రావచ్చు' అని రుక్మిణి జవాబు చెప్పింది.

'ఒకమాటు తలుపు తీస్తారా?' అని వెలుపలిగొంతు అడిగింది.

రుక్మిణి తలుపు తీసింది.

రుక్మిణికి ఎవరో మాసినధోతీ చొక్కాలతో, నెత్తికి జరీతలపాగా చుట్టుకొని, వాకిలిగుమ్మంలో ఒక నడిఈడు మనిషి కనపడ్డాడు. రెండుచేతులకి నాలుగు రాళ్ళఉంగరాలు ఉన్నాయి. దుస్తులూ, ఉంగరాలనిబట్టి ఆ వచ్చినమనిషి కోమటి అయివుంటాడనుకుంది రుక్మిణి.

'ఆఫీసుకు వెళ్ళారా?' అని అడిగాడు, ఆ వచ్చినమనిషి తలుపు తీయడంతోనే.

'బహుశా ఆఫీసుకే వెళ్ళిఉంటారు' అంది రుక్మిణి క్లుప్తంగా.

'నాలుగైంది - ఆఫీసునించి తిరిగి రావడానికి ఇంకా దాదాపు రెండు గంటలు పట్టవచ్చు' అని పైకే ఆలోచిస్తున్నాడు ఆ వచ్చినమనిషి. రుక్మిణి ఏమీ సమాధానం చెప్పలేదు.

'మీ కేమి అభ్యంతరంలేకపోతే, విశ్వేశ్వరరావుగారు వచ్చేవరకు ఇక్కడ కూర్చుంటా' నని అన్నాడు ఆ నడిఈడు మనిషి ఒక నిర్ణయానికి వస్తో.

'అభ్యంతరం ఏం వుంటుంది? మీయిష్టం. కూచోండి' అంది రుక్మిణి సమాధానంగా.

ఆ నడిఈడుమనిషి వాకిలితలుపుకి ఎదురుగా వేసి వున్న చాపమీద వచ్చి కూర్చున్నాడు.

'విశ్వేశ్వరరావుకి మీ రేమి అవుతారు?' అని అడిగాడు ఆ వచ్చినమనిషి, రుక్మిణి వంటగదిలోకి వెళుతుండగా.

ఆ వాక్యం రుక్మిణిహృదయానికి బాకుకుమల్లే గుచ్చుకుంది. వంటయింట్లోకి వెళుతున్నదల్లా, బ్రేక్ వేసినట్లు ఆగిపోయింది. మొహం వివర్ణమైంది. ఏమని సమాధానం చెబుతుంది? ఒకేయింట్లోవుంటూ తను అతనికి ఏమీకానని జవాబుచెప్పడం భావ్యంగావుంటుందా? అతనితో తనకుగల అవినీతికర సంబంధాన్నిగూర్చి ఏమనిచెబుతుంది? కొంపతీసి తను విశ్వేశ్వరరావుభార్యని కానని ఇతనికి ముందుగానే

తెలిసిపోలేదుకద? ఏమో? ... ఎవరికి తెలుసు? ... రుక్మిణి గొప్ప సందిగ్ధావస్థలో పడింది. ఏమీ తోచక వెనక్కి తిరిగింది.

రుక్మిణిమానాన్నిబట్టి ఆమె విశ్వేశ్వరరావు భార్య అయివుంటుందని ఊహించాడా వచ్చినమనిషి. మార్పు పొందుతూవున్న రుక్మిణి ముఖకవళికలేమీ అతను గమనించ లేదు.

'పెళ్ళిఅయి ఎంతకాలమైంది?' అని అడిగాడు ఆ మనిషి.

రుక్మిణి ఏం సమాధానం చెబుతుంది? పెళ్ళిఅయితేగా సమాధానం చెప్పడానికి? ఇంతవరకు కాకపోవడమేకాక ముందు అయ్యే సూచనలుకూడా లేవు. కాగా అతను ఆవిధంగా ప్రశ్నపరీక్ష చేయడం రుక్మిణికి విచిత్రంగా తోచింది.

'ఎందుకడుగుతున్నారా ప్రశ్న?' రుక్మిణి ఉండబట్ట లేక అడిగింది.

'ఆఁ, ఏమీలేదు. ఒకభార్య వుండగా విశ్వేశ్వరరావు రెండవపెళ్ళి ఎందుకుచేసుకున్నాడా అని!' సాలోచనగా సమాధానం చెప్పాడా వచ్చిన మనిషి.

'అతనికి ఇదివరకే పెళ్ళి అయిన సంగతి నాకు తెలి యదే. అయితే మొదటి భార్య బ్రతికేవుందా?' ఆతురతగా బైటపడ్డది రుక్మిణి.

'అయితే, నేను అనుకున్నట్టే జరిగింది' అన్నాడు ఆ వచ్చిన మనిషి ఆలోచిస్తూ.

'మీరు అనుకున్న దేమిటి ?' అని రుక్మిణి చప్పున అడిగింది.

'మిమ్మల్ని చూడడంతోనే, అతను మిమ్మల్ని మోసంచేసివుంటాడని ఊహించాను. నా ఊహ అక్షరాలా నిజమైంది' అన్నాడు అతను తనఉద్దేశాన్ని వివరిస్తూ.

ఉత్తరక్షణంలో రుక్మిణిహృదయం గడ్డకట్టింది. పనిచేయడం మానుకుని చివరకి స్తంభించిపోయింది.

'మీకు ఆయనతో ఏంపని?' రుక్మిణి కాస్త తేరుకొని అడిగింది.

'విశ్వేశ్వరరావుగారు నాకు రెండువందల రూపాయలు ఇవ్వాలి. ఇదుగో అని, అదిగో అని కొంతకాలం తిప్పారు. ఆ తరువాత పూర్తిగా మొహం తప్పించారు. చివరకి ఈ యింటి ఆచోకీతీసి ఇక్కడికి వచ్చాను' అన్నాడు ఆ మనిషి.

'రెండు వందలు మీదగ్గర అప్పుగా తీసుకున్నారా?' అని అడిగింది రుక్మిణి, తన చెవుల్ని తానే నమ్మలేక.

'లేదు, ఇంటికోసం మా కొట్లో సామాను తీసుకున్నారు' అని జవాబు చెప్పాడు అతను.

ఇంతలోకే విశ్వేశ్వరరావు వచ్చాడు. రుక్మిణి లోపలికి వెళ్ళిపోయింది.

'ఓహో సెట్టిగారా! ఎప్పుడు వచ్చా' రని పలకరిస్తూ, తెచ్చిపెట్టుకున్న ఆప్యాయతని కనపరచాడు. సెట్టి ఆ ఆప్యాయతకి చలించలేదు. కుశలప్రశ్నలకి స్వస్తిచెప్పి సూటిగా వ్యవహారానికి వచ్చాడు.

'డబ్బు సంగతి ఏమంటారు? ఇప్పుడు డబ్బు యివ్వక తప్ప' దని నిక్కచ్చిగా చెప్పాడు.

'డబ్బుదేముందండీ, ఇవాళ సంపాయిస్తాం - రేపటికి ఖర్చు అయిపోతుంది. ముందు మీ క్షేమసమాచారం చెప్పండి' అన్నాడు విశ్వేశ్వరరావు తప్పించుకోవడానికి ఉచ్చులు అల్లుతూ.

'నా క్షేమసమాచారం మీకు అనవసరం. డొంకతిరుగుళ్ళతో పని జరగదు. ముందు డబ్బు అక్కడపెట్టి మాట్లాడండి' అన్నాడు సెట్టి, తన దృఢనిశ్చయాన్ని వ్యక్తపరుస్తో' విశ్వేశ్వరరావు పరిస్థితులు విషమించినసంగతి గ్రహించాడు.

'నిలుచున్నపాటున డబ్బు కక్కమంటే ఎక్కడినించి వస్తుందండీ - ఒకటి రెండురోజులు గడువివ్వండి. మీ అప్పు పూలల్లోపెట్టి తీర్చుకుంటా' నన్నాడు విశ్వేశ్వరరావు.

'మీ మాటలు నమ్మి ఇదివరకే మోసపొయ్యాను. ఇంక గడువు ఇవ్వడానికి వీలులేదు' అన్నాడు సెట్టి నిష్ఠూరంగా.

'ఇంతకాల మాగారు, ఇంకొక్కపూట ఆగండి. రేపు ఉదయం వస్తే, మీడబ్బు మీకు అణాపైసలతో లెక్కచూచి ఇస్తాను' అన్నాడు. విశ్వేశ్వరరావు ప్రాథేయపూర్వకమైన కంఠంతో.

'రేపు ఉదయం మీరు కనపడుతారని ఏం నమ్మకం?' అన్నాడు సెట్టి, విశ్వేశ్వరరావుని నమ్మలేక.

'ఇంతకాలం ఓపికపట్టాను. ఈ ఒక్కపూటకి ఆగండి. ఇదే ఆఖరుమాటగా చెబుతున్నాను. రేపు ఉదయం డబ్బు

యివ్వకపోతే, మీ యిష్టమొచ్చినట్లు చెయ్యండి' అని మరీ మరీ బ్రతిమలాడాడు విశ్వేశ్వరరావు.

సెట్టి కొంచెం కరిగాడు. ఒక్క-పూటలో మునిగిపోయే దేముందని అనుకున్నాడు.

'రేపుఉదయం ఇవ్వకపోతే మీ పరువుదక్కదు. కోర్టుకీడ్చి డబ్బు వసూలుచేస్తాను. మీ ఆఫీసుకువచ్చి, మీ అధికారితో చెబుతాను. తరువాత నన్నని ప్రయోజనం ఉండదు' అని సెట్టి లేచి వెళ్ళిపోతూ అన్నాడు.

'అప్పుడే వెళ్ళిపోతారేం? కాస్త టీ పుచ్చుకొని మరీ వెళ్ళండి' అన్నాడు విశ్వేశ్వరరావు, సెట్టి లేవడం గమనించి. సెట్టి విశ్వేశ్వరరావుమాట వినిపించుకోలేదు. లేచి చకచకా వెళ్ళిపోయాడు.



సెట్టి వెళ్ళిపోవడంతోనే విశ్వేశ్వరరావు, పెద్దగండం గడిచిపోయినట్లు దీర్ఘంగా నిశ్వసించాడు. దుస్తులుమార్చి మొహం, చేతులూ, కాళ్ళూ కడుక్కున్నాడు. టవల్‌తో తుడ్చుకున్నాడు. ఇంతలోనే రుక్మిణి కప్పుతో 'టీ' తీసుకొచ్చి ఇచ్చింది. విశ్వేశ్వరరావు 'టీ' అందుకొని, ఆమె వెళ్ళిపోతూవుండడం గమనించి, 'ఇదిగో, ఒకమాట' అన్నాడు. రుక్మిణి వెనకకు తిరిగి 'ఏమిటి?' అన్నట్టు అతన్ని ప్రశ్నార్థకంగా చూసింది. తనని విశ్వేశ్వరరావు 'ఇదిగో ఒకమాట' అంటూ అనడంచూచి ఆమెకి ఆశ్చర్యంవేసింది. ఈమధ్య అల్లాంటి అనునయవాక్యాలు వినడం, ఆ యింట్లో ఆమెకి అదే మొదటిసారి.

'ఈరోజు నీవు నాకు ఒక చిన్నసహాయం చేయాలి' అన్నాడు విశ్వేశ్వరరావు, ఆమె ప్రశ్నార్థకమైన చూపులకి సమాధానంగా.

'ఏమిటి చెప్పండి?' అంది ఆమె, విశ్వేశ్వరరావు ప్రాథేయపూర్వకమైన ధోరణికి విస్తుపోతో.

'అడగడానికి నోరు రావడంలేదు, కానీ అడక్కుండా రేపటిగండం గడిచే ఉపాయం కనబడడంలేదు' అన్నాడు విశ్వేశ్వరరావు నాందిప్రస్తావనగా.

రుక్మిణికి అతనిధోరణి అర్థంకాలేదు, కళ్ళప్పగించి అతన్ని చూస్తో నిలబడ్డది.

'ఒక్క పదిరోజులు ఓపికపడితే చాలు. నీ సొమ్ము నీకు విడిపించి యిస్తాను. మళ్ళీ నీ వస్తువేదీ ముట్టుకోను' అన్నాడు విశ్వేశ్వరరావు, తనఉద్దేశాన్ని కొద్దిగా బైటపెడుతో.

'మీ కేమికావాలో సూటిగా చెప్పండి — మీ డొంకతిరుగుడుమాటలు నాకు బొత్తిగా అర్థంకావడంలేదు' అంది రుక్మిణి, విశ్వేశ్వరరావు సుదీర్ఘమైన నాందిప్రస్తావనకి తట్టుకోలేక.

'అదే, ఇందాకే చెప్పానుగా, అడగడానికి నోరు రావడంలేదని' అన్నాడు విశ్వేశ్వరరావు వేసినఉచ్చుల్ని మరీ బిగిస్తో.

'అడగదలుచుకున్న దేదో అడిగేసెయ్యండి. దానికి ఇంత సందేహ మెందుకు?' అంది రుక్మిణి, ఏదోఒకటి తేల్చుకుందామనే ధోరణిలో. విశ్వేశ్వరరావుకి తనమార్గం సుగమంగా ఉన్నట్లు తోచింది.

'నీ గొలుసు... పదిరోజులలో విడిపించి ఇస్తాను... పదిరోజులుకూడా పట్టకపోవచ్చు. రెండు మూడు రోజుల్లో చేతికి డబ్బు అందవచ్చు... అందుకోసమే అమ్మడం దేనికి? తాకట్టుపెడితే సరిపోతుందని అనుకుంటున్నాను ...' అని అన్నాడు విశ్వేశ్వరరావు, అడగలేక అడగలేక అడిగినట్టు నటిస్తో.

విశ్వేశ్వరరావుదగ్గర బొత్తిగా డబ్బు లేదు. ఎన్నో చిక్కుల్లో ఉన్నాడు. ఆ సాయంత్రమే సెట్టి వచ్చి, రేపు ఉదయానికల్లా రెండువందలు కక్కితేనేగాని వల్లకాదన్నాడు. నిమిషాలు, గంటలమీద, పాపం, విశ్వేశ్వరరావు అంతడబ్బు ఎక్కడనించి తేగలడని? నిజమే, అతను తనపట్ల నీచంగా ప్రవర్తించాడు. తనకు తీరనినష్టం కలుగజేశాడు. అంతమాత్రాన్న తనుకూడా అతనిపట్ల నీచంగా ప్రవర్తించవలసిందేనా? అల్లా ప్రవర్తిస్తే తనకూ, అతనికీ భేద మెక్కడుంటుంది? ఒకరు మనకు అన్యాయం చేస్తే. మనం కూడా వారికి అన్యాయంచేయవలసిందేనా? ఇందులో మనగొప్ప ఏముంది? అన్యాయాన్ని అన్యాయంతో ఎదుర్కోవడం మహాపాపమని, రుక్మిణికి విస్పష్టంగా తోచింది. అపకారికి చేతనయితే, ఉపకారం చేయాలి. ఆ ఉపకారమే అతనికి ఒక గుణపాఠం కావచ్చు. అందువల్ల రుక్మిణి, ఆ సదవకాశాన్ని చేతులారా వదులుకోదల్చుకోలేదు. పోగా పోగా రుక్మిణి దగ్గర రెండునగలుమాత్రం మిగిలాయి. ఒకటి గొలుసూ, రెండవది కంటె. ఈ రెండునగలూ, తాను ఎప్పుడూ పెట్టుకోదు. తనకిఉపయోగంలేని వస్తువులు తనదగ్గర ఉంచేసేం

ఇతరులదగ్గర వుంటేనేం? రుక్మిణి తనసర్వస్వాన్ని ఇదివరకే విశ్వేశ్వరరావుకి అప్పగించింది. అలాంటప్పుడు ఆ రెండువస్తువులుకూడా అతనికి అప్పగిస్తే తనకి జరిగే ప్రమాదం ఏం వుంటుందని? రుక్మిణి వెంటనే పెట్టెతాళం తీసి ఆ రెండువస్తువులూ తెచ్చింది. 'గొలుసు చాలు. కంటె కూడా ఎందుకు?' అన్నాడు విశ్వేశ్వరరావు ఆమె రెండు నగలూ తనకి అందిస్తున్నందుకు విస్తుపోతూ.

'కావలిస్తే రెండూ తీసుకోండి' అంది రుక్మిణి విశ్వేశ్వరరావుతో.

'అవసరం లేదు. ప్రస్తుతానికి గొలుసు చాలు'నన్నాడు విశ్వేశ్వరరావు, రుక్మిణి ఔదార్యానికి తట్టుకోలేక.

రుక్మిణి గొలుసు ఇచ్చింది. 'ఎక్కడైనా గొలుసు తాకట్టుపెట్టి రెండువందలు తీసుకొస్తా' నని బయల్దేరాడు విశ్వేశ్వరరావు ఇంట్లోంచి.

విశ్వేశ్వరరావు ఆరాత్రి ఇంటికి రాలేదు—మరునాటి ఉదయంకూడా రాలేదు. సెట్టి మరుసటి ఉదయం వచ్చి ధుమధుమలాడి తిరిగివెళ్ళాడు.

ఉదయంనించీ సాయంత్రంవరకూ రోజూ ఎందరో అప్పులవాళ్ళు వచ్చి తిరిగిపోతారు. వాళ్ళకి సమాధానాలు చెప్పలేక, రుక్మిణికి తలప్రాణం తోకకు వస్తున్నది. వాళ్ళందరికీ తమయిల్లు ఎల్లా తెలిసిందో, మొదట రుక్మిణి ఆలోచించలేకపోయింది. ఒకరిద్వారా ఒకరికి తెలిసివుంటుందని, తరువాత తనకితానే సమాధానం చెప్పుకున్నది. మొదట సెట్టి తమఇల్లు ఎల్లాగో కనుక్కున్నాడు. అతనిద్వారా తమయింటి

విలాసం అందరికీ తెలిసివుంటుంది. "ఈ అప్పులవాళ్ళందంతా ఒక కూటమా?" అనే ఆలోచన రుక్మిణికి కలిగింది. అయితే కావచ్చు- ఒకే ఆశయంతో పనిచేస్తున్నవాళ్ళంతా బహుశా కాకతాళీయంగా, అల్లా కలుసుకోవచ్చు - కలుసుకున్నప్పుడు ఒకరికి ఇంకొకరు అనుకోకుండా సహాయంచేసుకుంటూ వుండవచ్చు.

విశ్వేశ్వరరావు ఇంటికివస్తే ఏ రాత్రికో పది దాటిన తరువాత వస్తాడు. మళ్ళీ తెల్లవారుఝామునే ఏ అయిదు గంటలకో వెళ్ళిపోతాడు. అప్పులవాళ్ళు రోజూ తిరిగిపోతున్న సంగతి చెబితే, అతనికి చీమకుట్టినట్లైనా వుండదు. 'ఏం చేస్తాం? తిరగనీ. అది వాళ్ళ ఖర్మ'మని తేలికగా అనేస్తాడు. రాత్రిళ్ళు అప్పులసంగతి మరిచి సుఖంగా నిద్రపోతాడు. చుట్టూ అప్పులు పెట్టుకొని, 'అంత గాఢమైన నిద్ర ఎల్లా పోగలుగుతున్నాడా?' అని, రుక్మిణికి ఆశ్చర్యమేసేది. అంత మంది రోజూ తిరిగిపోవడానికి అతను ఎంతో డబ్బు అప్పుచేసి వుండాలి. అణాలదగ్గిరినించి మొదలుపెడితే, కొన్నివందల వరకూ అప్పులున్నాయి. ఇన్ని అప్పులున్నా అతను తీర్చే మార్గమేమీ ఆలోచించడు. 'ప్రతిరోజూ అప్పులవాళ్ళు నా ప్రాణం కొరుక్కు-తింటున్నా'రని రుక్మిణి చెబితే. 'తిరిగితిరిగీ వాళ్ళకే విసుగేసి రావడం మానుకుంటా'రని చిన్న నవ్వు నవ్వి, విశ్వేశ్వరరావు సమాధానం చెబుతాడు. 'కంటె అమ్మి అయినా అప్పులు తీర్చండి' అంటే, 'అప్పులకోసం నగలు చెడగొట్టుకుంటామా?' అని సమాధానం చెబుతాడు. గొలుసు తాకట్టుపెట్టి వచ్చిన రూపాయలు ఏంచేశాడో

తెలియదు. రుక్మిణి గొలుసురూపాయలు ఏవని ఎన్నడూ అడగలేదు. 'పోనీ, ఇల్లైనా మార్చేసెయ్యండి. వీళ్ళందరికి అందకుండా ఎక్కడైనా దూరంగా వుందా'మంటే, 'మా ఆఫీసులో రామనాథం అని ఒకతను పనిచేస్తున్నాడు. అతని ఇల్లు పాత వాల్తేరదగ్గర వుంది. అతనిఇంట్లోకి త్వరలోనే మారుదా' మని చెప్పాడు.

విశ్వేశ్వరరావు చాలా విచిత్రమైన మనిషి. ఇన్ని అప్పులతో అతను ఎల్లా నెట్టుకురాగలుగుతున్నాడో రుక్మిణికి ఎంత ఆలోచించినా పాలుపోలేదు. రోజూ తాగుతాడు. ఖరీదుఅయిన దుస్తులు వేస్తాడు. దైనందినజీవితంలో రాజఠీవి ఒలికిస్తాడు. దుకాణానికి వెడితే ఏ వస్తువూ బేరంచెయ్యడు. ఎంత అడిగితే అంత ఇచ్చేస్తాడు. ఇంట్లో కావల్సిన వస్తువు లన్నీ పనిమనిషితో తెప్పిస్తాడు. అది రోజూ ఎంత కాజేస్తున్నదో ఎన్నడూ చూచుకోడు. ఏవస్తువు ఎంతఅయిందీ దాన్ని కనుక్కోడు. అల్లా కనుక్కోవడం తన మర్యాదకి లోటుఅని భావిస్తాడు. తను ధనవంతుడిని అనుకొని తనని తాను మోసగించుకుంటాడు. తన శ్రీమంతాన్ని నిలుపుకోవడంకోసం ఇతరులని మోసగిస్తాడు. ఎందుకో అప్పులవాళ్లు అంటే ముఖ్యంగా పెద్దమొత్తాలవాళ్ళు ఇంకా కోర్టుకు ఎక్కలేదు. ఎక్కిననాడు అతని ఆట కట్టుబడుతుంది. ఉద్యోగం పోతుంది. జైలుశిక్ష ప్రాప్తిస్తుంది. అంతవరకు వస్తే, అతను హైదరాబాద్‌నించి పారిపోకుండా ఉంటాడా? ఏమో?...ఎవరు చెప్పగలరు?...ముందు ముందు తనగతి ఏమికానుందో?...రుక్మిణి ఇంక ఆలోచించలేకపోయింది.

నారాయణరావు రమణని రఘుకివ్వనని నిరాకరించడంతోనే వరలక్ష్మికి తనబంధువులమీదా, ఆ ఊరిమీదా మనస్సువిరిగింది. పెళ్ళి సన్నాహాలు ప్రారంభం కావడంతోనే ఊరిప్రజలందరూ 'నీ మేనకోడలి పెళ్ళట. నీ కొడుక్కే ఇస్తున్నారా?' అని తనని అడుగుతారు. అప్పుడు తనేమి సమాధానం చెప్పగలదని? 'తనకొడుక్కి ఇవ్వడం లేదనీ, ఎక్కడో పరాయిచోట యిచ్చుకుంటున్నా'రనీ చెప్పడం, తన కెంత అవమానకరంగా వుంటుందని? తన సంగతి అటుంచి తన కొడుక్కి ఎంత అవమానకరంగా వుంటుందని? తనకొడు కేమన్నా చదువురానివాడనా, మొహం ముక్కూ వంకరనా, తన కొడుక్కి రమణని ఇవ్వక పోవడం. ఏదో ఈడుకాదట. ఈడు - ఇద్దరికి మూడు ఏళ్ళ తేడావుంది. ఇవ్వదలుచుకుంటే ఆ తేడా సరిపోదూ? ఈడూ జోడూ చూసి పిల్లనిస్తారు కాని, ఆస్తిచూసి పిల్లనిస్తారా? నాలుగు అక్షరాలు చదువుకున్నవాడైతే చాలు, ఆస్తెందుకు నెత్తిన కొట్టుకోనా? ఆస్తి ఈరోజునవుంటే రేపు పోతుంది. ఆస్తి దేమి నమ్మకం? వాళ్ళకి కోఠీలో స్వంతయిల్లు వుందట. తండ్రి ఏవో సర్కారీఉద్యోగంచేసి బాగా డబ్బు గడించాడట. అంతమాత్రానికే పిల్ల నిచ్చివేయడమా? వరలక్ష్మికి ఎంత ఆలోచించినా నారాయణరావు రమణకి తెచ్చిన సంబంధం బొత్తిగా నచ్చలేదు. కాని వాళ్ళకి తన ఇష్టాయిష్టాలతో ప్రసక్తి ఏంవుంది? తనకి ఆ సంబంధం యిష్టం లేనంతమాత్రాన రమణతలిదండ్రులు ఆ సంబంధం చేసుకోకమానుతారా? పంతానికైనా ఆసంబంధం చేసితీరుతారు.

ఇంక పెళ్ళికూడా అట్టే దూరం లేదట. ఒక నెల రోజులలో చేసితీరుతారట. తనకు సంబంధంలేని పెళ్ళికి తనుండడం దేనికి? నలుగురిలో నగుబాట్లపాలు కావడానికా ?

ఒక రోజున వరలక్ష్మి, 'ఏమండీ, మనం పట్నం వెళ్ళిపోదామండీ' అంది భర్తతో.

'నాకూ ఇక్కడ ఉండడమంటే కష్టంగానే వుంది. కాని, తీరా పెళ్లిముందు వెళ్లిపోవడం భావ్యంగా వుంటుందా? అని ఆలోచిస్తున్నాను' అన్నాడు వెంకటరామయ్య.

'భావ్యం అవునో, కాదో మీరు ఆలోచిస్తూ కూర్చోండి. నేనుమాత్రం రేపు వెళ్లిపోతున్నా' నన్నది వరలక్ష్మి, తన కృతనిశ్చయాన్ని వ్యక్తపరుస్తూ.

వేంకటరామయ్య సందిగ్ధావస్థలో పడ్డాడు. 'పిల్ల నివ్వనంతమాత్రాన, బంధుత్వానికి తిలాంజలి యివ్వడమా?' అని ఆలోచించాడు. ఈ తాత్కాలికఉద్రేకాలు ఎంతకాలం ఉంటాయని? పెళ్ళితరువాత, కొంతకాలానికి ఈ ఉద్రేకాలు సమసిపోతాయి. చివరకి ఎలాగూ బంధుత్వం మిగులుతుంది. పెళ్లికి వుంటే, 'నీ కొడుక్కి పిల్ల నివ్వలేదా?' అని పెళ్లికి వచ్చిన బంధువులంతా వరలక్ష్మిని ఎల్లాగూ అడుగుతారు. అప్పుడు రాద్ధాంతాలు ప్రారంభమవుతాయి. ఏడుప్పులు, ఆరుప్పులు మొదలవుతాయి. వరలక్ష్మి చాలా ఉద్రేకంమనిషి. ఆ ఉద్రేకంలో ఇంగితజ్ఞానాన్నే మరచిపోతుంది. పిల్లనివ్వలేదనే అక్కసుకొద్దీ పలకరించిన బంధువులందరిదగ్గరా, తన గోడు చెప్పుకుంటుంది. 'ఎక్కడైనా మేనరికం వదులుకుంటారా? 'అని అందరిదగ్గరా వాపోతుంది. క్షణక్షణాని

కంటనీరు పెడుతుంది. "శుభమా అని వాళ్ళు పెళ్లి చేసుకుంటూవుంటే, పెళ్లి యింట్లో కూర్చొని ఏడ్వడానికి ఈమెకి ఏం పోయేకాలమమ్మా!" అని నలుగురూ వరలక్ష్మిని నానా మాట లంటూరు. ఈ విషమపరిస్థితులనించి తప్పించుకోవా లంటే ఇక్కడినించి వెళ్ళిపోవడమే సమంజసమని వేంకటరామయ్య ఒక నిశ్చయానికి వచ్చాడు. మరుసటిరోజున అక్కడినించి పట్నం వెళ్ళిపోవడానికి అతనూ అంగీకరించాడు. వరలక్ష్మి మరునాడు వెళ్ళిపోతున్నసంగతి, ఈనోటా ఆ నోటా పడి ఊరంతా పాకింది. పక్కయింట్లో తెలిసింది.

ఆనాటి మధ్యాహ్నం, రెండుగంటలు దాటినతరువాత రమణ పక్కింటికి వెళ్ళింది. వసారాలో రఘు ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు. రమణ రావడం చూచి అతను పుస్తకం మూశాడు.

'నాకు ఒక చిన్నసహాయం చేసిపెడుతావా బావా?' అని అడిగింది రమణ, అతన్ని సమీపించడంతోనే.

'దేవిగారి ఆజ్ఞ!' అన్నాడు రఘు కొంటెగా.

'ఛీ పో, బావా! ఏమి టా మాటలు!' అంది రమణ, తెచ్చిపెట్టుకున్నకోపాన్ని కళ్ళద్వారా వ్యక్తపరుస్తో.

రమణ రఘుకి ఉత్తరం అందించింది. ఉత్తరం అతికించి వుంది. రఘు ఉత్తరంపైన పేరూ, విలాసం చూచాడు. 'పద్మ' అని వ్రాసివుంది, కవర్‌పైన.

'క్లాసుమేటా?' అని అడిగాడు రఘు క్లుప్తంగా.

రమణ 'అవు'నన్నట్లు తలఊపింది.

'పెళ్ళికి రమ్మని ఆ అమ్మాయికి ఆహ్వానమా?' అని అన్నాడు రఘు, రమణని ఉడికింతామనే ఉద్దేశంతో.

'నే నసలు పెళ్ళిచేసుకుంటే కదూ, యితరులకి ఆహ్వానాలు పంపించడానికి?' అంది రమణ, తన కృతనిశ్చయాన్ని వ్యక్తపరుస్తో.

రఘు తనచెవుల్ని తానే నమ్మలేకపోయాడు.

'పెళ్ళిచేసుకోకపోవడ మేమిటి? నీకేమైనా మతిపోలేదు కద?' అని అడిగాడు రఘు ఒళ్ళు తెలియని ఆవేశంతో.

'నాకు మతిపోలేదుకనుకనే, పెళ్ళిచేసుకోకుండా వుండడానికి నిశ్చయించుకున్నాను!' అంది రమణ, ప్రతిమాటనీ నొక్కి చెబుతో.

రఘుకి రమణధోరణి ఏమీ అర్థంకాలేదు.

'పెళ్ళిచేసుకోవడానికీ, చేసుకోకపోవడానికీ నీ చేతిలో ఏముంది? నీ భవిష్యత్తుకు నీవే కర్తవైనట్లు మాట్లాడుతున్నావే?' అన్నాడు రఘు, రమణకి వివేకోదయం కలిగించే ఉద్దేశంతో.

'ఇంతవరకు కాసిమాట నిజమే. కాని ఈరోజునించి ఆ బాధ్యత నేనే స్వీకరించదలుచుకున్నాను!' అంది రమణ, తన హక్కుల్నీ, బాధ్యతల్నీ గుర్తిస్తున్న ఆధునికయువతిగా.

రమణ వింతధోరణికి రఘుకు నవ్వు వచ్చింది.

'రెండు లెంపకాయలువేస్తే, తనబాధ్యత లేమిటో అమ్మాయిగారికి చప్పున గుర్తుకు వస్తాయి' అన్నాడు రఘు నవ్వుతో.

'కాదని ఎదిరిస్తే, రెంపకాయలు వేస్తారు, కొడుతారు తిడుతారు, అంతేనా?' అంది రమణ, తాను అన్నింటికీ సిద్ధమైనట్లు.

'రెంపకాయలూ, దెబ్బలూ పడనంతవరకూ అవి తేలిగ్గానే కనపడతాయి. కాని ఒకసారిపడితే అన్నీ తిరుగుబాట్లూ సర్దుకుంటాయి' అన్నాడు రఘు, రమణ ప్రశ్నకి జవాబుగా.

'ఉన్న చిక్కంతా ఎక్కడుందంటే, నేను మా అమ్మమ్మలకాలంలో బతకలేకపోవడం. ఇదుగో, ఈవరుణ్ణి కుదిర్చాం-పెళ్ళిచేసుకొమ్మంటే, వాళ్ళు కిక్కురుమనకండా పెళ్ళిచేసుకునేవారు. విద్యాగంధంలేకపోవడంవల్ల ఇది మంచిసంబంధం, ఇది కాదని వాళ్ళకి విచక్షణ వుండేదికాదు. మంచీ, చెడూ చూసే బాధ్యత అప్పట్లో వాళ్ళతలిదండ్రులపైన వుండేది. తలిదండ్రులు ఆ బాధ్యతని సద్వినియోగం చేస్తే సరేసరి; దుర్వినియోగంచేస్తే అది తమ ఖర్మ మనుకునేవాళ్ళు. ఈ ఇరవయ్యోశతాబ్దంలో పుట్టి, నేను అంత అంధకారంలో వుండదలుచుకోలేదు. నా హక్కుల్నీ బాధ్యతల్నీ గుర్తించి, నా భవిష్యత్తుని నేనే తీర్చిదిద్దుకోదలుచుకున్నాను. తదనుగుణంగా ప్రవర్తించదలుచుకుంటే నేను విప్లవకారిణిగా లోకానికి కనపడుతున్నాను!' రమణ ఆవేశంలోగుక్కతిప్పుకోకుండా ఉపన్యాసధోరణిలో మాట్లాడేసింది.

'తీరా చూస్తే నీకు ఇంకా 15 సంవత్సరాలు నిండలేదు. మెట్రిక్యులేషన్‌కూడా పూర్తిచేయలేదు. అప్పుడే నీకు నీ మంచిచెడ్డలు చూసుకోగల లోకజ్ఞానం వచ్చిందా?' అని రఘు ఒక సూటిప్రశ్న వేశాడు.

ఆ ప్రశ్నకి రమణ, ఒక్క క్షణంపాటు ఉక్కిరిబిక్కిరి అయింది.

'నిజమే, నాకు తగినంత లోకజ్ఞానం లేనిమాట నిజమే. కాని, ఆ లోకజ్ఞానం కలిగేవరకు నాభవిష్యత్తుకు సంబంధించిన నిర్ణయాలేవీ చేయకండా, నన్ను సంకెళ్ళలో బంధించడానికి ప్రయత్నించకుండా కొంతకాలంపాటు నన్ను స్వేచ్ఛగా బ్రతకనిస్తేనో...?' అంది రమణ పైకి ఆలోచిస్తున్న ధోరణిలో.

'బాగానే వుంటుంది. కాని, గడచినతరంవాళ్ళతో వచ్చిన చిక్కే అది. ఈడు వచ్చేవరకు మనని స్వేచ్ఛగా ఉండనివ్వరు. ఇంతలోకే ఏవో నిర్ణయాలు చేస్తారు. వాటిని మనతలపైన రుద్దుతారు. ఫలితం అనుభవించేవాళ్ళు ఈతరం వాళ్ళని, గడచినతరంవాళ్లు ఎన్నడూ గుర్తించరు' అన్నాడు రఘు, రమణఉద్దేశాన్ని బలపరుస్తో.

'అంతమాత్రానికి, మనం వాళ్ళనిర్ణయాల్ని తలలొగ్గి అంగీకరించవలసిందేనా?' అంది రమణ, రఘు సమాధానం కోసం ఎదురుచూస్తో.

'గుడ్డిగా అంగీకరించమని, నేనూ చెప్పను. కాని ఏ పనైనా బాగా ఆలోచించి చేయమనిమాత్రం చెబుతాను' అన్నాడు రఘు జవాబుగా.

'నేను ఈ కార్యంలో కృతకృత్యురాల్ని కావడానికి— నాకు నీ ఆశీర్వచనం, పద్మసహాయం కావాలి' అంది రమణ, కళ్ళతో రఘుని పూజిస్తూ.

'ఏ శక్తీ లేని ఆశీర్వచనాన్ని ఏం చేసుకుంటావు? నా హృదయాన్ని నీకు ఎన్నడో అర్పించాను. దాన్ని భద్రంగా

దాచుకో. అదినీలోని ప్రతి భావానికీ అనుకంపిస్తుంది'అన్నాడు రఘు డగ్గుత్తికతో.

ఆ వాక్యాలు వినడంతోనే, రమణశరీరం సంతోషంతో పొంగులెత్తింది. వెంటనే వెళ్లి రఘుకాళ్ళపైన పడదా మనుకుంది. కాని వేంకటరామయ్య వసారాలో వాకిలికి ఎదురుగాఉన్న పీటపైన పడుకొని వుండడం చూచి ఆ పని మానుకుంది. రఘుకూడా రమణని దగ్గరికి తీసుకోలేక పోయినందుకు ఎంతో ఖేదించాడు. రమణ వెళ్ళిపోతూ వెనక్కితిరిగి 'బావా! పద్మఉత్తరంసంగతి మాత్రం మరిచి పోకేం?' అని మరీమరీ చెప్పింది. రఘు నిశ్చేష్టుడై రమణ వెళ్ళినవేపు కళ్ళుఅప్పగించి ఎంతోసేపు వసారాలో నిల బడ్డాడు. ఎందుకో అతనికళ్ళల్లో అమాంతంగా నీళ్ళు నిండాయి.

మరునాడు పట్నంవెళ్ళిపోయేటప్పుడు రఘుకి రమణ కనబడలేదు. అతను ఉదయంనించీ రమణకోసం ఎదురు చూశాడు. తల్లి వెళ్ళవద్దని రమణని నిర్బంధించివుంటుం దనుకున్నాడు. పోనీ, తను పక్కింటికి వెళ్ళి వస్తే? అక్కడ తనని ఎవరు పలుకరిస్తారు? అయినా తను అక్కడికి ఏ నెపంతో వెళ్ళగలుగుతాడు? ఇంకా ఉదయం తొమ్మిది గంటలైనా కాలేదు. అప్పుడే తన తలిదండ్రులు పట్నం వెళ్ళడానికి తొందరపడుతున్నారు. బండి తెప్పించారు. సామాను బండిలో పెట్టారు. తనతల్లి పక్కయింటికి చెప్పి రావడానికి వెళ్ళలేదు. తండ్రిమాత్రం చెప్పి వచ్చాడు. తల్లి బండిలో కూర్చుంది. బండిచుట్టూ ఊరివాళ్ళంతా పోగైనారు.

తల్లి ఊరివాళ్ళందరితో 'వెళ్ళి వస్తా'మని చెబుతున్నది. తను బండి ఎక్కలేదు. తండ్రికూడా ఎక్కలేదు. 'వెళ్లివస్తా'నని తల్లి ఒక్కొక్కరితో విడివిడిగా చెబుతున్నది. త నెవరికి చెప్పాలి? తనూ, తండ్రీ బండివెనకాల నడుస్తున్నారు. బండి వెనకాల కొంతదూరం నడిచి, ఊరివాళ్ళు ఒక్కొక్కరే ఆగిపోతున్నారు. బండి ఊరు దాటింది. మంచినీళ్ళబావిని సమీపిస్తున్నది. ఆ బావిగట్టుమీద ఎవ రది కనపడేదీ? రమణ కాదు కదా? నిస్సందేహంగా రమణే అయివుంటుంది.

లేకపోతే బండినీ, తమనీ తదేకదీక్షగా ఎవరు చూస్తారు? బండి మంచినీళ్ళబావిని సమీపించింది; బావిపక్కనున్న దారిమీదుగా ముందుకు సాగుతున్నది. రఘు ఒకటే పనిగా రమణని చూచాడు. రమణతల్లి బావిలో బట్టలు ఉతుకుతున్నది. కళ్ళతో 'వెళ్ళివస్తా' నని రమణకి చెప్పాడు. తండ్రి పక్కన నడుస్తున్నాడు. నిలబడిపోవడానికి వీలులేదు. రఘు మెకానికల్‌గా ముందుకు నడిచాడు. బహుశా రమణ ఇంకా తనని చూస్తూనేవుంటుంది. ఆమెచూపులు తనవీపుని స్పృశిస్తున్నట్లు మృదువుగా అతనికి తోచాయి. ఇంకా రమణ తనని చూస్తూనే వుంటుంది. కనుచూపు మేరవరకూ అల్లానే చూస్తూవుంటుంది. ఆ తరువాత కళ్ళల్లో నీళ్ళుతిరిగి, చూపులు నీటిపొరల్లో లీనమవుతాయి.

* * * *

పద్మ మూడవరోజున ఉదయం ఒక పెద్ద కారులో, ప్రేమావతీపేటకు వచ్చింది. కారుచప్పుడు వినడంతోనే రమణ వెలుపలికి పరుగెత్తుకొచ్చింది. పద్మ కారు దిగడం

తోనే, ఒక అడుగు ముందుకువేసి రమణ ఆ అమ్మాయిని గట్టిగా కావలించుకుంది.

'ఒక్క నెలరోజుల్లో ఇంత చిక్కిపోయా వేమిటి రమణా?' అని పద్మ ఆప్యాయంగా అడిగింది.

'చిక్కిపోయానా? లేదే!' అని రమణ సమాధానం చెప్పింది.

'చిక్కిపోకపోవడ మేమిటి? నీ మొహం' అంది పద్మ, రమణసమాధానాన్ని ఖండిస్తూ.

ఇద్దరుస్నేహితులు భుజాలపైన చేతులువేసుకొని లోపలికి వచ్చారు. రమణతలిదండ్రులకి పద్మ ఇదివరకే బాగా తెలుసు. హైదరాబాద్‌లో తరచూ వాళ్ళఇంటికి వస్తూ పోతూ ఉండేది.

'స్నానం చేశావా? కాఫీ తాగావా? ఫలహారమేమైనా చేస్తావా?' ప్రశ్నలవర్షం కురిపించింది రమణ, పద్మని తనగది లోకి లాక్కొని వెడుతూ.

'కాఫీ ఫలహారాలు అయినాయి. స్నానం కూడా చేశాను. మళ్ళీ ఒకకప్పు కాఫీ తాగమంటే నా కేమీ అభ్యంతరం లేదు' అంది పద్మ రమణప్రశ్నలవర్షానికిసమాధానంగా.

రమణ గబగబా పరుగెత్తుకొనివెళ్ళి, రెండు కప్పులు కాఫీ పెట్టమని తల్లితో చెప్పివచ్చింది. వచ్చి పద్మపక్కన ఆమెభుజంపైన ఒకచెయ్యి వేస్తో మంచంమీద కూర్చుంది.

'ఉత్తరం అందినవెంటనే బయల్దేరి రమ్మని వ్రాశావు, కారణ మేమిటో అడగవచ్చునా?' అంది పద్మ. రమణకళ్ళ ల్లోకి చూస్తో.

'నీవు అడగావచ్చు, నేను చెప్పావచ్చు. కాని మొదట కాఫీతాగి తరువాత నింపాదిగా మాట్లాడుకుందాం' అంది రమణ, పద్మ చూపులతో తన చూపుల్ని మేళవిస్తో.

'నీవు అల్లా నాకళ్ళల్లోకి చూస్తే నేను భరించలేను' అంది పద్మ, తనచూపుల్ని బలవంతంగా పక్కకితిప్పుకొంటో.

'ఆడచూపుల్నే భరించలేకపోతే, ముందుముందు మగ చూపుల్ని ఎల్లా భరించగలుగుతావు?' అని రమణ కొంటెగా ప్రశ్నించింది.

'నీవు మహా భరించగలిగినట్లే' అని తిప్పికొట్టింది పద్మ.

'భరించగలనో లేదో మా బావని అడిగి చూడు' అంది రమణ, కొద్దిగా సిగ్గుపడుతో.

'ఒక నెలరోజుల్లో వ్యవహారం అంతవరకూ వెళ్ళిందీ?' అని అడిగింది పద్మ తన ఆతురతని కప్పిపుచ్చలేక.

'నీవు వూహించినంతదూరం వెళ్ళలేదు. కాని, నిజం చెప్పవలసివస్తే చాలాదూరంవరకు వెళ్ళిందనే చెప్పాలి' అంది రమణ, కొంచెం సీరియస్‌గా.

'మరి మీవాళ్ళు నీ కేదో సంబంధం కుదిర్చినట్టున్నారే!'

'ఆ సంబంధం ఇష్టంలేకనే నిన్ను పిలిపించింది.'

'దానిని పడగొట్టటం మనతరమా?'

'కొంచెం ఆలోచిస్తే పడగొట్టేమార్గం కనపడకపోదు.'

'ఇదేమైనా పిల్లలాట అనుకున్నావా?'

'కాదు కనకనే గట్టిగా ఆలోచించాల్సిన అవసరం ఏర్పడుతున్నది.'

'ఏమో, నాకు నీ ధోరణి చాలా అయోమయంగా కనబడుతున్నది.'

'అయోమయం చేసుకుంటే, ఏ సమస్య అయినా అయోమయంగానే కనపడుతుంది.'

'ఇంతకీ నీవు ఏమి చెయ్యాదల్చుకున్నావు?'

'అల్లా అడిగావు బాగుంది. దానివల్ల మనం ఆలోచించుకోవడానికి ఒక మార్గం ఏర్పడుతుంది.'

'ముందు చెప్పు ఏం చేయదలుచుకున్నావో.'

'రేపు నేను పస్తుపడుకోదలుచుకున్నాను. భోజనం మానేస్తే, ఎందుకు మానేశావు అని అడుగుతారు. అప్పుడు నీవు, రమణకి ఈ సంబంధం యిష్టంలేదని గట్టిగా నొక్కి చెప్పవచ్చు.'

'కాని అంతటితో మానుకుంటారా?'

'మానుకోకపోవచ్చు. నన్ను కొట్టవచ్చు, తిట్టవచ్చు. కాదూ పోదూ అంటే కొద్దిగా హింసించవచ్చు.'

'కాని, నే నుండగా ఈ కర్మకాండఅంతా జరుగుతుం దంటావా?'

'కొద్దో గొప్పో జరుగవచ్చు. కాని, ఎంత జరగాలో అంత జరగదు. అందుకోసమే నిన్ను పిలువనంపింది.'

'అక్కడికీ మీవాళ్ళు దారికి రాకపోతే?'

'నేను రహస్యంగా నీ వెంట వచ్చేస్తాను. నన్ను మీ వాళ్ళల్లో ఎవరిదగ్గరైనా పెళ్ళిముహూర్తం దాటేవరకూ

దాచేసెయ్యి. తక్కినసంగతి తరువాత చూసుకుందాం.'

'మీవాళ్లు మా నాన్నపైన కేసు పెడితే?'

'తరువాత సంగతి అప్పటిపరిస్థితులనుబట్టి ఆలోచింతా మన్నానుగా!'

'చిన్నతనపుఫ్యాన్సీని ఆధారంచేసుకొని, ఇంతసాహస కృత్యానికి తలపడడం భావ్యంగా వుంటుందా?'

'నిజమే. మా బావపై నాకు గల ప్రేమచిన్నతనపు ఫ్యాన్సీ అని నేను ఒప్పుకుంటాను. కాని అంతమాత్రాన నేను తొందరపడి, అతన్ని పెళ్ళిచేసుకోవడం లేదే! నాలుగు సంవత్సరాలపాటు ఆగి, అతను నాకు తగినవరుడో కాడో పరీక్షించి మరీ పెళ్ళిచేసుకుంటాను. కాని మావాళ్లు తొందర పడి, ఒక సంబంధాన్ని నిశ్చయించి నాకు ఆ అవకాశం లేకుండా చేస్తున్నారు. పెళ్ళిచేసుకునేది నేను. దాని ఫలి తాన్ని-అది మంచైనా, చెడు అయినా జీవితమంతా-అనుభ వించేది నేను. అందువల్ల వాళ్ళనిర్ణయాలకి తలఒగ్గకండా, నాభవిష్యత్తును నేనే తీర్చిదిద్దుకోవా లనే ఉద్దేశంతో వాటిని ఎదిరిస్తున్నాను.'

'దీనివల్ల ఎంతరభస జరుగుతుందో, దానిఫలితం ఎవరు అనుభవించాల్సివస్తుందో ఆలోచించావా?'

'అన్నిటికీ సిద్ధపడే ఈ పనికి పూనుకుంటున్నాను.'

'నీ భవిష్యత్తును నీవు తీర్చిదిద్దుకోలేక, చివరకి నీ శాంతినే కోల్పోతే...?'

'అప్పుడు నా ఖర్మ మనుకుంటాను. అప్పుడు అన్నిం టికీ తలఒగ్గే రెండుతరాలక్రిందటి మా అమ్మకూ, నాకూ

ఎంతో తేడా వుంటుంది. ఈ ప్రయత్నంతో నేను ఇరవయ్యోవ శతాబ్దపు ఆధునికయువతి నని నిరూపించుకుంటాను. అది చాలదూ, శేషజీవితాన్ని సంతృప్తితో గడుపుకోవడానికి?'

పద్మ రమణతో ఇంక వాదించలేకపోయింది. కాగా ఆమె వాదనలో ఎక్కడా పెడదారులుపట్టినట్లు తోచలేదు పద్మకి.

'రమణా, రమణా!' అనే పిలుపు బయటినించి వినపడింది. తల్లిపిలుపు విని రమణ కాఫీ తీసుకురావడానికి వంటఇంట్లోకి వెళ్ళింది.

* * *

నారాయణరావు పేష్కార్ (డెప్యూటీ తహసీల్దారు) గా పనిచేస్తూ, తొమ్మిదిమాసాలక్రితం వరంగల్‌నించి హైద్రాబాద్‌కు ట్రాన్సఫర్ అయి వచ్చాడు. అతనికి ఉర్దూ, పార్శీ భాషలు బాగా వచ్చు. తెనుగులో కర్ణికం వ్రాయగలడు. అసఫ్‌జాహీ రాజుల పరిపాలనక్రింద హైద్రాబాద్ సంస్థానంలో అప్పట్లో ఉర్దూ రాజభాషగా ఉన్నది. ప్రభుత్వోద్యోగాలలో చేరి సంస్థానంలో మంచి పలుకుబడి సంపాదించుకోదలుచుకున్నవాళ్ళంతా, రాజభాష విధిగా నేర్చుకునేవాళ్లు. ఉర్దూలో మంచిప్రావీణ్యత సంపాదించదలుచుకుంటే, పార్శీ నేర్చుకోక తప్పదు. తెనుగూ సంస్కృతాలకి ఎంత అవినాభావసంబంధమో, ఉర్దూ పార్శీ భాషలకి అంతఅవినాభావ సంబంధం. పార్శీవినా ఉర్దూ మనజాలదు. ఎన్నో పార్శీపదాలు ఉర్దూలో విరివిగా ప్రచారం పొందాయి. గడచిన తరంవాళ్ళంతా సంస్థానంలో ఉర్దూ

పార్శీ భాషలతో విద్యాభ్యాసంచేసేవారు. నారాయణరావు ఈశ్వరరావులుకూడా ఒక మౌల్వీ (ఉర్దూ, పార్శీపండితుడు) దగ్గర ఉర్దూ పార్శీలు అభ్యసించారు. చిన్నతనంలోనే ఆమదన్, బోస్తాన్ మొదలైన పార్శీ గ్రంథాలు చదివారు. తెనుగులో అక్షరాలు నేర్చుకొని, పెద్ద బాలశిక్ష చదివారు. తరువాత పెద్ద ఎరుసులు, మిత్తి లెక్కలు, ఉత్తరాలు వ్రాయడం చదవడం నేర్చుకున్నారు. ఆ తరువాత తెనుగుతో సంబంధం తీరిపోయింది. చాలా కాలం వరకు పార్శీ నేర్చుకొని, కర్ణీకం వ్రాయడం అభ్యసించారు. కర్ణీకం వ్రాయడం రావడంతోనే చదువు పూర్తి అయింది. ఈశ్వరరావు ఇంట్లోనే వుండి కర్ణీకం వ్రాస్తూ, జీవితరంగంలోకి దిగాడు. నారాయణరావు ఇంటిదగ్గర ఏ ఆదరణాలేక గిర్దావర్ ఉద్యోగంలో చేరాడు. క్రమంగా పైకి వచ్చి, ఇటీవలనే డిప్యూటీ తహసిల్దార్ అయ్యాడు. అప్పట్లో సంస్థానంలో ఇంగ్లీషు బాగా ప్రచారంలోకిరాలేదు. ఏ కొద్ది మందో మాత్రం ఇంగ్లీషు చదువుకునేవారు. సంస్థానంలో ఇంగ్లీషువిద్య నభ్యసించడానికి అవకాశాలు లేకపోవడంవల్ల, ఇంగ్లీషు చదువుకోదలుచుకున్నవారు పొరుగురాష్ట్రాలకి వెళ్ళవలసివచ్చేది. ఇటీవల దాదాపు ఒకయాభై సంవత్సరాలనించి సంస్థానంలో ఇంగ్లీషు బాగా ప్రచారంలోకివచ్చింది. సంస్థానంలో నిజాంకళాశాల స్థాపించడంతో ఇంగ్లీషులో ఉన్నత విద్య ప్రారంభమైంది. ఆ రోజుల్లో నగరంలో ఒకటి రెండు ఉన్నతపాఠశాలలు ఉండేవి. ఆ పాఠశాలల్లో హెచ్. ఎస్. ఎల్. సి (మెట్రిక్యులేషన్) పరీక్షలో ఉత్తీర్ణులై, విద్యార్థులు

కళాశాలవిద్య నభ్యసించడానికై నిజాంకళాశాలలో చేరే వారు. ఆ స్కూళ్లలో ఫోర్తుఫారం తరువాత, ఒక పబ్లిక్ ఎగ్జామినేషన్ ఉండేది. దాన్ని స్పెషల్ అనేవాళ్లు. స్పెషల్ ప్యాసుఅవుతే, ఏవ్యక్తిఅయినా అప్పట్లో ఇంగ్లీషులో గొప్ప నిధి అన్నమాట. థర్డుఫారం పరీక్షని మిడిల్ అనేవారు. మిడిల్ ప్యాసుఅయిన వ్యక్తికి పట్టపగ్గాలు ఉండేవి కావు. ఖర్మంచాలక మెట్రిక్యులేషన్ ప్యాసుఅయితే, అతన్ని మించిన విద్వాంసుడు ఆ చుట్టుపక్కల తుపాకివేతామన్నా కనపడే వాడు కాదు. ఇదీ అప్పటి విద్యావిధానం.

ఏడవ అసఫ్‌జాహ మీర్ ఉస్మానలీఖాన్ హయాంలో ఉస్మానియా విశ్వవిద్యాలయం స్థాపించబడింది. ఇంగ్లీషు విశ్వ విద్యాలయాలలో బోధనాభాషగా వుంటే, విద్యార్థులు వివిధ విషయాల్ని సమగ్రంగా గ్రహించడం కష్టం. అందుకోసం ప్రాంతీయభాషల్లో విశ్వవిద్యాలయాల్ని స్థాపించవలెనని, బ్రిటిషుఇండియాలో అప్పట్లో ఒక ఉద్యమం బయల్దేరింది. కాగా, 'ఉర్దూ - హిందూస్తాన్' జాతీయభాషగా అంగీకరిం చాలని అప్పట్లో గాంధీజీ గొప్ప ఆందోళనని బయల్దేర దీశాడు. ఈ ఉద్యమాల్ని సాకుగాతీసుకొని, ఉర్దూ బోధనా భాషగా ఉస్మానియా విశ్వవిద్యాలయం స్థాపించబడింది. సంస్థానంలో నూటికి 90 మంది మాతృభాష తెనుగు, మహా రాష్ట్రం, కన్నడ భాషలు. నూటికి పదిమంది జనసంఖ్య గల ముస్లింల మాతృభాష ఉర్దూ. విశ్వవిద్యాలయంలో, ఆఫీసు లలో ఉర్దూని పోషించడంవల్ల మూడు ప్రాంతీయభాషలూ గొప్పగా దెబ్బతిన్నాయి. నగరంలో, జిల్లా ప్రధాన కేంద్రా

లలో ఉర్దూ బోధనాభాషగా అనేక ఉన్నత పాఠశాలలు ప్రారంభింపబడినాయి. విద్యార్థినిలుకూడా ఉర్దూ బోధనా భాషగా విద్యనభ్యసించవలసివచ్చేది. స్త్రీలకోసం నగరంలో ఒక కళాశాల స్థాపించబడింది. ఈ కళాశాలను ఉస్మానియా విశ్వవిద్యాలయానికి జతపరిచారు.

రమణ ఉర్దూ బోధనాభాషగా ఫోర్తుఫారం ప్యాసై, నారాయణరావు హైదాబాద్‌కు బదిలీకావడంతో నాంపల్లి గర్ల్స్ హైస్కూల్లో ఫిఫ్తుఫారంలో చేరింది. పద్మ రమణ క్లాస్‌మేటు. ఉభయులూ ప్రస్తుతం ఫిఫ్తుఫారం ప్యాసై సిక్స్తుఫారంలోకి వచ్చారు. రమణ వరంగల్‌నించి వచ్చిన కొద్ది రోజుల్లోనే, ఆమెకి పద్మతో మంచి స్నేహితం కుదిరింది. పద్మ దేశముఖుల అమ్మాయి. రమణ బ్రాహ్మణుల అమ్మాయి. ఇద్దరూ ఉన్నతవిద్య నభ్యసిస్తూఉండడంవల్ల వాళ్లు కుల భేదాలు అంతగా పాటించేవారు కాదు. ఇద్దరూ విడివిడిగా కూర్చొని భోజనంచేసేవారు. పద్మ శాకాహారి. అందు వల్ల యిరువురియిండ్లల్లో వంటలు ఒకలాగానే వుండేవి. ఈ తరంవాళ్ళు కులభేదాలు అంతగా పాటించకపోయినా యిరువురితలిదండ్రులూ వాటిని తు. చ. తప్పకుండా ఆచరణలో పెట్టేవారు. పద్మకి వంటయింట్లో రమణ తల్లి భోజనం పెట్టేది కాదు. ఆ అమ్మాయి ఎప్పుడువచ్చినా, మనసాల్లో రమణతల్లి యిద్దరికి సహపంక్తిని వడ్డించేది. సహ పంక్తిని కూర్చొని వాళ్ళుయిద్దరూ భోజనంచేసేవారు.

♦ ♦ ♦ ♦

పద్మ ప్రేమావతీపేటకి వచ్చినరోజు కూడా రమణ

తల్లి యిద్దరికీ మనసాల్లో వడ్డించింది. కబుర్లు చెప్పుకుంటూ, పరియాచికాలు ఆడుతూ యిద్దరూ ఎంతోసేపు భోజనాలు చేశారు. మధ్యాహ్నం కాసేపు కునుకుతీసి, సాయంత్రం టీ త్రాగి, బాగా చల్లబడినతరువాత, కాలువగట్టుకి షికారు వెళ్ళారు. కాలువగట్టున చాలాసేపు కూర్చొని, రమణ నిరశనవ్రతానికి సంబంధించిన వివరాలెన్నో మాట్లాడుకున్నారు. బాగా చీకటిపడ్డతరువాత ఇంటికి తిరిగివచ్చారు.

రమణ మరునాటినుంచీ నిరశనవ్రతం ప్రారంభించింది. ఆరోజు యథాప్రకారం నారాయణరావు ఉదయమే భోజనం చేసి, సైకిల్‌పైన పట్నం ఆఫీసుకు వెళ్ళాడు. రమణ ఉదయం టీ తాగింది. మధ్యాహ్నం వంట అయిన తరువాత, తల్లి భోజనానికి రమ్మంటే, 'నాకు ఆకలి లేదు. ఒక్క పద్మకే వడ్డించ'మని చెప్పింది. తల్లి చాలాసేపు బతిమిలాడింది. చివరకి కోప్పడ్డది. అయినా రమణ భోజనంచెయ్యలేదు. తల్లి విసిగి పద్మకి ఒక్కదానికే వడ్డించింది. పద్మకూడా రమణని బతిమిలాడినట్లు నటించి, అన్నం తినకపోతే వెళ్ళిపోతానని బెదిరించినట్లు బెదిరించి చివరకి అన్నం తిన్నది. రమణ సాయంత్రం తిరిగి టీ మాత్రం తాగింది.

చెట్లూ, గుట్టలమీదినించి నీరెండలు జారాయి. చీకటిపడింది. నారాయణరావు ఏడుగంటల తరువాత హైద్రాబాద్‌నించి తిరిగివచ్చి, ఆఫీసు దుస్తులు వదలి వేడినీళ్ళతో స్నానంచేశాడు. మడి కట్టుకున్నాడు. సంధ్యావార్చేలోపుగా నారాయణరావుభార్య సుభద్ర మనసాలలో మూడుపీటలు వేసి, భర్తకీ రమణ పద్మలకి వడ్డించింది.

భర్తకి దూరంగా వడ్డించి, పిల్లలిద్దరికి కొంచెం ఎడంగా వడ్డించింది. వడ్డన పూర్తికావడంతోనే నారాయణరావు 'రమణా!' అని కేకవేశాడు. ఆ పిలుపుకి పద్మమాత్రం భోజనానికి వెళ్ళింది.

'రమణ ఏదమ్మా? దాన్ని భోజనానికి పిలువు' అన్నాడు నారాయణరావు పద్మతో.

'ఆకలి లేదండీ. భోజనం చెయ్యదట. పడుకుంది' అని పద్మ సమాధానం చెప్పింది.

'పొద్దుటినించీ భోజనంచెయ్యలేదు. ఆకలి లేకపోవట మేమిటి?' అంది సుభద్ర అభిగారం వేస్తూ.

'పొద్దునకూడా భోజనం చెయ్యలేదా?' అన్నాడు నారాయణరావు ఆశ్చర్యంగా.'

'లేదు' అంది సుభద్ర క్లుప్తంగా.

నారాయణరావు వెంటనే పీటమీదనించి లేచి, రమణ పడుకున్నగది వాకిట్లోకి వెళ్ళాడు. పద్మకూడా అతన్ని అనుసరించింది. రమణ గదిలో మంచంమీద పడుకొని వుంది. 'రమణా! భోజనానికి లె'మ్మని అన్నాడు నారాయణరావు, వెళ్ళివెళ్ళడంతోనే.

'నాకు ఆకలి లేదు నాన్నా' అంది రమణ బలహీనమైన కంఠస్వరంతో.

కారుమేఘాలు కమ్ముకుంటున్నాయి. తుఫాను ఎప్పుడు వస్తుందో నని పద్మ భయపడింది.

'ఉదయంకూడా భోజనం చేయలేదట! ఆకలిలేకపోవడానికికారణం ఏమైనా ఉండాలా?'అన్నాడునారాయణరావు.

'వేరే కారణ మేముంటుంది? ఆకలి లేకపోవడమే కారణం' అంది రమణ సమాధానంగా.

'తనకైనా తోచాలి, లేక ఒకరు చెబితేనైనా వినాలి' అన్నాడు నారాయణరావు విసురుగా.

'చెప్పినట్లల్లా వినడంవల్లనే, ప్రస్తుతానికి కంఠంమీదికి వచ్చింది' అంది రమణ దూకుడుగా.

'ఎవ రేమి చెప్పారు? కంఠంమీదికి ఏమి తెచ్చారు?" అన్నాడు నారాయణరావు. రమణ వింతధోరణికి విస్తుపోతూ.

'ఇంకా ఎవరని అడుగుతా రెందుకు? మీరే!' అంది రమణ, ఒళ్ళు తెలియని ఆవేశంలో.

గిల్లి కజ్జాపెట్టుకుంటున్న ట్లున్నది- పద్మకి రమణ ధోరణి చూస్తే.

'నేనా!' అన్నాడు నారాయణరావు, రమణధోరణి అర్థంకాక.

వ్యవహారం ఇంత ముంచుకొచ్చిన తరువాత, ఇంకా ఈ డొంకతిరుగుళ్ళు దేని కని పద్మ కుండ బద్దలుకొట్టింది.

'మీరు చూచిన సంబంధం రమణకి ఏమాత్రం యిష్టంలేదు!'అంది నోట్లోనోట్లో ఏదో గొణుక్కుంటున్నట్లు

'ఆ సంబంధాని కేమైందని యిష్టం లేకపోవడానికి?' అన్నాడు నారాయణరావు కోపంగా.

'సంబంధం మంచిదే కావచ్చు. కాని, రమణ ఇప్పుడప్పుడే పెళ్ళిచేసుకోదలచుకోలేదు' అంది పద్మ, పైకి ఆలోచిస్తున్నట్లుగా.

'ఈడువచ్చినపిల్లని ఇంకా ఎంతకాలం ఇంట్లో అట్టే పెట్టుకుంటారని, నలుగురూ మా మొహంమీద ఉమ్మివేయ డానికా?' అన్నాడు నారాయణరావు రూక్షంగా.

'కొంతవరకు యీడువచ్చినమాట నిజమే. కాని రమణకి, 'ఇది మంచిసంబంధం - యిది కాదు' అని తెల్సుకో గలిగినంతయీడు రాలేదేమోనని భయం' అంది పద్మ, యువదృక్పథాన్ని వివరించడానికి ప్రయత్నిస్తో.

'మంచిచెడ్డలు పరిశీలించి, ఒక సంబంధాన్ని నిశ్చ యించే బాధ్యత తలిదండ్రులది కాని, ఏ అనుభవమూ లేని పిల్లలది' కాదు అన్నాడు నారాయణరావు, వెల్లువగా పైకి ఉబికివస్తున్న ఆగ్రహాన్ని సాధ్యమైనంతవరకు అణచుకుంటో.

'ఆ రోజులు మారాయి. ప్రస్తుతం యీ తరంవారు ఆ బాధ్యతని తమపైన వేసుకోదలుచుకున్నారు. అందు కోసమే అవసరమైన లోకజ్ఞానాన్ని సంపాదించేవరకూ, పెళ్లి చేసుకోకూడదని నిశ్చయించుకున్నారు' అంది పద్మ, యువ లోకానికి ప్రాతినిధ్యం వహిస్తో.

'నాలుగు ఇంగ్లీషు ముక్కలు నేర్చుకోవడంతో, బాధ్యత, లోకజ్ఞాన మని పెద్దపెద్దమాటలు ఉపయో గిస్తారు. కాని తాము ఎందుకూ పనికిరామని యీ తరంవాళ్లు ఎన్నడూ గుర్తించరు' అన్నాడు నారాయణరావు, యువ లోకాన్ని యీసడించుకొంటూ.

'పనికివచ్చేదీ, లేనిదీ కాలం నిర్ణయిస్తుంది' అంది పద్మ, యువజనంపైన గొప్ప విశ్వాసాన్ని ప్రకటిస్తో.

'వాగ్వివాదాలతో నాకు పనిలేదు. నా యింట్లో ఎవ్వరైనా నా యిష్టానుసారంగా నడుచుకోవాల్సిందే. దానికి విరుద్ధంగా ప్రవర్తించేవాళ్ళకి, యీ యింట్లో ఆశ్రయం ఉండదు'' అన్నాడు నారాయణరావు, బల్లగుద్ది చెప్పినట్లు. తన తుదినిర్ణయాన్ని ప్రకటించి, వంటయింట్లోకి చరచరా వెళ్ళిపోయాడు.

పద్మ నారాయణరావు నిర్ణయానికి నిర్ఘాంతపోయింది.

రమణకి ఏమీ తోచలేదు. ఈ యిల్లు వదిలి తను ఎక్కడికి వెళ్ళగలుగుతుందని? పోనీ, పద్మయింటికి వెళ్ళిపోతే? వాళ్ళు ఎన్నిరోజులని తన పోషణభారం వహిస్తారు? ఎన్ని రోజులైతే అన్నిరోజులే. ఆ తరువాత మార్గమేదైనా కన పడకపోతుందా? కనపడకపోతే, వరలక్ష్మిఅత్తయ్య ఇంటికి వెళ్ళిపోవచ్చు. వాళ్ళుకూడా తనని ఇంట్లోంచి తరిమివేస్తారా? రఘుబావ, వేంకటరామయ్య మామ ఉండగా ఆ పని జర గదు. జరగడానికి వీలులేదు.

పద్మ నెమ్మదిగా రమణని సమీపించి, 'ఇప్పుడు ఏమి చేతాం?' అని ఆతురతతో అడిగింది.

'చేసేదేముంది? రేపు నీతో మీయింటికి వచ్చేస్తా' నంది రమణ జలజల అశ్రువులు రాలుస్తో.

పద్మ రమణని చప్పున కావలించుకొని, కంటనీరు పెట్టింది. ఇద్దరూ ఏడుస్తో కూర్చున్నారు. ఎంతసేపు ఏడ్చారో వాళ్ళకే తెలియదు.

నారాయణరావుకి ఆ రాత్రి అన్నం సహించ లేదు. లాంఛనప్రాయంగా రెండుమెతుకులు కొరికి,

విస్తరిముందునించి లేచాడు ఆ రోజు ఇంట్లో పద్మ లేకపోతే, రమణని చీల్చి కాకులకి వేసేవాడు. కాని పద్మ మూలకంగా అతనిఆలోచనలన్నీ తలక్రిందులయినాయి. ఆ యింట్లో శిలాక్షరానికి మల్లే అతనిమాటకి తిరుగులేదు. చివరకి కలలోనైనా, అతనిని ఎవ్వరూ అంతవరకు ఎదిరించి ఎరగరు. ఆరోజు తనకూతురే తనకి ఎదురుతిరిగిందంటే తల నరికినంతపని అయింది. ఈ పద్మకూడా యిప్పుడే తమ యింటికి రావాలా? మహా మహా యుద్ధాల్లో దిగ్విజయ పరంపరల్ని సాధించి, ఒక చిన్నయుద్ధంలో మామూలు సైనికుడిచేతుల్లో క్షతగాత్రుడై పడిపోయిన ఒక వీరాగ్రేసరుడి దైన్యావస్థను తలపునకు తెస్తున్నది, ఆనాటి తన దుస్థితి. పక్కమీద పడుకున్నాడే కాని అతనికి ఎంతసేపటికీ నిద్రపట్టలేదు. తను జీవితంలో మొదటిమాటు, స్వయంగా తనకూతురిచేతుల్లో ఓడిపోయాననేసంగతి పదేపదే జ్ఞాపకానికివచ్చి, ఆ రాత్రిని దుర్భరంగా మార్చింది.

సుభద్ర ఉండబట్టలేక 'భోజనంచెయ్య్యి'మని రమణని మరీమరీ బతిమిలాడింది. రమణ ఎంతకూ భోజనంచేయడానికి అంగీకరించలేదు. విసుగేసి అన్నింటిపైనా మూతలుపెట్టి ఆమెకూడా వంటింట్లో కొంగుపరుచుకొని పడుకుంది. ఆరాత్రి పద్మకూడా అన్నం తినలేదు.

ఈశ్వరరావు క్రితంరోజున పట్నంవెళ్లి అంతవరకూ తిరిగిరాలేదు. ఈ హడావుడిలో భోజనంచేశావా లేదా అని ఆ రాత్రి వెంకమ్మని ఎవ్వరూ కనుక్కోలేదు. ఆమె కూడా భోజనంచెయ్యకుండానే పడుకుంది.

అర్ధాకలితో నిద్రరాక పక్కమీద దొర్లే మనిషికి మల్లే ఆ రాత్రి రమణగదిలోనిదీపం మిణుకుమిణుకుమని నిస్తేజంగా వెలిగింది.

మరునాటి ఉదయం రమణ తండ్రికి కనపడలేదు. అతను మామూలుగా లేచి, స్నానంచేసి, దుస్తులు వేసుకొని సైకిల్‌పైన ఆఫీసుకు వెళ్లిపోయాడు.

రమణ, పద్మలు నారాయణరావు ఆఫీసుకు వెళ్ళిన తరువాత లేచి, స్నానాలుచేసి, కాఫీలు తాగి, కారుకోసం ఎదురుచూడడం మొదలుపెట్టారు. కారు రావడంతోనే, రమణ తన పెట్టె, పక్కచుట్ట కారులో పెట్టింది. సుభద్ర వెళ్ళవద్దని కూతురుని ఎంతబతిమలాడినా ఆమె వినలేదు. 'నేను ఈ యింట్లో ఒక్కక్షణమైనా ఆగ' నని నిక్కచ్చిగా చెప్పింది. పోనీ, పట్నంపోతేనన్నా, కూతురు పస్తులుండడం మానుకుంటుందని, రమణప్రయాణానికి ఎట్టి అభ్యంతరం చెప్పలేదు. ఏడుస్తూ కూతుర్ని సాగనంపింది. కారు కదిలింది. మట్టి మేఘాలలో చివరకి లీనమైంది.

నారాయణరావు సాయంత్రం వచ్చి, రమణ పద్మతో పట్నంవెళ్ళిపోయిందని తెలియడంతోనే నిలువునా నీరైనాడు దుస్తులు విప్పి, కాళ్ళూ చేతులూ కడుక్కొని, ముసుగుతన్ని మంచంమీద పడుకున్నాడు. 'భోజనానికి లెండి' అని భార్య వచ్చి లేపితే, 'నాకు ఆకలిలేదు. నేను భోజనంచెయ్యను' అన్నాడు.

ఆ రోజు కూడా ఆ యింట్లో ఎవ్వరూ భోజనం చెయ్యలేదు.

# 6

హైదరాబాద్‌కి వెళ్ళిన తరువాత, రఘుకి ఏమీ తోచలేదు. ఏదో దిగులు, ఏదో భయం అతన్ని వెన్నాడుతూనే ఉంది. రమణ ఎల్లా వుందో? తలిదండ్రుల్ని ఎదిరించగలిగిందా? పద్మ ఆమెకి ఏమైనా తోడ్పడగలిగిందా? ఏమో! నిజం విచారిస్తే ఇద్దరూ పిల్లలే. ఇద్దరికీ సరిగా పదిహేను సంవత్సరాలైనా దాటలేదు. ఇద్దరికీ ఏమాత్రంకూడా లోకజ్ఞానం లేదు. వాళ్ళిద్దరూ కలిసి రమణతలిదండ్రుల్ని ఎదిరించి కుదిరినసంబంధాన్ని పడగొట్టగలరనే విశ్వాసం రఘుకు ఏనాడూ కలగలేదు. వారిపట్ల తనకు ఎంత సానుభూతి వున్నా, ఆ పని జరగడం అసంభవంగా తోచింది. రమణ ఏదో ఒకనాడు మొండికేసి ఉంటుంది. తండ్రిముందు గజ్జనవాణికిపోతో 'ఈ పెళ్ళి నాకు యిష్టంలే' దని నోట్లో నోట్లో గొణిగివుంటుంది. తనకీ సంబంధం యిష్టంలేదని పద్మతో తండ్రికి చెప్పించి వుంటుంది. అంతమాత్రానికి నారాయణరావు ఆ సంబంధం వదులుకుంటాడా? ముమ్మాటికి వదులుకోడు. ఇతరుల యిష్టాయిష్టాలకి కట్టుబడివుండేస్వభావం అతనిది ఏ మాత్రం కాదు. అటువంటిస్వభావమే కలవాడైతే, మొదటే ఆ పెళ్ళి విషయంలో రమణ అభిప్రాయాన్ని కనుక్కొని వుండేవాడు. రఘుకి తెలిసినంతవరకు అతను ఏ విషయంలోకూడా ఇతరులఅభిప్రాయాన్ని తీసుకొని, తదనుగుణంగా ప్రవర్తించడం ఎన్నడూ జరగలేదు. ఆ యింట్లో అతననిర్ణయానికి తిరుగు లేదు. ఒకవిధంగా అతను ఆడించే ఆటగా, పాడించే పాటగా

ఇంతవరకు ఆ యింట్లో జరుగుతూ వచ్చింది. ఇప్పుడు దానికి భిన్నంగా జరుగుతుందని అనుకోవడానికి ఎక్కడ అవకాశ ముంది? 'ఈ సంబంధం నాకు యిష్టంలే' దని ఒకవేళ రమణ అనడమే జరిగితే, 'నే నీ సంబంధం కుదిర్చాను. నాకు నీ యిష్టాయిష్టాలతో ప్రసక్తి లేదు. నీవు యీ పెళ్ళి చేసుకోక తప్పదు' అని కటువుగా అతను సమాధానం చెప్పివుంటాడు. దానితో రమణఆట పూర్తిగా కట్టుబడిపోయి వుంటుంది. పోనీ, నారాయణరావుని రమణ విజయవంతంగా ఎదిరించ గలిగిందనుకున్నా, దాని వల్ల తనకి ఒరిగేదేమిటి? పోనీ, ఆ సంబంధం పడిపోతుందనుకున్నా అంతటితో తనసమస్య పరి ష్కారంకాదే! ఐనా, రమణని తనకే ఇస్తారని ఏమి నమ్మకం? తన తలిదండ్రులు వెళ్ళి, రమణని యివ్వమని అడిగితే సన దులు, దస్తావేజులు చూపించమని అడిగాడే నారాయణరావు! అతను రమణకి ఈ సంబంధంకాకపోతే ఇంకో సంబంధం చేస్తాడు - అంతేకాని, తనకిమాత్రం రమణని ఇవ్వడు. ఇప్పటి కీ సంబంధం పడిపోయిందని సంతోషించాల్సిందే కాని, భవిష్యత్తు ఎల్లా వుంటుందో చెప్పడంమాత్రం కష్టం. వెంటనే తనకి రమణతో పెళ్ళి జరగకపోయినా, ప్రస్తుతాని కీ సంబంధం పడిపోతే బాగుండు ననిపించింది రఘుకి.

తలవని తలంపుగా రఘు కుడిచెయ్యి బుగ్గపైనున్న మచ్చమీదికి వెళ్ళింది. మునివేళ్ళతో మచ్చని తడిమింది. దానితో చలనచిత్రాల్లో నాయిక వివిధభంగిమల్లో నాయ కుడికి కనపడినట్లే, రమణ రఘుకి కనపడటం మొదలెట్టింది. జడ పట్టుకొని వెనక్కి లాగినప్పుడు గిలకపై చేంతాడులాగ

తనచేతుల్లోకి జారివచ్చిన రమణ, చేతితో గదువ పైకిఎత్తి ముద్దుపెట్టుకోబోతున్నప్పుడు సిగ్గుతో కళ్ళు మూసుకున్న రమణ, ఎర్రని సిల్కులంగా వేసుకొని, ఎర్రని పట్టుజాకెట్టు తొడుక్కొని సూర్యరశ్మికి రెపరెపలాడే ముకుళిత పద్మానికి మల్లే సిగ్గులు ఒలకబోస్తూ ప్రేమావతీపేటలో తనని సమీపించిన రమణ, పువ్వుల పరికిణీ జాకెటు తొడుక్కొని తనతో భార్యాభర్తల ఆట ఆడనందుకు కసిగా బుగ్గకొరికిన రమణ వివిధభంగిమల్లో రఘుని వేధించారు. హృదయాన్ని ఉండి ఉండి బాధపెట్టారు. జీవితాన్ని దుర్భరంగా చేశారు. పుస్తకం తీసుకుంటే చదువు సాగదు. పడుకుంటే నిద్ర రాదు. ఏపని చేయడానికీ తోచదు. పద్ధెనిమిది సంవత్సరాలకే జీవితం దుర్భరంగా మారడం, రఘుకి ఆశ్చర్యాన్ని కలిగించింది. ప్రేమా, విరహం అంటె ఇవేనా? వీటినే కవులు, కావ్యాల్లో చిలువలూ పలవలూ పెట్టి వర్ణించారా? ఏమో? ఏమీ తోచడం లేదు. గుండెల్లో ఏదో తియ్యనిబాధ. ఈ బాధతో కాలం ఎంతకూ గడవదు. గడిచినా ఏదో భారంగా, మందకొడిగా గడుస్తుంది. ఇదికూడా ప్రేమలక్షణమేనా? ఏమో? తల గోడకేసి గట్టిగా కొట్టుకుందా మనిపించింది రఘుకి. తల బద్దలవుతుంది. ఆలోచనలు ఆగిపోతాయి. వివిధభంగిమల్లో రమణలు అదృశ్యమవుతారు. రమణలు అదృశ్యమైతే తను బతకగలడా? వివిధభంగిమలు కనపడకపోతే, శూన్యంలో ఏవిధంగా మనగలుగుతాడు? బాధలో చిన్న సిట్టూర్పులకి మల్లే, దుఃఖంలో చిన్న ఓదార్పులకి మల్లే వివిధభంగిమల దృశ్యాలు తనకి ఉపశాంతిని కలుగజేస్తున్నాయి. వాటిని

కోల్పోతే ఇంక బ్రతకడం సంభవమా? పెద్దచేప చిన్నిచేపని తింటుందని అంటారు. ఆ విధంగానే భరింపశక్యంగాని బాధ, ఈ తియ్యనిబాధని మింగేయగలుగుతుందా? ఏమో? మింగేసినా మింగేయవచ్చు. భరింపశక్యంగాని బాధని ఎల్లా తెచ్చి పెట్టుకోవడమో, రఘుకి అర్థంకాలేదు. తల బద్దలుకొట్టుకోవడం రఘుకి క్రూరంగా కనబడ్డది. అంత గొప్పసాహసంచేసి భరింపశక్యంగాని బాధని తెచ్చిపెట్టుకోవడం కూడా బాధగానే తోచింది అతనికి. పోనీ, మనస్సు మార్చుకుంటే? చిన్నతనంనించీ రమణపైననే మనస్సు లగ్నంచేసి ఇప్పుడు అమాంతంగా మనస్సు మార్చుకుంటే, అది సాధ్యపడుతుందా? ప్రేమకన్నా బలీయమైనశక్తి ఏదైనా ఉండి, అది తనని ఆకర్షించి, తన మనస్సుని తిప్పగలుగుతే బాగుండేది. ప్రేమకన్నా బలీయమైన శక్తి త్యాగమని చెబుతారు. పోనీ, తను కూడా త్యాగంచేస్తే? ఏ ఆశయంకోసం తను తన నిండుజీవితాన్ని త్యాగంచేయడం? ఆలోచిస్తే ఆశయమేదైనా దొరకకపోతుందా? దేశంకోసం తనజీవితాన్ని త్యాగంచేస్తే? బ్రిటిషు ఇండియాలో, దేశస్వాతంత్ర్యం సందర్భంలో, ఏదో ఒక ఆందోళన కొనసాగుతూనే వుంటుంది. ఎక్కడో ఒకచోట తప్పక సత్యాగ్రహం జరుగుతూనే వుంటుంది. గాంధీజీ నాయకత్వంక్రింద ప్రజలు ఉత్సాహంగా సత్యాగ్రహోద్యమంలో పాల్గొంటున్నారు. విదేశవస్తువుల్ని బహిష్కరిస్తున్నారు. నూలువడికి, ఖద్దరు వస్త్రాల్ని ధరిస్తున్నారు. మిల్లుబట్టలు వేసుకొనడం మానివేశారు. న్యాయవాదులు తమవృత్తుల్ని వదిలి దేశస్వాతంత్ర్యోద్యమంలో పాల్గొంటున్నారు. విద్యా

ర్థులు పాఠశాలలు, కళాశాలల్ని బహిష్కరిస్తున్నారు. వేల కొలది ప్రజలు కారాగారశిక్షల్ని అనుభవిస్తున్నారు. కాని, హైద్రాబాద్‌లో ఇట్టిఉద్యమం ఏమీ జరగడంలేదు. అన్య ప్రాంతాలకి వెళ్ళి కాంగ్రెస్ ఉద్యమంలో పాల్గొనడమంటే రఘుకి మనస్కరించలేదు. హైదరాబాద్ విముక్తికోసం, ఉన్నచోటనే ఏదో ఉద్యమంలో పాల్గొనడం, రఘుకి సమంజసంగా తోచింది. కొన్ని సంవత్సరాలక్రితం ఆర్యసమాజం గుల్బర్గా జిల్లాలో పెద్దపెట్టున సత్యాగ్రహాన్ని జరిపిందట. ఈ ఆర్యసమాజం అట్టి సత్యాగ్రహం ఏదైనా ప్రస్తుతం జరిపితే బాగుండేది నేడు తనున్న పరిస్థితుల్లో, తాను సంతోషంగా ఆ ఉద్యమంలో పాల్గొనేవాడే. ఆర్యసమాజం నేడు ఉద్యమం కొనసాగించకపోవడానికి కారణమేమైనా ఉందా? పరిస్థితుల్లో మార్పు ఏమైనా వచ్చిందా? మార్పు రావడం అటుంచి, నేడు పరిస్థితులు మరీ విషమిస్తున్నాయి. దీనికంతటికీ కారణం, బహద్దుర్‌యార్‌జంగ్. అతను ముస్లింల సర్వతోముఖాభివృద్ధి పేరట, రాజధానీనగరంలో 'ఇత్తెహాదుల్ ముసల్‌మీన్' అనే సంస్థ స్థాపించాడు దీనికి జిల్లా, తాలూకా కేంద్రాల్లో శాఖల్ని నెలకొల్పాడు. ఈ సంస్థ ముస్లింలలో మతావేశాల్ని, మతవిద్వేషాల్ని పురికొల్పుతున్నది. బ్రిటిషు ఇండియాలో జిన్నానాయకత్వంక్రింద పనిచేస్తున్న 'ముస్లిం లీగ్' అడుగుజాడల్లో ఈ సంస్థ పనిచేస్తున్నది. ఈ ఉభయ సంస్థల నాయకుల మాటలప్రకారం హిందువులు, ముస్లిములు రెండు విభిన్నజాతులట. ఈ రెండుజాతుల ఆచారవ్యవహారాలు వేరట. రెండుజాతులూ ఒకచోట మనలేవట. దేశాన్ని

విభజించి, ముస్లింలకోసం ప్రత్యేకంగా పాకిస్తాన్ ఏర్పరిస్తేనే గాని, ముస్లింలు దేశంలో సురక్షితంగా ఉండలేరట. సంస్థానంలో ఇత్తెహాదుల్ ముసల్‌మీన్ సంస్థపైన ఎట్టిన్బిరంధాలు లేవు. అది విరివిగా సమావేశాల్ని జరుపుకోవచ్చు. ఉపన్యాస సభల్ని ఏర్పాటుచేయవచ్చు. కాని ముస్లిమేతరసంస్థలు ఏవీ ఆవిధంగా చేయడానికి పీలులేదు. ఆంధ్రమహాసభ, ఆర్య సమాజం చివరకి వార్షికసమావేశాల్ని జరుపుకోవడానికికూడా ముందుగా ప్రభుత్వానుమతిని పొందాలి. ఆ సమావేశాల్లో రాజకీయాల్ని ఏమీ మాట్లాడకూడదు. మతవిషయాల్ని గూర్చి ముచ్చటించగూడదు. సారస్వతవిషయాల్ని గూర్చి ఉపన్యాసాలు యివ్వవచ్చు. కాని ఆసందర్భంలో ఉర్దూభాషకి వ్యతిరేకముగా పల్లెత్తుమాట అనగూడదు. వార్షికోత్సవంలో ఇవ్వదలచిన ఊపన్యాసాలన్నీ లిఖితరూపంలో ముందు సంస్థానప్రభుత్వానికి దాఖలుచేసుకోవాలి. ఇన్ని షరతులకి అంగీకరించినా, వార్షికోత్సవానికి అనుమతి లభించడం దుర్ఘటం. సంస్థానంలో ప్రజలకి వాక్‌స్వాతంత్ర్యంగాని, సమావేశ స్వాతంత్ర్యంగాని లేదు. గష్తీ నిషాన్ 53 (సర్క్యులర్ నెంబర్ 53) వీటిని అరికట్టుతున్నది. ఆర్యసమాజానికి ఈ మధ్య వార్షికోత్సవాలు జరుపుకోవడానికిగాని, ఉపన్యాస సభలు ఏర్పాటుచేసుకోడానికి గాని అసలు అనుమతి లభించడమేలేదు. ఆంధ్రమహాసభ ఏదోవిధంగా వార్షికోత్సవాలకి ప్రభుత్వానుమతిని పొందుతున్నది. ఆంధ్రమహాసభ ప్రతిసంవత్సరం ఏదో ఒక జిల్లాలో వార్షికోత్సవాన్ని జరుపుతుంది. 'నిజాంప్రభువరేణ్యుల' పట్ల అచంచల భక్తి విశ్వాసాల్ని

ప్రకటిస్తో, ఏవో కొన్ని తీర్మానాల్ని ప్రతివటా చేస్తుంది. వాటిని ప్రభుత్వానికి అర్జీలరూపంలో పంపిస్తుంది.

మళ్ళీ ఆర్యసమాజం పెద్దపెట్టున సత్యాగ్రహాన్ని నడిపితే బాగుండు ననిపించింది రఘుకి. కాని కొన్నిసంవత్సరాలక్రితం జరిగిన సత్యాగ్రహాలతాకిడినించే, అది నేటికీ కోలుకోలేదు. ఇప్పటికీ వందలాదిసత్యాగ్రహులు జైళ్ళలో మగ్గుతున్నారు. రఘుకి దేశంకోసం జీవితాన్ని త్యాగంచేతామన్నా మార్గ మేదీ కనపడలేదు. ఆంధ్రమహాసభలో చేరి సంవత్సరాలతర బడి గతీ మోక్షం లేకుండా పోరాడడమంటే, అతనికి ఏ మాత్రం మనస్కరించలేదు. ఈ రోజు చేరితే రేపటికి అరెస్టు అయ్యే ఉద్యమం ఏమైనా వుంటే బాగుండు ననిపించింది రఘుకి. అట్టిఉద్యమం ఏదీ కట్టెదుట కన్పించకపోవడంతో అతనిహృదయం కృంగిపోయింది.

రఘుకి ఎడతెరిపిలేని ఆలోచనలతో చిరాకెత్తింది. తల దిమ్మెక్కినట్లు తోచింది. పోనీ, ఎక్కడికయినా వెడితే? 'ఎక్కడికివెళ్ళడమా' అన్నేప్రశ్న నిటారుగా తల పైకెత్తింది. పద్మయింటికి వెడితే? బాగానే వుంటుంది. తనకు పద్మఇంటి విలాసంకూడా తెలుసు. రమణయిచ్చినకవరుపైన ఆ విలాసం ఉన్నది. రమణ జ్ఞాపకానికి వచ్చినప్పుడల్లా, ఆమె వ్రాసిన విలాసం చూచుకోవడంవల్ల, ఆనాడు అదికంఠ స్తమైపోయింది. తీరా అంతదూరం వెళ్ళి, పద్మ కనపడకపోతే ఏం చెయ్యడం? ఇంట్లో వుంటుందో, వుండదో? ప్రేమావతీపేటకు వెళ్ళి, ఇంకా వచ్చిందో రాలేదో? తను పట్నంవచ్చి పదిహేను రోజులు దాటింది. పదిహేనురోజులు దాటినా తిరిగిరాకుండా

వుంటుందా? పద్మ ఎవరో తనకు తెలియదు. తను ఎవరో పద్మకి తెలియదు. రఘు ఇంతవరకు పద్మని చూడలేదు. 'ఇట్టి పరిస్థితులలో పద్మఇంటికి వెళ్ళడం సమంజసంగా వుంటుందా' అని ఆలోచించాడు రఘు. తెలియకపోతే పరిచయంచేసుకో వచ్చు. అంతమాత్రానికి సంకోచించడం దేనికి అనుకున్నాడు రఘు. తాను వెళ్ళి 'పద్మ యింట్లో వుందా?' అని అడిగితే, వాళ్ళవాళ్ళు ఏమనుకుంటారు? అనుకోవడానికి ఏముంది? తను ఫలానా అని చెబితే, తీరిపోతుంది. వాళ్ళు అంతగా అనుమానించేవాళ్ళైనప్పటికీ తనకు వచ్చే నష్టం ఏముంటుంది? ఇందులో మహాఅయితే పద్మతో నీకేమి పని అని కోపంగా అడుగుతారు. అప్పుడు తను నిజం ఏమాత్రం దాచకుండా చెప్పేస్తే, ఆసమాధానంతో తృప్తిపడితే తృప్తిపడతారు, లేకపోతే లేదు. రఘుకి ఈ ఆలోచనలతో కొంచెం ధైర్యం వచ్చింది. అతను వెంటనే దుస్తులు మార్చుకొని, మహారాజ్ గంజ్ కి బయల్దేరాడు.

ఫీల్ ఖానానించి మహారాజ్ గంజ్ కి రఘు కాలినడకని వెళ్ళేసరికి దాదాపు అరగంట పట్టింది. దారిలో ఎక్కడనా జట్కాగాని, టాంగాకాని కుదుర్చుకుందామంటే బేరం కుదర లేదు. మహారాజ్ గంజ్ కి వెళ్ళడంతోనే రఘు దారినవెడుతున్న ఒక పెద్దమనిషిని ఆపి, 'ఆంజనేయులుగారి యిల్లు ఎక్కడ?' అని అడిగాడు.

'ఆ ఎదురుగా కనపడుతున్న మూడంతస్థుల మేడే, ఆంజనేయులుగారి ఇల్లు' అని ఆపెద్దమనిషి చెప్పాడు.

రఘు ఆ మూడు అంతస్థుల మేడని సమీపించాడు. సింహద్వారానికి ఒక ఎదురుబద్దలపర్దా వెడల్పాటిది వ్రేలాడ గట్టి వుంది. హైద్రాబాద్ రాష్ట్రంలో కాయస్థులు, రెడ్లు, వెలమలు, తురకలు- వారినిచూచి ఇతరకులాలవారు పర్దా పాటించడంమామూలు. అందువల్ల సింహద్వారానికి వ్రేలాడ గట్టినపర్దా రఘుకి ఎట్టి ఆశ్చర్యాన్ని కలిగించలేదు.

ఇంటిముందు ఏ అలికిడీ లేదు. ఉన్న జనమంతా లోపలే ఉన్నారేమో? ఎవ్వరూ కనపడకపోవడంతో రఘు రెండుసార్లు ఇంటిముందు అటూ ఇటూ తిరిగాడు. ఇంతలోకే ఒక సేవకుడు ఆ ఇంట్లోనించి వెలుపలికి రావడం కనపడింది. రఘు ఆ సేవకుడిని సమీపించి 'ఆంజనేయులుగారు ఇంట్లో ఉన్నారా?' అని అడిగాడు. సేవకుడు ఆ ప్రశ్నకి బిత్తర చూపులు చూచాడు.

కొద్దిసేపటికి తేరుకొని 'దొరా?' అని అడిగాడు. రఘు 'జౌ' నని సమాధానం చెప్పాడు. సేవకుడు 'లేడు' అని చెప్పి తనదారినీ తాను వెళ్ళడానికి ప్రయత్నించాడు. రఘు అతన్ని అడ్డగించి 'ఆంజనేయులుగారి భార్యా, పిల్లలూ లోపల ఉన్నారా?' అని ప్రశ్నించాడు. ఆంజనేయుల్ని రఘు 'దొర' అని పిలవకపోవడం సేవకుడికి వెగటుగా కనపడింది. అతను కనుబొమలు ముడిపెడుతూ 'దొరసానులా?' అని అడిగి, రఘు సమాధానంకోసం నిరీక్షించకుండానే 'ఉన్నా' రన్నాడు. ఉత్తరక్షణంలో మేడమీదినించి గొల్లుననవ్వులు వినపడ్డాయి. రఘు తల పైకివెత్తి చూసేసరికి ఒక అమ్మాయిని తరుముతూ, రమణ మేడవసారాలోకి రావడం కనపడింది. రఘు ఆమెని

చూడడంతోనే 'రమణా!' అని గట్టిగా కేకవేశాడు. రమణ అమాంతంగా నవ్వు ఆపి, కిందికి చూచింది. 'వస్తున్నాను ఉండు' అని మాఘు కేకవేసి, రమణ బంగళాలోకి అదృశ్య మైంది. కొంచెంసేపటికి సింహద్వారంలో దర్శనమిచ్చింది.

రఘుని లోపలికి ఆహ్వానించింది. రఘు నెమ్మదిగా పరదాతొలగించి లోపల ప్రవేశించాడు. కుడివేపున ఒకపెద్ద గది. ఎదురుగా రెండుమూలలకి రెండు పెద్దపులులతలలు గోడకి అమర్చబడిఉన్నాయి. వాటికిమధ్య ప్రస్తుతపు నిజాం తండ్రి మహబూబ్ ఆలీఖాన్ తైలచిత్రం నిలువెత్తుది వ్రేలాడ గట్టబడి వుంది. ఆ ప్రక్కనవున్న గోడలకి ఎవరివో రెండు తైలచిత్రాలు ఉన్నాయి. వాటికిమధ్య జింకతలలు అమర్చ బడి వున్నాయి. గదికి నాలుగువేపులా మఖ్మల్ సోఫాలు, మధ్యన టేబుల్ పైన ఒక నటరాజస్ఫటికవిగ్రహం. టేబుల్ కింద ఒకపులిచర్మం – పులితల గదివాకిలికేసి ఉంది. ఒక సోఫాపక్కన పెద్దహుక్కా – హుక్కాకిందిభాగం వెండిది – దానిపైన బిదిరీపని చేసివుంది.

'నే నిక్కడ ఉన్నానని నీ కెల్లా తెలిసింది?'

'ఈ యింటిఅడ్రసు ఎల్లా కనుక్కోగలిగావు?'

'వచ్చి చాలాసేపు అయిందా?'

ఇలా రమణ ప్రశ్నలవర్షం కురిపిస్తున్నది. దివాన్ఖానా (మగసాల)ని చూడడంలో నిమగ్నమైవున్నరఘుకి ఆప్రశ్నలు నూతిలోనిగొంతుకలకిమల్లే వినపడుతున్నాయి. రమణ తన గొడవలో వుండి, జవాబులకోసం నిరీక్షించకండానే'నీకు ఒక

తమాషా చూపిస్తా' నని లోపలికి తుర్రున పరుగెత్తుకొని వెళ్ళింది.

ఆ తరువాత రఘుని దివాన్‌ఖానాలోని పులితలలు కాని, జింకతలలుకాని, మఖ్‌మల్‌సోఫాలుకాని ఆకర్షించలేదు. అతను ఒంటరిగాడుండడం చూచి, అదే అనువైన సమయమని ఎంచి రమణకి సంబంధించిన పూర్వపుఆలోచనలన్నీ అతని తలలో తిరిగి ముసురుకున్నాయి. మెదడులో ప్రశ్నపరంపరల్ని రేపాయి.

'రమణపెళ్ళి ఆగిపోయినట్లేనా ?'

'పద్మ వెళ్ళి రమణని ఇక్కడికి తీసుకొచ్చిందా ?'

'పద్మా రమణా కలిసి నారాయణరావు మామయ్యని విజయవంతంగా ఎదుర్కోగలిగారా ? లేక పెళ్ళికిముందు రెండుపూటలు పద్మతో గడపడానికి ఇక్కడికి వచ్చిందా ?'

రఘుమెదడులో ప్రశ్నలు ప్రశ్నలుగానే వుండిపోయినాయి.

ఇంతలోకే తిరిగి నవ్వులు. రమణా, మేడపైన కనపడిన అమ్మాయీ ఇద్దరూకలిసి చెరి ఒక అమ్మాయిని నవ్వుతో మగసాలలోకి లాక్కొస్తున్నారు— మేడపైన కనపడిన అమ్మాయి కుడుతా, షెల్వార్, వోణీవేసుకున్న అమ్మాయిని లాక్కొస్తున్నది. దుస్తుల్నిబట్టి బహుశా ఆ అమ్మాయి తురకఅమ్మాయి కావచ్చునని అనుకున్నాడు రఘు. రమణ లాక్కొస్తున్న అమ్మాయి తెల్లచీర కట్టుకొని పట్టంచుతెల్లటిరవిక వేసుకుంది. మనిషి సన్నగా నాజూకుగా

వుంది. బెంగాలీచిత్రాలలో కనపడే అరమోడ్పుకళ్ళతో, సన్ననినాలికతో సన్ననిపెదవుల్ని తడుపుకుంటూ సిగ్గుతో శరీరాన్నంతా ఒక్కచోటికి కుదించుకుంటూ, నిష్ఫలితంగా రమణని లోపలికి లాగుతున్నది. కోలమొహం, పల్చనిచర్మం మనిషికి వింతసోయగాన్ని అమరుస్తున్నాయి.

గదిలోకిరావడంతోనే డాబాపైన కనపడినఅమ్మాయి 'నా పేరు సుమన్' అనీ, తను లాక్కొస్తున్న అమ్మాయివేపు మొహాన్ని చాచి చూపుతో 'ఈ అమ్మాయి 'ఆయెషా' అనీ, రమణలాక్కొచ్చినఅమ్మాయి 'పద్మ' అనీ ముగ్గురినీ రఘుకి పరిచయంచేసింది. సుమన్ ధైర్యానికి రఘు ఆశ్చర్య చకితుడైనాడు. పేరునిబట్టి ఆ అమ్మాయి మహారాష్ట్రల అమ్మాయి అయివుంటుందని అతను అనుకున్నాడు.పరిచయాలతో పద్మ,ఆయెషాలు ప్రతిఘటన మానుకున్నారు. మంత్ర ముగ్ధలకుమల్లే రమణ, సుమన్‌లకి స్వాధీనులైనారు. రమణ, సుమన్‌లు వాళ్ళిద్దరిని లాక్కొచ్చి, రఘుకి ఎదురుగావున్న సోఫాలో కూర్చోపెట్టారు. రమణ,సుమన్‌లు వాళ్ళ ఉభయులకీ చెరిఒకపక్కన కూర్చున్నారు.

'పద్మ, ఆయెషా - వీళ్ళిద్దరిలో ఎవరు అందంగా ఉన్నారు బావా?' అని అడిగింది రమణ, తనపక్కన కూర్చున్న పద్మని కొంటెగా క్రీగంటిచూపులతో చూస్తూ.

'వాళ్ళిద్దరే ఏం ఖర్మం - మా నలుగురిలో ఎవరు అందంగా ఉన్నారో చెప్పండి!'అంది సుమన్, రమణప్రశ్నని ఖండిస్తూ.

రమణప్రశ్నకి పద్మ సిగ్గుతో ముకుళించుకుపోయింది. ఆమెషా కోపంగా రమణని క్రీగంటిచూపులతో చూస్తున్నది.

సుమతి, అంతధైర్యంగా 'మానలుగురిలో ఎవరు అందంగా ఉన్నా'రని అడగడం రఘుకి ఆశ్చర్యాన్ని కలిగించింది. ఫెళ్ళున లెంపకాయవేసినట్లు సమాధానం చెబుదామనుకున్నాడు రఘు - కాని, వెంటనే సమాధాన మేదీ తట్టలేదు.

'మానలుగురిని బాగాపరిశీలించి మరీ జవాబుచెప్పండి- తొందరపడి తరువాత విచారించకండి' అంది సుమతి ఉడుకు మోతుగా.

నలుగురు అందమైన అమ్మాయిలు తలవనితలంపుగా కనపడి 'మాలో మీకు నచ్చినవాళ్ళని ఎవరినైనా ఒకరిని వరించండి' అని నిలేసి అడిగితే, ఏ పురుషుడైనా ఏం సమా ధానం చెప్పగలడు !

రఘు తనతోమాట్లాడుతున్న సుమతినితప్ప మిగతా ముగ్గురినీ పరిశీలించి చూడలేకపోయాడు. కాగా, ఒక నిర్ణ యానికి రాలేకపోయాడు. మిగతాముగ్గురిని అప్పటిమట్టుకు వదిలేసి మొదట సుమతిని డీకొనదల్చుకున్నాడు.

'నిజం చెప్పమన్నారా ?' అన్నాడు సుమతికళ్ళ ల్లోకి చూస్తూ.

'మీా కెప్పుడూ అబద్ధాలుచెప్పడమే అలవాటా ?' అని తిప్పికొట్టింది సుమతి.

'ఆడవాళ్ళదగ్గిర ఎప్పుడూ అబద్ధాలుచెప్పడమే శ్రేయ స్కరం' అన్నాడు రఘు ఎత్తుకిపైఎత్తుగా.

'అది మా నాయనమ్మలకాలంలో. నేడు పురుషులు స్త్రీలదగ్గర అబద్ధాలాడి తప్పించుకోలేరు' అంది సుమన్ జాగృతిపొందుతున్న మహిళాప్రపంచానికి ప్రాతినిధ్యంవహిస్తో.

'ఏం చెప్పినా తప్పించుకోలేనప్పుడు నిజం చెప్పడమే మంచిదనుకుంటాను' అన్నాడు రఘు స్త్రీజాతికి లొంగిపోతో.

'నిజమో, అబద్ధమో - ఏదోఒకటి చెప్పండి మరి?' అంది సుమన్, ఏదోఒకటి తేల్చుకుందామనే ఉద్దేశంతో.

'మరి నేను నిజంచెబితే, మీ రేమీ అనుకోరుగదూ?' అని అడిగాడు రఘు, కొంచెం సందేహిస్తో.

'మేమే కావాలని అడిగినప్పుడు, అనుకోవడం దేనికి?' అంది సుమన్ రఘుకి ధైర్యాన్ని పురికొల్పుతో.

'నాకు పోట్లాడేవాళ్ళంటే చాలా యిష్టం' అన్నాడు రఘు, కొంటెగా సుమన్‌వేపు చూస్తో.

ఆవాక్యానికి రమణ, ఆయెషా, పద్మలు గొల్లు మన్నారు. సుమన్ రఘుసాహసానికి క్షణంసేపు బిత్తర పోయింది. తను విసరినబంతి రఘుకి తగిలి, తిరిగి తననే గట్టిగా దెబ్బతీయడం సుమన్‌కి లజ్జాజనకంగా తోచింది.

'అంటే రమణ మీ కిష్టంలేదన్నమాట?' అంది సుమన్, బంతిని రమణపైకి విసరుతో.

'ఆమాట నే నన్నానా?' అన్నాడు రఘు, సుమన్ తీర్పుని ఖండిస్తో—

'ఆ యిద్దరు మూగపిల్లలుకూడ మీ కిష్టమేనా?' అని అడిగింది సుమన్ రఘుని, ఆయెషా,పద్మలని ఉద్దేశించి.

'సిగ్గుతో, మూగవోయిన అమ్మాయిలంటేకూడా నాకు యిష్టమే' అన్నాడు రఘు, సుమన్ ప్రశ్నకి సమాధానంగా.

'కొంపదీసి, మానలుగురినీ పెళ్ళిచేసుకోరుగద!' అంది సుమన్ గొల్లున నవ్వుతో.

'ఇష్టమున్నంతమాత్రాన పెళ్ళిచేసుకోమని ఎక్కడ వుంది?' అన్నాడు రఘు, సుమన్ ప్రశ్నకి సమాధానంగా.

'ఈరోజు లేవడంతోనే ఎవరిమొహం చూచానో - రక్షించారు! లేకపోతే ఈక్షణంలో చచ్చి పెళ్ళాన్ని అయి కూర్చునేదాన్ని' అంది సుమన్ అల్లరిగా.

'అబ్బబ్బ! నీ అల్లరీ నీవూనూ-కాసేపు వుండు' అంది రమణ, సుమన్‌ని ఉద్దేశించి.

'ఏం, మీయిద్దరిమధ్య పానకంలోపుడకలాగా ఉన్నానా?' అంది సుమన్, రమణని విసిరికొడుతో.

'సుమన్ అల్లరి కేమిగాని - చెప్పు బావా, వీళ్ళిద్దరిలో ఎవరు అందంగా ఉన్నారో? ఆమెపా అందంగావుందని సుమన్, పద్మ అందంగావుందని నేను, ఇద్దరమూ పోట్లాడు కుంటూ ఉంటాము' అంది రమణ, రఘుకళ్ళల్లోకి చూస్తో-

నిజంవిచారిస్తే, ఇద్దరిలో ఎవరు అందంగాఉన్నారో తేల్చిచెప్పడం కష్టం. పద్మ స్వప్నసుందరి అయితే, ఆమెపా భూలోకసుందరి అని చెప్పొచ్చు. ఇద్దరూ కలిగినకుటుంబాల్లో పుట్టారు. అల్లారుముద్దుగా పెరిగారు. కలిమికీ, అందానికీ ఏదో అవినాభావసంబంధం వుంది - బహుశా కలిమి, వున్న అందాన్ని తీర్చిదిద్దుతుందేమో! రఘుకి స్వప్నసుందరి ఎంతో

నాజూకుగా సన్నగా కనపడితే-భూలోకసుందరి బాగా ఏపుగా పెరిగి, కొంచెంబొద్దుగా కనపడింది. ఇద్దరూ పచ్చగా, దబ్బ పండులాగా, ఎంతో ఆరోగ్యంగా ఉన్నారు. ఒకరు కమ్మని కలలుకల్పించి స్వప్నలోకాల్లోకి లాక్కెడితే, ఇంకొకరు స్వర్గ మంటే ఎక్కడో లేదు, ఈ భూలోకంలోనే వుందని గుర్తుకు తెచ్చి స్వర్గం అందజేయగల అలౌకికసౌఖ్యాల్ని కళ్లెదుట నిలబెడతారు. ఒకరిది కోలమొహం అయితే, ఇంకొకరిది గుండ్రనిమొహం. ఒకరు మల్లెపువ్వు అయితే, ఇంకొకరు గులాబీ. ఈ రెండుపువ్వుల్లో ఏది అందంగా వుండదని రెం డింటిలో దేన్ని మనం కాదని తోసెయ్యగలం? గులాబీ చక్షువుల్ని సంతృప్తిపెడుతుంది, స్పర్శసుఖాన్ని ఇస్తుంది. కాని మల్లె ఈ రెండుసుఖాల్నే కాక కమ్మనిసువాసనల్ని వెదజల్లి, ఏదో అవ్యక్తానందాన్ని సమకూరుస్తుంది. అప్పుడు గులాబీకన్నా మల్లె ఎక్కువ ఆరాధ్య మవుతుంది.

'ఏమిటి ఆలోచిస్తున్నావు బావా! నేను అడిగినప్రశ్నకి సమాధానం చెప్పవేం?' అని తొందరపెట్టింది, రమణ రఘుని.

'నామట్టుకు నాకు ఇద్దరూ అందంగానే ఉన్నారు - ఒకరు స్వప్నసుందరిలాగా కనపడితే, ఇంకొకరు భూలోక సుందరిగా సాక్షాత్కరిస్తున్నారు' అన్నాడు రఘు, రమణ ప్రశ్నకి సమాధానంగా.

"My dream girl" అని రమణ వెంటనే పద్మని కావలించుకుంది.

"My earthly damsel" అని సుమన్, అదే క్షణంలో ఆయెషాని తనబాహువుల్లో గట్టిగా బంధించింది.

స్వప్నసుందరీ, భూలోకసుందరీ సిగ్గుతో ఒకచోటికి కుదించుకుపోయారు.

ఇంతలోకే దాసీది పెద్ద ట్రేలో టీ, బిస్కట్లూ తీసుకొచ్చి, నటరాజస్ఫటికవిగ్రహాన్ని కొద్దిగా పక్కకి జరిపి, మగసాలలో మధ్యగావున్న టేబుల్‌పైన పెట్టింది. రఘు అనాలోచితంగా దాసీదానికేసి చూచాడు. దాదాపు ఇరువయి సంవత్సరాలు ఉంటాయి. మనిషి మొత్తంమీద అందంగానే వుంది. శుభ్రమైనదుస్తులు ధరించింది. దేశముఖ్‌లు, జాగీర్దార్ల యిళ్ళల్లో సేవకులూ, దాసీలూ వంశపారంపర్యంగా ఉంటారనీ, వాళ్ళకి పెళ్ళీపెటాకులూ జరగవనీ రఘు ఎప్పుడో విన్నాడు. ట్రేపట్టుకొచ్చినమనిషి ఆ జాతికి సంబంధించింది కాదుకదా ? అని అతనికి అనుమానం కలిగింది. టేబుల్‌పైన ట్రే వుంచి దాసీది లోపలికి వెళ్ళిపోయింది.

పద్మ లేచి, టేబుల్‌దగ్గరికి వెళ్లి, అయిదు కప్పుల్లో టీ డికాషన్ పోసింది. పాలుకలిపింది. స్పూన్‌తో చక్కెర తీస్తూ 'ఎన్నిచెంచాలు వెయ్యమంటావు ?' అని రమణని అడిగింది. 'రెండు' అని రమణ అనడంతోనే 'నాకూ రెండే' అని సుమన్ సమాధానంచెప్పింది. 'నీకో ?' అని పద్మ ఆమెపాని ప్రశ్నించింది. 'రెండున్నర' అని ఆమెపా సన్నగా పలికింది. పద్మ 'ఎన్నిచెంచాలు' అని రఘుని అడగలేదు. నాలుగు కప్పుల్లో చక్కెరకలిపి రఘుకేసి చూసింది. అడిగేవరకూ ఏమీ చెప్పకూడదని రఘు మౌనంవహించాడు. జవాబురాక పోవడం గమనించి 'మీ బావకి ఎన్నిచెంచాలు చక్కెర వెయ్యాలో కనుక్కో'మని రమణకి చెప్పింది. 'నేను కనుక్కో

వడ మేమిటి? నీకు నోరు లేదా?' అని రమణ జవాబు చెప్పడంతో తిరిగి పద్మ రఘుకేసి చూసింది. చూపులు కలిశాయి. కాని రఘు జవాబు ఏమీ చెప్పలేదు. తనచూపుల్ని పద్మ, రఘుచూపుల్లోంచి బలవంతంగా లాక్కొని అతని కప్పులో రెండుస్పూన్‌లు వేసింది. అందరికీ కప్పులు అందించింది. రఘుకి అందించేప్పుడు, అతనిమునివేళ్ళు పద్మమునివేళ్ళకి తాకాయి. ఆమెవళ్ళు ఝల్లుమన్నది. రమణ బిస్కట్లు అందరికీ ఇచ్చింది. కాని పద్మ తీసుకోలేదు. బిస్కట్లు లేకండానే టీ తాగింది.

'ఇంతకీ మేము ఊరినించివచ్చినతరువాత ఏంజరిగింది?' అని అడిగాడు రఘు రమణకేసి చూస్తూ.

'జరిగే దేముంది? పెళ్లికొడుకునోట్లో గడ్డపడింది!' అంది సుమతి గొల్లున నవ్వుతో రఘుప్రశ్నకి సమాధానంగా.

'మొత్తానికి మీరు పన్నినపన్నాగం విజయవంతమైందన్నమాట? అన్నాడు రఘు సంభాషణని ఏవిధంగా కొనసాగించడమో తోచక.

'ససేమిరా పెళ్లిచేసుకోనని నేను మొండికేశాను. కాగా, నిరాహారదీక్ష పూనాను. పద్మ నాతోఉండడంవల్ల నన్ను ఎవ్వరూ ఏమీఅనలేకపోయారు. తమలోతాము మండిపడ్డారు. ఒంటరిగావుంటే, ఆ మంటకి చితకపొడిచేవారే. కాని అల్లాంటిదేమీ జరగకండానే నేను ఇక్కడికి తప్పించుకువచ్చాను' అంది రమణ, పరిస్థితుల్ని వివరిస్తూ.

'మామయ్య నిన్ను పద్మతో రానిచ్చాడా?' అని అడిగాడు రఘు రమణని ఆతురతగా.

'నాన్న ఇంట్లోవుంటే రానిచ్చేవాడేనా?' అంది రమణ, ప్రశ్నకి పైప్రశ్న వేస్తో.

'అయితే, మామయ్యలేనిసమయంచూచుకొని ఇంట్లో నించి ఉడాయించారన్నమాట. మరి అత్తయ్య ఏమీ అన లేదూ?' అని రఘు తిరిగి ప్రశ్నించాడు.

'రెండురోజులనించీ నేను అన్నంతినకపోవడంగమనించి, ఇక్కడికివస్తేనన్నా భోజనంచేస్తానేమో అని మెదలకండా ఊరుకుంది' అంది రమణ వివరంగా.

'మీరు ఇక్కడికి వచ్చినతరువాత, మామయ్య రా లేదా?' అని రఘు అడిగాడు.

'వచ్చాడు. నన్ను పంపించమని ఆంజనేయులు చిన్నాయనని అడిగాడు. అమ్మాయికి ఇష్టంలేనిపెళ్ళిచేయడానికి మీ మనస్సు ఎల్లాఒప్పుకుంది అని అడిగాడు. దాంతో నాన్నఆట కట్టుబడింది. పైగా పెళ్లిముహూర్తం దాటేవరకూ అమ్మాయిని మీయింటికి పంపించనని నిక్కచ్చిగా చెప్పాడు. అందువల్ల నాన్న వచ్చినదారినే తిరిగివెళ్ళాడు' అని రమణ జవాబుచెప్పింది.

'మరి భోజనం ఎక్కడ చేస్తున్నావు?' అని రఘు రమణని ప్రశ్నించాడు.

'ఈ ఇంటిపక్కనే ఒక బ్రాహ్మణయిల్లు వుంది. ఆ యింట్లో భోజనంచేస్తున్నాను' అని చెప్పింది రమణ.

'పోనీ, ఫీలుఖానాకి వచ్చెయ్యకూడదూ?' అని సూచించాడు రఘు.

'వస్తే ఏమిలేదు కాని, నాన్నకి తెలిస్తే కొంపలంటు కుంటాయి. వచ్చి ఆయన నన్ను ఊరికి తీసికెళ్ళి పెళ్ళిచేసినా చేసెయ్యవచ్చు. ఆతరువాత విచారించి లాభమేమీఉండదు' అని ముందు వెనకలు ఆలోచించి చెప్పింది రమణ.

'ఆమాట నిజమే. కాగా, మొదటినించీ మేమంటే అతనికి కోపం' అన్నాడు రఘు, జరిగినవిషయాలన్నీ గుర్తు కు తెచ్చుకుంటూ.

'మీరంటే ఈమధ్యనే నాన్నకి పడకండా వచ్చింది కాని, మొదటినించీ కోపంవుందని నేను అనుకోను' అని రమణ రఘుపొరపాటుని సవరించింది.

'అయితే, పెళ్లిముహూర్తం దాటేవరకూ, నీ ఉనికి ఇక్కడే నన్నమాట' అన్నాడు రఘు, తుదివాక్యంగా.

'ఇంక మరి అంతే!' అంది రమణ క్లుప్తంగా.

'మరి నేను వెళ్ళిరానా?' అని అడిగాడు రఘు, రమణ చూపుల్లో తనచూపులు కలుపుతో.

'మళ్ళీ ఎప్పుడు కనపడుతావు?' అని అడిగింది రమణ, అతనిచూపుల్లో తనచూపులు లీనంచేస్తో.

'రేపు కొంచెం పనుంది - ఎల్లుండి వస్తా' నని బయల్దే రాడు రఘు.

అతను లేవడంతోనే నలుగురుఅమ్మాయిలూ లేచారు. ఆమెషా,పద్మలు మగసాలగుమ్మంలో ఆగిపోయారు. సుమన్ రమణలు వాకిలిగుమ్మంవరకు వచ్చి రఘుని సాగనంపారు.

రెండవరోజుఉదయం పదిగంటలకు రఘు తిరిగి ఆంజనే యులుగారియింటికి వెళ్ళాడు. ఆనాడు అతను యింటిముందు

తిరిగి తారట్లాడవలసిన అగత్యం లేకపోయింది. రఘువెళ్ళిందే తడవుగా, వాకిట్లో ఒక సేవకుడు కనపడి అతన్ని మర్యాదగా మగసాలలోకి తీసుకువెళ్లాడు. వెళ్ళినకాసేపటికి పద్మ అడుగులో అడుగు వేసుకుంటూ మగసాలలోకి వచ్చింది. పద్మ అప్పుడే తలంటిపోసుకున్నట్టుంది. తలవెంట్రుకలు వీపుమీదుగా జారవిడిచిఉన్నాయి. లేత గులాబీరంగు చీర కట్టి, ఎర్రని పట్టుచురవిక వేసుకుంది. ఎర్రని మఖమల్ ఆకుచెప్పులు వేసుకుంది.

'నిన్న మద్రాస్ యూనివర్సిటీ ఇంటర్ రిజల్ట్సు వచ్చాయేమో, మీ పరీక్ష ఏమైంది?' అని వచ్చీరావడంతోనే రఘుని అడిగింది.

మొన్నల్లా మౌనవ్రతంవహించిన పద్మేనా నేడు వచ్చీరావడంతోనే తనని ప్రశ్నిస్తున్నది?

'ఏమవుతుంది? పరీక్ష ప్యాసుఅయ్యాను' అన్నాడు రఘు క్లుప్తంగా.

'క్లాస్ ఏమైనా వచ్చిందా?' తిరిగి పద్మ ప్రశ్నించింది.

'ఏదో ఫస్టుక్లాసు వచ్చింది' అన్నాడురఘునిర్లక్ష్యంగా.

'కంగ్రాచ్యులేషన్స్'అంది పద్మ ఉత్సాహంగా.

'థ్యాంక్సు' అన్నాడు రఘు సమాధానంగా.

అంతటితో సంభాషణ కట్టుబడిపోయింది. ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు. పద్మ తలవాల్చి మగసాలలో పరిచివున్న తివాచీకేసి చూస్తున్నది.

'రమణ ఏదీ?' అని అడిగాడు రఘు ఆ మౌనాన్ని భరించలేక.

'తలంటిపోసుకుంటున్నది. ఈపాటికి అయిపోయి వుంటుంది' అంది పద్మ, ఎంతోకాలంనించీ ఆ గదిలో పాతుక పోయిన నిశ్శబ్దాన్ని పెల్లగిస్తూ.

మొన్న మౌనవ్రతంవహించిన పద్మ నేడు తనతో ఎందుకు మాట్లాడుతున్నదో రఘుకి అప్పుడు అర్థమైంది. రమణ తలంటిపోసుకుంటోవుండడంవల్ల విధిలేక పద్మ మొగ సాలకి వచ్చి, తనని పలకరించాల్సివచ్చిం దని అనుకున్నాడు రఘు.

'అరె! గదినిండా ముత్యాలేనే!' అన్నాడు రఘు ఆశ్చ ర్యం ఉట్టిపడేకంఠంతో.

'ముత్యాలా! ఏవీ?' అంది పద్మ రఘుమాటలకి విస్తుపోతో.

'మీకు కనపడటంలేదా!' అన్నాడు రఘు, కంఠంలో మరీ ఆశ్చర్యాన్ని ధ్వనింపజేస్తో.

'మీకు మతిపోలేదుకదా.' అంది పద్మ రఘువింత ధోరణికి తట్టుకోలేక.

'మతిపోయింది నాకు కాదు - మీకు - మీరు మాట్లాడితే నోటిముత్యాలు రాలకండా వుంటాయా అని గదంతా పరిశీలిస్తున్నాను'అన్నాడు రఘు కొంటెగానవ్వుతో.

మొన్న మౌనంగావున్నందుకు సమయంచూచుకొని రఘు తనపై గట్టిదెబ్బతీశా డనుకుంది పద్మ. కాని, దెబ్బకి దెబ్బ తీయడానికి ఆమెకు అప్పట్లో ఏమీ తోచలేదు. విధిలేక అప్పటిమట్టుకు మౌనంవహించింది.

కాసేపు మౌనంగా గడిచింది.

'అనవసరంగా ముత్యాలు ఎందుకు వ్యయపరచడమని ఆలోచిస్తున్నారా?' అన్నాడు రఘు తిరిగి కయ్యానికి కాలు దువ్వే ధోరణిలో.

'లేదు, ఇంగ్లీషులో ఒక సామెత వుంది. అది జ్ఞాపక మొచ్చి ఏదో ఆలోచిస్తున్నాను' అంది పద్మ, సూచన ప్రాయంగా దెబ్బకిదెబ్బతీస్తూ.

'Throughing pearls before a swine అనే సామెతేనా? అన్నాడు రఘు, ఆ దెబ్బకి ఉక్కిరిబిక్కిరిఅవుతూ.

'విజ్ఞులు, మీకు చెప్పదగినదాన్నా నేను' అంది పద్మ వినయం ఉట్టిపడే కంఠంతో.

ఈసారి రఘుకంఠం బిగుసుకుపోయింది. పద్మచూపిన సభ్యతకి ఆశ్చర్యమేసింది.

ఇంతలోకే రమణ మొగసాలలోకి వచ్చింది. రమణ కూడా లేతగులాబీరంగుచీర కట్టుకొని, ఎర్రనిపట్టుంచురవిక తొడుక్కుంది. కాళ్ళకిమాత్రం ఎర్రనిమఖ్మల్ చెప్పులు లేవు. కాళ్ళు బరిగా వున్నాయి.

'ఇద్దరూ ఒకేరకం దుస్తులు ధరించారు - విశేష మేమీ లేదుకదా?' అని అడిగాడు రఘు, రమణ మగసాల లోకి వచ్చీరావడంతోనే.

'అప్పచెల్లెళ్లు ఒకేరకం దుస్తులు ధరించడంలో విశేష మే ముంటుంది?' అంది రమణ ప్రశ్నకి ఎదురుప్రశ్న వేస్తూ.

'ఓహో! మీరిద్దరూ అప్పచెల్లెళ్ళన్నమాట!' అన్నాడు రఘు, తెలియనిసంగతిని అప్పుడే తెలుసుకుంటున్న ధోరణిలో.

'మరి కాక?' అంది రమణ రఘుధోరణిలోని పూర్వాపరాలు అర్థంకాక.

'అయితే పద్మ నాకు ఏమవుతుంది ?' అని అడిగాడు రఘు, కంఠంలో అమాయకత్వాన్ని వ్యక్తపరుస్తో.

ఆ ప్రశ్నకి పద్మ నిలువునా సిగ్గుతో క్రుంగిపోయింది.

'నీకు తలలో జేజెమ్మ అవుతుంది' అంది రమణ పద్మని విషమపరిస్థితుల్లోంచి తప్పిస్తో.

ఆతరువాత రఘు పరీక్షాఫలితాన్నిగూర్చి సంభాషణ కొనసాగింది. కొంతసేపటికి దాసీది ట్రేలో లడ్డూలు,గులాబ్ జామూన్, కారపుపూస తెచ్చింది. ఇంకొక ట్రేలో డికాక్షన్, పాలు, చక్కెర విడివిడిపాత్రలతో తీసుకొచ్చింది. తీపి తిని టీలు తాగడంతో ఆనాటిసమావేశం అంతముగిసింది.

# 7

'విశ్వేశ్వరరావుగారు ఉన్నారా ?'

రాత్రి ఎనిమిదిగంట లైంది. రుక్మిణి వంటచేస్తున్నది. వాకిట్లో ఎవరిదోపిలుపు వినపడగానే, ఏ అప్పులవాడో అయి వుంటా డనుకొని 'లేరు' అని గట్టిగా అరిచింది.

'కాస్త తలుపుతీస్తారా ?'

ఏ అప్పులవాడైనా వస్తే, ఒకపట్టాన వెళ్ళిపోడు - 'ఎప్పుడు వస్తారు?' 'ఎక్కడికి వెళ్ళారు?' మొదలైనప్రశ్నలతో ఉన్నప్రాణంకాస్తా తోడేస్తాడు. వాకిలితలుపు వేసి వుంటే చిత్రవిచిత్రమైనప్రశ్నలతో క్రాస్‌పరీక్షచేసి నిజం

బయటపడేవరకూ మనిషిని ఉక్కిరిబిక్కిరిచేయడానికి వీలు ఉండదు - అందుకోసమే 'కాస్త తలుపు తీస్తారా?' అనే ధోరణిలో ప్రారంభించి, తలుపుతీయడంతోనే ఎదురుగా కనపడినమనిషిని లక్షప్రశ్నలువేసి షాక్ టాక్ టిక్సుతో కథని క్లైమాక్సులోకి దింపుతారు.

'ఏమండీ, కాస్త తలుపుతీస్తారా ?' అని తిరిగి వెలుపలి గొంతుక అరిచింది.

రుక్మిణికి, అప్పులవాళ్ళగొంతుకల్ని ఎదుర్కొనేశక్తి లేదు. విధిలేక వెళ్లి వాకిలితలుపు తీసింది.

'ఎక్కడికి వెళ్ళారు ?'

తిరిగి ప్రశ్నలవర్షం ప్రారంభమైంది. రుక్మిణికిమాత్రం తెలుసునా? విశ్వేశ్వరరావు ఎక్కడికి వెళ్ళాడో సమాధానం చెప్పడానికి ?

'ఏమో !'

'ఎప్పుడు వస్తారు ?'

'ఏమో !'

'విశ్వేశ్వరరావుగారు అసలు ఇక్కడ ఉంటున్నారా?'

రుక్మిణికి, ఆ ప్రశ్న అర్థరహితంగా తోచింది.

'ఇక్కడఉండక ఇంకెక్కడ ఉంటారు ?'

'వారికి ఇంకొకయిల్లుకూడా వుంది - అందుకని !'

రుక్మిణికి తన హీనస్థితి చప్పున గుర్తుకువచ్చింది. తనేమైనా పుస్తెకట్టినభార్య అనా తనని విశ్వేశ్వరరావు ఎల్లప్పుడూ అంటిపెట్టుకొని ఉండడానికి ? ఇష్టమొచ్చిననాడు వస్తాడు, లేకపోతే లేదు. ఆవచ్చిననాడుకూడా రాత్రికి చాలా

ప్రొద్దుపోయి వచ్చి, ఉదయం ఏ నాలుగుగంటలకో లేచి వెళ్ళిపోతాడు. ఈమధ్య కొన్నిరోజులు వరుసగా రావడం కూడా మానేశాడు. ఆరోజుల్లో తాను రాత్రిళ్ళు ఒంటరిగా బిక్కుబిక్కుమంటూ గడుపవలసివస్తుంది.

'ఏమో! నిన్నమాత్రం వచ్చారు. ఈరోజుకూడా వస్తే రావచ్చు.'

'నాపేరు రామనాథం. నేనూ అతనూ ఒకటేఆఫీసులో పనిచేస్తున్నాం.'

ఈమధ్యనే రామనాథం తనస్నేహితుడనీ వాళ్ళఇల్లు పాతవాల్తేరులో వుందనీ, అక్కడికి మారుద్దామనీ విశ్వేశ్వర రావుఅనడం రుక్మిణికి అమాంతంగా జ్ఞాపకంవచ్చింది. లోపలికి రమ్మనకుండా వాకిలిగుమ్మంలో రామనాథాన్ని అంతసేపు నిలబెట్టినందుకు తననుతానే లోపలలోపల నిందించుకుంది.

'ఏవోమాటలలో పడి మిమ్మల్ని లోపలికివచ్చి కూర్చోమనడమే మరచిపోయాను' అంది రుక్మిణి, తన అతిథిసత్కారపు విధుల్ని గుర్తుకు తెచ్చుకుంటో.

'లోపలికి వచ్చి కూర్చోమనడానికి నేను ఫలానాఅని చెప్పేవరకు మీకుమాత్రం ఎల్లా తెలుస్తుంది?' అన్నాడు రామనాథం తనని ఆహ్వానించకపోవడంలో రుక్మిణిదోషం ఏమీ లేదని వ్యక్తపరుస్తూ.

వెంటనే లోపలికివచ్చి కూర్చున్నాడు రామనాథం.

'పోనీ, ఇప్పుడు చెప్పండి, విశ్వేశ్వరావుగారు ఎప్పుడు వస్తారో?' అని అడిగాడు రామనాథం, పరధ్యానంగా వున్న రుక్మిణిచూపుల్ని బలవంతంగా తనవేపుకు లాక్కుంటో.

'పదిగంటలు దాటితేనేకాని రారేమోనని నా అనుమానం' అంది రుక్మిణి క్లుప్తంగా.

రామనాథం తదేకధ్యానంగా తనని నఖశిఖపర్యంతం పరీక్షించడం, కొంతయిబ్బందిగా తోచింది రుక్మిణికి. అతను వచ్చినప్పటినించీ తనని అల్లానే పరీక్షించి చూస్తున్నాడా? ఏమో... తనుమాత్రం గమనించలేదు. ఆ పరీక్షించి చూడడంలో అతని ఉద్దేశ మేమై వుంటుంది?

'ఇప్పుడు ఎనిమిదీ యిరవై అయింది. ఇంకా రెండు గంటలు దాటితేనేకాని విశ్వేశ్వరరావుగారు రారన్నమాట' అన్నాడు రామనాథం చేతిగడియారాన్ని పరిశీలిస్తూ.

'ఈరోజే కల్సుకోవాల్సినంత అవసరం లేకపోతే రేపు మీకు ఆఫీసులో కనపడుతారుగా' అంది రుక్మిణి, తన కళ్ళల్లోకి వాలిన రామనాథం చూపుల్ని తప్పించుకొంటూ.

'వారం, పదిరోజులనించీ అతను ఆఫీసుకే రావడం లేదు' అన్నాడు రామనాథం, తన చూపుల్ని రుక్మిణిమొహం మీదినించి వక్షోజాలమీదికి జారుస్తూ.

ఎవరో తనని వివస్త్రనిచేసి, చూడరానిచోట్లల్లా చూస్తూ, తాకరానిచోట్లల్లా తాకుతున్నట్లు రుక్మిణికి తోచింది. ఉత్తరక్షణంలోనే ఆమె శరీరంనిండా కొంగువేసుకుంది. ఆమెకి జరుగుతున్న సంభాషణపైన మనస్సు ఏమాత్రంలేదు.

'ఆఫీసుకు వారం పదిరోజులనించి రావడంలేదా?' అని అడిగింది మెకానికల్‌గా.

'ఆఫీసుకు రాకపోయినా ఫరవాలేదు. కాని ఈ అప్పుల గొడవలు చూసుకుంటే బాగుండేది' అన్నాడు రామనాథం

తనచూపుల్ని తిరిగి రుక్మిణిమొహంమీదికి మళ్ళిస్తో.

'అప్పుల మూలకంగా ఆఫీసులో కొత్తచిక్కులు ఏమైనా వచ్చాయా?' అని అడిగింది రుక్మిణి, అమాయకంగా.

'నిన్న సెట్టి ఆఫీసుకువచ్చి, అప్పువిషయంలో డైరెక్టర్‌కి ఫిర్యాదుచేస్తానని నానా హంగామా చేశాడు,' అన్నాడు, రామనాథం ఈసారి రుక్మిణిచూపుల్లో తనచూపులు కలుపుతూ.

రుక్మిణి గొప్ప సందిగ్ధావస్థలో పడింది. ఆమె రామనాథంతో మాట్లాడనూలేదు, మానుకోనూ లేదు. అతని చూపులకి తట్టుకోలేక లోపలికి వెళ్ళిపోదామనుకుంటే, ఏమి చెబుతాడో విందామని మనస్సు వెనక్కిలాగుతున్నది.

'ఇంతకీ సెట్టి మీఅధికారిని చూచాడా?' అని అడిగింది రుక్మిణి, రామనాథం కొంటెచూపుల్ని లక్ష్యంచేయకండా.

'లేదు. విశ్వేశ్వరరావుగారు డబ్బు ఇవ్వకపోతే, నేను ఇస్తానని సర్దిచెప్పి పంపించాను' అన్నాడు రామనాథం విశ్వేశ్వరరావుని గొప్పవిపత్తునించి రక్షించిన ధోరణిలో.

రుక్మిణికి తాను తెలుసుకోదలచినదంతా తెలుసుకున్నట్లు తోచింది. ఆమె వెంటనే వంటగదిలో వెళ్ళిపోయింది.

కాలచక్రం నిమిషాల్ని చుట్టివేస్తున్నది... ఒకటీ... రెండూ... మూడూ... రామనాథం ఎంతసేపు కూర్చున్నాడో అతనికే తెలియదు. గదిలో లాంతరు చలనం లేకండా వెలుగుతున్నది. ఏవో రెక్కలపురుగులు లాంతరు

గాజుబుగ్గకేసి కొట్టుకుంటున్నాయి. బుగ్గని పగలగొట్టలేక కిందపడుతున్నాయి. తమకు కలిగిన పరాభవాన్ని తట్టుకోలేక, వీరావేశంతో నేలమీదినించి ఎగిరి తిరిగి గాజుబుగ్గని ఢీకొంటున్నాయి. లాంతరుకి ఆగాజుబుగ్గలేకపోతే ఎంతబాగుండేది. అవి వళ్లుతెలియని ఆవేశంలో దీపశిఖని చుంబించి, ధన్యత చెందేవి. ప్రేమాగ్నిలో ఆహుతిఅయి జన్మరాహిత్యాన్ని సాధించేవి. ...

రామనాథానికి ఎందుకో కణతలు కొట్టుకుంటున్నాయి. శరీరం క్రమంగా వేడెక్కుతున్నది. నోట్లో తడి ఆరిపోతున్నది.

'కాసిన్ని మంచినీళ్ళు ఇస్తారా?' డగ్గుత్తికతో అరిచాడు.

రుక్మిణికి, రామనాథంఅరుపు లోపలికి వినపడింది. కాని, ఆ పిలుపు ఏదో ప్రమాదభరితంగా కనపడింది. మగనెమలి, ఆడనెమలికోసం అరిచే అరుపుగా తోచింది. పోనీ, వినపడనట్లు నటిస్తే ... దానివల్ల ఏంలాభం? ... అతను తిరిగి ఎల్లాగూ పిలుస్తాడు ... ఏవిధంగా ఆలోచించినా తను తిరిగి అతనికి మంచినీరు యివ్వకతప్పదు.

రుక్మిణి మంచినీళ్ళగ్లాసు తీసుకొని బెదురుచూపులతో, అడుగులో అడుగు వేసుకుంటూ పక్కగదిలోకి వెళ్ళింది. రామనాథం తననీ, తనశరీరంలోని ప్రతిఅవయవాన్నీ, తన నడకనీ వెయ్యికళ్ళతో పరీక్షిస్తున్నాడు. రుక్మిణి రెప్పలు కిందికి వాల్చి ముందుకు నడిచింది. తను వంగి మంచినీళ్ళగ్లాసు కింద పెట్టబోతూవుండగా, అతను కుడిచెయ్యి గ్లాసుకోసం ముందుకు చాచాడు. చాచినచెయ్యి గమనించకండా రుక్మిణి

గ్లాసు కిందపెట్టింది. అమాంతంగా చాచినచెయ్యి గ్లాసుపైన వాలి తనమునివేళ్ళని స్పృశిస్తున్నది. తను చప్పున గ్లాసు మీదినించి చెయ్యిలాగేసుకుంది. ఆ ఊపుకి గ్లాసులోనినీళ్ళు సగానికిపైగా కిందికి వొలికాయి. చాచినచెయ్యి గ్లాసుమీది నించి ఎగిరి, తనచేతిని అందుకోవడానికి ప్రయత్నించింది. కాని, ఇంతలోకే వెలుపల అడుగులచప్పుడు, సైకిల్ చప్పుడు మిళితమై వినపడ్డాయి. తనచేతిని అందుకోవడానికి ప్రయత్నించినచెయ్యి చప్పున తనప్రయత్నాన్ని మానుకుంది. రుక్మిణి గిరుక్కున వెనక్కిమళ్ళి వంటగదిలోకి వెళ్ళిపోయింది.

ఇంతలోకే విశ్వేశ్వరరావు సైకిల్‌తో లోపలికి వచ్చాడు. సైకిల్ గదిలో గోడకి ఆనించి 'చాలాసేపు అయిందా వచ్చి?' అని అడిగాడు.

'ఆఁ, ఒకగంట అయింది' అన్నాడు రామనాథం క్షణంక్రితం తను తలదాకా మునకలువేసిన ఉద్రిక్త ప్రపంచంలోంచి తేరుకుని.

కుశలప్రశ్నలతరువాత రామనాథం విశ్వేశ్వరరావుకి సెట్టిసంగతి చెప్పాడు.

సెట్టికి ఆ రెండువందలు తాను సర్దుతానని విశ్వేశ్వర రావుకి హామీయిచ్చాడు. కాగా, విశ్వేశ్వరరావుస్థితిగతుల్ని గూర్చికూడా విచారించాడు. సెట్టికిచ్చే రెండువందలు కాక, ఇంకొకఅయిదువందలు కూడా అప్పుగా యివ్వడానికి ఒప్పుకున్నాడు.

రామనాథం ఔదార్యానికి విశ్వేశ్వరరావు కారణం ఊహించుకోలేకపోయినాడు. కారణంతో సంబంధంపెట్టుకో

కండా, కలిగినసత్ఫలితానికి సంతోషించాడు. కష్టాలలో తనని ఆదుకున్నందుకు రామనాథంపట్ల గొప్ప కృతజ్ఞతని ప్రకటించాడు. అతనిడబ్బు త్వరలోనే పువ్వుల్లోపెట్టి ముట్ట చెబుతానన్నాడు. అతను చేసినమేలు ఎన్నటికీ మరిచిపోలేనని మరీమరీ చెప్పాడు. ఆపత్సమయంలో అండగా నిలిచినందుకు అతనికి జీవితాంతంవరకూ ఋణపడివుంటానని అన్నాడు. కష్టకాలంలో చేయూతనిచ్చి తనని ఒకగట్టుకుచేర్చినందుకు, నిజంవిచారిస్తే, ఒక్క రామనాథమే తనకు నిజమైన మిత్రుడనీ, తక్కినవారు మిత్రులని పిలవడానికికూడా అనర్హులనీ అన్నాడు.

రామనాథం బయల్దేరుతుండగా విశ్వేశ్వరరావు 'భోజనంచేసి మరీ వెళ్ళరాదా?' అన్నాడు. 'లేదు. భోజనానికి ఇంటికి వెళ్ళాలి.' అని అంటే 'ఇదిమాత్రం నీఇల్లు కాదా? నేటినించి నీవు ఆ భేదాలు పాటించడానికి వీలులే'దని నొక్కిచెప్పాడు. 'ఈసారి వచ్చినప్పు డెప్పుడైనా భోజనం చేస్తాను. ఈనాటికిమాత్రం నన్ను క్షమించ'మని రామనాథం లేచాడు. వెంటనే విశ్వేశ్వరరావు లేచి లాంతరు అందుకొని అతనిముందు నడిచాడు. ఎంతోమర్యాదగా కొనవాకిలివరకూ అతనిని సాగనంపాడు.

విశ్వేశ్వరరావు తిరిగివచ్చేలోపుగా రుక్మిణి కంచంవేసి ఒక్కఅన్నంతప్ప మిగిలినవస్తువులన్నీ వడ్డించింది. దుస్తులు విప్పి, కాళ్ళు కడుక్కొని విశ్వేశ్వరరావు వచ్చి పీటమీాద కూర్చున్నాడు. రుక్మిణి వేడివేడిఅన్నం వడ్డించింది. విశ్వేశ్వరరావు పచ్చడికలుపుకుంటూ 'పాతవాల్మాదిలోని రామనాథం

ఇంటికి ఎప్పుడు మారుదా'మని రుక్మిణిని అడిగాడు. 'చూతా మని రుక్మిణి క్లుప్తంగా సమాధానంచెప్పింది. 'చూంతామంటే కాదు. ఒకటిరెండురోజుల్లో మారాలి' అన్నాడు విశ్వేశ్వర రావు. ఆమాటలువినడంతోనే రుక్మిణికి గుండెల్లో రాయిపడ్డ ట్టయింది. ఎక్కడో పరాయిఇంట్లో ఉంటేనే అంతసాహసా నికి ఒడిగట్టిన రామనాథం, స్వయంగా అతనిఇంట్లోనే వుంటే ఇంక బ్రతకనిస్తాడా అనే అనుమానం రుక్మిణికి కలిగింది. దానితో పాతవాలాద్రికి వెళ్ళడం ఏవిధంగానైనా పడగొట్టడం అవసరమని ఆమెకు తోచింది.

'అంతతొందరెందుకు ? ఆలోచింతా మన్నానుగా!'

'మనం ఆలోచిస్తూ కూచుంటే, మనకోసం ఆయిల్లు ఆగుతుందా ?'

'అంతఆగనియిల్లుకోసం, మనంమాత్రం ప్రాకులాడడం దేనికి ?'

'మంచిసహవాసం-తరువాత మనం కోరుకున్నా మనకు దొరుకుతుందా ?'

'మీ రామనాథాన్నిబట్టి చూస్తేమాత్రం, అది అంత మంచి సహవాసంగా కనపడడంలేదు.'

'ఎందుచేత ?'

'ఇంకా ఎందుచేత అని అడుగుతున్నా రేమిటి ? అతనిప్రవర్తన నాకు బొత్తిగా బాగుండలేదు.'

'అతనిప్రవర్తన బాగుండకపోవడ మేమిటి? నీ కేమైనా మతిపోలేదుకదా ?'

'నా కేమీ మతిపోలేదు. అతని ప్రవర్తన బాగుండ లేదు కనుకనే బాగుండలే దన్నాను. అంతే.'

'ఇంతకీ జరిగిం దేమిటి ?'

'జరిగే దేముంది—వచ్చినప్పటినించీ ఒకటే పనిగా, అదోరకంగా నావేపు చూచాడు. మంచినీళ్ళు ఇవ్వబోతే, నా చెయ్యి అందుకోవడానికి ప్రయత్నించాడు.'

'అంతేకదా? నే నింకేదో అనుకున్నాను.'

'ఆ అనుకోవల్సిన రోజు వస్తుందేమోనని నాభయం. అందుకోసమే నేను, పాతవాలాప్రికి మనం వెళ్ళవద్దంటున్నది.'

'ఆరోజు వస్తే మరీ సంతోషం - నేను రామనాథానికి యివ్వవల్సినడబ్బుకూడా యివ్వాల్సిన అవసరం ఉండదు.'

'మీరు మగవాళ్ళు కారూ ? మీకు పౌరుషమంటూ లేదూ ? ఎక్కడైనా అప్పుకోసం స్వంతస్త్రీని తాకటుపెట్టు కుంటారా ?'

'నువ్వేమైనా నేను పుస్తెకట్టి పెళ్ళిచేసుకున్న భార్యవా నాకు పౌరుషం రావడానికి ? స్వయంగా పుస్తెకట్టి పెళ్ళిచేసు కున్నభార్యవిషయంలోనే నా కా పట్టింపు లేనప్పుడు ఏదో మదమెక్కి నా వెంటబడిన మనిషివిషయంలోఎందుకుంటుంది?'

'ఆ రామనాథమే స్వయంగా మీభార్యని బలాత్కా రంచేస్తే మీరు ఊరుకుంటారా ?'

'ఎందుకు ఊరుకోను? ఈ స్త్రీలకోసం కలిగినవాళ్ళతో కోరి కయ్యానికి కాలుదువ్వుతానా ? జీవితంలో డబ్బువుంటే స్త్రీలు లక్షలకొద్దీ వస్తారు. తాగుడు వస్తుంది. అంతెందుకు

సర్వసౌఖ్యాలూ లభిస్తాయి. అది లేనినాడు ఏమీ ఉండదు. పుస్తెకట్టినస్త్రీకూడా ఎదురుతిరుగుతుంది అవమానిస్తుంది. డబ్బుకోసం భర్తని నానా హింసలుపెడుతుంది. నిజం విచారిస్తే నాకీ ఉద్యోగం ఎన్నోకాలాలపాటు నిలవదు. ఈ అప్పులవాళ్ళు త్వరలో కోర్టులకి ఎక్కక మానరు. వాళ్లు కోర్టులకి ఎక్కడంతోనే ఉద్యోగంకాస్తా ఊడికూర్చుంటుంది. జైలుశిక్ష ప్రాప్తిస్తుంది. దీపంఉన్నప్పుడే ఇల్లు చక్కదిద్దుకోవడం మంచిది. అందుకోసం జైలుకు వెళ్ళేముందు చేతికందినడబ్బంతా ఖర్చుపెట్టి, సర్వసుఖాలూ అనుభవిస్తాను. రాని డబ్బుకోసం ప్రయత్నిస్తాను. డబ్బు! డబ్బు! డబ్బు! నాకు డబ్బుతప్ప జీవితంలో ఇంకేమీ అక్కర్లేదు. నాకు డబ్బే సర్వస్వం—డబ్బే భార్యాపిల్లలు—డబ్బే నాకు ఆత్మీయులూబంధువులూనూ. జీవితంలో డబ్బు అందించగల సర్వసౌఖ్యాల్నీ- ప్రపంచంలో ఇంక ఏ ఒక్కసౌఖ్యమూ మిగలకండా అనుభవిస్తాను. ఆ తరువాత జైలుశిక్షకాని, మరణదండనగాని ఏది అనుభవించవల్సివచ్చినా నేను వెనుదీయను. సంతోషంగా వాటిని ఆహ్వానిస్తాను. 'అయ్యో! జీవితంలో ఫలానిసుఖాన్ని అనుభవించలేదే!' అనే విచారం నాకు అప్పుడు వుండదు. అన్నిసుఖాల్నీ చవిచూచాను, ఇంక జీవితం నాకు అందివ్వగలమాధుర్యం ఏమీ లేదనే సంతృప్తితో, ధీమాతో, గర్వంతో చివరికి మృత్యువుకైనా చిరునవ్వుతో సుస్వాగతం చెబుతాను. సంతోషంగా ఆమె కౌగిలిలో తలదాచుకుంటాను. కాని నాదగ్గర ఇంక ఆటే వ్యవధి లేదు. ఏ కొద్దిరోజులో మిగిలిఉన్నాయి. ఈ అప్పుల

వాళ్ళు నన్ను ఎంతోకాలం సర్వస్వతంత్రంగా ఉండనివ్వరు. వాళ్ళు నన్ను కోర్టులకీడ్చేడకముందే జీవితం నాకు అందించ గల జీవనమాధుర్యాన్ని నేను అడుగంటా చవిచూడాలి. ఒక్కక్షణమైనా వృథాగా కాలయాపనచేయడానికి వీలులేదు; వీలు ఉండకూడదుకూడా.'

విశ్వేశ్వరరావు ధోరణికి రుక్మిణి చకితురాలైంది. ఎప్పుడో జీవితంలో అతను తప్పటడుగు వేశాడు. సుడిగుండంలో పడ్డాడు. అప్పులసుడిగుండంనించి తేరుకోవడానికి అతనికి శక్తిలేదు. సామర్థ్యంలేదు. సుడిగుండంలో కూరుకుపోవడానికి సంసిద్ధంగా ఉన్నాడు. మునగడంతప్ప వేరే గత్యంతరంలేదని అతనికికూడా తెలుసు. ఆ నిస్సహాయస్థితిలో తనజీవితంచుట్టూ అతను ఒక మెట్టవేదాంతాన్ని అల్లుకున్నాడు. దానికి వన్నెలూ, చిన్నెలూ తీర్చిదిద్దుకున్నాడు. జీవితంలో దర్జాగా బ్రతకడం అవసరమనే దుర్భ్రమలో మొదట పడ్డాడు. దానికి తగిన సాధనసంపత్తులు లేవు. చాలీ చాలని జీతంతో దర్జాలు సాగలేదు. అప్పులు చేశాడు. అప్పులతో కోరికల్ని పెంచుకున్నాడు. ఇంద్రియసౌఖ్యాలకి లోనయ్యాడు. జీవనపరిమాణాన్ని హెచ్చించుకున్నాడు. దానిని నిలబెట్టుకోవడానికి అబద్ధాలు ఆడాడు. ఇంకా అప్పులు చేశాడు. కోరికలు తీరలేదు. అనుభవించవల్సిన సౌఖ్యాలన్నీ ఇంకా మిగిలిపోయాయే అనే బెంగపట్టుకుంది. జీవితం ఎన్నడో దుఃఖాంతం కాకతప్పదని తెలిసింది. సర్వసౌఖ్యాలకూ డబ్బే మూలమని తెలుసుకున్నాడు. జీవితంలో ఏదో అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందవలెనని అనుకున్నాడు. దానికోసం

డబ్బుఅవసరమని, జీవితంలో ధనదాహం పెంచుకున్నాడు. డబ్బుని ఆరాధించడం మొదలెట్టాడు. ధనారాధనతో జీవితంలో అన్నిఅనుబంధాలూ తెగిపోయినవి. భార్య దూరమైంది. ఆత్మీయులూ, బంధువులూ దూరమైనారు. అనుబంధాలన్నీ తెగిపోవడంతో మనిషిలో ఒక్క స్వార్థంతప్ప ఇంకేమీ మిగలలేదు. కామెర్లకళ్ళతోచూస్తే ప్రపంచమంతా పచ్చగాకనపడినట్లు స్వార్థదృష్టితోచూస్తే ప్రపంచం స్వార్థమయంగా కనపడింది. ఆలంబనలన్నీ తెగిపోగా తానూ, తను అనుభవించాల్సిన సౌఖ్యాలూ మిగిలిపోయాయి. సౌఖ్యాలు అనుభవించవల్సిన తనూ, సౌఖ్యాలను సమకూర్చగలిగిన డబ్బూ జీవితంలో ప్రాముఖ్యతవహించాయి. తనూ, డబ్బూ, సౌఖ్యం ఇదీ విషవలయం. ఈ విషవలయంనుంచి అతన్ని తప్పించడానికి అతనిముందు కొంతడబ్బు పారేస్తే? నిజమే, క్షణికంగానైనా అతనికి అప్పులనించి విముక్తి కలుగుతుంది. అప్పులనించి విముక్తికలగడంతో అతనిజీవితం చెడుమార్గంనించి మంచిమార్గంవేపు మళ్లినా మళ్ళవచ్చు. అతను తనని నిరాశ్రయురాల్నిగాచేసి, తనజీవితాన్నినడివీధినవిసిరినమాట నిజమే. తనని ఉంపుడుకత్తెకన్నా నికృష్టంగాచూస్తున్నమాట నిజమే. తనశీలాన్ని చులకనచేసి దాన్ని రామనాథంముందు బట్టబయలుగా విసరుతున్నమాటకూడా నిజమే. కాని, అతను నీచంగా ప్రవర్తిస్తే, తను నీచంగా ప్రవర్తించాలని ఎక్కడుంది? ఎవరిపాపాన వాళ్ళు పోతారు. తనుమాత్రం ఈ తరుణంలో విశ్వేశ్వరరావుకి సహాయంచేయక తప్పదని అనుకుంది రుక్మిణి. తనశీలం ఇదివరకే చెడింది. ఇప్పుడు

కొత్తగా చెడే దేముందని? ఇదివరకే తన బ్రతుకు నలుగురిలో నగుబాట్లపాలైంది. అంతకన్నా ఎక్కువ ఇప్పుడు జరిగే దేముందని?

విశ్వేశ్వరరావు కలిపినఅన్నం పక్కకుత్రోసి, లేచి చెయ్యికడుక్కున్నాడు. దుస్తులువేసుకొని ఎక్కడికో బయల్దే రుతుండగా 'ఒక్కమాట వింటారా?' అని రుక్మిణి ఎదురుగా వచ్చింది.

'ఏమిటి?' అని విశ్వేశ్వరరావు విసుగ్గా అడిగాడు.

'నా కంటె యిస్తాను. అది అమ్మేసి అప్పులుతీర్చే సెయ్యండి' అంది రుక్మిణి, ప్రాధేయపడుతున్న కంఠంతో.

'నా అప్పులముందు నీ కంటె ఏమూలకు వస్తుంది?'అని ప్రశ్నించాడు విశ్వేశ్వరరావు.

'మిగిలినడబ్బు రామనాథందగ్గర అప్పుతీసుకోండి' అంది రుక్మిణి ఒక సూచనగా.

'అంతడబ్బు అతను అప్పుయిస్తాడా ?' అన్నాడు విశ్వేశ్వరరావు, సందేహం ఉట్టిపడుతున్న కంఠంతో.

'మీరు అడుగుతే ఇవ్వకండా వుంటాడా?' అంది రుక్మిణి ఏమీ పాలుపోక.

'ఏమో? అనుమానమే!' అన్నాడు విశ్వేశ్వరరావు గొప్ప నిరాశతో.

'అడిగి చూడండి, ఇస్తే ఇస్తాడు లేకపోతే లేదు' అంది రుక్మిణి అటో ఇటో తేల్చుకోవడం మంచిదనే దృష్టితో.

అంతటితో విశ్వేశ్వరరావు కాలిసడకని ఇంటిసించి బయల్దేరివెళ్ళాడు. రాత్రి ఏ రెండుగంటలుదాటినతరువాతో

ఇంటికి వచ్చాడు. తలుపు దబదబా బాదాడు. తలుపు తెరుచుకోవడంతో షూజు వదిలించుకోవడానికి కాళ్ళు ఝాడించి, పక్కమీద పడ్డాడు. వెంటనే గుర్రుపెట్టి నిద్రపోయాడు.

రుక్మిణి యథాప్రకారం తెల్లవారుఝామున నాలుగు గంటలకు లేచి, విశ్వేశ్వరరావుని లేపింది. అతను కాలకృత్యాలు తీర్చుకునేసరికల్లా కాఫీ యిచ్చి, స్నానానికి వేడినీళ్ళు తోడింది. విశ్వేశ్వరరావు స్నానంచేసి, దుస్తులు వేసుకున్నాడు. షూజుతొడుక్కుంటున్నప్పుడు రుక్మిణి పెట్టెలోంచి కంబెతీసి విశ్వేశ్వరరావుచేతికి అందించింది. విశ్వేశ్వరరావు రుక్మిణిచేతుల్లోంచి మౌనంగా కంబె అందుకొని, సైకిల్‌తీసుకోకుండానే ఇంటినించి బయల్దేరాడు.

* * *

ఆనాటి సాయంత్రం తిరిగి రామనాథం వచ్చాడు. అతన్ని చూచీ చూడడంతోనే రుక్మిణికి శరీరంపైన తేళ్ళూ, జెర్రెలూ పాకినట్లుఅయింది. ఎందుకో కుడికన్ను అదిరింది. గుండెల్లో ఏదో దడ ప్రారంభమైంది. ఏదో భయం పట్టుకొని పీడించసాగింది. తలుపుతీసి రుక్మిణి లోపలికి వెడుతుండగా 'విశ్వేశ్వరరావు ఇంట్లో లేడా?' అని రామనాథం అడిగాడు. రుక్మిణి వినిపించుకోకుండా వంటయింట్లోకి వెళ్ళిపోయింది. తలుపుచప్పుడైనప్పుడు తలుపుతీయకుండావుంటే బాగుండేదనుకుంది. కాని, రామనాథం వచ్చాడని తన కేం తెలుసు? అమాయకంగా వెళ్ళి తలుపుతీసింది. జరిగినదానికి ఇప్పుడు పశ్చాత్తాపపడి లాభం? ఇంటికి గడ్డితలుపువుంటే బాగుండు ననిపించింది. పక్కింటికి వెళ్ళి రామనాథం ఇంట్లో ఉన్నంతసేపూ,

అక్కడ కూర్చోవడానికి వీలుఉండేది. రామనాథాన్ని చూచి తను ఇంతగా భయపడడం దేనికని వితర్కించుకుంది. ఏవో అనవసరభయాలు కల్పించుకొని బాధపడడం దేనికని, మనస్సు కుదుటపరచుకోవడానికి ప్రయత్నించింది. కాని, ఎంత ప్రయత్నించినా మనస్సుకుదుటపడలేదు. జరగరానిఅకృత్యం ఏదో జరగనుందని మెదడు పదేపదే హెచ్చరిస్తున్నది. ఈ విషమపరిస్థితుల్లోంచి ఎల్లాతప్పించుకోవడమూ అని, రుక్మిణి మనస్సు ఆరాటపడసాగింది. పక్కయింట్లోకి వెళ్ళి ఎవరి నైనా తోడుతెచ్చుకుంటే ? రామనాథం తిరిగి ఈనాడు కూడా వస్తాడని ముందుగా తెలిసివుంటే, తను ఇదివరకే ఆ పని చేసివుండేది. పోని, ఇప్పుడయినా మించిపోయిం దేమిటి ? ఇప్పుడు పోయి ఎవరినైనా తీసుకొనివస్తే ? నిజమే. తీసుకొనిరావడమే మంచిది. 'దుష్టో దూర వర్జితః'అన్నారు. ఈపాటికి పనిమనిషి వచ్చిఉంటుందా ? నాలుగే అయింది. ఇప్పుడప్పుడే ఎక్కడినించి వస్తుంది? అయిదు దాటితేగాని, అది అంట్లకోసం రాదు. పక్కింటిఆమెని పిల్చుకొనిరావడమే మంచిదని నిశ్చయించుకుంది రుక్మిణి. వెళ్ళి ఆమెని తీసు కొద్దామంటే ఎందుకో కాళ్ళు తడబడుతున్నాయి. ఇప్పుడు అధైర్యపడితే లాభంలేదని రుక్మిణి వంటింట్లోంచి తలవంచు కొని, బయల్దేరింది. అడుగులు తడబడుతూనే ఉన్నాయి. ఎందుకో శరీరం కంపించిపోతున్నది.

అదేమిటి ? ఆ వాకిలితలుపు ఎవరు వేశారు? తను గడియతీసి వంటయింట్లోకి వెళ్ళిపోయిందే ! రామనాథం వేయలేదుకదా ! అతనుతప్ప ఇంక ఎవరు వేస్తారు ? అతనే

వేసిఉంటాడని తోచడంతో రుక్మిణికి ముచ్చెమటలు పోశాయి. అయినా రుక్మిణి ఏమీలక్ష్యంచేయకుండాముందుకు సాగింది. ఒకటి... రెండు... మూడు... నాలుగు... నాలుగు అడుగుల్లో వాకిలితలుపుచేరుకోవచ్చు. గడియతీసి బయటికి గంతువేయవచ్చు. రుక్మిణి ఒకఅడుగు ముందుకు వేసింది. రెండవఅడుగు ముందుకు పడుతున్నది. ఇంతలోకే వెనకనించి ఎవరో పరుగెత్తుకొచ్చినచప్పుడు అయింది. రెండవఅడుగు పడి మూడవఅడుగు పడేలోపుగా బుజంపట్టి ఎవరో వెనక్కి లాగుతున్నట్టు అనిపించింది. రుక్మిణి కంఠంలోంచి అమాంతంగా ఒక పెద్ద కేక బయల్దేరింది. ఎవరో నోరునొక్కి ఆ కేకను గొంతులోనే అణచివేస్తున్నారు. నోరునొక్కిన చెయ్యి, ముక్కు చెలిమలకి అడ్డంగానిలిచి శ్వాసఆడకండాచేస్తున్నది. శ్వాస భారంగా వస్తున్నది. కళ్ళు తిరుగుతున్నాయి. రుక్మిణి కొంచెంసేపు ఆ బలమైన చేతులతో పోరాడింది. కాని, లాభంలేకపోయింది. శ్వాసఆడక మెదడు గిర్రున తిరిగింది. రుక్మిణి వివశమై, స్పృహతప్పి, తనని చేతులతో బంధించిన శరీరంపైన విరుచుకుపడింది... ...ఎవరో మొహంపైన నీళ్ళు చల్లుతున్నారు. కళ్ళు తెరిచిచూసేసరికల్లా తను రామనాథం తొడపైన తలపెట్టి పడుకున్నట్టు రుక్మిణికి తోచింది. దిగ్గున లేచి కూర్చోవడానికి ప్రయత్నించింది. కాని, చేతులు తిరిగి బలంగా అదిమిపెట్టి పడుకోబెట్టాయి. రుక్మిణి తిరిగి కొంతసేపు ఆ చేతులతో పెనుగులాడింది. కాని, చివరికి లాభంలేక కళ్ళు మూసుకుంది... ...ఎడమచెయ్యి తననోటిని గట్టిగా అదిమిపట్టింది. కాని, ఈసారి ముక్కుచెలిమలు మూసుకుపోలేదు.

......ఏదో బలమైన శరీరం, తనని బలవంతంగా లొంగదీస్తున్నది......రుక్మిణికి అమాంతంగా దుఃఖం పొంగుకొచ్చింది. కన్నీళ్ళు ఏకధారగా కణతలమీదుగా చెవులసందుల్లోకి ప్రవహిస్తున్నాయి...తన కన్నీళ్లు తాను తుడుచుకోలేని దుస్థితిలో రుక్మిణి మరీ వెక్కి వెక్కి ఏడ్చింది...

ఆ సాయంత్రం పనిమనిషి రాలేదు.

ఆ రాత్రి విశ్వేశ్వరరావుకూడా ఇంటికి తిరిగిరాలేదు. తలుపు గడియవేసిలేదు. ఊరికే వేసిఉంది....ఆయింటికి ఆరాత్రి వాకిలితలుపు గడియవేసేనాథుడు లేడు...తలుపు రెక్కలు జోడించి లేవు—ఓరగా వేసిఉన్నాయి.

# 8

వేంకటరామయ్య ఒకరోజుమధ్యాహ్నం పడుకుంటే పైన ఒకచనిపోయినపాము ఫీలుఖానాలోని ఇంటికప్పులోంచి పడింది. పైన ఏదో పడడంతోనే వేంకటరామయ్యకు మెలకువవచ్చింది. లేచి ఉత్తరీయం దులుపుతే పక్కపైన పాము పడిఉండడం కనపడింది. పాము అంతపెద్దది కాదు. మూరెడు కన్నా తక్కువవుంది. గద్దఏదైనా చనిపోయినపామును ఇంటి కప్పుపైన పడేసివుంటుంది తాముంటున్నది పెంకుటిల్లు. పెంకు టెంట్లోంచి జారి కిందపడివుంటుందని అనుకున్నాడు వేంకటరామయ్య. ఎందుకో మనస్సు కలుక్కుమంది. చనిపోయిన పాము శరీరంపైన పడటం అనర్థదాయకమని తోచింది. ఇటీవలనే దేవీనవరాత్రులప్పుడు అఖండజ్యోతి ఆరిపోయింది. ఆ సంఘటన మనస్సులో మెరమెరలాడుతూనే వుంది. గోరు

చుట్టుపై రొకటిపోటన్నట్టు ఇప్పుడు ఇంకొకసంఘటన జరిగింది. 'ఒకదానితరువాత ఇంకొకటిగా కలుగుతున్న ఈదుశ్శకునాలకి కారణం ఏమిటా ?' అని మనస్సు పరిపరివిధాలపోయింది. తమఇంట్లో 'బాల' ప్రత్యక్షదైవం - దీపంఆరిపోయినప్పుడల్లా తమకుటుంబంలో ఎవరోఒకరు చనిపోవడం కద్దు. తనతండ్రి చనిపోయినసంవత్సరంలో అఖండజ్యోతి ఆరిపోయింది. తనతాత చనిపోయినప్పుడుకూడా అఖండజ్యోతి ఆరిపోయిం దట !

తమఇంట్లో దసరానవరాత్రులకి పదిరోజులూ అఖండ జ్యోతి వెలుగుతుంది. పదవనాడు దేవికి ఉద్వాసనచెప్పికాని దీపాన్ని కదిలించరు. దేవిని ఆహ్వానించి ఉద్వాసన చెప్పే వరకూ దేవిదగ్గర దీపం వెలుగుతుండాల్సిందే. తను ఆ పది రోజులూ భోజనంచెయ్యడు. ప్రదోషపూజ చేసి, ఒకగ్లాసు పాలు తాగి, రెండుఅరటిపండ్లుమాత్రం తింటాడు. ఎందుకో ఆరోజుల్లో అసలు ఆకలేవేయదు. అమ్మవారిని చూస్తో కూచుంటే కడుపునిండినట్లువుంటుంది. మొదటిరోజున స్నానం చేసి, దీక్షావస్త్రాలు ధరించినప్పటినించీ పదిరోజులవరకూ తను పూజాగృహాన్నిదాటి వెళ్ళడు. రాత్రిళ్ళుకూడా మడితో తను పూజాగృహంలోనే పడుకుంటాడు. మడికట్టుకోనిది పూజాగృహంలోకి ఎవ్వరూ రారు. ఆ పదిరోజులూ తను పలికినమాట వేదవాక్యంలా జరిగితీరుతుందని అందరూ అనడం కద్దు. అందువల్ల తను ఎవ్వరితోనూ మాట్లాడడు. మౌన వ్రతంతో కాలంగడుపుతాడు. ఆపదిరోజులూ తనకు రాత్రిళ్లు నిద్రకూడా సరిగ్గా పట్టదు. ఏదో కాస్త కునుకుపడితే, ఎవరో

చిన్నపిల్ల వచ్చి తనని తట్టి లేపినట్లు తోస్తుంది. లేచి చూస్తే ఏమీ వుండదు. పూజాగృహమంతా ఏదో అద్వితీయమైన వెలుగుతో నిండిపోతుంది. ఆవెలుగు సూర్యరశ్మిలాగా జిగేలు మనదు. సన్నని చంద్రకిరణంలా ప్రశాంతతని వెదజల్లుతుంది. హృదయాన్ని నందనవనంలా వికసింపజేస్తుంది. ఏదో అనిర్వచనీయమైన అలౌకిక ఆనందాన్ని సమకూరుస్తుంది, అంతే! ఆ తరువాత కొంతకాలానికి చంద్రకిరణం జారిపోతుంది. తిరిగి వాస్తవికప్రపంచం కళ్ళెదుట నిలుస్తుంది..

ఈసారి జ్యోతిఆరిపోయినప్పుడు ఎవరో తనని చెంప మీద ఛెళ్ళునకొట్టి, నిద్రలేపారు. ఆదరాబాదరాలేచి చూసే సరికల్లా జ్యోతిఆరిపోయివుంది. కాగా, వత్తి కొడిగట్టి ఎర్రగా చీకట్లో మెరుస్తున్నది. తను అగ్గిపుల్లగీచి వత్తి వెలిగించాడు. దీపం వెలిగింది. కాని, కాసేపటికి దీపం క్రమంగా పెద్దది కావడం మొదలెట్టింది. జ్యోతి క్రమశః పూజాగృహమంతా వ్యాపించింది. ఆ జ్యోతిలో తనకి ఒకబాల కనపడింది. తన చిన్ని చేతులతో, తనని ఎక్కడికో రమ్మని పిలుస్తున్నది. తన కళ్లు మిరుమిట్లు చెందాయి. కళ్ళునులుపుకొని చూస్తే ఏమీ లేదు. దీపం మామూలుగా వెలుగుతున్నది. ఆనాడే తనకు తెలిసింది—తను ఇంక అట్టేకాలం బ్రతకనని; మహా గడిస్తే ఒకఆరునెల్లు గడవవచ్చునని; అంతకుమించితే పదకొండునెల్ల వరకు వెళ్ళవచ్చునని. కాని, సంవత్సరంమాత్రం దాటదు. తిరిగి దేవీనవరాత్రులు చూడడం దుర్లభం. ఇట్టిపరిస్థితుల్లో పైనించి పాముపడింది. ఈ సంఘటన తనమృత్యువుని త్వరపెట్టడంలేదుకదా! దీనిఅంతరార్థం ఇంతకన్నా ఏమై ఉంటుంది?

ఇతరమేమీ కాజాలదని తోచింది. గడువు దగ్గరపడింది. ఈరోజు నవమి. సరిగా ఒక నెలరోజులక్రితం ఈ నవమినాడే జ్యోతి ఆరిపోయింది. తిరిగి నవమినాటికి పైన చనిపోయిన పాము పడింది. ఈతిథులకీ తన మృత్యువుకీ ఏదైనా సన్నిహిత సంబంధం ఉందా ? తప్పక ఉండేవుంటుంది. నెలరోజులు దాటదా ? దాటినట్లే తోస్తుంది. మృత్యువువిషయంలో అంత నిక్కచ్చిగా ఎవరు తేల్చిచెప్పగలరు ? ఇంతవరకు రెండుసార్లు హెచ్చరికలు లభించాయి. మూడవహెచ్చరిక ఏదైనా వుందా ? ఉండకపోవచ్చు. మూడవహెచ్చరిక ఇంక మృత్యువే. నెలరోజులు దాటినా, రెండునెల్లకు మించదు. జ్యోతి ఆరిపోయినప్పుడల్లా, తమవంశంలో గృహయజమాని మరణించడమే జరుగుతున్నది. ఈసారి దానికి భిన్నంగా ఎందుకు జరుగుతుంది ? జరగడానికి వీలులేదు. తను చని పోవడమే తథ్యం. అదీ ఒకటి రెండునెల్లలోపుగానే.

ఏఉద్దేశంతో తాను పట్నం వచ్చాడో ఆ ఆశయం నెరవేరకండానే తాను మరణించడం వేంకటరామయ్యకి ఎంతో విచారకరంగా తోచింది. కాని, విధిలిఖితాన్ని ఎవరు తప్పించుకోగలరు ? భోనగిరితాలూకాలోని ఆ కుగ్రామంలో పడివుంటే- రఘుకి ఈ నాలుగుఅక్షరాలైనా వచ్చివుండేవి కావు. అందరుపిల్లలకిమల్లేనే పశువులుకాస్తోనో లేక ఏవ్యవ సాయంచేస్తోనో ఆ కుగ్రామంలో పడివుండేవాడు. మహా చదువుచెప్పిస్తే తను తెనుగూ, సంస్కృతంలో పంచకా వ్యాలవరకు చెప్పించివుండేవాడు. చుట్టుపక్కల మంచి సంస్కృతపండితులు ఎవరూ లేరు. అందువల్ల అదీ జరగక

పోయి ఉండేదేమో! ఇంక మిగిలితే తాను చెప్పాల్సివచ్చేది. కాని ఏ తండ్రి ఏ కొడుక్కి సవ్యంగా చదువుచెప్పగలిగాడు కనక? తను చదువుచెప్పడం. రఘు నేర్చుకోవడం మొత్తాని జరిగివుండేది కాదు. కాగా ఆ విద్యలతో, రఘుకి భుక్తి అయినా గడుస్తుందా అనే అనుమానంవేసింది తనకు ఆరో జుల్లో. అప్పట్లో గడవదనే తోచింది. కాలం మారింది. ఎక్కడచూచినా ఇంతకలిగినవాళ్ళు తమపిల్లలకి ఉర్దూఫార్సీలు చెప్పించడం, అప్పట్లో తను కళ్ళారా చూచాడు. అందువల్ల రఘుకి తెనుగూ, సంస్కృతాలు చెప్పించడానికి తనమనస్సు ఒప్పలేదు. ఉర్దూ, ఫార్సీలకోసం మౌల్వీని వెతికితే ఆ చుట్టుపక్కల్లో ఎవ్వరూ కనుపించలేదు. అప్పట్లో రఘుకి చాలా చిన్నతనం. మహావుంటే ఆరేళ్ళుఉంటాయి. ఒకరోజు ఏమీతోచక 'నీవు పెద్దవాడివైనతరువాత ఏమవుతావురా?' అని నవ్వుతాలకి అంటే-రఘు 'సదర్ ఆజం (ప్రధాని) అవుతా' నని సమాధానంచెప్పాడు. ఆ మాట, ఎక్కడ ఏసందర్భంలో విన్నాడో తెలియదు. రఘు పలికిన ఆ వాక్యం విని తనకు ఆశ్చర్యంవేసింది. 'సదర్ ఆజం కాకపోయినా చివరికి తాలూకదార్ (కలెక్టర్) అయినా కాకపోతాడా?' అని అనుకున్నాడు తను అప్పట్లో. కాని, ఆ కుగ్రామంలో పడి వుంటే, నిజంగా వాడిలో ఆ ప్రతిభే ఉంటే, రఘు తాలూ క్దార్ ఎల్లా అవుతా డనే సందేహం తనకు కలిగింది.

దానితో ఆ కుగ్రామం వదిలిపెట్టి పట్నంవెళ్ళిపోవా లనేవాంఛ కలిగింది తనకు. పట్నానికి సమీపంలో ఆరుమైళ్ళ దూరాన తన అత్తవారు ఉన్నారు. పట్నంలో ఏ కారణాన

అయినా వుండలేకపోతే ప్రేమావతీపేటలో వుండవచ్చుననే ధైర్యం కలిగింది. తనకు పౌరోహిత్యం వచ్చు కాగా వైద్యం కూడా బాగా వచ్చు. పట్నంలో వైద్యంనడవకపోతే పౌరోహిత్యంచేసుకొనిఅయినా, పిల్లవాడికి నాలుగు అక్షరాలు చెప్పించుకోవచ్చుననీ, పిల్లకి మంచిసంబంధం చూచుకోవచ్చుననీ తను సాహసించి భోనగిరిలోని కుగ్రామంనించి ప్రేమావతీపేటకు వచ్చేశాడు. అప్పట్లో ప్రేమావతీపేటనించి నగరానికి వెళ్ళడానికి బస్సులు లేవు. కాలినడకని తను ప్రేమావతీపేటనించి పట్నానికి వరుసగా అయిదారురోజులపాటు వెళ్ళి ఫీలుఖానాలో పౌరోహిత్యం కుదుర్చుకున్నాడు. ఫీలుఖానాలో స్థిరనివాసం ఏర్పరుచుకొని, రఘుని బళ్ళోచేర్పించారు. రఘు క్రమంగా ఒకక్లాసు తరువాత ఇంకొకక్లాసు నెగ్గుతూ పైకి వస్తున్నాడు. ఇంకొక సంవత్సరంలో బి. ఏ. అవుతాడు. తను కూతురు రామలక్ష్మిపెళ్ళికూడా చేసేశాడు. అమ్మాయి అత్తవారియింట్లో సుఖంగా సంసారంచేస్తున్నది. అమ్మాయి విషయంలో తనకు ఏమీ బెంగలేదు. ఎటొచ్చీ రఘువిషయంలోనే తనకు ఒకలంగరు అందలేదు. వాడు బి. ఏ. ప్యాసు అయి ఏదో ఒకఉద్యోగంలో చేరితే తనకు మనస్సు కుదుటపడేది. వాడు ఉద్యోగంలో చేరితే ఎవరో ఒకరు వాడికి పిల్లనివ్వకపోరు. ఏదోవిధంగా వాడు సంసారం గడుపుకోలేకపోడు. కాని రఘువిషయంలో తనఆశయం నెరవేరనందుకు వేంకటరామయ్యకి ఎంతో విచారంవేసింది. కాని తాను ఏమిచేయగడని? విధినిర్ణయం ఒకతీరుగావుంటే ఇంకొకతీరుగా ఎల్లా జరుగుతుందని? ఎవరిభవిష్యత్తుకి ఎవరుకర్తలు?

వేంకటరామయ్య హృదయభారంతో లేచాడు. బట్టలు ఎండవేసే కర్రతో పామునితీసుకెళ్ళి చెత్తకుండీలో పారేశాడు. రఘు ఇంట్లో లేడు. వరలక్ష్మి పడుకొనివుంది. పాముని ఎవ్వరూ చూడలేదు. తనుకూడా పామువిషయం ఎవ్వరికీ చెప్పదలచుకోలేదు. పడుకున్న జంపుఖానా పైపు కిందపెట్టి తడిపాడు. తలకింద పెట్టుకున్న ఉత్తరీయం, పైనకప్పుకున్న ఉత్తరీయం తడిపాడు. వేంకటరామయ్య స్నానంచేసి పొడివస్త్రాలు ధరించాడు. వరలక్ష్మి వేంకటరామయ్య స్నానంచేస్తున్నప్పుడుకూడా లేవలేదు. అందువల్ల అతను ఆ మధ్యాహ్నం స్నానంచేసినసంగతి ఎవ్వరికీ తెలియదు.

అనుమానమంటూ కలగనే కూడదు. ఒకమాటు కలిగిందంటే అది హృదయాన్ని పట్టిపీడిస్తుంది. మనశ్శాంతి లేకండాచేస్తుంది. జరుగుతున్న ప్రతిసంఘటనకీ అంతరార్థాన్ని వెతికి దానిని పూర్వపు సంఘటనలతో సమన్వయపరిచి, భవిష్యత్తుని మరీ భయాకరంగా చిత్రిస్తుంది. రోజులు గడిచినకొద్దీ వివిధసంఘటనలద్వారా ఆ అనుమానం మరీ బలపడుతుందేకాని, తొలగిపోవడం మాత్రం ఎన్నడూ జరగలేదు. జ్యోతిఆరిపోయి మృత్యువు ఆసన్నమైందని సూచిస్తే, పైన చనిపోయినపాము పడి ఆ మృత్యువుకు అతన్ని మరీ సన్నిహితంచేసింది. దానితో వేంకటరామయ్యకు జీవితంలో ఒకవిధమైన అధైర్యం కలిగింది. మృత్యువు అంటే అతనికి భయమని కాదు. తాను జీవితంలో తలపెట్టినకార్యం జరుగలేదే అని ఒకబెంగ. రఘు ఇంకా ఒకయింటివాడు కాలేదు. చదువుకూడా పూర్తి కాలేదు. ఇట్టిపరిస్థితుల్లో తాను చనిపోతే

రఘుగతేమికానూ అనేవిచారం అతన్నిపీడించసాగింది. జరిగిన రెండు దుశ్శకునాలనీ గురించి అతను ఇంతవరకు భార్యతో గాని కుమారునితో గాని పల్లెత్తుమాట అనలేదు. చెప్పకూడదని ఎంత గుండెనిబ్బరంచేసుకున్నా ఆ దుశ్శకునాలని గూర్చి పరోక్షంగా వాళ్ళతో ప్రస్తావించకుండా ఉండలేక పోయినాడు.

'ఈ నెలరోజులు సుఖంగా గడిచిపోతే ఎంత బాగుంటుంది?' అన్నాడు వేంకటరామయ్య రాత్రిభోజనాలదగ్గర.

'గడిచిపోక ఏం చేస్తుంది? కాలం మనకోసం ఆగుతుందా నాన్నా?' అన్నాడు రఘు అమాయికంగా.

'కాలం మనకోసం ఆగనిమాట నిజమే కాని, మనగ్రహచారం బాగాలేదు. ఈ నెలరోజుల్లో మనింట్లో ఏమైనా జరగవచ్చు' అన్నాడు వేంకటరామయ్య సాలోచనగా.

'ఏమిటో నాన్నా నువ్వనేది నాకేమీ బోధపడలేదు' అన్నాడు రఘు విసుగ్గా.

'అదికాదురా! మనయింట్లో మృత్యువేదైనా సంభవిస్తే సంభవించవచ్చు' అన్నాడు వేంకటరామయ్య కుండబద్దలుకొట్టినట్లు.

'తీరిగ్గాకూర్చుని అర్ధరాత్రి ఏమి టామాటలు? శుభం కోరరా పెండ్లికొడకా అంటే, ఐకేణికుండ పగరె అన్నట్లుంది మీధోరణి' అంది వరలక్ష్మి వేంకటరామయ్యపైన విరుచుకుపడుతూ.

'ప్రస్తుతానికి అందరం బాగానేవున్నాం. అదే మనకు పదివేలు. ఎప్పటివిషయాన్నిగూర్చి అప్పుడు ఆలోచించడం

మంచిది. అంతేకాని, రేపటి విషయాన్నిగూర్చి నేడు ఆలో చించడం దేనికి, నాన్నా?' అన్నాడు రఘు చర్చనీయాంశాన్ని పక్కకి తప్పించేస్తో.

'అవును, నిజమే. భవిష్యత్తుకు మనం ఎన్నడూ కర్తలం కాము. అల్లాంటప్పుడు మనం భవిష్యత్తునిగూర్చి ఆలోచించిమాత్రం ఏం లాభం' అన్నాడు వేంకటరామయ్య, తన అనుమానాన్ని తనహృదయంలోనే పదిలపరచుకుంటూ.

రఘు అప్పటికిమట్టుకు, తండ్రి కేదో సమాధానం చెప్పాడేకాని, తండ్రిమాటలు అతని హృదయంలో మెరమెరలాడుతూనే ఉన్నాయి తండ్రి ఏది పలికినా అది తప్పక జరిగితీరుతుందని అతనికి బాగా తెలుసు. కాగా తనతండ్రి భవిష్యత్తునిగూర్చి ఆవిధంగా అప్పుడప్పుడు జోస్యంచెప్పడం కూడా కద్దు. అతనుచెప్పినజోస్యాలన్నీ తు. చ. తప్పకండా లోగడ జరిగిఉండడంవల్లనే, ప్రస్తుతం రఘుకి గొప్పఆందోళన పట్టుకుంది. సహేతుకంగా తరచిచూస్తే ఆ జోస్యాల్ని విశ్వసించడానికిగల కారణమేమీ అతనికి కనపడలేదు. కాకతాళీయన్యాయంగా తండ్రి లోగడ పలికిన మాటలన్నీ నిజమైనాయి. అంతటితో హేతువాదాన్ని వదిలి అంధవిశ్వాసానికి గురికావడానికి అతనిమనస్సు ఒప్పుకోలేదు. తండ్రిలో గల ఏదో విశిష్టత తనలో కొరవడినట్లు అతనికి తోచింది. తన కుటుంబానికి ఏదో విపత్తు సంభవించనున్నదని విశ్వసించి కూడా, తనతండ్రి తొణకనికుండలాగా గంభీరంగా వున్నాడు. తనకు అటువంటివిశ్వాసం ఏమీ లేదు. తండ్రిమాటలవల్ల తనకు ఏదో లీలగా అనుమానంమాత్రం కలిగినమాట నిజమే.

కాని, ఆ కించిత్ అనుమానానికి తను ఇంతగా ఆందోళన చెందడం దేనికి? నిజం విచారిస్తే, ఆ అనుమానానికికూడా తనదగ్గర సకారణమైన హేతువు లేదు. ఇటువంటిపరిస్థితుల్లో రఘుకి సంప్రదాయంపైన ప్రబలవిశ్వాసంగల తనతండ్రికీ, దేనిపై నాకూడా విశ్వాసంలేని తనకీ ఎంతో వ్యత్యాసంకనపడింది. కొద్దిగా విచారంగావున్నా అతను ఏమీఆందోళన చెందడం లేదు. కాని, తనో? ఆందోళనతో గిజగిజ తన్నుకొని చస్తున్నాడు. జీవితపువిలువలు సమగ్రంగా అర్థమై, తనతండ్రికి ఆ ప్రశాంతత వచ్చిందా? లేక తనకీ తనతండ్రికీ మౌలికంగానే భేదంవుందా? అతనికి మతమూ, సంప్రదాయం పైన విశ్వాసం వుంది. తనకు వాటిపైన ఏమాత్రం నమ్మకంలేదు. ఆ విశ్వాసమే తనని ఒక విభిన్నవ్యక్తిగా మార్చిందా? అనువంశికంగా సంక్రమించవలసిన విశ్వాసానికి విదూరుడై ఆధునికవ్యక్తి, జీవితంలో ఏఆధారమూ లేకుండా, గాలిలోఎగురుతున్నాడా? పాతవిలువల్ని త్యజించి కొత్తవిలువల్ని వాటిస్థానే స్థాపించుకోలేక ఒక యుగసంధిలో బలంగా చిక్కుకొని ఆధునికమానవుడు గిజగిజ తన్నుకుంటున్నాడా? ఏమో?... ...?... అంతా అయోమయం... ... ...

ఒకనాటిఉదయం పదకొండుగంటలకు వేంకటరామయ్యా పార్థివంచేసుకుంటుండగా పక్కన ప్లేగుఎలుక పడింది. ఎలుక తెల్లగా వుంది. పడీపడడంతోనే అది ఒకసారి చుట్టూ తిరిగి చనిపోయింది. వరలక్ష్మి వంటచేస్తున్నదల్లా, 'ఎలుక, ఎలుక' అని గట్టిగా అరిచింది. వేంకటరామయ్యా వెంటనే పార్థివంకట్టిపెట్టి, మడితోనే ఎలుకను తీసివేశాడు.

పెరట్లో కిరసనాయిల్ పోసి, దానికి నిప్పంటించాడు. తిరిగివచ్చి వంటయిల్లంతా కిరసనాయిల్‌తో శుభ్రపరిచాడు. చేసిన వంట అవతలపడేసి, వరలక్ష్మి తిరిగి స్నానంచేసి వంటప్రారంభించింది. వేంకటరామయ్యకూడా స్నానంచేసి తిరిగి దేవతార్చనచేశాడు. ఆనాడువంటఅయ్యేసరికి ఒంటిగంటదాటింది. మరుసటిరోజున వేంకటరామయ్య మధ్యాహ్నం కొంచెం సేపు కునుకుతీశాడు. నాలుగుగంటలకి లేచేసరికల్లా ఏదో జ్వరమొచ్చినట్లు తోచింది. గజ్జల్లో ఏదో నొప్పి. భార్యని పిలిచి 'కాస్త టీ కాచ' మని చెప్పాడు. పక్కమీదినించి లేచి, కాళ్ళూచేతులూ కడుక్కోవడానికి పెరట్లోకి వెడదా మనుకుంటే కాస్త వళ్ళు తూలింది. ఎందుకో ఎడంకాలు భూమి మైన ఆనడంలేదు. కాలు ఒకటేపనిగా గుంజుతున్నది. గజ్జల్లో పోటు. గజ్జలు తడిమిచూసుకుంటే, కురుపుమోస్తరు ఏమీ కనపడలేదు. కాలు ఝాడించి వేస్తో, పెరట్లోకి వెళ్ళి వేంకటరామయ్య కాళ్ళూచేతులూ కడుక్కున్నాడు. ఇంట్లోకి తిరిగివస్తుంటగా, వీపులోంచి చలి ప్రారంభమైంది. ఏదో విధంగా ఇంట్లోకివెళ్ళి, వేంకటరామయ్య తిరిగి పక్కమీద పడుకొని ఉత్తరీయం కప్పుకున్నాడు. చలి ఆగలేదు. భార్యని పిలిచి, పచ్చడం కప్పమన్నాడు. వరలక్ష్మి ఎందుకనిఅడిగితే, కాస్త చలిగావుందని సమాధానంచెప్పాడు. పచ్చడానికికూడా చలి ఆగలేదు. గొంగడికప్పించుకున్నాడు. గొంగడి కప్పుతూ వరలక్ష్మి శరీరంతాకిచూసింది. వళ్ళు సలసల కాగిపోతున్నది. వరలక్ష్మిగుండెల్లో రాయిపడ్డట్లు అయింది. నిన్న యింట్లో ప్లేగుఎలుక పడింది. నేడు తన భర్తకి జ్వరంవచ్చింది. కొంప

తీసి ప్లేగుకాదుకదా? ఏమో? ఎవరు చెప్పగలరు? ఆమెకు కళ్ళల్లో అమాంతంగా నీళ్ళునిండాయి. గొంగడికప్పుతూ వంగి వేంకటరామయ్యశరీరం తాకి చూస్తున్నప్పుడు గొంగడి కొస వరలక్ష్మినొసటికి వరుసుకుపోయి బొట్టు చెరిగిపోయింది. వరలక్ష్మి ఆ విషయంగమనించలేదు. కాని, వేంకటరామయ్య గజగజవణికిపోతూ, వరలక్ష్మినొసటిబొట్టు చెరిగిపోవడం కళ్ళారా చూచాడు. ఇంక తాను, మహాఎక్కువైతే ఒకటి రెండు రోజులకన్న ఎక్కువకాలం బ్రతకనని నిరాశచెందాడు. వరలక్ష్మి గొంగడిమీదినించి వేంకటరామయ్య శరీరంపైన ఎడమచెయ్యి చుట్టి, బొటబొట కన్నీరుకారుస్తూ 'డాక్టర్ని పిలిపించమంటారా?' అని అడిగింది. 'వద్దు, ఈ జ్వరం ఏవిధంగా పరిణమిస్తుందో చెప్పడం కష్టం' అని వేంకట రామయ్య సమాధానం చెప్పాడు. 'జ్వరం ఏవిధంగా పరిణ మిస్తుందో' అని వేంకటరామయ్య అనడంలోగల ఇంగితాన్ని వరలక్ష్మి గ్రహించింది. తన భర్తకూడా ప్లేగే అని అను మానపడుతున్నట్లు విస్పష్టపడింది. ప్లేగేఅయి, డాక్టర్ని పిలిపిస్తే, ఎక్కడో ఐసొలేషన్‌హాస్పిటల్‌లో వుంచి తన భర్తని తనకి కానివ్వకండా చేస్తారని తోచింది. 'ప్రేమావతీ పేటకి వెడుదామా?' అని అడిగింది.

'రఘు కాలేజినించి వస్తే, ఒక టాంగా తెప్పించుకు వెళ్ళిపోదా' మన్నాడు వేంకటరామయ్య. వరలక్ష్మి లేచి, రఘుగదిలోకి వెళ్ళింది. రఘు అప్పుడే కాలేజీనించి వచ్చి బట్టలు విప్పుతున్నాడు. వెళ్ళివెళ్ళడంతోనే 'ప్రేమావతీపేటకు ఒక టాంగా మాట్లాడుకొనిరా' అని వరలక్ష్మి కొడుకుతో

చెప్పింది. తల్లిబొట్టు చెరిగివుండడం, కళ్ళల్లో నీళ్లు తిరిగివుండడం చూచి, రఘుకి గుండె ఝల్లుమన్నది. టాంగా ఎందుకని అడగడానికి అతనికి నోరురాలేదు. వెంటనే అతను తనగదిలో నించి తండ్రిగదిలోకి వెళ్ళాడు. తండ్రి గొంగడికప్పుకొని పడుకొని ఉన్నాడు. దగ్గిరికివెళ్ళి పక్కలోకూర్చొని 'ఏం, నాన్నా! పడుకున్నావు? వంట్లో బాగాలేదా?' అని అడుగుతూ శరీరం తాకిచూచాడు. శరీరం సలసల కాగుతున్నది. రఘుకి క్రితంరోజున యింట్లో ప్లేగుఎలుక పడినట్లు తెలియదు. ఎవ్వరూ అతనితో ఆ సంగతి చెప్పలేదుకూడా. 'అకారణంగా తండ్రికి ఎందుకు జ్వరమొచ్చిందా?' అనుకున్నాడు. 'ఏదో కొద్దిగా జ్వరమొచ్చింది. ఇక్కడ ఉండడం నాకు నచ్చలేదు. వెళ్ళి టాంగా తీసుకురా. ప్రేమావతీపేటకి వెడదాం' అన్నాడు వేంకటరామయ్య. రఘుమారుమాటాడకండా వెళ్లి టాంగాకుబదులు జట్కా తీసుకొచ్చాడు. తల్లిసహాయంతో, తండ్రిని నెమ్మదిగా నడిపించుకొనివెళ్ళి, జట్కా ఎక్కించాడు. తల్లికూడా జట్కా ఎక్కింది. తను ఎక్కబోతుండగా 'నీవు సైకిల్పైన రమ్మ'ని తండ్రి చెప్పాడు. ఎందుకని అడిగితే, 'నీవు వస్తూవస్తూ ఒకరూపాయి బత్తాయిపళ్ళు కొనుక్కొని రమ్మ'ని చెప్పాడు. జట్కా కదిలింది. రఘు ఇంట్లోకి వెళ్ళి సైకిల్ వెలుపలికి తీశాడు.

దారిలో కొందరుస్నేహితులు కనపడడంమూలాన, బత్తాయిపళ్లు కొని సైకిల్పైన ప్రేమావతీపేటకు వెళ్ళేసరికి రాత్రి ఎనిమిదిగంటలు దాటింది. తీసుకెళ్ళిన పళ్ళు తల్లికిచ్చి రఘు తండ్రిపడుకున్న గదిలోకి వెడుతుంటే 'ఇప్పుడే కునుకు

పట్టింది. ఇప్పుడప్పుడే ఎందుకు లేపుతావు?' అని తల్లి వారించింది. రఘు ఆ రాత్రికి ఇంక తండ్రిని చూడలేదు. అలసివుండడంవల్ల భోజనంచేసి నిద్రపోయినాడు — తెల్లవారి లేచేసరికల్లా ఎనిమిది దాటింది. కాలకృత్యాలు తీర్చుకొని, టీతాగి రఘు తండ్రిగదిలోకి వెళ్ళాడు. 'ఎల్లావుంది నాన్నా?' అని అడుగుతూ పక్కలో కూర్చోబోయాడు. 'ఈరోజు కొంచెం నెమ్మది. వుంది' అని సమాధానంచెప్పి 'ఎనిమిది దాటినట్టుంది. ఇంకా కూచుంటావేఁ? కాలేజీకి టైంకాలేదా?' అని అడిగాడు వేంకటరామయ్య. 'ఏమో, నాన్నా! ఈరోజు కాలేజీకి వెళ్ళడానికి మనస్సు ఒప్పడంలేదు' అన్నాడు రఘు. 'కాస్త జ్వరమొస్తే అల్లా దిగాలుపడిపోతారా?' అని, కొంచెం ఆగి 'ఎవరైనా ఈకాస్త జ్వరానికి కాలేజీ మానుకుంటారా?' అని హెచ్చరికచేశాడు. తండ్రిధోరణి తనని అక్కడినించి తరిమివేస్తున్నట్లు తోచింది రఘుకి. విధిలేక అక్కడినించి లేచాడు. స్నానంచేసి, భోజనం చేశాడు. కాలేజీకి వెడుతో తండ్రిపడుకున్న మిద్దెగదిలోకి వెళ్ళి 'నేను వెడుతున్నా నాన్నా!' అని తండ్రినుద్దేశించి అన్నాడు. 'త్వరగా వెళ్ళు. ఇప్పటికే ఆలస్యమైనట్లుంది. సాయంత్రంమాత్రం కొంచెంత్వరగా రా' అని వేంకటరామయ్య సమాధానం చెప్పాడు. అంతటితో రఘు కాలేజీకి బయలుదేరాడు.

సాయంత్రం రఘు ప్రేమావతీపేటకి తిరిగివచ్చేసరికి ఇంటిముందర జనం మూగిఉన్నారు. కొనవాకిలిలో పిడకల తంపటి రాజుతూ వుంది. వాకిలిలో పిడకలతంపటి చూచే

వరకు రఘు గుండె ఝల్లుమన్నది. వాకిట్లో సైకిల్ పడేసి, గబగబా లోపలికి పరుగెత్తాడు. తనని చూడడంతోనే, ఇంట్లోఅంతా ఒకేసారి గొల్లుమన్నారు. 'మనకొంప కూలింది, నాయనా' అని జిజియాబాయి గొల్లున ఏడ్చింది. తల్లి వర లక్ష్మిని నలుగురుచుట్టి, ఉపశమనవాక్యాలు పలుకుతున్నారు. 'మీకొడుకు వచ్చాడు. ఏమి చెబుతారో చెప్పండి-నాతో మాట్లాడకపోయినా సరే - వాడితోనైనా మాట్లాడండి' అని గట్టిగా ఏడుస్తూ, వరిగడ్డిమీద పడుకోబెట్టబడి, నిండా ఉత్తరీయం కప్పబడి వున్న శరీరంపైన పడింది. దానితో రఘుకి పైప్రాణాలు పైననే ఎగిరిపోయినాయి. 'నాన్నా' అని గొల్లుమంటూ కుప్పగా కూలాడు. జిజియాబాయి వచ్చి, రఘుని పట్టుకుంది. ఆమెని పక్కకుతోసి, రఘు మృతకళేబ రముపై కప్పబడిన ఉత్తరీయం లాగాడు. వేంకటరామయ్య ప్రశాంతంగా నిద్రపోయినట్లు కనపడ్డాడు. ఎందుకో రఘుకి వేంకటరామయ్య చనిపోయినాడని నమ్మకం కుదరలేదు. 'నాన్నా, నాన్నా!' అని మృతకళేబరాన్ని కుదించాడు. చలనంలేదు. ఏమాత్రం కదలిక లేదు. 'ఇం కెక్కడి నాన్న బాబూ?' అంటూ జిజియాబాయి రఘుని పక్కకి లాగింది. ఏడుస్తూ ఎవ్వరో మొహంపైన నిండా ఉత్తరీయం కప్పారు. 'అమ్మమ్మా!' అని రఘు జిజియాబాయిని గట్టిగా కావ లించుకొని ఏడ్చాడు. చుట్టూమూగిన నలుగురూ, ఎవరికి తోచిన ఉపశమనవాక్యాలు వారు పలకడం మొదలెట్టారు. తండ్రి చనిపోయినాడని రఘు, ఇంకా నమ్మలేకపోతున్నాడు. కళ్ళముందు అంతా ఏదోకట్టుకథగా జరిగిపోతున్నది. 'ఇంక

ఎంతసేపని అల్లా కూర్చుంటారు? అప్పుడే చీకటిపడుతున్న' దని ఎవరో తొందరపెడుతున్నారు.

'ఆ భార్యనీ పిల్లవాడినీ పట్టుకోండి. కూర్చుంటే పను లవుతాయా?' అని ఎవ్వరో అంటున్నారు. 'పట్టండి, పట్టండి' అని కేకలు. మృతకళేబరంపైన విరుచుకుపడి, ఏకధారగా ఏడుస్తోన్న వరలక్ష్మిని ఎవరో ఇద్దరు ఆడవాళ్ళు పట్టి విడ దీశారు. 'ఇదేమిటి? అన్యాయం. నాకు నాభర్తని కాకుండా చేస్తారా?' అని వరలక్ష్మి ఏడుస్తున్నది. నలుగురు పట్టి మృత కళేబరాన్ని వెలుపలికి తీసుకువెళ్ళారు. తనగుండెను రెండు ముక్కలుగా నరికి, ఒకముక్కని ఎవరో వెలుపలికి తీసుకెళ్ళి నట్లైంది రఘుకి. తనూ మృతకళేబరాన్ని అనుసరించాడు. మృతకళేబరంపైన, తంపటిపైనకాగిన నీళ్ళు పోశారు. స్నానం అయిందనిపించారు. మృతకళేబరాన్ని పాడెకి బిగిం చారు. నలుగురు పట్టి పాడెనిఎత్తుకున్నారు. వరలక్ష్మి హాహా కారాలు ఎవ్వరూ వినడంలేదు. పాడె ముందుకుసాగుతున్నది. రఘుచేతికి నిప్పుయిచ్చి, పాడెముందు నడిపిస్తున్నారు. 'సరిగ్గా ఇరవైఏళ్లు రాకముందే, అప్పుడే పెద్దవాడవైపోవా? నాన్నా!' అని వరలక్ష్మి గొల్లుమంటున్నది. పాడె ముందుకు సాగిపోతున్నది. చీకటిపడుతుందని బ్రాహ్మలు త్వరత్వరగా నడుస్తున్నారు. రఘుకి ప్రపంచమంతా అప్పటికే అంధకార బంధురమైంది. వరలక్ష్మికి జీవితమే కారుచీకటిగా మారింది. ప్రేతయాత్ర సాగుతున్నది. ఊరంతా కదిలి ప్రేతయాత్రలో పాల్గొన్నది. కాలువబడ్డున కాష్టం పేర్చివుంది. ప్రేతాన్ని తీసుకెళ్ళి కాష్టంపైన ఉంచారు. రఘుని కాష్టానికి నిప్పం

టించమన్నారు. ఆ మాట వినడంతోనే రఘు కాళ్ళూ, చేతులూ అమాంతంగా వణికిపోయినాయి. క్షణం క్రితం వరకూ అంతగా ప్రేమించి పూజించిన శరీరానికి నిప్పంటించ మనడం రఘుకి ఘోరంగా తోచింది. కాష్టానికి నిప్పంటించ లేకపోయాడు. ఎవరో తనని లాగి, కాష్టానికి నిప్పంటింప జేశారు. కాష్టం రాజుకోవడం మొదలెట్టింది. చిరుమంటలు లేస్తుంటే రఘుకి, తననే ఎవరో దహిస్తున్నట్లు తోచింది. 'నాన్నా!'' అని రఘు కాష్టంవేపు పరుగెత్తాడు. ఎవరో తనని అమాంతంగా పట్టుకొని, వెనక్కి లాక్కొనివెళ్లారు. వరలక్ష్మి కిందపడి, మంటిలో పొర్లిపొర్లి ఏడుస్తున్నది. రఘుకి వెల్లువ వలె దుఃఖం పొంగుకొచ్చింది. అతనూ గొల్లున ఏడుస్తూ కింద కుప్పగా కూలాడు.

## 9

వేంకటరామయ్య కాలంచెందినతరువాత, రఘుకి జీవితంపైన విరక్తి కలిగింది. చదువుకుందామంటే, పుస్తకం పైన మనస్సు లగ్నం కాదు. పరీక్షలు దగ్గరపడుతున్నవి. ఏ పుస్తకం తీసినా 'ఎందుకు వచ్చినచదువా?' అనిపిస్తుంది. బలవంతంగా చదవడానికి కూర్చుంటే, ఒక్క అక్షరంకూడా బుర్రకెక్కదు. తీసినపేజీ తీసినట్టుగానే వుంటుంది. 'పరీక్షలు వచ్చేస్తున్నాయే' అనే తొందరపాటు ఒకవేపూ, 'ఏమీ చదవలేకపోతున్నానే?' అనే విచారం ఇంకొకవేపూ రఘుని పట్టి వేధిస్తున్నాయి. ఒకొకసారి 'ఎల్లాజరగాల్సివుంటే అల్లా

జరుగుతుం' దని మనస్సు మొండికేస్తుంది. ఉత్తరక్షణంలోనే 'జరిగే దేముంది? పరీక్షపోతుం' దని మనస్సు ఆరాటపడుతుంది. 'పరీక్షపోతే ఎల్లాగా?' అని భవిష్యత్తుని తలచుకొని హృదయం తల్లడిల్లిపోతుంది. ఇప్పటికే జీవితం భయంకరంగా మారింది. అందులో పరీక్షే పోతే, ఇంక అడగక్కరనే లేదు.

తండ్రి చనిపోయిన తరువాత తల్లితో పట్నంలో వుండి చదువుకోవడం దుర్ఘటమైపోయింది. తండ్రివుండగా పట్నంలో జీవితం సుఖంగా గడిచింది. బ్రతికివుండగా అతను బాగా సంపాదించాడు నలుగురికీ పెట్టాడు. తానూ తిన్నాడు. కాని పన్నెండుసంవత్సరాలకి పైగా పట్నంలో కాపురంచేసి కూడా అతను ఒక పైసా మిగల్చలేదు. ఎంతవస్తే అంతా ఖర్చుపెట్టాడు. ఎన్నడూ అతిఆశకు వెళ్ళలేదు. డబ్బుకోసం ప్రజలని పీడించలేదు. పౌరోహిత్యంచేస్తూ వాళ్ళు ఎంతయిస్తే అంతే తీసుకున్నాడు. ఇంత ఇవ్వమని కానీ, ఇంత ఇస్తేనే కార్యంవెళ్ళదీస్తానని కానీ అతను ఎన్నడూ పేచీలు పెట్టలేదు. ఇచ్చినదానితో సంతృప్తిపడ్డాడు. ఇచ్చినవాళ్ళనీ ఇవ్వని వాళ్ళనీ ఒకే కంటితో చూచాడు. అందరినీ చెయ్యెత్తి ఆశీర్వదించాడు. సద్బ్రాహ్మ డనిపించుకున్నాడు. ఇంట్లో పదిమంది బ్రాహ్మలు లేనిది ఎన్నడూ భోజనం చెయ్యలేదు. ఉన్నదానిలో అతిథీ అభ్యాగతులను చక్కగా సత్కరించాడు. తనయింటికి వచ్చినవాళ్ళు ఎన్నిరోజులున్నా, వెళ్లమని ఎన్నడూ అనలేదు. ఇల్లంతా వచ్చినవాళ్లకి బట్టబయలే. గుట్టుగా సంసారంచెయ్యడం అతనికి ఎన్నడూ తెలియదు. ఇంట్లో నూనెఅయిపోతే, అప్పటిమట్టుకు తనదగ్గర రెండు

అణాలు మాత్రమే వుంటే, ఆ అణాలతోనే నూనె తెప్పించే వాడు. ఆ మరుక్షణంలో రూపాయి వస్తే, ఆ రూపాయి ఏ వస్తువుకో వెంటనే అతనిదగ్గరినించి వెళ్లిపోయేది. ఇంట్లోకి వస్తువులు పనిమనిషిఎవరో తీసుకురావలెననే పట్టింపు లేదు. రెండుఅణాలు పెట్టి, తనే నూనెపావుతో బజారుకు బయల్దేరేవాడు. దారిలో ఎంతోమంది ఆగర్భశ్రీమంతులైన షావుకార్లు కనపడేవారు. ఎంతో వినమ్రతతో నమస్కరించే వారు. 'అయ్యో! ఇంతగొప్పవాళ్ళముందు నేను నూనెపావు పట్టుకొని రెండుఅణాలనూనెకోసం వెళుతున్నానే' అని అతను ఎన్నడూ అనుకునేవాడు కాదు. అందులో అతనికి న్యూనత ఏమీ కనపడేది కాదు.

రఘుకి, వరలక్ష్మికి వేంకటరామయ్య అల్లా బజారుకి చిల్లరవస్తువులకోసం వెళ్ళడం ఇష్టంలేకపొయ్యేది. 'అల్లా వెళ్ళకూడదు' అని ఎన్నోసార్లు చెప్పిచూచారు. కాని, వేంకటరామయ్య వాళ్ళమాటలు ఎన్నడూ పాటించలేదు. కాగా, వాళ్ళమాటలు చెవిని పెట్టేవాడుకూడా. ఒకొక రోజున ఇంట్లో నెయ్యి వుండేది కాదు. ఏ ఎనిమిదిఅణాలదో తెప్పిస్తే భోజనాలప్పుడు అభిగారానికి సరిపోయి, మహావస్తే మొదటివాయికి వచ్చేది. ఆ తరువాత ఎవరైనా నెయ్యి అడగడం సంభవిస్తే, వరలక్ష్మికి తలకొట్టినంతపని అయ్యేది. ఆమె వినీవిననట్లు నటించేది. కాని, వేంకటరామయ్యమాత్రం కుండబద్దలుకొట్టినట్లు 'ఇంటో నెయ్యి అయిపోయింది. ఏదో విధంగా భోజనంచెయ్యండి' అని అనేవాడు. 'ఈరోజుకి పరమాత్ముడు ఇంతే యిచ్చాడు. ఎవ్వర మేమి చేస్తా'మని

నిస్సంకోచంగా చెప్పేవాడు. వరలక్ష్మికి అతని ఈధోరణి నచ్చకపోయేది. అలా కుండబద్దలుకొట్టి చెప్పడం దేనికి? ఒకటిరెండుసార్లు నెయ్యిఅడిగి ఆ అతిథే అసలుసంగతి అర్థం చేసుకొని, మౌనంవహిస్తా డనేది. భార్యధోరణి భర్తకు నచ్చకపోయేది. అయినా, వేంకటరామయ్య భార్యని ఏమీ అనేవాడు కాడు. ఇల్లా సంసారంచేసిన వేంకటరామయ్య జీవితంలో ఏమి మిగులుస్తాడని!

వరలక్ష్మిమెళ్ళో పుస్తెలూ, నల్లపూసలూ తప్ప వేంకటరామయ్య చనిపోయేనరకు ఏ ఒక్కనగా లేదు. జిజియాబాయి ఐనవాడిపి,కానివాడిపి కాళ్ళుపట్టుకొని రెండు వంకలు తెచ్చి ఏదో జరిగిందంటే జరిగిందనే లెఖ్ఖలో కర్మ నడిపించింది. ఇట్టిపరిస్థితుల్లో రఘు తల్లితో పట్నంలో ఏ విధంగా సంసారం ఈడ్వగలడని? లేమివల్ల పట్నంలో సంసారం ఎత్తివేయాల్సివచ్చింది. కాలేజీకి వెళ్ళాలంటే పోను ఎనిమిదిమైళ్లూ, రాను ఎనిమిదిమైళ్ళూ రోజూపదహారు మైళ్ళు సైకిల్‌పైన వెళ్ళాల్సివచ్చేది. ఉదయం ఏ ఎనిమిది గంటలకో బయల్దేరితేగాని, పదిగంటలకి కాలేజీకి అందుకోలేక పోయేవాడు. సాయంత్రం నాలుగుగంటలకి నిజాంకాలేజీనించి బయల్దేరితే ప్రేమావతీపేటకు చేరుకునేసరికి ఆరుగంటలు దాటేది. భోజనంచేసేసరికి ఎనిమిదిగంటలుఅయ్యేది. అప్పుడు చదువుకోవడానికి కూర్చుంటే ఏమీ బుర్రకెక్కేదికాదు. చదువుకోవడానికి ఎంతప్రయత్నించినా లాభంఉండేదికాదు. ఇట్టిపరిస్థితుల్లో ఎందుకొచ్చినచదువు అనిపించేది. పోనీ, కాలేజీకి వెళ్ళకపోతే? కోర్సు ఇంకా పూర్తికాలేదు. కాలేజీకి

వెళ్ళకండా తను గట్టెక్కగలడనా? ముందు చెరువూ, వెనక గొయ్యీ అన్నట్లుంది తన బతుకు. ఏమిచేయడానికీవీలులేదు. కాలేజీ మానుకోవడానికి వీలులేదు. మానుకోకపోతే ఇంట్లో చదువుకోవడానికికూడా వీలులేదు. రఘు అటు సరిగ్గా కాలేజీకి వెళ్ళలేకపోతున్నాడు, ఇటు సరిగ్గా చదువుకోలేకపోతున్నాడు. రెండూచెడిన రేవడికథలాగైంది అతని బతుకు. పోనీ, స్టేటుకాంగ్రెసు ఉద్యమంలో పాల్గొని సత్యాగ్రహంచేస్తే? స్టేటుకాంగ్రెసుపక్షాన క్రితంరోజునే సత్యాగ్రహం ప్రారంభమైంది. తాను నిన్న కాలేజీనించి సుల్తాన్‌బజారుకి ఒకస్నేహితుడిని కలుసుకోవడానికి వెళ్ళి, సత్యాగ్రహం చూచాడు. అదే మొదటిసారి తాను తనజీవితంలో సత్యాగ్రహం ఏమిటో కళ్ళారా చూచి, తెలుసుకోవడం. కాకతాళీయన్యాయంగా తను సుల్తాన్‌బజారుకు వెళ్ళినప్పుడే ఆ సత్యాగ్రహం జరగడం, తన పూర్వపుణ్యవిశేష మనుకున్నాడు రఘు. గోవిందరావునానక్‌వంటి ప్రముఖులు ఆ సత్యాగ్రహంలో పాల్గొనడం, కాంగ్రెస్ ఉద్యమానికి ఒకవిశిష్టతని చేకూర్చింది. స్టేటుకాంగ్రెస్‌పక్షాన ఓంప్రథమంగా జరిగిన ఆ సత్యాగ్రహంలో అయిదుగురునాయకులు పాల్గొన్నారు. తాను సాయంత్రం సుల్తాన్‌బజారుకువెళ్ళేసరికి, సుల్తాన్‌బజార్‌చౌరస్తా దగ్గర వేలకొలదిప్రజలు గుమిగూడి ఉన్నారు. ప్రజలు ఎందుకు అల్లా గుమిగూడి ఉన్నారో తనకు మొదట అర్థం కాలేదు. పక్కనున్నవాళ్ళని అడిగితే, సత్యాగ్రహం జరుగుతుందని చెప్పారు.

గాంధీజీనాయకత్వంక్రింద బ్రిటిషుఇండియాలో సత్యాగ్రహంజరుగుతున్నదని వినడమేకాని, తాను ఎన్నడూ చూచి ఎరగడు. రఘుకి ఎల్లావుంటుందో చూతామన్నకుతూహలం కలిగింది. తను జనంలోకి తోసుకొని వెళ్ళి ఒకఅనుకూలమైన స్థలంలోకి వెళ్ళి నిలబడ్డాడు. ఇంతలోకే "స్టేటుకాంగ్రెస్‌కీ జై" అనే నినాదాలు ఒకవేపునించి వినపడినాయి. అమాంతంగా ప్రజలదృష్టి ఆవేపుకు మళ్ళింది. అయిదుగురువ్యక్తులు ఖద్దరుబట్టలు ధరించి, "స్టేటుకాంగ్రెస్‌కీ జై" అనేనినాదాలు చేస్తున్నారు. రఘు పక్కనున్నవాళ్ళని ఆ అయిదుగురువ్యక్తులనిగూర్చి అడిగి తెలుసుకున్నాడు. ఆ అయిదుగురూ స్టేటుకాంగ్రెస్ అగ్రనాయకులని రఘుకి పక్కనున్నవాళ్ళు చెప్పారు. అందులో ఒకతను వయోవృద్ధు - అతనే గోవిందరావునానక్ అని రఘు అడిగి తెలుసుకున్నాడు. అయిదుగురూ పుష్పమాలాలంకృతులై ఉన్నారు. అయిదుగురికీ పొడుగాటి కుంకుమబొట్లు ఉన్నాయి. కుంకుమబొట్లు అయిదుగురిఫాలభాగాల్లో ధగధగ మెరుస్తున్నాయి. జయజయధ్వానాలు చేస్తూ, వారు నాలుగుఅడుగులు ముందుకువేసి, చతుష్పథమధ్యభాగంలోకి వచ్చారు. ఇంతలోకే ప్రజల్లో ఉత్సాహం వెల్లివిరిసింది. ఐక్యకంఠంతో ప్రజలందరూ 'స్టేటుకాంగ్రెస్‌కీ జై" "మహాత్మా గాంధీజీకీ జై" "పండిత జవాహర్‌లాల్‌కీ జై" అని జయజయధ్వానాలు చేశారు. "సత్యం ఐక్యకంఠంతో దార్ఢ్యాన్నీ, నిరంకుశత్వాన్నీ ఎదిరిస్తున్నదా ?' అన్నట్లు తోచింది రఘుకి, మిన్నుముట్టే ఆ జయజయధ్వానాలు వినడంతోనే. ఎందుకో అతనికంఠం

కూడా తలవనితలంపుగా విడివడింది—"స్టేటుకాంగ్రెస్‌కీ జై"
"మహాత్మా గాంధీకీ జై" "పండిత జవాహర్‌లాల్‌కీ జై"
అని అతనికంఠంకూడా మారుమ్రోగింది. అతనిగళం
మక్కోటిగళాల్లో కాదు ముప్ఫైమూడుకోట్లగళాల్లో విలీన
మైంది. ఆ క్షణంలో రఘుకి, ఎందుకో ఎక్కడాలేని ధైర్యం
వచ్చింది. తిలక్, గోఖ్లే, దాదాభాయ్‌నౌరోజ్, మోతీలాల్
నెహ్రూ, లాలా లజపతరాయ్ అనీ బీసెంటు ప్రభృతులు
కళ్లకికట్టినట్లు కనపడ్డారు. వినమ్రతతో రఘు తల క్రిందికి
వాలింది, శరీరం జలదరించింది..... ఇంతలోకే కమ్మనికల
కరిగింది. పక్కనున్న వ్యానులోంచి పోలీసులు దిగి స్టేటు
కాంగ్రెస్ అగ్రనాయకులను అరెస్టుచేశారు. నెమ్మదిగా
వ్యానువేపుకి వాళ్లని నడిపించుకొని వెళ్ళారు. వ్యానులో
కూర్చోబెట్టారు. వ్యానుకదిలింది......వ్యానుకదలడంతోనే
జనంలో మరీ ఉత్సాహం హెచ్చింది. తిరిగి జయజయధ్వా
నాలు ప్రారంభమైనాయి. వ్యానును కనుచూపుమేరవరకూ
జయజయధ్వానాలతో సాగనంపారు. వ్యాను కనుమరుగు
కాగానే జనంలో ఉత్సాహం తగ్గింది. సమిష్టిభావం
క్షీణించింది.

ఉత్తరక్షణంలోనే ముక్కోటిగళాలు స్వదేశసంస్థా
నాలు, బ్రిటిషు ఇండియా రాష్ట్రాల్లో విడిపడి, జాతులు,
మతాలు, కులతత్వాలతో సంకుచితపడి ప్రజల హృదయాంత
రాళాల్లో ఇంకిపోయినాయి. త్యాగధనులనీ స్వార్థపరులనీ
వేరుపరచాయి. త్యాగధనుల కంఠనినాదాలు చివరకి అరణ్య

రోదనాలు అయినాయి... క్రమంగా జనం పల్చబడింది. ప్రజలు ఎవరిఇళ్ళకువాళ్ళు వెళ్ళడం మొదలెట్టారు.

రఘుకూడా అక్కడినించి కదిలాడు. సైకిల్‌పైన ప్రేమావతీపేటదారి పట్టాడు. దారిపొడుగునా అతన్ని సత్యాగ్రహదృశ్యం వేధించింది. పోనీ, తనూ సత్యాగ్రహించేస్తే? తనవల్ల దేశానికి ఏ కొంతఉపకారం జరిగినా మంచిదే... రఘు అలసి ప్రేమావతీపేట చేరుకున్నాడు. వేడినీటితో స్నానంచేసి భోజనంచేశాడు. ఆతరువాత పక్కమీద మేను వాల్చిందే తడవుగా నిద్రపట్టింది. మరుసటిఉదయం తన దుస్థితిని తలచుకున్నప్పుడుగాని అతనికి సత్యాగ్రహంసంగతి జ్ఞాపకంరాలేదు. ఆ విషమపరిస్థితుల్లో ఎల్లాగూ ఆ సంవత్సరం తనచదువు సాగదు. ఆసంవత్సరంమాత్రమేఅని ఏం నమ్మకం? వచ్చేసంవత్సరంమాత్రం తనఆర్థికపరిస్థితులు చక్కబడుతాయనా ? ఏ కొద్దిపాటిసంపాదనకూడా లేకుండా తనపరిస్థితులు చక్కబడడం ఇంక అసాధ్యం. ఆ సంవత్సరమే కాదు, ఇంక ఏ సంవత్సరంకూడా తనచదువు సాగదు. అంతటితో తను చదువుకి స్వస్తిచెప్పవలసిందే. ఇంక దానికి ఏమాత్రం తిరుగు లేదు. ఎల్లాగూ చదువుకు స్వస్తిచెప్పదలుచుకున్నప్పుడు తను సత్యాగ్రహంలో ఎందుకు చేరకూడదు? నెలనెలకి తను కాలేజీ జీతం, పరీక్షఫీజు కట్టగలుగుతాడనా ఈ సందేహం ? జీతం కట్టకపోతే ఎల్లాగూ తనపేరు కాలేజీలో తీసేస్తారు. ఆరోజున మానుకోవడానికి బదులు ఇప్పుడే చదువు మానుకుంటే? ఎల్లాగూ మానుకోవడం తప్పనప్పుడు ఇప్పుడే మానుకోవడం మంచిది. సత్యాగ్రహానికిసంబంధించిన వివరాలు ఎక్కడ

తెలుస్తాయి? ఆంధ్రమహాసభ కార్యాలయానికి వెళ్ళి కనుక్కుంటే? నిజమే, అక్కడికి వెళ్ళి విషయాలన్నీ తెలుసుకోవాలి. అప్పుడుకాని, సత్యాగ్రహంలో చేరడమూ లేక మానుకోవడమూ అనే విషయాన్నిగూర్చి ఒకనిర్ణయానికి రావడానికి వీలుండదు. రఘుకి ఆ భావం కలగడంతోనే లేచి స్నానం చేశాడు. భోజనంచేసి, దుస్తులు వేసుకొని, సైకిల్‌పైన హైద్రాబాద్‌కి బయల్దేరాడు. నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభ కార్యాలయాన్ని చేరుకున్నాడు

అప్పటికి ఇంకా పదిగంటలు కాలేదు. లోపలికి వెళ్ళి కనుక్కుంటే ప్రధానకార్యదర్శి లేడన్నారు. ఎప్పుడు వస్తారని అడిగితే సాయంత్రం రావచ్చునన్నారు. రఘుకి ఏమిచెయ్యడానికీ తోచలేదు. బాధ్యతగలపదవుల్లో వున్నవారు అక్కడ ఎవ్వరూ కనిపించకపోవడంతో అతనికి చిరాకెత్తింది. ప్రేమావతీపేటనించి సైకిల్‌మీద వస్తూ సత్యాగ్రహాన్నిగూర్చి అతను కన్న కలలన్నీ కరిగిపోయినాయి. తను ప్రశ్నలతో వేధిస్తున్న క్లర్కూ, అతనికి ఎదురుగానిలబడివున్న తనూ వాస్తవికాలుగా మారాయి. తను సత్యాగ్రహంలో చేరదల్చుకున్నట్లు, ఆక్లర్కుకి మాటలసందర్భంలోసూచించాడు. ఎవరిని కలుసుకుంటే తను సత్యాగ్రహంలో చేరడానికి వీలుంటుందో చెప్పమని అడిగాడు. తను అడిగినప్రశ్నలకి క్లర్కు బిత్తరచూపులు చూస్తాడేగాని, ఏ ఒక్కదానికీ సమాధానం చెప్పడు. నిజాంరాష్ట్ర ఆంధ్రసభ కేంద్రకార్యాలయంలో పనిచేసే గుమాస్తాలు, సత్యాగ్రహంపేరు చెబితే అంతగా భయపడడం దేనికో అతనికి అర్థంకాలేదు. ఆంధ్రమహాసభ

సత్యాగ్రహంతో ఏమీసంబంధంలేకుండా విడిగావుంచడం వీళ్ళఉద్దేశమై వుంటుందా ? అయితే కావచ్చు. ప్రత్యక్షంగా సత్యాగ్రహంతో సంబంధం కల్పించుకుంటే అసలు ఆంధ్ర మహాసభ ఉనికికే ప్రమాదంకలుగవచ్చు.

ప్రభుత్వం స్టేటుకాంగ్రెస్‌ని 'మతపాక్షికసంస్థ' అని నిషేధించింది. 'ఇత్తెహాదుల్ ముసల్‌మీన్' ముస్లింమతావేశంతో విజృంభించి పనిచేస్తున్నప్పటికీ, ప్రభుత్వానికి అది మతపాక్షికసంస్థగా కనపడలేదు. కాగా, దానికి హైద్రాబాద్ ప్రభుత్వ సహాయ సానుభూతులు లభిస్తున్నాయి. 'ఇత్తెహాదుల్‌ముసల్‌మీన్' గ్రామాలలోని మాదిగ, మాలగూడాలని ముస్లింగూడాలుగా మారుస్తున్నదని వినికిడి. ఇట్టిపరిస్థితుల్లో ప్రభుత్వం 'ఇత్తెహాదుల్‌ముసల్‌మీన్' మతపాక్షిక కార్యకలాపాలకిఎట్టిఅవరోధాల్నికల్పించకండా, స్టేటుకాంగ్రెస్ సరిగ్గా స్థాపింపబడకపూర్వమే, దాన్నికూకటివేళ్ళతో పెల్లగించి వేయడానికి ప్రయత్నించడం రఘుకి హాస్యాస్పదంగాతోచింది.

రఘు ఆంధ్రమహాసభ కేంద్రకార్యాలయంలోని క్లర్కుని సత్యాగ్రహవిషయంలో మరికొంత కదిపిచూచాడు. 'ఆంధ్రమహాసభకి, స్టేటుకాంగ్రెస్‌సత్యాగ్రహంతో ఎట్టిసంబంధం లే'దని అతను నిక్కచ్చిగా సమాధానంచెప్పాడు. ఇంక ఆ విషయం క్లర్కుతో మాట్లాడి లాభంలేదని తెలుసుకొని, సాయంత్రం ప్రధానకార్యదర్శిని వచ్చి కలుసుకుంటే అన్ని సంగతులు తేలిపోతాయనే ఉద్దేశంతో, ఆంధ్రమహాసభ ప్రచురించినకొన్నికరపత్రాలుకొనుక్కొని, రఘుఅక్కడినుంచి బయటపడ్డాడు. అతనుకొన్నకరపత్రాలలో 'వర్తకస్వాతంత్ర్యం'

'వెట్టిచాకిరి' 'మోతత్రాఖ లేక మగ్గంపన్ను' అనేవి ముఖ్య మైనవి. వాటితోపాటు కొన్ని ఆంధ్రమహాసభవార్షికసమా వేశాల నివేదికలుకూడా అడిగి తీసుకున్నాడు. ఆంధ్రమహా సభ కేంద్రకార్యాలయంనించి బయటపడ్డతరువాత సాయం త్రంవరకు ఎల్లా గడపాలో తోచలేదు. 'పద్మయింటికి వెడు దామా' అనుకున్నాడు. కాని లాభం? పద్మ ఇంట్లోఉండదు. కాలేజీకి వెళ్ళిఉంటుంది. పోనీ, ప్రేమావతీపేటకు వెడితే? అప్పుడు వెళ్ళి సాయంత్రానికల్లా తిరిగిరావడం అతనికి దుస్సాధ్యంగా తోచింది. పబ్లిక్ గార్డెన్సుకు వెడితే! బాగానే వుంటుంది. ఆంధ్రమహాసభ కేంద్రకార్యాలయంలో కొను క్కున్న కరపత్రాలూ, నివేదికలూ చదివివేయవచ్చు. ఆ భావం కలగడంతోనే రఘు సైకిల్‌పైన పబ్లిక్ గార్డెన్సుకు బయల్దేరాడు.

వెళ్ళి, సైకిల్‌కి తాళంవేసి, ఒకబెంచీపైన కూర్చు న్నాడు. కరపత్రాలు ఒక్కొక్కటిగా తీసి, చదవడం ఆరంభించాడు—'వెట్టిచాకిరి'—ప్రభుత్వోద్యోగులు తమ పర్యటన సందర్భంలో గ్రామాలకి వెళ్ళినప్పుడు, ఎట్టి ప్రతి ఫలం ఇవ్వకుండానే చాకలి, మాల, మాదిగ మొదలైన కులాలకు చెందినవారితో నిర్బంధంగా పనులుచేయించు కోవడం దారుణంగా కనపడింది. ప్రభుత్వం ఈ కులాలవారికి గ్రామాల్లో కొన్ని ఈనాములుఇచ్చినమాట నిజమే. ఈ ఈనా ములనే బలోతా ఈనాములు అంటారు. ఈనాములు ఇచ్చి నందుకు చాకిరిచేయడానికి వారు ఎల్లప్పుడూ సంసిద్ధంగా ఉండాల్సివస్తుంది. అంతేకాని, ప్రతిఫలం లేకుండా చాకిరీ

చేయమని గాని, ఒక గ్రామంనించి ఇంకొక గ్రామానికి మూటలు మోయమనిగాని ఎక్కడా వ్రాసిలేదు. అయినా ప్రభుత్వోద్యోగులు కలకాలంనించీ, వారితో వెట్టిచాకిరీచేయించుకుంటూనే వున్నారు. కాగా, అల్లా చాకిరీచేయించుకోవడం ఒక ఆచారమైపోయింది. ఇది ఎంతో అమానుషంగా తోచింది రఘుకి. ఈ దురాచారానికి వ్యతిరేకంగా, ఆంధ్ర మహాసభ ఆందోళన జరపడం ఎంతోసమంజసంగా తోచింది అతనికి. — 'వర్తకస్వాతంత్ర్యం' ... ప్రభుత్వోద్యోగులు గ్రామాలలో పర్యటనచేస్తున్నప్పుడు వర్తకులు వారికికావల్సిన తినుబండారాలన్నీ సరఫరాచేయాలి. ఏవస్తువైనా తమదగ్గర లేకపోతే, పొరుగు గ్రామాలనుంచి వారికి ఆ వస్తువు తెప్పించి ఇవ్వాలి. ఏవస్తువుకూడా వారు తమ దగ్గరలేదని చెప్పడానికి వీలులేదు. ఇంతాచేస్తే, ప్రభుత్వోద్యోగులు వర్తకులుఇచ్చిన సామానులకి ధరలుకట్టి, ఇవ్వవలసినధనం ఇస్తే కద్దు; లేకపోతే లేదు. వర్తకులు తమకురావల్సిన ధనం రాలేదని, ఫిర్యాదుచేయడానికి వీలులేదు ఫిర్యాదుచేసినా లాభం ఉండదు. వస్తువులకి చౌకధరలుకట్టి ఏదో కొంతధనం ఇస్తే కిక్కురుమనకండా 'మహద్భాగ్యం'అని ఆ ధనం తీసుకోవాలి. ఈ దురాచారంవల్ల వర్తకులు ఎంతో నష్టపడడం చూచి, ఆంధ్రమహాసభ వారికి అండగా నిలిచి, గొప్పఆందోళన చేసింది. వర్తకులను ప్రోత్సహించి, వర్తకసంఘాల్ని స్థాపించింది. గొప్పఆందోళన జరిపింది. ఆంధ్రమహాసభఆందోళన ఫలితంగా ఈ ఆచారం సమసిపోవడం రఘుకి ఎంతో ఆనంద దాయకంగా కనపడింది. 'మగ్గం పన్ను'... ఈ దురాచారం

ఎక్కువగా జాగీర్ ప్రాంతాల్లో అమలులో వుంది. దీనిని 'మోతరఫీ' అని కూడా అంటారు. పద్మశాలీలు దీనినిబట్టి తమ నేతమగ్గాలకి పన్నులు చెల్లించవలసివచ్చేది. దీనికి వ్యతిరేకంగా ఆంధ్రమహాసభ చేసిన ప్రచారఫలితంగా, ఈ దురాచారం చాలావరకు తగ్గింది. రఘు ఆంధ్రమహాసభ ప్రచురించిన కరపత్రాలు చదివినతరువాత, నివేదికలు తిరగవేయడం ప్రారంభించాడు. పరిస్థితులు మరీ ఘోరంగా కనపడ్డాయి.

ప్రజలు ప్రైవేటుగా పాఠశాలలు స్థాపించడానికి వీలు లేదు. సభలు, సమావేశాలు జరుపుకోవడానికి వీలులేదు. పాఠశాలలు స్థాపించదలుచుకుంటే ఖాస్గీ (ప్రైవేటు) పాఠశాలల నియమావళి అడ్డువస్తుంది. సభలు జరుపదలుచుకుంటే గష్తినిషాన్ (సర్క్యులర్ నెంబర్) 53 అడ్డువస్తుంది. ఈసర్క్యులర్‌ని అనుసరించి, రాజకీయాలకి సంబంధించిన సభలకు బాబెహుకూమత్ (మంత్రిమండలి) అనుమతిని పొందాలి. రాజకీయపరిణామాలు కలిగించే సభల్నికూడా జరుపగూడదు. ఏవి రాజకీయపరిణామాలు కలిగించే సభలో, ఏవి కావో ప్రభుత్వమే నిర్ణయిస్తుంది. హైద్రాబాద్ ప్రభుత్వనిర్ణయానికి ఎట్టితిరుగూ లేదు. ఆంధ్రమహాసభకు రాజకీయాలతో ఎట్టిసంబంధం లేదని ఎన్నిసార్లు నాయకులు ప్రకటించినా, ప్రతిసంవత్సరం మహాసభలు జరుపుకోవడానికి సవ్యంగా అనుమతి లభించడం లేదని వినికిడి. దీనికి కారణం ఏమిటో రఘుకి ఎంత ఆలోచించినా తోచలేదు. ఎవరినైనా, తెలిసినవాళ్ళని అడిగికనుక్కోవడంమంచిది. రఘుఒక్కొక్కటిగా ఆంధ్రమహా

సభనివేదికలన్నీ చదివేశాడు. కొన్ని తీర్మానాలు అర్థమైనాయి; కొన్ని కాలేదు. ముఖ్యంగా రైతులకు సంబంధించిన తీర్మానాలు, అతనికి అయోమయంగా కనపడ్డాయి. రైతులసమస్యల్ని శ్రద్ధగా చదివి తెలుసుకోవాలి. తనకు కావలసిన సమాచారం, ఏపుస్తకం చదువుతే తెలుస్తుందో రఘుకి తెలియదు. ఎవరినైనా, మంచిరాజకీయవేత్తని అడిగి తెలుసుకోవాలి. నివేదికలు చదవడం పూర్తిఅయిన తరువాత రఘుకి పబ్లిక్‌గార్డెన్సులో వృథాగా కాలయాపన చేయడం బొత్తిగా మనసర్కించలేదు. పోనీ, ఏదైనాపత్రికకొని చదువుకుంటే? నిజమే, బాగానే వుంటుంది. కాలానికి కాలం గడుస్తుంది, ప్రపంచవిషయాలూ తెలుసుకున్నట్లవుతుంది.

మంచి లోకజ్ఞానం కలగాలంటే పత్రికలు చదవడం అవసరమని చెబుతారు. తాను ఇదివరకెన్నడూ పత్రిక కొని, చదివి ఎరుగడు. ఈరోజునించి ఏదైనా పత్రిక కొని చదువుకుంటే? కాని, దినపత్రికకోసం రోజూ నగరానికి రావడం ఎలా సాధ్యపడుతుంది. హేమావతీపేటలో పోస్టుఆఫీసు లేదు. దినపత్రిక ఏదైనా తెప్పించుకుంటే, అది ఏ నాలుగురోజులతరువాతో వస్తే ఏమిలాభం? గ్రామాల్లో పోస్టుఆఫీసులు ఉండకపోవడం రఘుకి ఎంతో అననుకూలంగా తోచింది. ఇది తెగే సమస్యకాదని తోచడంతో రఘు దినపత్రిక తెప్పించుకునే విషయమై ఆలోచించడం మానివేశాడు. నగరానికి వచ్చిన రోజునమాత్రం, పత్రిక కొని తప్పక చదువుకోవాలని నిశ్చయించుకున్నాడు. మెదడులో ఈ భావం మసలడంతోనే,

వెంటనే సైకిల్‌పైన వెళ్ళి "హిందూ" కొన్నాడు. పబ్లిక్ గార్డెన్సుకి తిరిగివచ్చి పత్రికచదవడం ఆరంభించాడు.

పత్రిక ఎక్కడినించి చదవడం మొదలుపెట్టాలో తోచ లేదు. అంతకుపూర్వం, అతను ఏవో తెనుగుపత్రికలు చదివాడేకాని, ఇంగ్లీషుపత్రిక చదివి ఎరగడు. ఎక్కడినించి మొదలుపెట్టినా పత్రిక ఆసాంతం చదవివేయడం అవసరమని నిశ్చయించుకున్నాడు. ప్రకటనలు వదిలేసి వార్తలువున్న పేజీ తీసి చదవడం మొదలుపెట్టాడు...... రెండుగంటలు దాటాయి. అయినా పత్రిక ఆమూలాగ్రంగా చదవడం పూర్తికాలేదు. చదివిచదివి విసుగేసింది. రఘు, పత్రిక పక్కనపెట్టి బెంచిపైన మేను వాల్చాడు. అనాలోచితంగా కళ్ళుమూసుకున్నాడు. ఎందుకో హాయిగా కనపడింది. కాసేపు నిద్రపోతే...పక్కనున్న సైకిల్‌సంగతి జ్ఞాపకంవచ్చి నిద్రపోవడం మానుకున్నాడు. సైకిల్‌కితాళంవేసివున్నప్పటికీ, నిద్రపోవడం ప్రమాదకరమని భావించాడు. మెదడులో ఏవో ఆలోచనలు ముసురుకుంటున్నాయి.

రమణ రోజురోజూ తనకు దూరంకావడంలేదుకద! రెండుసంవత్సరాలక్రితం పద్మయింట్లో వుంటున్నప్పుడు విరివిగా కనపడేది. పెళ్ళితప్పిపోయినతరువాత ఏదో తలవనితలంపుగా తాము ఉభయులూ పద్మయింట్లో కలుసుకోవడం సంభవిస్తేతప్ప ఎన్నడూ పనికట్టుకొని, తనకి కనపడలేదు. కనపడకపోవడానికి కారణంకూడా ఉంది. నారాయణరావు తనకూతురు రమణని తనకివ్వడానికి నిరాకరించినతరువాత, తను ఎన్నడూ రమణయింటికి వెళ్ళలేదు. రమణకూడా తమ

యింటికి రాలేదు. తనకు పిల్లనివ్వడానికి నిరాకరించినయింటికి తను ఏమొహంపెట్టుకు వెళతాడు? అంతటితో బాంధవ్యం తెగిపోయింది. కాకతాళీయన్యాయంగా ఎన్నడైనా రమణ పద్మయింట్లో కనపడితే కద్దు, లేకపోతే లేదు. మొదటినించీ తాము ఉభయులూ కూడబలుక్కొని పద్మయింట్లో కలుసుకుంటూవస్తే బాగుండేది. తగినంత లోకానుభవంలేకపోవడం వల్ల ఉభయులూ అటువంటిపని ఏమీ చేయలేదు. పద్మ ద్వారా రమణకి కబురుపంపితే పని సానుకూలపడేది. "ఫలాని రోజున నీస్నేహితురాలిని రమ్మని చెప్పు" అని అనడానికి రఘుకి సిగ్గుగాఉండేది. బహుశా రమణకూడా తనకుమల్లేనే సిగ్గుపడిఉంటుంది. అందువల్లే ఎన్నడూ పద్మద్వారా ఏ కబురూ తనకుచెప్పిపంపించలేదు. రమణకుమెట్రిక్యులేషన్‌లో ఫస్టుక్లాసు వచ్చింది. ఆమెకు చదువుపైన మరీశ్రద్ధ ఎక్కువవుతున్నది. పద్మ సెకండుక్లాసులో మాత్రమే ప్యాసుఅయింది.

రమణ, పద్మ ఉభయుల మనస్తత్వాల్లో రఘుకి ఎంతోతేడా కనపడింది. రమణ తలుచుకున్నపనిని పొల్లుపోకండా నిర్వహిస్తుంది. తను ఏర్పరుచుకున్న ఆశయాన్ని సాధించితీరుతుంది. పద్మ అల్లాకాదు. ప్రవాహంలో పుడకలాగా జీవితాన్ని దానిదారికి దాన్ని వదిలేస్తుంది. అందంగా హాయిగా జీవితాన్ని గడుపుతుంది. ఉభయులమధ్య ఒకసైన్టిస్టుకీ, ఒకఆర్టిస్టుకీ ఉన్నతేడా లేదుకద! ఏమో...!

ఎందుకో తనమధ్య పద్మమధ్య చనువు ఎక్కువవుతున్నది. తనకు ఉల్లిపాయపకోడీలు, గులాబ్‌జామున్ అంటే ఎంతోయిష్టం. పద్మ తనయిష్టాల్ని ఎల్లా కనిపెట్టిందో! తను

వెళ్ళినప్పుడల్లా తనకు యిష్టమొచ్చినఫలహారాలనే పెడుతుంది. కొందరు స్త్రీలకి తమకిఇష్టమున్న వ్యక్తులహృదయాల్లోకి చొచ్చుకొనివెళ్ళి, వారి అభిరుచుల్ని శ్రద్ధగా కనిపెట్టి, తదనుగుణంగా నడుచుకోవడం ఎల్లాసాధ్యపడుతుందో రఘుకి అర్థంకాలేదు. పద్మకి తనకనుసన్నల్లో మెలగడం ఎల్లా చాతనవుతుందో రఘు ఆలోచించుకోలేకపోయాడు. తను పద్మకి మల్లే పద్మఅభిరుచుల్ని తరిచి, తెలుసుకొని, తదనుగుణంగా మెలగగలిగివుంటే ఎంతబాగుండేది! ప్రేమ అంటే ఇదేనా? ఒకరి అభిరుచుల్ని ఇంకొకరు తెలుసుకొని, ఒకరికి అనుకూలంగా ఇంకొకరు మెలగడమేనా? ఉభయులూ తమతమస్వభావాల్ని ఇంకొకరిస్వభావాలతో సరిపెట్టుకొని, కొంత కొంత త్యాగాలుచేసి, భావైక్యత పొందడంతో ప్రేమ సాఫల్యంపొందుతుందా? పొంగులెత్తుతున్న రమణయౌవనం తనని ఆకర్షించలేదుకద? చిన్నతనంలో తను భర్తగా వుండడానికి నిరాకరించినప్పుడు రమణ తనబుగ్గకొరికింది. ఆ కొరుకుడుతో తనని రమణ తనభర్తగా చేసుకుందనే సెంటుమెంటుకి తను లొంగిపోవడంలేదుకద! ఏమో? ప్రేమావతీపేటలో రెండుసార్లు తను రమణని కౌగిలించుకున్నప్పుడు తనకుకలిగిన 'హాయిని' తలచుకొని, రఘు తన్మయుడైనాడు. 'తానునిజంగా రమణని ప్రేమిస్తున్నా'నని నిశ్చయించుకున్నాడు. తను రమణని ప్రేమిస్తే, మధ్యలోఈపద్మరసగుళికలకిమల్లే తనహృదయంలోకి చల్లగా జారుకోవడం ఎందుకు జరుగుతున్నది? సన్నని చంద్రకిరణంలా తనశరీరంపైనసోకి, తనకు హాయిని ఎందుకు సమకూర్తున్నది? ఒకటి శరీరానికిసంబంధించిన 'హాయి'

అయితే, ఇంకొకటి ఆత్మకిసంబంధించిన 'హాయి' కాదుగద! రమణ, పద్మలమధ్య శరీరమూ, ఆత్మలకి సంబంధించిన బాంధవ్యం ఉందా? ఏమో? ఇంతలోకే పబ్లిక్‌గార్డెన్సుపక్కనున్న క్లాక్‌టవర్ మూడుగంటలు వేసింది. పద్మ నాలుగున్నరకి గాని కాలేజీనించి ఇంటికి తిరిగి రాదు. గంటన్నర ఎల్లా గడపాలో రఘుకి తోచలేదు. ఇంకొకక్షణమైనా పబ్లిక్‌గార్డెన్సులో గడపడానికి అతనికి మనస్కరించలేదు. వెంటనే రఘు సైకిలుపైన బయల్దేరాడు. ఒకగమ్యస్థానం లేకండా ఎటు యిష్టమొస్తే అటు వెళ్ళడం మొదలెట్టాడు.

సైకిలు మింటుమీదుగా సికింద్రాబాద్ దారి పట్టింది. ఎండ తీక్షణంగా కాస్తున్నది. సైకిలుతొక్కడుతో రఘుకి చమటలుపోస్తున్నాయి. కర్చీఫ్‌తో చమటలుతుడ్చుకుంటూ రఘు ముందుకు సాగిపోతున్నాడు ......... టాంక్ బండ్ వచ్చింది. అంతఎండలోకూడా టాంక్ బండ్ పైన సైకిల్ మీద ప్రయాణంచేయడం హాయిగా తోచింది. గాలి చెరువు పైని కెరటాలమీదుగా తేలి చల్లగావీస్తున్నది. ఆ కాసింత సుఖంలో రఘుకి తననిజస్థితి జ్ఞాపకంవచ్చింది.

'ఎక్కడికీ ప్రయాణం?' అనే ప్రశ్న ఆకాశంఎత్తున అతనికళ్ళముందు నిలిచింది. శంకలతో, సందేహాలతో బ్రతుకే ఒక బరువుగా ఒక అలసటగా ఉంది. ఎక్కడికని నిర్ణయించుకోగలడు? సవ్యంగా, ప్రశాంతంగా వెడుతున్న బండి రమణని తనకివ్వడానికి నిరాకరించడంతో పట్టాలు తప్పింది. రెండుసంవత్సరాలక్రితం తనకీ రమణకీ పెళ్ళిఅయిపోతే, ఏసమస్యా ఉండేదికాదు. గోరుచుట్టుకిరోకటిపోటన్నట్టు

తనతండ్రిమరణంతో జీవితం ఒక భయంకరస్వప్నంగా మారింది. ఎవరైనా తనకి అండగా నిలిచి, ఈదారుణస్వప్నం నించి, తనని పక్కకి తొలగించివేయగలుగుతే? నిలుచున్న పాటున ఏదైనా మిరకిల్ (Miracle) జరిగిపోతే? ఎన్నడూ లేనిది తనుజీవితంలో మిరకిల్సుకోసం ఎదురుచూడడం ఏమిటి? జీవితంలో మిరకిల్సుజరగవని తెలిసికూడా వాటికోసం ఎదురు చూడడం, ఆశించడం ఏమిటి?

జీవితంలో బలంగా దెబ్బతిన్నహృదయాలు కించిత్ వ్యతాపిమూఢతతో మిరకిల్సుని ఆశిస్తాయా? గాఢంగా వాటిని విశ్వసించి, అవి తమజీవితంలో జరుగవలెనని మరీమరీ కోరుకుంటాయా? ఏమో?...రఘుకి ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోయింది. ఆలోచనలకి అంతం ఎక్కడా కనపడలేదు. జీవితాంతంవరకూ ఆలోచనలతో తలబాదుకోవాల్సిందేనా? తన జీవితమే ఒక ఆలోచనలపుట్టగా మారలేదుకద!

సత్యాగ్రహంలో చేరితే తాత్కాలికంగానైనా, ఆలోచనలు ఆగిపోతాయి. బుర్రకి కొంతకాలమైనా విశ్రాంతి దొరుకుతుంది. దానితో సత్యాగ్రహంలో చేరకతప్పదని రఘు తిరిగి నిశ్చయించుకున్నాడు. సైకిలు మళ్ళించాడు. ఆంధ్రమహాసభ ప్రధానకార్యాలయానికి బయల్దేరాడు. దారి పొడుగునా 'ఆంధ్రమహాసభ అప్పటివరకు ఏమిసాధించిందా?' అనే ఆలోచనతో ఉక్కిరిబిక్కిరి అయినాడు.

అప్పటికిఆరుమహాసభలుజరిగాయి. నిజాంరాష్ట్రాంధ్రోద్యమం ప్రారంభమై దాదాపు 16 సంవత్సరాలు దాటింది. 1922లో ఆంధ్రజనకేంద్రసంఘస్థాపనతో ప్రారంభమైన ఉద్య

మం, 1938 వరకు సాధించినకార్యాన్ని ఒకసారి పరిశీలించి చూస్తే, నిద్రాణమైనజాతిని జాగరితంచేసిందని తోచింది. 1922 కి పూర్వం ఆంధ్రులు 'మేము ఆంధ్రులం. మా భాష తెనుగు' అని సగర్వంగా చెప్పుకునేస్థితిలో లేరు. తమకి ఒక మహోజ్జ్వలచరిత్ర వుందనీ, తమకి గర్వించదగిన సాహిత్యం వుందనీ, తమసంస్కృతికి భారతీయసంస్కృతిలో ఒక విశిష్ట స్థానం వుందనీ గుర్తించిఎరుగరు. మాతృభాషని త్యజించి, రాజకీయభాషశరణుజొచ్చారు. దానిలో పాండిత్యప్రకీర్తిలు సంపాదించడానికి శాయశక్తులా ప్రయత్నంచేశారు. తమ దేశ భాషల్ని మరిచారు. సంస్కృతాంధ్రాలకు బదులు ఉర్దూ పార్శీలని మన్నించి పోషించారు. ఆంధ్రులు తమనితాము గుర్తించలేనిస్థితిలో వున్నప్పుడు నిజాంరాష్ట్రంలో ఆంధ్రోద్యమం ప్రారంభమైంది. ఆంధ్రభాషని ప్రచారంచేసింది. ప్రజల్లో మాతృభాషపట్ల భక్తిభావాన్నికలుగరుజేసింది. 'మీా ఆంధ్రులు,మీాభాష తెనుగు' అని ప్రజల్ని ఉద్బోధించింది. దానితో ప్రజల్లో తెనుగుపట్ల భక్తిశ్రద్ధలు ఏర్పడ్డాయి. వారు తమ ఉజ్జ్వలచరిత్రనీ, మహోజ్జ్వలసాహిత్యాన్నీ గుర్తించారు. తత్ఫలితంగా తెనుగుసంస్కృతిని పునరుజ్జీవింపజేశారు. ఆంధ్ర మహాసభ రాజకీయంగా సాధించిన మహత్కార్య మేమీా లేకపోవచ్చు. కాని, సాంస్కృతికంగా చరిత్రలో సువర్ణాక్షరాలలో లిఖింపదగిన ఘనవిజయాన్ని సాధించింది. రాజకీయంగా వీలైనప్పుడల్లా కొన్ని ప్రజలయిబ్బందుల్ని శాంతియుతంగా తొలగించింది. కొన్ని సందర్భాల్లో వలనుకాకపోతే, ఆ యిబ్బందులకి వ్యతిరేకంగా ఆందోళన

జరిపింది. సాధించింది చాలాతక్కువ. సాధించవల్సింది ఇంకా ఎంతో మిగిలివుంది. కాని, సాధించిన ఆ కొద్దిమాత్రమే చరిత్రలో నిజంగా సువర్ణాక్షరాల్లో లిఖింపదగ్గది. పెడదారులు పట్టిన జాతిని సక్రమమార్గంలోకి తెచ్చింది. ఇక ఎట్టి దుష్టశక్తులైనా జాతిపురోగమనాన్ని అరికట్టలేవు. జాతి ఇంక తనగమ్యస్థానానికి చేరుకోక తప్పదు. ఏ ఒడిదుడుకులూ దానివేగాన్ని, ఉత్సాహోద్వేగాల్ని తగ్గించలేవు. జాతి సక్రమమార్గంలో ముందుకు సాగుతున్నదని తోచడంతోనే, రఘుకి ఆనందాశయాలు వెల్లివిరిశాయి. తలవని తలంపుగా రఘునోటినించి 'ఆంధ్రోద్యమానికి జై' అనే జయజయ ధ్వానం బయల్దేరింది. తనతో కలిసి ముక్కోటిగళాలు జయ జయధ్వానంచేస్తున్నట్లు రఘుకి తోచింది. శరీరం పులకలెత్తింది. చెవులు గింగురుమన్నాయి....

రఘు ఆంధ్రమహాసభ ప్రధానకార్యాలయానికి వెళ్ళేసరికి ఇంకా నాలుగుగంటలు కాలేదు. లోపలికివెళ్ళి ప్రధాన కార్యదర్శినిగూర్చి కనుక్కున్నాడు. ఇంకా రాలేదని చెప్పారు. ఎప్పుడు వస్తాడని అడిగితే ఆరుగంటలలోపల ఎప్పుడైనా రావచ్చునని చెప్పారు. రఘుకార్యాలయంలోంచి వెలుపలికి వచ్చాడు. 'టైం ఎల్లా గడపడమా?' అనే సమస్య తిరిగి అతనిని వేధించింది. ఈలోపుగా ఒకమాటు పద్మఇంటికి వెళ్ళివస్తే—సైకిల్ పైన వెడితే పదినిమిషాలదారి - యింకొక అరగంట అయితేనేకాని ఆ అమ్మాయి కాలేజీనించి యింటికి రాదు. తక్కినయిరవై నిమిషాలు గడపడానికి మార్గమేమీ కనపడలేదు. కాలినడకనిబయల్దేరి వెడితే? నిజమే. బాగానే

వుంటుంది. అరగంట యిట్టే గడిచిపోతుంది. ఆ భావం కలగడంతో రఘు సైకిల్ తీసుకొని పద్మయింటికి కాలినడకని నెమ్మదిగా బయలుదేరాడు. మరికొంతటైం కలిసివస్తుందని మధ్యలో ఒక హోటల్లో టీ తాగాడు. హోటల్లో దాదాపు పదినిమిషాలు గడిచిపోయినాయి. పద్మయింటికి చేరుకునేసరికల్లా నాలుగున్నర దాటింది.

పద్మ అప్పుడే కాలేజీనుంచి తిరిగిరావడంవల్ల మొహం కడుక్కొని, దుస్తులుమార్చి, డ్రాయింగ్‌రూమ్‌లోకి వచ్చేసరికి కొంత ఆలస్యమైంది. ఈమధ్య రఘు, తనమనస్సు ఎంత చంచలమైనదీ ఆలోచించడం మొదలుపెట్టాడు. ఏవిషయంపైనా ఏకాగ్రత వుండదు. ఒకేసారి ఎన్నోవిషయాల్ని గూర్చి ఆలోచిస్తుంది. ఒకవిషయానికి యింకొకవిషయంతో ఏమాత్రం సంబంధం వుండదు. స్టేటుకాంగ్రెస్‌సత్యాగ్రహం, ఆంధ్రమహాసభ, రమణ, పద్మ మొదలైనవిషయాల్నిగూర్చి తాను ఆరోజు ఆలోచించాడు. యిందులో ఒకదానికి యింకొకదానితో ఏమైనా సంబంధం వుందా? స్టేటుకాంగ్రెస్ సత్యాగ్రహానికీ ఆంధ్రమహాసభకీ ఏమైనా సంబంధవుంటే వుండవచ్చు. కాని వాటికి రమణ, పద్మలతో ఏమి సంబంధం? తనమనస్సు ఒకేసారి ఒకేవిషయాన్నిగూర్చి ఆమూలాగ్రంగా ఎందుకు ఆలోచించదు? ఒకేక్షణంలో తన మనస్సు వివిధవిషయాలపైకి ఎందుకు వెడుతుంది? అందరిసంగతీ ఇంతేనా? ఏ ఒక్కరూ ఒకేవిషయాన్నిగూర్చి ఒకేసారి చివరంటా ఆలోచించలేరా? ఏమో? ఎవరుచెప్పగలరు?...

పద్మ ఇంతలోకే డ్రాయింగ్‌రూమ్‌లోకి వచ్చింది.

'బాగా అలసిపోయినట్లు వున్నారే ?'

'ఏదో ఉదయంనించి తిరగడంమూలాన అల్లా కనపడుతున్నానేమో !'

'అయితే ఈరోజు కాలేజీకి వెళ్ళలేదా ?'

'లేదు. చదువు మానేశాను.'

'ఎప్పటినించి ?'

'ఈరోజునించే'

'డబ్బులేకనేనా ?'

ఆ ప్రశ్నకి రఘు ఉక్కిరిబిక్కిరిఅయినాడు - ఆ విషయంలో పద్మ తనని అంత సూటిగా ప్రశ్నిస్తుందని అతను ఎన్నడూ అనుకోలేదు.

'కాదనుకో.........ఇంకా ఇతరకారణాలుకూడా వున్నాయి.'

'ఆ కారణాలు ఏమిటో అడగవచ్చునా ?'

'దేవిగారు అడుగనూవచ్చు, నేను చెప్పనూవచ్చు.'

ఆవాక్యానికి పద్మ నొచ్చుకుందేమోనని రఘు ఆమె కళ్ళల్లోకి పరీక్షగా చూచాడు. అల్లాంటిదేమీ జరిగినట్లు తోచలేదు. కాగా, కొద్దిగా సిగ్గుపడినట్లుకూడా కనపడింది.

'అయితే చెప్పండి ?'

'సత్యాగ్రహంచేయదలుచుకున్నాను !'

'అమ్మ బాబోయ్ ! సత్యాగ్రహమే !!'

'ఏం, ఎందుకుచేయగూడదు ?'

'అవును-ఎందుకుచేయగూడదు - తప్పకుండా చెయ్యండి కాని......'

'కాని?'

'ముందుగా మాకు నోటీసుయివ్వడం మంచిది'

'మాకు అంటే?'

'మాకు' అనేది బహువచనప్రయోగం - అందులో నేనూ, రమణ యిమిడిఉన్నాం'

'మీకు ముందుగా నోటీసుఇవ్వడం ఎందుకు?'

'మీరు సత్యాగ్రహంచేయడానికి తలపెట్టింది మాకు వ్యతిరేకంగా కాదా?'

'మీకు వ్యతిరేకంగా సత్యాగ్రహంచేయడం దేనికి?'

'మరి, సత్యాగ్రహం ఎందుకు చేస్తున్నారు?'

'ఏమిటో! నీమాటలు నాకు బొత్తిగా అర్థంకావడం లేదు.'

'మీమాటలు నాకు అంతకన్నా అర్థంకావడం లేదు.'

'నేను స్టేటుకాంగ్రెస్ సత్యాగ్రహంలో చేరదలచుకున్నాను. ఇప్పుడు తెలిసిందా?'

'ఈరోజు మీరు ఇంట్లో ఎవ్వరితోనూ పోట్లాడి రాలేదు కద!'

'ఇంట్లో ఎవ్వరితోనూ పోట్లాడలేదు. ఇప్పుడు నీతో పోట్లాడుతున్నాను.'

'నేను అబలని - ఇట్టే ఓటమిని ఒప్పుకుంటాను. ఇంక సత్యాగ్రహంచేయడం దేనికి?'

'వేళాకోళం వదిలిపెట్టు. రేపు సత్యాగ్రహంలో చేరదలచుకున్నాను. ఆ సంగతే చెప్పడానికి వచ్చాను.'

'వేళాకోళం చేస్తున్నది మీరా? నేనా?'

'నే నేమి వేళాకోళంచేస్తున్నాను?

'పెళ్ళాంమీద అలిగి సన్యాసంపుచ్చుకున్నట్టు - డబ్బు లేక చదువు మానేసి, సత్యాగ్రహంచేయడానికి పూనుకోవడం వేళాకోళం కాక మరేమిటి చెప్పండి?'

'మరి న న్నేమి చేయమంటావు?'

'ఏమి చేయమంటానా? డబ్బుపుట్టించుకొని శ్రద్ధగా చదువుకొమ్మంటాను.'

'ఆ డబ్బు పుట్టేమార్గమే కనపడలేదు'

'ఒక్కమాట చెబుతాను వింటారా?'

'ఊఁ......'

'నిజంగా మీకు సత్యాగ్రహంపైన భక్తిశ్రద్ధలు ఉన్నాయా?'

'చదువు మానేయడానికి నిశ్చయించుకున్న తరువాత భక్తిశ్రద్ధలు కుదిరాయి.'

'మీకు రాజకీయా లేమైనా తెలుసునా?'

'లేదు, క్రమంగా తెలుసుకుంటాను.'

'ఆ తెలుసుకున్నతరువాత, అప్పటికీ మీకు ఉత్సాహముంటే, తప్పకండా సత్యాగ్రహం చెయ్యండి — నేను కాదనను. కాని, సంగతి సందర్భా లేమిటో, చివరకి సత్యాగ్రహం ఎందుకు చేస్తున్నామో కూడా తెలుసుకోకండా, ఉద్రేకం కొద్దీ, పరిస్థితులు మనకిఅనుకూలంగా ఉన్నాయని విసుక్కొని ఉద్యమంలోకి దూకడం నేను ఏమాత్రం హర్షించను.'

'అదంతా నిజమే - కాని. ఇప్పుడు న న్నేమి చేయమంటావో చెప్పు'

'మీ రేమీ అనుకోకపోతే, మీకు కావలసినడబ్బు నేను ఇస్తాను-మీరు హాస్టల్లో చేరి శ్రద్ధగా చదువుకోండి.'

'నీదగ్గర డబ్బు ఎక్కడిది?'

'మా జమీందారీ కుటుంబాలలో కొన్ని కట్టుబాట్లు ఉన్నాయి. అందులో కొన్ని మంచివి కావచ్చు, కొన్ని చెడ్డవి కావచ్చు. నెలపేరిట స్వంతఖర్చులకోసం కొంతపైకం ఇవ్వడం, ఆ మంచికట్టుబాటుల్లో ఒకటి.'

'నెలకి నీ కెంత ఇస్తా రేమిటి?'

'75 రూపాయలు.'

'ఇంట్లో తక్కినవాళ్ళందరికీ అలవెన్సు లుంటాయా?'

'ఆఁ, మాఅమ్మకి రెండువందలు-మాతమ్ముడికి 50. ఈ డబ్బు మేము ఎల్లాఖర్చుపెట్టుకున్నా మమ్మల్ని ఎవ్వరూ అడగరు. ఈ 75 రూపాయలు కాక, నా చదువుకయ్యేఖర్చు లన్నీ నాకు ప్రత్యేకంగా ఇస్తారు. ఇదేకాక, పండుగలకీ పబ్బాలకీ మరికొంతడబ్బు ఇస్తారు.'

'మరి ఆ 75 రూపాయలు నెలపేరిట ఎల్లా ఖర్చు చేస్తావు?'

'ఆ డబ్బు ఖర్చుచేయవలసిన అవసరమే కనపడదు. బ్యాంకులో వేస్తాను'

'ప్రస్తుతం బ్యాంక్లో నీకు ఎంతడబ్బు వుంది?'

'పదివేలదాకా వుంది. ఇదికాక నా చదువుఖర్చుల కని ఓ పాతికవేలరూపాయలు, నా పెండ్లిఖర్చుకని ఒకలక్ష రూపాయలు విడివిడిగా బ్యాంకులో అకౌంట్లు ఉన్నాయి.'

పద్మ వాళ్ళు ఏదో శ్రీమంతు లనుకున్నాడేకాని, అంత శ్రీమంతులని రఘుకి ఎన్నడూ తెలియదు. పద్మ చెప్పిన సంగతుల్నివిని రఘు ఆశ్చర్యచకితు డైనాడు.

'నీస్వంతఖర్చులకి ఇస్తున్నడబ్బు నీ యిష్టంవచ్చినట్లు నీవు ఖర్చుచేసుకుంటే మీవాళ్ళు ఎవ్వరూ ఏమీ అనరా?'

'10 వేల రూపాయలు మానాన్నకి ఒకలెఖ్ఖలోనివి కావు. కాగా, ఈయింట్లో నాకు సంపూర్ణస్వాతంత్ర్యం వుంది. నాపై మా నాన్నకిగల విశ్వాసమే ఈ స్వాతంత్ర్యానికి కారణం. డబ్బు దుబారాచేయననీ, వంశాన్ని అవమానాల పాలుచేసే పనేమీ నేను చేయననీ ఆయనకు గట్టినమ్మకం.'

'ఇంతవరకు డబ్బు దుబారాచేయనిమాట నిజమే. కాని, ఇకముందునుంచి చేస్తావేమోనని నా భయం.'

'ఆ భయం మీ కక్కరలేదు. నేను ఏ పనీ, బాగా ఆలోచించికాని చేయననిమాత్రం తెలుసుకోండి......... మాటల్లోపడి మీసంగతే మరిచిపోయినాను. లెండి, మొహం, కాళ్ళూ చేతులూ కడుక్కోండి. కాస్త ఫలహారంచేద్దురు గాని...'

రఘు లేచాడు. పద్మ డ్రాయింగ్ రూమ్‌కర్టెన్ ఎత్తి, రఘుకి లోపలికి, దారిచూపించింది. పెద్దచతుశ్శాలభవంతి. రఘుకి చుట్టుపక్కల ఎవ్వరూ కనపడలేదు. భవంతిని అంటి బాత్ రూమ్. లోపల కాళ్ళు, మొహం కడుక్కోవడానికి పెద్ద గంగాళంలో వేడినీళ్ళుపెట్టిఉన్నాయి. పక్కన పీటవేసిఉంది. ఆ పక్కన ఒక ఎత్తైన స్టూలుపైన సబ్బూ, అద్దం, దువ్వెన ఉన్నాయి. రఘు కాళ్ళూచేతులూ, మొహమూ కడుక్కొని

వెనక్కి తిరిగాడు. పద్మ టవల్ అందించింది. మొహంతుడుచుకొని, చేతులుతుడుచుకున్నాడు. వాసననూనెసీసా అందించింది. తలకి నూనెరాచుకొని, దువ్వెనతో క్రాపు దువ్వుతున్నాడు. డ్రాయింగ్ రూమ్ లోకి తిరిగివస్తూ 'ఈరోజు దాసీలు ఎవ్వరూ కనపడడంలేదేం?' అని పద్మని అడిగాడు రఘు.

'మీకు దాసీలంటే ఇష్టంలేదు. అందువల్ల కనపడవద్దని చెప్పాను.'

'ఆ సంగతి నీకెల్లా తెలిసింది?'

'నేను ఎదుటివారిహృదయాలు చదువగలను.'

'నిజమే. నాకు దాసీలంటే బొత్తిగా యిష్టంలేదు. వాళ్ళకి పెళ్ళిళ్ళుచేయకండా యావజ్జీవం చాకిరీచేయించుకోవడం దారుణమైన విషయం.'

'ఆసంగతి నాన్నతో మాట్లాడి, వాళ్ళల్లో ఈడుమళ్ళనివారికి కొందరికి పెళ్ళిళ్ళు ఏర్పాటుచేయించాను.'

'నిజంగానా!' రఘు తనచెవుల్ని తానే నమ్మలేక పద్మని ప్రశ్నించాడు.

'జమీందారీఇళ్ళల్లో కొన్ని మంచివీ, కొన్ని చెడ్డవీ ఆచారా లున్నాయని ఇంతకుపూర్వమే చెప్పాను కదూ! సదాచారాల్ని పాటిస్తూ, కొన్ని దురాచారాల్ని తొలగించివేయడానికి నేనూ, నాన్నా శాయశక్తులా ప్రయత్నం చేస్తున్నాం.'

ఈడుమళ్ళని దాసీలకి పెళ్లిళ్ళుచేస్తున్నారని తెలుసుకొని రఘుకి ఎంతో సంతోషం కలిగింది.

సేవకుడు పెద్ద ట్రేలో ఫలహారాలు తీసుకొచ్చాడు. గులాబ్ జామున్, ఉల్లిపాయలపకోడీలు చూచి, రఘు ప్రాణాలు లేచివచ్చాయి. ఇద్దరూ కలిసిఫలహారంచేశారు. పద్మ టీ కలిపి, ఒకకప్పు రఘుకి అందించింది. తానూ ఒకకప్పు తీసుకుంది.

'మీా నాన్నగారు ఇంట్లో ఉన్నారా?'

'ఇంతకు క్రితమే వచ్చారు.'

'నేను ఇల్లా వచ్చిపోవడం మీానాన్నకి యిష్టముండ దేమో?'

'ఇష్టముండదని ఎవరైనా చెప్పారా?'

'లేదు. నేనే అనుకుంటున్నాను.'

'అయితే మీారు పొరపాటుపడుతున్నారు. నా కేది ఇష్టమో, మానాన్నకి అదేఇష్టం. ఈ ఇంట్లో నావిషయంలో నాకు సంపూర్ణస్వాతంత్ర్యం వుంది.'

'ఇల్లా ఒకఅబ్బాయితో ఒకఅమ్మాయి ఒంటరిగా కాలంగడపడం, తనస్వాతంత్ర్యాన్ని దుర్వినియోగంచేయడం కాదూ?'

'అబ్బాయీ, అమ్మాయీ మంచివాళ్ళు అయితే కూడా దుర్వినియోగంచేయడం ఎల్లా అవుతుంది?'

'ఒంటరిగా నీవు ఇల్లా నాతో కాలంగడపడం అసలు మీావాళ్ళకి నచ్చుతుందా?'

'మొదటివిషయం నేను నా స్వాతంత్ర్యాన్ని దుర్వినియోగం చేయనని మావాళ్ళకి గట్టినమ్మకం. కాగా, రెండవ విషయం: అబ్బాయిరాకకి వాళ్ళు చిరకాలంనుంచీ అలవాటు

పడ్డారు. అందువల్ల నేను ఒంటరిగా మీతో కాలంగడపడం వాళ్ళకి ఇదివరకే తెలుసు. ఇందులో కొత్తఏమీ లేదు.'

రఘు పద్మయింటి కట్టుబాట్లకి మరీ ఆశ్చర్యచకితుడైనాడు. పద్మతలిదండ్రులు ఆమెని అంతగా విశ్వసించడం ఆమెమంచికో కాదో నిర్ణయించుకోలేకపోయినాడు.

'మీకు కులాలవిషయంలో ఇంకా పట్టింపు ఉందా?'

'ఆ మాట ఎందుకు అడుగుతున్నావో చెప్పు.'

'ఏమీలేదు. ఈపూట మాయింట్లో భోజనంచేసి వెళ్ళమని.'

'పుట్టడమేమో సదాచారసంపన్నమైన బ్రాహ్మణుల ఇంట్లో పుట్టాను. ఆ వాతావరణంలోనే పెరిగాను. కాని, బ్రాహ్మణత్వం అంటే ఏమిటో నాకు తెలియదు. వేదాలు, శాస్త్రాలు వదిలి, ఇంగ్లీషు, ఉర్దూ, పార్శీలు నేర్చుకున్నాను. రెండుసంవత్సరాలక్రితంనీవు ఈప్రశ్న అడిగితే, మేము బ్రాహ్మలం, మీరు బ్రాహ్మణేతరులు - మీఇంట్లో నేను భోజనం చేయనని, తకీమని జవాబుచెప్పేవాడిని. కాని, ఇప్పుడేమి సమాధానం చెప్పాలో నాకు తోచడంలేదు.

'రెండు సంవత్సరాలక్రితం రమణ మాయింట్లోవున్నప్పుడు ఆమెని మాయింట్లో భోజనంచేయమని అడుగలేదు. ఆమెని భోజనానికి పక్కనున్న బ్రాహ్మలింటికి పంపించాం.'

'బ్రాహ్మణ, బ్రాహ్మణేతరభేదాలు బూటకాలని నేనూ విశ్వసిస్తాను. ఏవో బూజుపట్టిన ఆచారాలను నేటికీ చెక్కుచెదరని స్థితిలో పాటిస్తూరావడం బూటకమని నేను భావిస్తాను. కాని, ఇంతకుపూర్వం ఎన్నడూ బ్రాహ్మణేత

రుల ఇండ్లల్లో భోజనంచేసిఎరగను. అందుకోసం భోజనం చేయడానికి కొద్దిగా సందేహపడుతున్నాను.'

'అయితే, ఈరోజు మాయింట్లో భోజనంచెయ్యండి. మీ సందేహంకాస్తా తీరిపోతుంది.'

'సరే, నీయిష్టం; కాని, నేను ప్రేమావతీపేటకు వెళ్ళాలి. బాగాచీకటిపడ్డతరువాత అక్కడికి వెళ్ళడం, కొద్దిగా ప్రమాదకరం. దారిలో దొంగలభయం. అందువల్ల ఈ రోజుకి నన్ను వదలివెయ్యి. ఈసారి ఎప్పుడైనా వచ్చినప్పుడు మీయింట్లో భోజనంచేస్తాను.'

'ఈసారి వచ్చినప్పుడెప్పుడో ఎందుకు? ఈరోజే మా యింట్లో భోజనంచెయ్యండి. రేపటినుంచీ హాస్టల్‌లో వుంటే, అందరితో భోజనంచెయ్యడంకూడా అలవాటు అవుతుంది. భోజనంచేసిన తరువాత, మా డ్రైవరు కారులోతీసుకెళ్ళి మిమ్మల్ని ప్రేమావతీపేటలో దిగబెట్టి వస్తాడు.'

'అయితే సరే. కాని, హాస్టల్‌లోవుంటే చదువు సాగదు. అందువల్ల పట్నంలో ఒకయిల్లు అద్దెకు తీసుకొని, మాఅమ్మను తీసుకొచ్చి ఇక్కడే వుండి చదువుకుంటాను.'

'ఎల్లా చదువు బాగాసాగుతుందని మీకుతోస్తే, అల్లా చెయ్యండి.'

ఏవేవో కబుర్లతో రెండుగంటలు దాటాయి. సాయంత్రం 7 గంటలకి పద్మ డ్రాయింగ్‌రూమ్‌లో భోజనంఏర్పాటు చేసింది. వెండికంచంలో అన్నం, దానిచుట్టూ ఓ పది వెండిగిన్నెలు, వాటిలో ఏవేవో పదార్థాలు ఉన్నాయి. పద్మ రఘుకి స్వయంగా వడ్డించింది. రఘు వెండిగిన్నెల్లోని కూరలు,

పచ్చళ్ళు రుచిచూచాడు. ఒకొక్కటిగా అన్నీ కొద్దికొద్దిగా కలుపుకున్నాడు. మామూలుకన్నా ఎక్కువే భోంచేశాడు. పెరుగుతో భోజనం ముగించాడు. భోజనానంతరం అతని ముందరే కూర్చొని పద్మ రఘుకి తాంబూలంచుట్టియిచ్చింది. తాంబూలంవేసుకొని, "ఇంక వెళ్ళివస్తా" నని చెప్పేసరికి ఆమె ఒకకవరు చేతికి అందించింది. కవరుపైన ఏమీ వ్రాసిలేదు. కవరు అంటించివుంది. కవరు జేబులోపెట్టుకొని, రఘు అక్కడినించి కారులో ప్రేమావతీపేటకు బయల్దేరాడు. డ్రాయింగ్‌రూమ్‌గుమ్మందాటుతూండగా 'మళ్ళీ ఎప్పుడు కనపడతా' రని పద్మ అడిగింది. 'రెండుమూడురోజుల తరువాత ఒకమాటు వస్తా' నని చెప్పి, రఘు డ్రాయింగ్‌రూమ్‌గుమ్మం దాటాడు. కారు దాదాపు ఒకఅరగంటలో ప్రేమావతీపేట చేరుకుంది. కారు దిగి 'ఇంక తిరిగి వెళ్ళు' మని డ్రైవరుతో చెప్పి రఘు ఇంట్లోకి వెళ్ళాడు. కవరు చింపి చూస్తే అందులో అయిదునోట్లు—వందరూపాయలవి—ఉన్నాయి.

# 10

కంఠెతీసుకొని వెళ్ళిననాటినించీ విశ్వేశ్వరరావు ఇంటికి తిరిగి రాలేదు. సాయంత్రం కాగానే, రోజూ రుక్మిణి అతని కోసం ఎదురుచూస్తుంది. ఇద్దరికీ వంటచేస్తుంది. రాత్రి పదకొండు, పన్నెండు గంటలదాకా విశ్వేశ్వరరావుకోసం దారి కాస్తుంది. వాకిలి కాస్తచప్పుడైతే, దిగ్గున లేచి వెళ్ళి, తలుపు తీస్తుంది. ఎవ్వరూ కనపడకపోవడంతో హతాశురాలు అవుతుంది. కాసేపు నిశ్చేష్టురాలై వాకిలిగుమ్మంలో కను చూపుమేరవరకూ పరికించి చూస్తుంది. చూచిచూచి, చివరకి

విసిగి, వాకిలితలుపు వేసుకుంటుంది. వచ్చి వంటయింట్లో కూచుం టుంది. ఎందుకో వంటయింటిని ఆనుకొనివున్న గదిలో ఒంట రిగాకూచోడానికి ఆమెకు భయం ఎవరైనావస్తే వాకిలితలుపు తీయడానికితప్ప ఆమె ఆ గదిలోకి వెళ్ళదు. వంటయింట్లోనే పడుకుంటుంది. వంటయింట్లోనే కాలం గడుపుతుంది. రాత్రిళ్ళు ఆమెతోపాటు లాంతరుకూడా మేలుకొనివుంటుంది. ఆమె పడుకున్నప్పుడు అది ఆమెకి రక్షణగా సన్నగా వెలుగు తుంది. రాత్రిళ్ళు ఏ కాస్త అడుగులచప్పుడైనా విశ్వేశ్వర రావు వస్తున్నాడని అనుకుంటుంది. అడుగులచప్పుడు పరీ క్షగా వింటుంది. అది దగ్గరపడితే సంతోషిస్తుంది. దూరమ యితే నిరాశచెందుతుంది. ఎదురుచూస్తూ, ఎదురుచూస్తూ, విసిగి అలసిపోయి కొంగుపరచుకొని వంటయింట్లో నిద్రపోతుంది. ఆరాత్రికి ఇంక భోజనం ఉండదు. ఒంటిపూట భోజనాలతో ఇల్లా ఎన్నోరాత్రులు గడచిపోతున్నాయి. రాత్రితరువాత పగలు వస్తుంది. రుక్మిణి ఓపికగావుంటే తిరిగి వంటచేస్తుంది. ఒంటరిగా భోజనంచేస్తుంది. భోజనంఅంటే ఏదో ఎంగిలిపడడ మన్నమాట. పగళ్ళు విశ్వేశ్వరరావుకోసం ఎదురుచూడదు. ఎందుకో అతను పగటిపూట ఇంటికి రాడని ఆమెకి ఒక గట్టి నమ్మకం. ఏరాత్రిపూటో ఎక్కడినించో ఊడిపడతాడని ఆశ!

రాత్రులు వేడినిట్టూర్పులు విడిచి, పగళ్ళుగా మారు తున్నాయి. పగళ్ళు రాత్రిళ్ళకౌగిళ్ళల్లో విలీనమవు తున్నాయి. కాలచక్రం రోజుల్ని చుట్టుతున్నది. ఐనా విశ్వేశ్వరరావు ఇంటికి తిరిగిరాలేదు. అతను తనని మోస గించాడనే దుగ్ధ రుక్మిణికి లేదు. అతను తన కంటె,

గొలుసు తీసుకున్నాడనే ఆలోచన ఆమెకు ఎన్నడూ లేదు. అవి తనసొమ్ములని ఆమె ఎన్నడూ భావించలేదు. దైవికంగా అవి తనదగ్గరికి వచ్చాయి. ఏదో చిన్నప్పుడు తప్ప, ఇంగిత జ్ఞానం వచ్చినతరువాత ఆమె ఎన్నడూ వాటిని పెట్టుకొని ఎరుగదు. బుద్ధితెలిసినప్పటినుంచీ ఆమె విధవగానే బ్రతికింది. విధవ సొమ్ములు పెట్టుకొని ఎల్లా తిరుగుతుందని? అందువల్ల వాటిని పెట్టెలోపడేసి ఉంచింది. వాటిఅవసరం ఆమెకు ఎన్నడూకలుగలేదు. విశ్వేశ్వరరావుకి వాటిఅవసరం వచ్చింది. వాటిమూలాన అతనిజీవితం బాగుపడేఅవకాశం ఏర్పడింది. తనకి అవసరంలేని వస్తువులు, తనదగ్గర ఉంచుకొని ఏం లాభం? వాటిఅవసరం ఉన్నవాళ్ళకి వాటిని ఇచ్చివేస్తే-వారిఇబ్బందులు తీరుతాయి. వారికష్టాలు గట్టెక్కుతాయి. తనమూలకంగా ఇతరులు సుఖపడడమంటే, రుక్మిణికి ఎంతో ఇష్టం. అందులో ముఖ్యంగా విశ్వేశ్వరరావు సుఖపడడం కళ్ళారాచూచి ఆనందించాలనే ఉద్దేశంతో రుక్మిణి తన సొమ్ములు అతనికి యిచ్చింది. విశ్వేశ్వరరావు తిరిగి ఇంటికి రాలేదనే బెంగ తప్ప, సొమ్ములుపోయినాయే అనే బెంగ ఆమెకు ఎన్నడూ లేదు. తన నీచత్వంకొద్దీ విశ్వేశ్వరరావు రామనాథందగ్గర అప్పుతీసుకొని, ఆఅప్పుకి తనని తాకట్టుపెడతాడని ఆమె కలలోకూడా అనుకోలేదు. వెండి బంగారువస్తువులు తాకట్టుపెడితే వాటిని విడిపించుకోవాలనే ఆసక్తి, ఒకనాడుకాకపోతే ఒకనాడైనా కలుగుతుంది. స్త్రీని తాకట్టుపెడితే, అది విడిపించుకునేవస్తువు కాదని తాకట్టుపెట్టేవాడికీ, పెట్టుకునేవాడికీ ఉభయులకూ తెలుసు. వెండి బంగారాల

ముందు మానవజీవితానికి ఎట్టివిలువా లేదనికూడా తెలుసు. అందులో స్త్రీజీవితానికి అసలే విలువ ఉండదు.

విశ్వేశ్వరరావు తనఅప్పు ఎన్నడూ తీర్చలేడని రామనాథానికి బాగా తెలుసు. తెలిసికూడా అప్పు ఇచ్చాడు. రుక్మిణే దీనికి ప్రబలకారణం. మీ స్నేహితుడి ప్రవర్తన నా కేమీ నచ్చలేదని ఒకనాడు రుక్మిణి విశ్వేశ్వరరావుకి చెప్పడంతో, విశ్వేశ్వరరావు రామనాథానికి రుక్మిణిపైగల మోజు గ్రహించాడు. ఆ మోజుని ఊతగాగొని మరుసటి ఉదయమే రామనాథం దగ్గరికి అప్పుకోసం వెళ్ళాడు. విశ్వేశ్వరరావుదగ్గర కంటె ఉందన్నసంగతి రామనాథానికి తెలియదు. ఒక వెయ్యిరూపాయలు అప్పయిస్తే, ఇవ్వవలసిన వాళ్ళకి కొంతడబ్బు ఇచ్చి ఆరోజు రాత్రిబండికి ఊరికివెళ్ళి మరికొంత డబ్బు తెచ్చి ఎక్కడిఅప్పులు అక్కడ సర్దివేస్తానని చెప్పాడు. ప్రస్తుతానికి తనదగ్గర వెయ్యిరూపాయలు లేవనీ, తానుఅయిదువందలుమాత్రం ఇవ్వగలననీ రామనాథం అన్నాడు. విశ్వేశ్వరరావు ఆఫీసుకు ఎనిమిదిరోజులు సెలవు పెట్టి, ఆ అయిదువందలు తీసుకొని ఎక్కడికో కనపడకుండా వెళ్ళిపోయినాడు. విశ్వేశ్వరరావు వెళ్ళిపోయినసంగతి తెలుసుకొని ఆరోజు సాయంత్రమే రామనాథం రుక్మిణిదగ్గరికి వచ్చాడు. విశ్వేశ్వరరావు ఆనాడు ఇంక తిరిగిరాడని నిశ్చయించుకొని రుక్మిణిని బలవంతంచేశాడు. రుక్మిణి విధిలేక రామనాథం పశుప్రవృత్తికి లొంగిపోవాల్సివచ్చింది. ఆరోజు నుంచీ రామనాథం రుక్మిణిదగ్గరికి రోజుకు ఒకసారైనా వెళ్ళి రావడం మొదలుపెట్టాడు. అతనికి నగరంలోని హెడ్ క్వా

ట్రస్టుకి ట్రాన్స్‌ఫర్ కావడంవల్ల, ఎనిమిదిరోజులసెలవు తరువాత విశ్వేశ్వరరావు తిరిగివచ్చి హిమాయత్‌సాగర్ ఫారమ్‌లో ఉద్యోగంలో చేరిందీ లేనిదీ తెలియదు.

రోజులు గడచిపోతున్నాయి. విశ్వేశ్వరరావు తిరిగి వస్తాడనేఆశ రుక్మిణిని వదలలేదు. రాత్రిళ్ళు అతనికోసం ఎదురుచూస్తూనే వుంది. ఇద్దరికీ వంట వండుతూనే ఉంది. ఎదురుచూచి, ఎదురుచూచి, పస్తులుపడుకుంటూనే వుంది. రామనాథం బలవంతానికి లొంగిపోతూనే వుంది. శరీరం అప్పగిస్తూనే వుంది. జీవితం గడిచిపోతూనే వుంది. కాని ఎక్కడో లోటు- ఏదో వెలితి! కాని ఆ లోటు ఎక్కడుందో, ఆ వెలితి ఎందుకు వచ్చిందో ఆమెకు తెలియదు. విశ్వేశ్వరరావు తిరిగివస్తే, ఆ లోటు తీరుతుందా? ఆ వెలితి పూర్తి అవుతుందా? ఏమో? చెప్పలేము.

విశ్వేశ్వరరావు ఉన్నప్పుడుమాత్రం రుక్మిణి ఏమంత సుఖంగా గడిపిందని? ఏమంత సంతోషంగా రోజులు వెళ్ళబుచ్చిందని? అప్పుడుకూడా జీవితాన్ని మోడుగా గడిపింది. నిరుత్సాహంగా, నిర్లిప్తంగా జీవితాన్ని ఈడ్చింది. విశ్వేశ్వరరావుతో లేచివచ్చినప్పుడు రుక్మిణిహృదయాకాశంలో ఇంద్రధనుస్సులు వెల్లివిరిశాయి. ఆశలు, ఆశయాలు చిగురించాయి. తనజీవితం అర్థవంతంగా మారబోతున్నదని తోచడంతో ఆమెహృదయం ఎగిరి గంతువేసింది. జీవితమే చాకిరిగా భావించిన ఆమెహృదయానికి ఒక వెలుగు కనపడింది. దానితో భవిష్యజ్జీవితాన్నిగూర్చి కమ్మనికలలు కన్నది. ఇంతకాలానికి 'నా' 'నాది' 'నేను' అనేమాటలకు ఒక

స్వరూపం ఏర్పడుతున్నందుకుఎంతోసంతోషించింది. పత్నిగా, గృహయజమానురాలుగా, సంఘంలో తనకు ఒక సముచిత స్థానం లభిస్తున్నందుకు గర్వించింది. కాని ఆ ఆశలు అట్టే కాలం నిలువలేదు. విశ్వేశ్వరరావు పెళ్ళిచేసుకోనని నిరాకరించడంతో ఆశాసౌధాలు నేలమట్టమైనాయి. హృదయంలోని నందనవనాలు భస్మీపటలమైనాయి. వికసిస్తున్న మొగ్గలు తిరిగి ముకుళించుకుపోయినాయి. గౌరవప్రదమైన పత్నీ స్థానంనించి ఉంపుడుకత్తెస్థానంలోకి దిగజారడంతో, ఆమె హృదయం కరడుకట్టిపోయింది. స్పందించడం మానుకుంది. తనజీవితానికి ఇక ఉగాదులుగాని, ఉషస్సులుగాని లేవని తేలిపోయింది. జగత్పరివ్యాప్తమవుతున్న హృదయం ఒక చోటికి కుదించుకుపోయింది. చివరకు సంకుచితమైంది. విశ్వేశ్వరరావు, అతనిఅప్పులు, అతనికష్టాలవరకే పరిమితమైంది. ఆ పరిధుల్ని దాటి స్పందించడం వదలివేసింది. కాని విశ్వేశ్వరరావు దృష్టిపథంనుంచి తొలగిపోవడంతో అతనిఅప్పులు, అతని సమస్యలకి విలువలేకుండాపోయింది. అతను ఉన్నంత కాలం ఆ సమస్యలతో ఆరాటపడింది. అతను కనపడకండా వెళ్ళిపోవడంతో రుక్మిణిజీవితంలో ఒక లోటు, ఒక వెలితి ఏర్పడింది. జీవితమే కష్టాలుగా మారిన రుక్మిణికి, ఇతరుల కష్టాలపట్ల సానుభూతి చూపడం అలవడింది.

రామనాథానిది కడుపులోచల్ల కదలనిజీవితం. అతని జీవితంలో సిమ్మోన్నతాలు, కష్టసుఖాలు, ఒడిదుడుకులు ఏమీ లేవు. కాగా, అతనిది ఇంత కలిగినకుటుంబం. హాయిగా, సుఖప్రదంగా, విలాసంగా జీవితంవెళ్ళిపోతున్నది. ఇట్టిజీవితం

పట్ల రుక్మిణి ఏమాత్రం సానుభూతిచూపలేకపోయింది. కాగా, అతను బలవంతంగా ఆమెను లొంగదీసుకోవడం అతనిపట్ల విముఖత్వాన్ని రేపింది.

రెండు సంవత్సరాలక్రింతం రుక్మిణి విశ్వేశ్వరరావుతో లేచిపోయినప్పుడు ఆ వార్త ఆనోటా, ఈనోటా పడి గ్రామమంతా చప్పున వ్యాపించింది. ఒకటి రెండురోజులకు గ్రామం ఎల్లల్ని దాటి హిమాయత్‌సాగర్ ఫారంలోకి ప్రాకింది. ఫారంలో పనిచేసే ఉద్యోగులు చాలావరకు ప్రేమావతీ పేటలో ఇండ్లు బాడుగులకుతీసుకొని ఉండడమే దీనికి ముఖ్యకారణం. విశ్వేశ్వరరావు ఈశ్వరరావుఇంట్లో బాడుగకి ఉంటున్నసంగతి ఫారంలో చాలామందికి తెలుసు. ఈశ్వరరావుకూతురు లేచిపోయిందని తెలియడంతో వాళ్ళంతా సంగతి సందర్భాలు తెలుసుకోవడానికి విశ్వేశ్వరరావుని చుట్టుముట్టారు. ఆ అమ్మాయి ఎవరితో లేచిపోయిందో తనకేమీ తెలియదని విశ్వేశ్వరరావు తోడిఉద్యోగస్థులతో బొంకాడు. కాని, తనసెక్షన్‌లోనేపనిచేస్తున్న రామనాథంతో అల్లా బొంకి ప్రయోజనం లేకపోయింది. ఫారంలో పనిచేసే అలగాజనంద్వారా అతను ఇదివరకే అన్ని సంగతులూ తెలుసుకొనిఉండడంవల్ల, అతను విశ్వేశ్వరరావు కల్లబొల్లి మాటల్ని ఏమాత్రం నమ్మలేదు. కాని, విశ్వేశ్వరరావు ఒంటరిగా వున్నప్పుడు అతన్ని నిలవదీసి, నిజంచెప్పమని అడిగాడు. విశ్వేశ్వరరావుది మొదటినుంచీ అప్పులజీవితం. రామనాథం చేతిలో నాలుగుకాసులున్నమనిషి. కాగా, తనకి మంచిస్నేహితుడు. ఇట్టిపరిస్థితుల్లో తనకి ఏనాడైనా రామ

నాథంసహాయం కావల్సివస్తుందని భావించి, విశ్వేశ్వరరావు ఉన్నసంగతి ఉన్నట్లు చెప్పాడు. పైగా, రుక్మిణితో తాను చుడీబజారులో కాపురం ఉంటున్నాననీ, ఒకమాటు వీలు చేసుకొని తమఇంటికి రావలసిందనికూడా ఆహ్వానించాడు. చుడీబజారు ఇంటిఆనవాలు చెప్పాడు.

మొదట రామనాథం విశ్వేశ్వరరావు ఆహ్వానాన్ని నిర్లక్ష్యంచేశాడు. కాని కొన్ని మాసాలతరువాత, రుక్మిణి చాలా అందమైనఅమ్మాయని తెలిసి, ఒకనాటిసాయంత్రం ఆమె తను విన్నంతసౌందర్యవతో, కాదో, తేల్చుకునేఉద్దేశంతో చుడీబజారుకు వచ్చాడు. కాకతాళీయన్యాయంగా ఆరోజు విశ్వేశ్వరరావు ఇంట్లోలేడు. రామనాథానికి రుక్మిణిని ఆపాదమస్తకంపరీక్షించి తీరిగ్గాచూడడానికి మంచిఅవకాశం దొరికింది. తను విన్నదానికన్నో రెట్లు ఎక్కువసౌందర్యం అతనికి ఆమెలో కనపడింది. కాగా, ఆమెయౌవనం అతనిని ఇట్టే ఆకర్షించింది. ఏవిధంగానైనా ఆమెను పొందవలెనని అతను వెంటనే నిశ్చయించుకున్నాడు. లేచివచ్చినమనిషికి నీతి నియమాలు ఉండవనే ఉద్దేశంతో వెంటనే ఆమెతో ప్రేమ సల్లాపాలలోకి దిగాడు. మంచినీళ్ళు అడిగి, ఆ నెపంమీద ఆమెని తాకడానికి ప్రయత్నించాడు. సూటిగా అదేపనిగా ఆమెకళ్ళల్లోకి చూచి, తనఉద్దేశాన్ని వ్యక్తపరచడానికి విశ్వప్రయత్నం చేశాడు. డబ్బుతో ఆమెని ఆకర్షించాలని చూచాడు. ఉద్రేకంలో తనప్రయత్నా లేవీ సఫలంకావడం లేదని తెలుసుకునేస్థితిలోలేడు. ఆనాడు రామనాథం అంతా సుముఖంగానే వుందని భావించాడు. మరుసటి ఉదయమే

విశ్వేశ్వరరావుని కలుసుకొని, అతనికి అయిదువందలరూపా యలు అప్పు ఇచ్చాడు. ఆనాటిసాయంత్రమే తాను ఊరికి వెడుతున్నానని విశ్వేశ్వరరావు చెప్పడంతో రామనాథానికి మార్గం మరీ సుగమమైంది. తోడుదొంగలిద్దరూ కలిసి ఒక ఒప్పందానికి వచ్చారు. రుక్మిణి ఆఒప్పందంలో ఇరుక్కు-పోయింది. విశ్వేశ్వరరావు తనజీవితంలో డబ్బే ప్రధానంగాఎంచి రుక్మిణిని గొడ్డునిఅమ్మినట్లు అమ్మాడు. రామనాథం క్రితం రోజునే ఉద్రిక్తుడై మతిభ్రమణంపొంది,ఆ గొడ్డుని కొన్నాడు. ఈ బేరానికి ఫలితంగా గొడ్డు చేతులుమారింది. కొనుగోలు దారుకి బలవంతంపైన తనశరీరాన్ని అప్పగించింది. రామనాథం రుక్మిణిశరీరాన్నిమాత్రమే కొన్నాడుగాని, ఆమెఆత్మని కొన లేదు. శరీరం లొంగిపోవడంతోఆత్మకూడా క్రమంగా తన స్వాధీనమవుతుందని భావించాడు. రోజులు గడుస్తున్నకొద్దీ యథాపూర్వంగా శరీరం లొంగుతున్నదేకాని,ఆత్మలొంగడం లేదు. ఎంతప్రయత్నించినా రుక్మిణిహృదయం తనపట్ల సుము ఖంకాకపోవడం రామనాథానికి ఆశ్చర్యంకలిగించింది. ఆమె మూగవోయిన హృదయం ఏమాత్రం స్పందించడంలేదు. ప్రేమించకపోవడం అటుంచి తన ప్రయత్నాలపట్ల సాను భూతినైనా చూపడంలేదు. ఏలోటూ రాకుండా సంసారభా రాన్ని తానువహిస్తున్నాడు.ఇంటికికావల్సిన వస్తువులు తెచ్చి యిస్తున్నాడు. రెండు కొత్తచీరలుకూడా తెచ్చిఇచ్చాడు. రుక్మిణి ఆ కొత్తచీరెలు కట్టుకోవడానికి నిరాకరించింది. పూలు తెచ్చియిస్తే పెట్టుకోదు. రామనాథం సొమ్ములఆశ కూడా చూపాడు. కాని లాభంలేకపోయింది.

రుక్మిణి రామనాథం పిలిస్తే పలుకుతుంది. లేకపోతే లేదు. తనంతట తాను ఏవిషయాన్నిగూర్చి రామనాథంతో మాట్లాడదు. అతను యింటికి వచ్చినప్పుడల్లా అతనికి కనపడ కండా వెళ్ళి వంటయింట్లో కూచుంటుంది. రుక్మిణి, రామనాథానికి ఒక కొరకరానికొయ్య అయింది. ఒక పెద్దసమస్యగా మారింది. ఆమె బిగుసుకుపోయినకొద్దీ 'ఆమెను నవ్వించాలి, తుళ్ళించాలి, కవ్వించాలి, తనపట్ల సుముఖం చేసుకోవాలి' అనే పట్టుదల రామనాథానికి ఎక్కువఅయింది. రాత్రింబగళ్ళు ఆమెతో కలిసివుంటే ఆమెను సుముఖంచేసుకోవచ్చునని అనుకున్నాడు. చుడీబజారుయింట్లో రుక్మిణి విశ్వేశ్వరరావుభార్యగా చలామణిఅయింది. అపవాదులకి వెరచి, ఆ యింట్లో అతను రుక్మిణితో రాత్రింబగళ్ళు కలసిమెలసి ఉండలేకపోతున్నాడు. అందువల్ల ప్రతిరోజూ పగటిపూట ఆ యింటికి వచ్చి పోతున్నాడు. వచ్చినప్పుడల్లా ఒకటిరెండు గంటలకన్నా ఎక్కువసేపు ఉండలేకపోతున్నాడు. పోనీ, యిల్లుమార్చేస్తే? పాతవాల్తేరుకి దగ్గరగా ఏదైనా యిల్లు చూస్తే? బాగానే వుంటుంది. తనరాకపోకలకు ఎట్టిఆటంకం ఉండదు. స్వేచ్ఛగా ఎప్పుడుపడితే అప్పుడు రావచ్చు. రుక్మిణితో రాత్రింబవళ్ళు కలసిమెలసి ఉండవచ్చు. చుడీబజారుయింట్లో ఉన్నంతకాలం, రుక్మిణి విశ్వేశ్వరరావుకోసం ఎదురు చూడడం మానుకోదు. అందువల్ల ఎంత తొందరగా యిల్లుమారిస్తే అంత మంచిది.

మధ్యతరగతికుటుంబాలమధ్య కాపురం ఏర్పర్చుకుంటే, వారికి నీతినియమాలపట్ల పట్టింపు ఎక్కువ. నీతినియ

మూలు లేని మనుషులని తోస్తే, వాళ్ళని అవహేళనగా చూస్తారు. శ్రామికకుటుంబాలమధ్య వుంటే, వాళ్ళకీ పట్టింపులు ఉండవు. వాళ్ళపనులతో వాళ్ళకి సరిపోతుంది. కాగా, క్షమించగలిగే ఉదారత్వంకూడా వాళ్ళలో వుంటుంది. శ్రామికజాతిలో మధ్యతరగతి కుటుంబాలలో వున్నంతకుళ్లు ఉండదు. ఇంకా ఆ జాతి ఆరోగ్యంగానేవుంది. ఆ జాతి కోపం వస్తే బాహాటంగా కోపగిస్తుంది. ప్రేమించదలచుకుంటే, స్వేచ్ఛగా ప్రేమిస్తుంది. కోపంవస్తే - కోపకారణ మేమిటో సభ్యత మేలిముసుగుక్రింద దాచేసి, హృదయం దహించుకుపోతున్నా పైకి చిరునవ్వులు నవ్వదు. దీనికి వ్యతిరేకంగా కల్లాకపటం ఎరుగనిది శ్రామికజాతి. రామనాథం ఆ జాతి మధ్యలో రుక్మిణిని ఉంచడానికి నిశ్చయించుకున్నాడు. వెంటనే పాతవాలాద్రికి సమీపంగా యిల్లు వెతకడం ఆరంభించాడు. ఒకటి రెండురోజుల్లో తనకు అనుకూలంగావుండే యింట్లో, ఒకభాగం అద్దెకు దొరికింది. ఆ యింట్లో, ఇరుగుపొరుగువారంతా శ్రామికులు. ఎక్కువగా సిగరెట్ఫ్యాక్టరీలో పనిచేసేవారు. ఉదయం ఎనిమిదిగంటలు అయ్యేసరికల్లా ఆడా మొగా భేదం లేకుండా తమతమ పనులమీద వెళ్ళిపోతారు. పగటిపూట పిల్లా జెల్లా, ముసలీ ముతకా తప్ప యిళ్ళల్లో ఎవ్వరూ ఉండరు. సాయంత్రం ఆరుదాటితే గాని ఎవ్వరూ తిరిగిరారు. ఇంత అనుకూలమైనయిల్లు తిరిగి దొరకడం కష్టమని తోచి, రామనాథం వెంటనే ఆ యింటికి రుక్మిణిని మార్చాడు.

తీరా బండివచ్చి యింటిముందు నిలబడేదాకా తాము యిల్లుమారుస్తున్న సంగతి రుక్మిణికి తెలియదు. అప్పటికీ తాను కొత్తయింటికి రానని మొండికేసింది. తన ప్రసక్తిలేకుండా పనిమనుషులు సామానంతా బండిలోకి సర్దారు. కొత్తయింటికి బండి కదిలివెళ్ళింది. సామానంతా వెళ్ళిపోయినతరువాత తను రానని ఎంత మొండికేస్తే ఏంలాభం? పైగా, తను ఎక్కువగొడవచేస్తే, ఇరుగుపొరుగువాళ్లు ఏమనుకుంటారో నని భయం. ఎందుకో రుక్మిణికి ఆయిల్లు వదిలి వెళ్ళడం ఎంతోకష్టంగా తోచింది. రుక్మిణి ఎన్నోఆశలు ఒడిగట్టుకొని ఆ యింటికి వచ్చింది. ఆ ఆశలన్నీ అడియాసలు కాగా, ప్రస్తుతం వెళ్ళిపోతున్నది. ఉన్న రెండుగదులూ ఒకమాటు తృప్తిగా కలయతిరిగింది. గుండె నిబ్బరంచేసుకొని, వెళ్ళి టాంగాలో కూచుంది. రామనాథం పక్కనే ఎక్కి కూర్చున్నాడు. టాంగా కదిలింది. కనుచూపుమేరవరకూ రుక్మిణి తాను వదిలిపెడుతున్న ఇంటిని, ఏదోపోగొట్టుకొని వెతకుతున్న దానికిమల్లే ఆతురతగా చూసింది. ఇల్లు కనుమరుగైంది. రుక్మిణికళ్ళల్లో అమాంతంగా నీళ్ళు తిరిగాయి. కళ్ళని కొంగుతో వత్తుకుంది.

రామనాథం దారిపొడుగునా రుక్మిణిగొడవే పట్టించుకోలేదు. ఎందుకు ఏడుస్తున్నావనికూడా అడగలేదు. దిక్కులు చూస్తూ కాలం వెళ్ళబుచ్చాడు. ఒకేటాంగాలో పక్కపక్కగా కూర్చునివున్న యిరువురువ్యక్తులభావాలు రెండు విభిన్నమార్గాల్లో సంచరిస్తున్నాయి. శరీరాల సన్నిహితత్వం భావైక్యతను కలిగించలేకపోయింది. రుక్మిణిహృదయం వదిలి

వచ్చినయింటిచుట్టూ రెపరెపలాడుతున్నది. రామనాథం హృదయం తాను రుక్మిణితో అప్పటినుంచి సంసారంచేయబోయేఇంట్లో అమర్చవలసినవసతుల్నిగూర్చి ఆలోచిస్తున్నది. రుక్మిణిహృదయం భూతకాలంపై లగ్నమైవుంటే, రామనాథంహృదయం భవిష్యత్తుపై ఆసక్తిచూపుతున్నది. రుక్మిణికి భవిష్యత్తు లేదు. రామనాథానికి భూతకాలం లేదు. ఉభయులహృదయాలూ వర్తమానంలో కలుసుకోవడానికి అవకాశం ఏమైనా ఉందా? ఏమో! చెప్పడం కష్టం!!!

రుక్మిణి టాంగాదిగి, కొత్తయింట్లోకి వెళ్ళింది. చుడీబజారునించి వచ్చినసామాను కుప్పగా ఒకచోట పెట్టివుంది. ఆ సామానంతా చూచి రుక్మిణికి పిచ్చెత్తినట్లైంది. సామానంతా సర్దడం మొదలుపెట్టింది. లోపలిగదిలో ఆమెకు ఒక పట్టెమంచం, ఒకటేబుల్, రెండుకుర్చీలు కనపడ్డాయి. మంచంపైన ఒక కొత్తపరుపు వుంది. మంచానికి దోమతెర అమర్చబడివుంది. ఇవన్నీచూచి, ఆకస్మికంగా ఆశ్చర్యపోయి, చివరకి సంతోషిస్తుందేమో ననే ఉద్దేశంతో రామనాథం వాటిని తెప్పించిపెట్టాడు. వాటినిచూచి ఆమె కించిత్తైనా చలించకపోవడం చూచి అతను ఆశ్చర్యచకితుడైనాడు. ఏ వస్తువులు ఆమెని సంభ్రమాశ్చర్యాల్లో ముంచివేయగలవో అతనికి అర్థంకాలేదు. ఏ వస్తువులు ఆమెలో తిరిగి ప్రాణప్రతిష్ఠ చేయగలవో అతనికి తోచలేదు. ఆమెజీవితంతో తనజీవితము పెనవేసుకుంటే? ఆమెజీవితంలో భాగం పంచుకుంటే? నిజంగా అప్పుడు జీవితం స్వర్గతుల్యమవుతుంది. అప్పుడుగాని,

ఆమెఅభిరుచులు, ఆశయాలు తనకు అర్థంకావు. ఆమె మనస్తత్వం తనకు బోధపడదు.

కొత్తయింటికి వచ్చినతరువాత, రుక్మిణి జీవనవిధానం ఏమాత్రం మారలేదు- మళ్ళీకడుతూనే వుంది. పూజాపురస్కారాలు జరుపుతూనే వుంది. పూర్వాచారాలను పొల్లుపోకుండా పాటిస్తూనేవుంది. ఆయింట్లో రామనాథండునికి ఆమె జీవనవిధానానికి అంతరాయం కలిగిస్తున్నది. వండినవంట ముట్టుకుంటాడు. తనతో సహపంక్తినికూచుని భోజనంచెయ్యమని రుక్మిణిని బలవంతంచేస్తాడు. కళ్ళుమూసుకొని పూజచేసుకుంటున్నప్పుడు వచ్చి పక్కన కూచ్చుంటాడు. రాత్రింబగళ్ళు రుక్మిణితో కలిసిమెలిసివుండి, ఆమెయింటిపనులలో కలుగజేసుకుంటాడు. చేదోడు వాదోడుగా మెలగుతాడు. కొంటెగా, ఆమెపనులకి అడ్డంకులు కల్పిస్తాడు. అప్పుడు ఏ వస్తువూ ఉండవలసినచోట ఉండదు. మంచినీళ్ళచెంబు మంచంమీద పడివుంటుంది. అద్దం, దువ్వెన అంట్లదగ్గర పడివుంటాయి. చెంబు వెళ్ళి వాకిలితలుపుదగ్గర తిష్టవేస్తుంది. రుక్మిణి ఇంటిని సరిదిద్దడానికి ప్రయత్నిస్తే, ఇల్లు మరీ అల్లకల్లోలంగా మారుతుంది. ఏదీ పట్టించుకోకుండా కాసేపు మౌనంవహిస్తే, ఏ వస్తువు కావస్తువు యథాస్థానాల్లోకి వచ్చి కూర్చుంటాయి.

నీళ్ళు ఏపాత్రలోపోస్తే, ఆపాత్రఆకారాన్ని దాల్చినట్టు రుక్మిణి తనకు తెలియకండానే పరిస్థితులకు అనుగుణంగా మారుతూవచ్చింది. బ్రాహ్మణీకం సడలిపోతున్నందుకు ఆమె ఎన్నడూ విచారించలేదు. తనఆచారాలు అడుగంటుతున్నం

దుకు ఆమె ఏకోశానా దుఃఖించలేదు. బ్రాహ్మణీకం అంటే ఆమెకు తెలిసిందల్లా మడికట్టుకోవడం, పూజాపురస్కారాలుచేయడం, ఎవరినీ అంటి ముట్టకండా భోజనంచేయడం. ప్రస్తుతం రామనాథం అఘాయిత్యంవల్ల ఇవేవీ జరగడానికి వీలులేనిపరిస్థితులు ఏర్పడ్డాయి.

బ్రాహ్మణీకంనుంచి రుక్మిణిని దిగజార్చడం రామనాథంఉద్దేశ మెన్నటికీ కాదు. ఆమెలో జీవితంపట్ల ఉత్సాహోద్రేకాల్ని పురికొల్పడమే అప్పట్లో అతనిజీవితాశయం. ఆమెను నవ్వించాలి, తుళ్ళించాలి-ఆనవ్వులలోని అందాన్ని, ఆ తుళ్లింతలలోని సౌందర్యాన్ని దొంగిలించి, ఉభయులజీవితాల్ని ఆనందమయంచేసుకోవాలి. ఇదీ అతనిదీక్ష—అతని తపస్సు. ఈ ఆశయంతో అతను రుక్మిణిజీవనవిధానాన్ని క్రమపద్ధతిగా మార్చివేశాడు. మధ్యతరగతి నియమాల్లోంచి ఆమెని వెలుపలికి లాగి, ఎవరు ఏంచేసినా, ఏపట్టింపూ లేని స్వేచ్ఛావాతావరణంలో ప్రతిష్ఠింపజేశాడు. జీవితంలో ఆమెకు కొన్ని సౌకర్యాల్ని సమకూర్చాడు. పరోక్షంగా ఆమెతో ప్రేమసల్లాపాల్లోకి దిగాడు. వీటివల్ల రుక్మిణిజీవితంలో సాంఘికంగా విప్లవాత్మకమైనమార్పు వచ్చింది. కులంపట్టింపులు సన్నగిల్లినాయి. సాంఘికంగా కడు అధోగతిలోవున్న శ్రామికజాతిమధ్య తను సంసారంచేస్తున్నాననేభావం, చివరకి తలెత్తకుండానే ఎగిరిపోయింది. జీవితంలో బలంగా దెబ్బతిన్న ఆమెహృదయం మొదటినించే సాంఘికవ్యత్యాసాలను గుర్తించడం మానుకుంది. ప్రవాహంలో పుడకకుమల్లే, ప్రవాహం ఎటుమళ్ళితే అటు కొట్టుకుపోవడానికి ఆమె

జీవితం సంసిద్ధపడింది. అందరికిమల్లే తనూ వివాహంచేసు కొని, తనజీవితాన్ని తీర్చిదిద్దుకుందామని ఆశపడింది కాని, విశ్వేశ్వరరావుస్వార్థంవల్ల పెళ్ళి ఎగిరిపోవడంతో జీవితంలో ఆ కొద్దిఆశ అడుగంటింది. అభిరుచులనేవి తలెత్తకముందే, ఆ అభిరుచులు అదృశ్యమైనాయి. వ్యక్తిత్వం వికసించక ముందే ఆమెవ్యక్తిత్వం హరించుకుపోయింది. తత్ఫలితంగా జీవితంలో ఏ కోరికలూ లేక హృదయం మూగవోయింది. విశ్వేశ్వరరావు ఆమెజీవితంనుంచి తొలగిపోవడంతో ఆమె హృదయం ఇతరుల కష్టాలపట్ల సానుభూతి చూపడం మాను కుంది.

కొందరు తమకష్టాల్ని గోరంతలుగా వుంటె కొండం తలుగా చేసి మనకళ్ళముందు నిలుపుతారు. తమకష్టాలపట్ల మనసానుభూతిని ఇట్టే దొంగిలించివేస్తారు. విశ్వేశ్వర రావులో తనకష్టాల్ని కొండంతలుగా నిలిపి చూపేకళ వుంది. రామనాథం తను కష్టాల్లోఉన్నా, ఇతరులకి వాటిని ఎత్తి చూపలేని దీనస్థితిలో వున్నాడు. అందువల్ల అతనిసమస్య లేమిటో రుక్మిణికి అర్థంకాలేదు. విశ్వేశ్వరరావుసమస్యలు ఇట్టే అర్థమైనాయి. అతను చేతులారా తనజీవితాన్ని కష్ట భూయిష్టం చేసుకున్నాడని ఆమె గ్రహించగలిగినా, ఆమె అతనిపట్ల జాలిని, కరుణని చూపింది. ఇతరులు తమకష్టాల్ని ఎత్తిచూపితేగాని, రుక్మిణి వాటిని గ్రహించలేదు; గ్రహించి వాటిపట్ల సానుభూతి చూపలేదు. రామనాథంజీవితం, ఏదో ఇంతకలిగివుండడంవల్ల ఏ ఒడుదుడుకులు లేకుండా సవ్యంగా జరిగిపోతున్నది. అందువల్ల అతనిపట్ల రుక్మిణిహృదయం

స్పందించలేకపోతున్నది. రుక్మిణి తనజీవితంలో సమస్యలు లేకపోవడంతో ఇతరులజీవితాల్లో సమస్యలకోసం చూచింది. అవి రామనాథంజీవితంలో కనపడకపోవడంతో ఆమె హృదయం శూన్యమైంది.

రోజులు గడుస్తున్నకొద్దీ రుక్మిణితో బ్రతుకును ఈడ్వడం రామనాథానికి దుర్భరంగా తోచింది. కొన్నిరోజులకు యంత్రాలైనా మచ్చికపడుతాయి. యజమానిని ఇట్టే గుర్తిస్తాయి. అతనిపట్ల వినయవిధేయతల్ని ప్రకటిస్తాయి. ఒకకారును నడపడానికి అలవాటుపడిన మనిషి, కొత్తకారుని నడుపవలసివచ్చేవరకూ తికమకలుపడుతాడు. అదే తన కారు అయితే, ఎంతో హాయిని అనుభవిస్తాడు. ఆలోచనా రహితంగా కాళ్ళు మరల్ని నొక్కుతాయి. చేతులు స్టియరింగ్‌వీలుని తిప్పుతాయి. తత్ఫలితంగా కారుకీ, యజమానికీ ఒక గాఢసంబంధం ఏర్పడుతుంది. తనకారు అమ్మవలసివచ్చినప్పుడు యజమాని ఎంతో నొచ్చుకుంటాడు. వీలైతే అమ్మకుండా వుండడానికి ప్రయత్నిస్తాడు. రామనాథం రుక్మిణి మధ్య కారుకూ యజమానికీ వుండే సన్నిహితత్వం కూడా ఏర్పడలేదు. మొదటిమాటు తనని చూచీచూడడంతోనే రుక్మిణికి తనపైన సద్భావం కలుగలేదేమో? సద్భావం ఎల్లా కలుగుతుంది? మొట్టమొదటిసారి తను ఒక దుష్టభావంతో ఆమెను సమీపించాడు.

మొదటిసారి చూచినప్పుడు కొందరికి కొందరిపైన సద్భావం కలుగుతుంది. ఆసద్భావమే చివరంటా నిలుస్తుంది. తనవిషయంలో అల్లా జరగలేదు. తను ఒక దుష్టభావంతో,

మొదటిసారి ఆమెయింటికి వెళ్ళాడు. తనదుష్టభావప్రభావం ఆమెపైన తప్పక పడివుంటుంది. అందువల్లనే తనంటే ఆమెకు మొదటినించీ ఏమాత్రం యిష్టంలేదు. తనపైన ఆమెకు కలిగిన దుర్భావాన్ని తొలగించివేయడానికి అతను శాయశక్తులా ప్రయత్నిస్తూవచ్చాడు. కాని, ఎంతప్రయత్నించినా ఆమెకు ఆదుర్భావం తొలగలేదు. దీనికికారణం ఏమైనా వుందా? ఉంటే వుండవచ్చు. కాని ఆకారణమేమిటో, రామనాథానికి ఎంత ఆలోచించినా తోచలేదు. కాగా, రుక్మిణి ఏదోచెప్పరాని బాధ ననుభవిస్తున్నది. తనలోతానే కుళ్ళుతున్నది. ఆ బాధేమిటో, ఎందుకు అనుభవించవలసివస్తున్నదో కనుక్కొనిచూస్తే? తనబాధేమిటో ఇతరులకి చెప్పే మనస్తత్వం కాదు రుక్మిణిది. చెప్పదేమోననే భయంకూడా వేసింది రామనాథానికి. అయినా అడిగిచూడడం మంచిదని నిశ్చయించుకున్నాడు రామనాథం.

ఒకనాడు రామనాథం రుక్మిణిని దగ్గరికితీసుకొని "రుక్కూ, చెప్పవూ నీ కేమిబాధో?'' అని లాలనగా అడిగాడు. రుక్మిణికి ఆమాటలు అర్థమైనట్లు కనపడలేదు. బిత్తర చూపులుచూడడం మొదలెట్టింది. రామనాథం రుక్మిణి చెవులదగ్గర ముంగురులను సవరిస్తూ 'నీ కేమిలోటువచ్చింది? ఎందుకు నీవు సంతోషంగా ఉండడంలేదు? నీ కేమి కావాలో చెప్పు? ఎంతఖర్చుకైనా వెనుదీయకండా నీకోరిక తీర్చడానికి నేను సంసిద్ధంగా వున్నాను' అని తనభావాన్ని విడమర్చిచెప్పాడు. ఆమాటలకి సవ్వాలో, ఏడ్వాలో రుక్మిణికి తోచలేదు. తను సంతోషంగా ఉండకపోవడ మేమిటి? తను

అనుభవిస్తున్న బాధ ఏమిటి? జీవితంలో తనకు వచ్చిన లోటేమిటి? ఒక ప్రశ్నకి ఇంకొక ప్రశ్నతో ఆమెకు సమన్వయం కుదరలేదు.

కొందరు వ్యక్తులు, జీవితంలో కొన్ని ఆశయాల్ని పెట్టుకొని జీవిస్తారు. అటువంటివ్యక్తుల్ని 'మీ బాధ లేమిటి' అని అడిగితే, ఆశయసాధనలో తమకు కలిగిన బాధలన్నీ చెప్పుకుంటారు. ఓదార్పులకి ఉపశమిస్తారు. కాని జీవితమే ఒక మహత్తరబాధ్యత అని గుర్తించలేని వ్యక్తులను 'మీ బాధలేమిటి?'అని అడిగితే అడిగినవారికిపిచ్చెత్తినట్లుచూస్తారు. ఏమీ సమాధానంచెప్పరు. రుక్మిణివిషయంలోనూ సరిగ్గా అంతే జరిగింది. తను ఎందుకు జీవిస్తున్నదో ఆమెకే తెలియదు. జీవితంలో తనబాధ్యత లేమిటో, ఆమె ఇంతవరకు గుర్తించలేదు. తెలిసీ తెలియని చిన్నతనంలో భర్త మరణించాడు. బావపైనిలుపుకున్న మమకారం ఫలించలేదు. యంత్రానికిమల్లే ఇంట్లో చాకిరీ చేస్తూవచ్చింది. తనత్యాగం వల్ల ఎవరు సుఖపడుతున్నదీ గమనించలేదు. కట్టుబాట్లులేని తండ్రి స్వైరవిహారం విశ్వేశ్వరరావుతో లేచిపోవడానికి ఆమెను పురికొల్పింది. పెళ్ళిచేసుకొని, అందరికిమల్లే తనూ ఒకఆశ్రయం ఏర్పరచుకుందామనే వాంఛ అడుగంటడంతో ఆమెకోరికలూ, అభిరుచులూ నశించాయి. మోడుకుమల్లే జీవితాన్ని గడపడం నేర్చుకుంది. కాగా, చిన్నతనంనించీ ఆమెహృదయం బలంగా దెబ్బతినివుండడంవల్ల, జీవితంలో ఒకవిధమైన సహజ గంభీరత అలవడింది. మితభాషిత్వం వచ్చింది. గంభీరఆచ్ఛాదనని తొలగించి, అంతరంగంలోకి

తొంగిచూస్తే అందులో ఏభావమూ కనపడదు; ఏ కోరికా దృగ్గోచరం కాదు. అల్లాంటప్పుడు 'నీ బాధ ఏమిటి' అని అడిగితే, ఏమని చెప్పగలుగుతుంది? సహజగంభీరతతో మౌనంవహిస్తుంది. మొదట అసలు ఆ ప్రశ్నే అర్థంకాదు. ప్రశ్న అర్థమైనా, సమాధానంచెప్పవలసిం దేమీ ఉండదు. విధిగా మౌనంవహించవలసివస్తుంది.

అడిగిన ప్రశ్నలకి సమాధానాలు రాకపోవడంతో రామనాథానికి విసుగేసింది. చిరాకెత్తింది. కోపమొచ్చింది. తను సంసారంచేస్తున్నది 'ఒక పశువుతోనా? లేక మనిషితోనా?' అని తేల్చుకోలేకపోయాడు. కావాలని రుక్మిణి తనవిషయంలో మొండితనం వహిస్తున్నదని నిశ్చయించుకున్నాడు. కొందరుస్త్రీలు హృదయానికి హృదయ మివ్వరు. ఎదుటివారిని వేధించుకుతింటారు. బాధపెడుతారు. ఎదుటివారు బాధపడుతుంటే చూచి సంతోషపడుతారు. రుక్మిణి అటువంటిస్త్రీ అయివుంటుందని రామనాథం ఒక నిశ్చయానికి వచ్చాడు. తను బాధపడితే చూచి సంతోషించడానికి రుక్మిణి సంకల్పించుకున్నది. ఇట్టిపరిస్థితుల్లో తనే ఆమెని బాధపెట్టి చూస్తే? నయాన లొంగదియడానికి ప్రయత్నిస్తే లొంగలేదు. పోనీ, భయాన లొంగదీయడానికి ప్రయత్నించి చూస్తే? రుక్మిణి తన లాలనకి ఏమాత్రం చలించకపోవడం మొదలే రామనాథానికి కోపకారణంగావుంది. దానికితోడు భయాన ఆమెను లొంగదీసుకోవడానికి నిశ్చయించుకోవడంతో, అతనికి అగ్నిలో ఆజ్యంపోసినట్లైంది. వెంటనే రుక్మిణిపక్కన కూర్చున్నవాడల్లా దిగ్గున లేచాడు.

ముంగురులు సవరిస్తున్న చెయ్యి బలంగా రుక్మిణికొప్పు పట్టి లాగింది. ఎడమకాలు ఈడ్చి నడుముమీద తన్నింది. 'ఇప్పుడు చెప్పు, నేనంటే నీకెందుకు యిష్టం లేదో ?'' అని గొంతు గట్టిగా అరిచింది. ''చెప్పు, చెప్పకపోతే చంపేస్తా!'' అని అరుస్తూ కొప్పుపట్టుకొని జరజరా ఈడుస్తూ రామనాథం రుక్మిణిని తన్నడం మొదలుపెట్టాడు. రుక్మిణి ఏడ్చింది. తన్నులకు పెడబొబ్బలుపెట్టింది. 'మీరంటే నాకు ఇష్టమే'నని అరిచింది. కాని ఆ అరపులు పైపై అరపులని రామనాథానికి బాగా తెలుసు. రుక్మిణిహృదయాంతరాళంలోంచి వచ్చినవి కావని అతను వెంటనే గుర్తించాడు. రుక్మిణిఅరుపులు బోలుబోలుగా ఆ రెండుగదుల్లో ప్రతిధ్వనించాయి; రామనాథం కావాలని తెచ్చిపెట్టుకున్నకర్కశత్వాన్నిబోలుబోలుగాపరిహసించాయి అంతటితో రామనాథం కాళ్ళూ చేతులూ మంత్రంపెట్టినట్లు ఆగిపోయాయి. అతను వెంటనే వెళ్ళి ఒకకుర్చీలో చతికిలబడ్డాడు......మానసికంగా స్త్రీని లొంగదీసుకోవడంలో అతనికి జీవితంలో ప్రథమ పరాభవం జరిగింది... ఆ పరాభవం అతనిపురుషత్వాన్ని వెయ్యినోళ్ళతో వెక్కిరించింది.

## 11

స్టేటుకాంగ్రెసుసత్యాగ్రహం జరిగిన కొన్నినెలలకి ఉస్మానియా విద్యార్థి వసతిగృహాల్లో 'వందేమాతరం' ఉద్యమం ప్రారంభమైంది. ఆ ఉద్యమం మొదట హైద్రాబాద్‌లో తగిన బలాన్ని సమకూర్చుకొని, చివరికి జిల్లాలకి

వ్యాపించింది. విద్యార్థిలోకాన్ని ఒక్క ఊపుఊపి వారిలో గొప్పఉత్సాహాన్ని రేకెత్తించింది. జాతీయభావాన్ని సర్వత్రా పురికొల్పింది. హైదరాబాద్‌నగరం అట్టుడికినట్లు ఉడికింది. నిజాంరాష్ట్రమంతటా విద్యార్థులు సమ్మెలుకట్టారు. గొప్ప ఊరేగింపులు తీశారు. పెద్దపెద్దసభలు జరిపారు. విశ్వవిద్యాలయాధికారులకు వ్యతిరేకంగా గొప్పఆందోళన జరిపారు. విద్యార్థులు ప్రార్థనాస్వాతంత్ర్యాన్ని అంగీకరిస్తేతప్ప తాము విద్యాలయాలమొహం చూడమని శపథంచేశారు. తత్ఫలితంగా నగరంలో, జిల్లాలలో అనేక కళాశాలలు పూర్తిగా మూతలుపడకపోయినా, నామకఃమాత్రమే పనిచేస్తున్నాయి. విద్యార్థులలో జాతీయవాదులు, 'ఇత్తెహాదుల్‌ముసల్‌మీన్' అనుయాయులు అనే తెగలు బయల్దేరినాయి.

ఇత్తెహాదుల్‌ముసల్‌మీన్‌సంస్థ అనుయాయులు ఏమీ జరగనట్లు కాలేజీలకు వెళ్ళడం మొదలుపెట్టారు. జాతీయవాదులు కాలేజీలు వదలిపెట్టి, అధికారులకు వ్యతిరేకంగా ఆందోళనచేయ నారంభించారు. విద్యార్థులఆందోళనకు అధికారులు ఏమాత్రం లొంగలేదు. బహుళసంఖ్యాకుల్ని వదలివేసి అత్యల్పసంఖ్యాకులైన విద్యార్థులతో కాలేజీలు నడపడం మొదలుపెట్టారు. విశ్వవిద్యాలయావరణలో పెద్దపెద్ద బహిరంగసభలు జరుగుతుంటే వాటితో తమకు ఏమాత్రం ప్రసక్తిలేనట్లు అధికారులు నటించారు. విద్యార్థులు శాశ్వతంగా చదువులు మానివేయడానికి పూనుకుంటే 'అది వాళ్ళ ఖర్మం' అన్నట్లు అధికారులు మౌనం వహించారు.

చాలామంది విద్యార్థులు శాశ్వితంగా చదువులు మానుకోవడానికి సంసిద్ధపడితే, చదువులు మానుకోవడం వల్ల సాధించే దేమీ ఉండదనీ, ఈ విశ్వవిద్యాలయంలో చదువులు కొనసాగకపోతే భారతదేశంలోని ఇతరవిద్యాలయాల్లోనైనా విద్యార్థులు చదువుకోవడం అవసరమనీ కొందరు జాతీయనాయకులు, విద్యార్థులంటే గొప్ప అభిమానంగల విశ్వవిద్యాలయాచార్యులు, పురప్రముఖులు హితవు చెప్పారు. ఏ విశ్వవిద్యాలయానికి వెళ్ళి చదువుకోవడమా అనే ప్రశ్న బయల్దేరింది. విద్యార్థి నాయకులు, వివిధ విశ్వవిద్యాలయాలకు పరిస్థితులను వివరిస్తూ 'వందే మాతరం' ఉద్యమంలో పాల్గొంటున్న విద్యార్థుల్ని చేర్చుకోవలసిందిగా కోరుతూ, ఉత్తరప్రత్యుత్తరాలు జరిపారు. ఉర్దూ బోధనాభాషగాగల ఉస్మానియావిశ్వవిద్యాలయాన్ని అప్పటివరకు భారతదేశంలోని ఏ విశ్వవిద్యాలయం గుర్తించలేదు. కాని, విద్యార్థినాయకులు జరిపిన ఉత్తరప్రత్యుత్తరాల ఫలితంగా భారతదేశంలోని దాదాపుఅన్నివిశ్వవిద్యాలయాలు వందేమాతరం ఉద్యమవిద్యార్థుల్ని చేర్చుకోవడానికి అంగీకరించాయి. విద్యార్థులలో బహుళసంఖ్యాకులు నాగపూర్ విశ్వవిద్యాలయం కడుసమీపంలో వుండడంవల్ల దానిలో చేరడానికి నిశ్చయించుకున్నారు. కాని ధనాభావంవల్ల కొందరు విద్యార్థులు ఆ సంవత్సరానికి చదువుకు స్వస్తి చెప్పవలసివచ్చింది.ఆ సందర్భంలో విద్యార్థులు పోగుచేసినచందాలు వేడినీళ్ళకి చన్నీళ్ళు తోడైనట్లు, బీదవిద్యార్థులకు ఎంతో ఉపకరించాయి. యావత్తు విశ్వవిద్యాలయమే పరప్రాంతాలకి కదిలి వెడు

తున్నప్పుడు, చందాలరూపేణా ఎంతధనం పోగుచేస్తేమాత్రం ఎంతమంది బీదవిద్యార్థులకి అది ఉపకరించగలదు? విధిగా ఎంతోమంది బీద విద్యార్థులు చదువు మానుకోవాల్సి వచ్చింది. కాస్తోకూస్తో ఆర్థికస్తోమత గల విద్యార్థులు ఒక్క నాగపూర్ విశ్వవిద్యాలయాన్నే అంటిపెట్టుకోకండా, తమకి నచ్చిన విశ్వవిద్యాలయానికి వెళ్ళిపోవడానికి నిశ్చయించుకున్నారు.

ఇతరుల దయాదాక్షిణ్యాలపైన బ్రతుకునీడుస్తున్న రఘు, ఆ సంవత్సరానికి చదువు మానుకోవడమా లేక నాగపూర్ విశ్వవిద్యాలయంలో చేరి చదువుకొనసాగించడమా అనే విషయాన్నిగూర్చి ఏమీ తేల్చుకోలేకపోయినాడు. పద్మ ఆర్థికంగా సమయానికి ఆదుకోవడంవల్ల రఘు తన తల్లిని నగరానికి తీసుకువచ్చి, ఒకయిల్లంటూ ఏర్పరచుకొని, బి. ఏ. పరీక్షకు శ్రద్ధగా చదివాడు. బి. ఏ. మొదటితరగతిలో ఉత్తీర్ణుడైనాడు. పద్మ ప్రోత్సాహంపైన నిజాంకళాశాలలో లిటరేచర్ ఎం. ఏ. లేకపోవడంవల్ల, ట్రాన్సుఫర్ సర్టిఫికెట్ తీసుకొని ఉస్మానియా యూనివర్సిటీ కాలేజీలో చేరాడు. రఘు బి. ఏ. ప్యాసయినసంవత్సరమే రమణ, పద్మలు ఇంటర్ జూనియర్ ప్యాసై విశ్వవిద్యాలయ స్త్రీల కళాశాలలో సీనియర్ చదువుతున్నారు. రఘు యూనివర్సిటీ కంతటికీ ఇంగ్లీషులో ప్రథముడుగా ఉత్తీర్ణుడైనాడు. దానితో యూనివర్సిటీకాలేజీలో ఎం. ఏ. లిటరేచర్ చదువుకోడానికి విద్యార్థివేతనం లభించింది. కాని, ఆ విద్యార్థివేతనంతో సంసారం గడుపుకోవడం కష్టం. అందువల్ల అతను

పద్మ చేస్తున్న ధనసహాయంపైన ఉన్నతవిద్యకై ఆధారపడ వలసివచ్చింది.

ఉద్యమం ఆరంభమైన మొదటిరోజున అతను మామూలుగా కళాశాలకు వెళ్ళాడు. విశ్వవిద్యాలయ వసతిగృహ విద్యార్థులు ఆ క్రితంరోజు సాయంత్రం కామన్ హాలులో సమావేశమై 'వందేమాతరం' అనే గీతాన్ని సమిష్టిగా పాడారనీ, దానిపైన విశ్వవిద్యాలయాధికారులు హాస్టల్ విద్యార్థులకు వ్యతిరేకంగా చర్యతీసుకోవడానికి ఆలోచిస్తున్నారనీ తెలిసింది. ఆరోజు ఉదయానకూడా విద్యార్థులు కామన్ హాలులో సమావేశమైనప్పుడు 'వందేమాతరం' అనే జాతీయగీతం హాస్టల్ ఆవరణలో పాడడానికి వీలులేదని హాస్టల్ సూపరింటెన్ డెంటు వారించాడనీ, కాని విద్యార్థులు అతని మాటల్ని లక్ష్యంచేయలేదనీ, దానిపైన సూపరింటెన్ డెంటు అధికారులకి ఈ విషయమై రిపోర్టుచేశాడనికూడా తెలిసింది. ఆరోజు తోడి విద్యార్థులు చెప్పిన సంగతులు విని, రఘు మౌనంవహించాడు. తరువాత రెండురోజులు అధికారులు ఏం చర్య తీసుకుంటారా? అని ఆలోచించడంలో గడచిపోయింది.

విద్యార్థులు అధికారులు తీసుకోబోయే చర్యల్ని గూర్చి ఊహాగానాలుచేయడం మొదలుపెట్టారు. ఉద్యమ ప్రారంభకులకు వార్నింగ్ ఇస్తారని కొందరన్నారు. కాదు, వారిని కాలేజీనుంచి తొలగించివేస్తారని మరికొందరు అభిప్రాయపడ్డారు. ఆ రెండురోజులూ విద్యార్థులు ఉదయం, సాయంత్రం జాతీయగీతాన్ని పాడారు. హాస్టల్‌లో జాతీయగీతం పాడవలెననే ఉద్దేశ్యం మొదట ఎవరికి కలిగిందో చెప్పడం

కష్టం. ఎవరు మొట్టమొదట జాతీయగీతాన్ని పాడడానికి విద్యార్థుల్ని ప్రోత్సహించారో, వారిని ఎవరు కామన్ హాలులో ప్రోగుచేశారో చెప్పడంకూడా కష్టమే. అధికారులు ఎంత ఆరా తీసినా ఉద్యమాన్ని మొదట ఎవరు ప్రారంభించారో తెలియలేదు. దానితో వాళ్ళకు విసుగెత్తి పోయింది.

హాస్టల్ ఆవరణలో జాతీయగీతాన్ని పాడిన విద్యార్థులు హాస్టల్లో వుండడానికి వీలులేదని, హాస్టలులో ఒక నోటీసు అంటించారు. విద్యార్థులు ఆ నోటీసును లక్ష్యం చేయలేదు. యథావిధిగా ఉదయం, సాయంత్రం జాతీయగీతం పాడారు. దానితో విద్యార్థులను హాస్టలునుంచి ఖాళీచేయించవలసినదిగా పోలీసులకు తాకీదులు వెళ్ళాయి. అప్పుడు విద్యార్థులు పరిస్థితుల్ని గూర్చి ఆలోచించారు. హాస్టల్ ఖాళీచేసి కాలేజీకి వెళ్ళకుండా హర్తాల్ చేయడానికి నిశ్చయించుకున్నారు. ఆరోజున కొందరు విద్యార్థులు మిగిలిన విద్యార్థులు కాలేజీకి వెళ్ళకుండా పికెటింగ్ చేశారు. పెద్ద ఊరేగింపుతో అధికమెట్టులోని విశ్వవిద్యాలయంఆవరణనుంచి నగరంలోని వివిధకళాశాలలకు వెళ్ళారు. నగరంలోని కళాశాలల విద్యార్థులు పాఠాలువదలివేసి, విశ్వవిద్యాలయం విద్యార్థుల ఊరేగింపులో చేరారు. ఊరేగింపు తిరిగి విశ్వవిద్యాలయం ఆవరణకి కదిలి వచ్చింది. ఆరోజు ఉద్యమానికి ఒక విశిష్ట స్వరూపం ఏర్పడింది. రఘు ఆరోజున విద్యార్థుల ఊరేగింపులో గొప్ప ఉత్సాహంతో పాల్గొన్నాడు. హాస్టల్నుంచి విద్యార్థుల్ని వెళ్ళగొట్టడానికి అధికారులు పోలీసులకు తాకీ

దులు పంపడం రఘుకి చాలా అన్యాయంగా తోచింది. ఆ అన్యాయానికి వ్యతిరేకంగా తోడివిద్యార్థులతో కలిసి, ఆందోళనజరపడం తన కనీసధర్మంగా భావించాడు.

ఊరేగింపు విశ్వవిద్యాలయాం ఆవరణకి తిరిగివచ్చిన తరువాత ఒకగొప్పబహిరంగసభ జరిగింది. తక్కినవిద్యార్థులతో పాటు రఘుకూడా ఆ బహిరంగసభలో మాట్లాడాడు. అధికారులు విద్యార్థుల ప్రార్థనాస్వాతంత్ర్యం అంగీకరించేవరకూ కాలేజీలకి వెళ్ళకుండా హడ్తాల్ కొనసాగించడం అవసరమని ఉద్బోధించాడు. విశ్వవిద్యాలయాధికారులు విధించే క్రమశిక్షణకి కట్టుబడివుండడానికితాను సర్వదా సంసిద్ధుడననీ, కాని, క్రమశిక్షణపేరట అధికారులు విద్యార్థుల స్వేచ్ఛాస్వాతంత్ర్యాల్ని అరికట్టడానికి సమకడితే అది దౌర్జన్యం అనిపించుకుంటుందనీ, విద్యార్థిలోకం ఆ దౌర్జన్యానికి ఏమాత్రం తలొగ్గజాలదనీ, వ్యక్తిత్వ సర్వతోముఖాభివృద్ధే ఉన్నతవిద్య ఆశయమైతే అధికారులు అవలంబిస్తున్న దౌర్జన్యవిధానంక్రింద విద్యార్థుల వ్యక్తిత్వం ఎన్నడూ వికసింపజాలదనీ ప్రకటించాడు.

రఘు ఉపన్యాసం విద్యార్థులలో గొప్ప ఉత్సాహాన్ని రేకెత్తించింది. ప్రార్థనాస్వాతంత్ర్యాన్ని అంగీకరించేవరకూ తాము కళాశాలలకు వెళ్ళమని విద్యార్థులు ఎలుగెత్తి శపథం చేశారు. రఘువాగ్ధాటికీ, నిశితవిమర్శకూ తోడివిద్యార్థులు ఆశ్చర్యచకితులైనారు. చెవులు గింగురుమనే కరతాళధ్వనులమధ్య రఘుఉపన్యాసం పరిసమాప్తి జెందింది. వెంటనే ఉద్యమాన్ని విజయవంతంగా కొనసాగించడానికి ఒక చర్యాసంఘం (Action commitee) ఏర్పడింది. దానికి రఘు

ఏకగ్రీవంగా అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. అధికారులను చూడడంతో, వారితో ఉత్తరప్రత్యుత్తరాలు జరపడంతో కొంతకాలంగడిచింది. అధికారులు చర్యాసంఘం ఉత్తరప్రత్యుత్తరాలకుగాని, సందర్శనాలకిగాని (Interviews) ఏమాత్రం చలించలేదు. విద్యార్థుల ప్రాథనాస్వాతంత్ర్యాన్ని అంగీకరించడానికి నిరాకరించారు. దానితో చర్యాసంఘం ముందడుగు వేయవలసినఅవసరం ఏర్పడింది.

చర్యాసంఘుసభ్యులు అగ్రనాయకులు, పురప్రముఖులతో భవిష్యత్ కార్యక్రమాన్నిగూర్చి సంప్రదింపులు జరిపారు. విద్యార్థులు విద్యాభ్యాసాన్ని ఏపరిస్థితులలోకూడా మానుకోవడం సమంజసంకాదనీ, ఇతరవిశ్వవిద్యాలయాలకు వెళ్ళి చదువుకోవడం అవసరమనీ నాయకులు అభిప్రాయపడ్డారు. దూరదూరప్రాంతాలకి వెళ్ళడంకన్న సమీపంలో వున్న నాగపూర్ విశ్వవిద్యాలయంలో చేరడం మంచిదని చెప్పారు. ఈ హితవు ననుసరించి, చర్యాసంఘం విద్యార్థులను నాగపూర్ విశ్వవిద్యాలయంలో చేరవలసిందిగా కోరింది. బీద విద్యార్థులసహాయార్థం ఒక నిధిని ఏర్పాటుచేసింది. ప్రజలు విద్యార్థినిధికి ఉదారంగా విరాళాలు యిచ్చారు. చర్యాసంఘుసభ్యులు నాగపూర్‌కు వెళ్ళి, అడ్మిషన్సు, బసలు, భోజనవసతికి సంబంధించిన ఏర్పాట్లన్నీ చేసి వచ్చారు.

స్త్రీలకళాశాలనించి ఎంతమంది విద్యార్థినులు నాగపూర్‌కి వెళ్ళేదీ రఘుకి తెలియలేదు. విద్యార్థులు స్త్రీలకళాశాల ఆవరణంలోకి వెళ్ళడానికి వీలులేదు. ఇట్టిపరిస్థితుల్లో స్త్రీలకళాశాలనుగూర్చి చర్యాసంఘుసభ్యులకు ఏవివరాలూ తెలియ

లేదు. హర్తాల్ మాత్రం చాలాకుంది విద్యార్థినులు విజయ వంతంగా కొనసాగిస్తున్నారని తెలుసు. ఒకనాడు రఘు స్త్రీల కళాశాలకు సంబంధించిన విశేషాలు తెలుసుకోవడానికి పద్మదగ్గ రికి వెళ్ళాడు. హర్తాల్ మూలకంగా పద్మ ఆరోజున యింట్లోనే ఉంది.

'మహానాయకులైనప్పటినించీ బొత్తిగా తీరిక లేన ట్టుందే!' అంది పద్మ, రఘుని చూచీచూడడంతోనే.

డ్రాయింగ్ రూమ్‌లోకి ప్రవేశిస్తున్నవాడల్లా రఘు వెనక్కి గిరుక్కున మళ్ళాడు. ఎవరికోసమో చూస్తున్నట్లు నటించాడు.

'ఏరీ, మహానాయకులు ఎవ్వరూ కనపడడం లేదే?' అన్నాడు రఘు అమాయకత్వం ఉట్టిపడుతున్న కంఠంతో.

'ఇంకెవ్వరో అని కాదు - మీరేనని నా ఉద్దేశం' అంది పద్మ చిరునవ్వులు చిలుకరిస్తున్న కొంటెకళ్ళతో.

'నేను మహానాయకుణ్ణి కావడమేమిటి? నీ కేమైనా మతిపోలేదుకదా!' అన్నాడు రఘు పద్మచూపుల్లో తన చూపులు కలుపుతో.

'అంత గొప్పఉద్యమాన్ని నడుపుతున్నప్పుడు, మహా నాయకులు కాక మరింకేమవుతారు?' అంది పద్మ, రఘు చూపుల్లోంచి తనచూపుల్ని తప్పించివేయడానికి ప్రయత్నిస్తో.

'కొన్ని ప్రచ్ఛన్నశక్తులు ఉద్యమాన్ని ప్రోత్సహిస్తు న్నాయి. ఉద్యమం జయప్రదంగా కొనసాగుతూవుంది. అంతే కాని, ఉద్యమం విజయవంతం కావడంలో వ్యక్తుల ఘనత

ఏముంది ?' అన్నాడు రఘు పద్మ అభిప్రాయాన్ని ఖండించే ఉద్దేశంతో.

'మహానాయకులకు వినయం కూడా ఒక భూషణమే' అంది పద్మ, రఘుని మరీ ఉడికించే ఉద్దేశంతో.

'నిజమే కాని, అది కొన్ని చోట్ల రాణిస్తుంది - మరి కొన్ని చోట్ల రాణించదు' అన్నాడు రఘు సన్నిహితుల దగ్గర అది రాణించకపోవడాన్ని గుర్తిస్తో.

'కొన్ని చోట్ల అంటే?' అని ప్రశ్నించింది పద్మ రఘుని.

'కొన్ని చోట్ల అంటే - మరీ సన్నిహితుల దగ్గర, అని నా ఉద్దేశం' అన్నాడు రఘు పద్మ ప్రశ్నకి సమాధానంగా.

శరీరంలోని రక్తమంతా ఒక్కుమ్మడిగా పద్మ మొహం లోకి చిమ్ముకొచ్చింది - తలవని తలంపుగా మొహం ఎర్ర బారింది.

'ఏవో ప్రచ్ఛన్న శక్తుల ప్రోద్బలం వల్ల ఉద్యమం కొనసాగుతోందన్నారు. ఆ ప్రచ్ఛన్న శక్తులేవో కనుక్కోవచ్చునా?' అంది పద్మ, సంభాషణని కొనసాగించే ఉద్దేశంతో.

'నీవు కనుక్కోకూడదు. నీవు కనుక్కోదలచినా, నేను చెప్పకూడదు' అన్నాడు రఘు, పద్మ ప్రశ్నకి జవాబుగా.

'అంత రహస్యమైన విషయమైతే - చెప్పనవసరం లేదు లెండి' అంది పద్మ చిరుకోపంతో.

'పోనీ, కళ్లా యిస్తాను కనుక్కుంటావా ?' అని అడిగాడు రఘు కొంటెగా.

'కనుక్కోవలసినవిషయం కానప్పుడు కనుక్కోవడ మెందుకు?' అంది పద్మ, రఘుమాటలతోనే రఘుని బంధించివేస్తో.

'ప్రచ్ఛన్నశక్తులంటే శక్తిద్వయం అన్నమాట' అన్నాడు రఘు ఏదో విడమర్చిచెబుతున్నధోరణిలో.

'జాతీయభావం, విద్యార్థులసంఘటితశక్తి - ఈ రెండేనా? అని అడిగింది పద్మ మళ్ళీ.

'అవి గుప్తశక్తు లెందు కవుతాయి - అవి బహిరంగ శక్తులు' అన్నాడు రఘు సమాధానంగా.

'అయితే ఇంక నేను కనుక్కోలేను' అంది పద్మ, తనఓటమిని అంగీకరిస్తో.

'ఓడిపోయినానని ఒప్పుకుంటావా?' అని అడిగాడు రఘు, పద్మని ఉడికించేఉద్దేశంతో.

'ఏదో మనసులోపెట్టుకొని, అదేమిటని అడిగితే, ఎవరుమాత్రం ఏంచెప్పగలరు?' అంది పద్మ, ఓటమిని బహిరంగంగా అంగీకరించడం యిష్టంలేక.

'క్లూయిచ్చినతరువాతకూడా కనుక్కోలేకపోతే, అది ఎవరిదోషం?' అన్నాడు రఘు, క్లూయిచ్చినా కనుక్కోలేని నేరాన్ని పద్మపై మోపుతో.

'అది సరిగ్గా క్లూయివ్వడం చాతకానివారి దోషం' అంది పద్మ, రఘుప్రశ్నని రఘుపైకే తిప్పి దెబ్బకొడుతో.

'పోనీ, మరికొంచెం విడమర్చిచెప్పమంటావా?' అని అడిగాడు రఘు.

'మీకు యిష్టమైతే చెప్పండి, కష్టమైతే మాను కోండి' అంది పద్మ జవాబుగా.

'ఈమధ్య భలేమాటలు నేర్చావే!' అన్నాడు రఘు, పద్మకళ్ళల్లోకి ఒకటేపనిగా చూస్తో.

'సహవాసదోషం' అని తిప్పికొట్టింది పద్మ.

'ఈ ఉద్యమంలో దిగడానికి నన్ను రెండుప్రబలశక్తులు ప్రోత్సహించాయి. మొదటిరోజున నేను వేదికఎక్కి ఉపన్య సించడానికి ఉపక్రమించినప్పుడు, ఆరెండుశక్తులూ నాకళ్ళల్లో జిగేలున మెరిశాయి. నన్ను గొప్పగా ఉద్రేకపరిచాయి. వాగ్ధాటి అనర్గళంగా ప్రవహించింది. దానితో శివమెత్తినట్లు ఉపన్యసించాను. ఉపన్యాసం ముగిసేసరికి చెవులు కరతాళ ధ్వనులతో గింగురుమన్నాయి. తలవనితలంపుగాజరిగిన ఆ సంఘటన విద్యార్థిలోకానికినన్నునాయకుడినిచేసింది'అన్నాడు రఘు ఆనాటిసంఘటన విస్మృతిపథంలో నెమరువేసుకుంటో.

'ఒకశక్తిని నేను ఊహించుకోగలిగాను. మిమ్మల్ని ప్రోత్సహించిన ఆ రెండవశక్తి ఏదో ఎంతఆలోచించినా ఇంత వరకూ అర్థంకాకుండా వుంది' అంది పద్మ సాలోచనగా.

'నీవు ఊహించుకోగలిగినశక్తి ఏదో, కాస్త చెప్పు చూద్దాం' అన్నాడు రఘు, పద్మవేపు చూస్తో.

'ఆ మొదటిశక్తి రమణ - అంతేనా?' అంది పద్మ ఉత్సాహంగా.

'మొదటిశక్తి ఏదో పోల్చుకోగలిగినప్పుడు, ఆ రెండవ శక్తి ఏదో కొంచెం ఆలోచిస్తే, ఇట్టే తెలుసుకోగలవు' అన్నాడు రఘు, ఇంకా పద్మవేపు చూస్తూనే.

రఘు తననిఉద్దేశించిమాట్లాడడంలేదుకదా అనే అనుమానంకలిగింది పద్మకి—కాని, కాదని వెంటనే సరిదిద్దుకుంది.

'ఒకశక్తిని ఊహించుకోగలిగాను - ఆ తరువాత నామెదడు పనిచేయడంలేదు' అంది పద్మ కొంచెంవిచారంగా.

'పోనీ, నేను చెప్పనా, అని అడిగాడు రఘు, పద్మ కళ్ళల్లోకి చూస్తో.

'దానికి అడగడమెందుకు, చెప్పండి' అంది పద్మ, రఘుచూపుల్ని తప్పించుకోవడానికి ప్రయత్నిస్తో.

'చెబితే కోపంరాదు కద ?' అన్నాడు రఘు అమాయకంగా.

'మధ్యలో నాకు కోపంరావడం ఏమిటి ?' అంది పద్మ రఘుప్రశ్నకి పైప్రశ్న వేస్తో.

'అయితే చెప్పమంటావా ?' అన్నాడు రఘు, అసలు సంగతి చెబితే ఏమనుకుంటుందో అనే సందేహంకొద్దీ.

'ఊఁ, చెప్పండి' అంది పద్మ అనాలోచితంగా.

'ఆ రెండవశక్తి నువ్వే' అన్నాడు రఘు చప్పున.

'ఆఁ!' అని, ఆ వాక్యానికి నిర్ఘాంతపోయింది పద్మ. వెంటనే తేరుకొని చప్పున లోపలికి పరుగెత్తిపోయింది.

ఏదో అనకూడనిమాట అన్నట్టు ఫీలయినాడు రఘు. నోరుజారి ఆ మాట అన్నందుకు ఎంతో చింతించాడు. తనఅవివేకానికి ఎంతో బాధపడ్డాడు. ఎదుటిమనిషిహృదయం తెలుసుకోకుండా అంతపెద్దమాట అనేయడం గొప్పపొరపాటని గుర్తించాడు. పద్మ ఎంత బాధపడుతుందో అని నొచ్చుకున్నాడు. కాని... కాని...

ఏవ్యక్తైనా ఇద్దరుస్త్రీలను ప్రేమించకూడదా? ఒకస్త్రీలో కొన్నిసుగుణాలు కనపడుతాయి... ఇంకొకస్త్రీలో మరికొన్ని సుగుణాలు అగుపడుతాయి... మొదటిస్త్రీని ఆ కొన్నిసుగుణాలకోసం, రెండవస్త్రీని ఆ మరికొన్ని లక్షణాలకోసం ప్రేమించకూడదా? ... ఒకేసారి యిరువురుస్త్రీలని ప్రేమించడం దోషమా? ... కాని, ఇది నీతి, ఇది అవినీతి అని నిర్ణయించే దెవరు? ... సంఘం ... బూజుపట్టిన సంఘదురాచారాలకు మానవుడు కట్టుబడి వుండడం అవసరమా? ... ఒకకాలంలో అవి సదాచారాలే కావచ్చు. కాని పరిస్థితులు మారడంతో ఆ సదాచారాలే దురాచారాలుగా రూపొందాయి. ... ఆ దురాచారాలను ఎదిరిస్తే సంఘానికి కొంత మేలుజరుగుతుంది ... కాని ఒకఆచారం మంచిదైందీ, కానిదీ నిర్ణయించడ మెట్లా? ... నేటి సంఘపరిస్థితులే ఒకఆచారం మంచిదైందీ, కానిదీ సూచిస్తాయి. ఈ విషయంలో ఒకనిర్ణయానికి రావడానికి నేటిసంఘపరిస్థితులే గీటురాయి అన్నమాట! ఒక ఆచారం నేటిపరిస్థితులకు అనుకూలంగా లేకపోతే, అది నిలవడం కష్టం. అనుకూలంగాఉంటే మరికొన్నికాలాలపాటు నిలుస్తుంది. అంతే... సాంఘికసంక్షేమదృష్ట్యా యిరువురు స్త్రీలని ఒకేసారి ప్రేమించడం దోషమే... అందులో ఏమాత్రం సందేహం లేదు.... ఇరువురిలో ఎవరినో ఒకరిని వదలుకొని, ఇంకొకరిని వివాహంచేసుకోవాలి... కాని యిరువురిలో ఎవరిని వదలుకోవడం? ... పోనీ, పద్మని వదలుకుంటే... నిజమే, ఆమెనే వదలుకోవడం మంచిది... పద్మకన్నా ముందు రమణ తనహృదయంలో స్థానమేర్పర్చుకుంది... వెనకవచ్చిన

కొమ్మలు ముందు వచ్చిన చెవులకన్నా వాడి అయిపోయి నాయి... పద్మ వినయవిధేయతలు, ఉదారస్వభావం, అంద చందాలు తనహృదయాన్ని చూరగొన్నాయి ... రమణ పట్టుదల, విద్యపై ఆమెకుగల శ్రద్ధాభక్తులు తనకు నచ్చాయి. అంతేకాక, ఆమెపై తనకొక ఫ్యాన్సీ ... చిన్నప్పటినించీ అందరూ తమని భార్యాభర్తలుగా వ్యవహరించడంవల్ల కలి గిన ఫ్యాన్సీయో ఏమో తెలియదు... ఈ ఫ్యాన్సీనే మనం ప్రేమ అంటున్నామా?...

అసలు ప్రేమఅంటే ఏమిటి? ... ప్రేమ-నిజం విచారిస్తే ఒకఅకారణమధురమైత్రీభావం... స్త్రీపురుషులమధ్యఇదికాస్త విషయవాంఛతో మిళితమై ఉంటుంది... విషయవాంఛ లేక పోతే తపన ఉండదు,విరహం ఉండదు, ఆకర్షణ ఉండదు... హృదయాలు ప్రేమతో దహించుకుపోవు - ఒకరికోసం ఇంకొకరు నుసికావడం జరగదు - ఆ నుసికూడా బుసకొట్టి ఒండొరులను తలపోయడం సంభవించదు... ఈ విషయవాంఛా బలాన్ని గ్రహించే, బహుశా కొందరు భగవద్భక్తులు తమని తాము రాధగా, గోపికలుగా ఊహించుకొని విరహంతో తపించి దైవసాన్నిధ్యాన్ని పొందిఉంటారు .. ప్రేయసీ ప్రియులు ఒండొరులనుగూర్చి కమ్మనికలలు కనడాన్ని మనం మాధుర్యంగా నిర్వచించవచ్చు. మైత్రిలో త్యాగభావం కూడా యిమిడివుంది. ప్రేయసీప్రియులు ఒండొరులకోసం మహత్తరత్యాగాలు చేయడం మనం చూస్తూనే ఉన్నాం.

ప్రేమ ఎందుకు కలుగుతుందో, ఎప్పుడు కలుగుతుందో చెప్పడం కష్టం. అమాంతంగా ఉన్నదున్నట్లుగా ఒక సుము

హూర్త్తాన ప్రేమఉదయిస్తుంది. దానినే దైవికమన్నా అభ్యం తరం లేదు...ప్రేయసిఅందాన్ని చూచి ప్రియుడు ప్రేమిం చడు...లైలా నల్లగా వుండేదట...ఆ నలుపే మజ్నూకళ్ళకి నచ్చిందట...అతను ఆ నల్లటిఅమ్మాయిని ప్రేమించాడట... ప్రేయసి గుణగణాల్నిబట్టి ప్రియుడు ప్రేమిస్తున్నాడా అంటే అదీ లేదు...ఒకస్త్రీని ఒక పురుషుడు అకారణంగా ప్రేమి స్తాడు...ఆస్త్రీని ఎందుకుప్రేమిస్తున్నావని ఆ పురుషుడిని అడి గితే అతను ఏమీ సమాధానంచెప్పలేడు...అప్పుడు మనం అతను అకారణంగానే ఆ స్త్రీని ప్రేమిస్తున్నాడని తెల్చుకో వాల్సివస్తుంది...అందువల్ల ప్రేమని అకారణమధురమైత్రీ భావంగా నిర్వచిస్తే సరిపోతుందేమో నని రఘుకి తోచింది. ఇంతకీ ప్రేమంటూ ఒకటి వుందా అనే సందేహం కలిగింది రఘుకి...కవుల కల్పనాశక్తిలోవుంటే వుండవచ్చు...అంతే కాని, నిజంగా ఉందనుకోవడం గొప్పపొరపాటు...ప్రేమంటే ఇది కాదు అది కాదు, అని, భగవత్స్వరూపాన్ని వర్ణించినట్లే 'నేతి నేతి' అని అభివర్ణిస్తారు...భగవంతుడు ఉన్నాడనే నమ్మకం ఉన్నప్పటికీ ప్రేమ అంటూ ఒకటి వుందని రఘు విశ్వసించలేకపోయాడు... ... ...

స్త్రీపురుషులమధ్య ప్రకృతిసిద్ధమైన ఒక ఆకర్షణ వుంది... ...ఆ ఆకర్షణకే కవులు అనాదినించీ వింతరంగులు పూస్తూవచ్చారు... ...తత్ఫలితంగా ఆ ఆకర్షణని మరీ ఆకర్షవంతం చేశారు... ...చిలువలు పలువలు దిద్దారు... ...అపూర్వ ప్రేమకథల్ని అల్లారు... ...వింతప్రణయాల్ని చిత్రించారు... ...

తమ కల్పనాశక్తినంతటినీ వినియోగించి, ప్రేమని కళ్ళకుకట్టేట్లు అభివర్ణించారు... ...మన్మథదూషణ, చంద్ర దూషణ మొదలైన ప్రక్రియలన్నీ కావ్యాలలో వాడారు... దానితో ప్రపంచానికి మత్తుమందు ఎక్కించినంతపని జరిగింది. ... ...ఎక్కడబడితే అక్కడ. ఏవయస్సులోబడితే ఆ వయస్సులో ప్రపంచమంతటా ప్రేమికులు వెలిశారు... ... అవిరళంగా ప్రేమించడం ప్రారంభించారు... ...ఆ కైపుతో కొందరు మహత్తరకార్యాల్ని సాధించారు... ...మజ్నూ, ఫరహాద్‌లవంటి కొందరువ్యక్తులు తాము కల్పించుకున్న దారుణపరిస్థితుల్ని ఎదుర్కోలేక, ఎందుకూ పనికిరాకండా పిచ్చెత్తిపోయారు.

పూర్వకాలంలో మనుషులకు చేతినిండా పని ఉండేది కాదు... వేటాడో, వ్యవసాయంచేసో ఆహారాన్ని సంపా దించేవారు... ...పత్తిని పండించి, బట్టలు నేసి, దుస్తులు ధరించేవారు...ఆ రెండు అవసరాలు తీరడంతో చేయవలసిన పనులన్నీ పూర్తిఅయ్యేవి... ... ...బోలెడంత తీరిక ఉండేది... ...దానితో రోజులతరబడి, మాసాలతరబడి, సంవ త్సరాలతరబడి ప్రేమించేవారు ...వివిధశాస్త్రావలోకనతో, ఆధ్యాత్మికచింతనతో ఏ కొద్దిమందో తమకాలాన్ని సద్విని యోగంచేస్తే, మిగిలినవారంతా నిత్యావసరాలు తీరడంతోనే ప్రేమకలాపాల్లో పడేవారు... ...దానితో ప్రేమ ఒకకళగా, ఒకశాస్త్రంగా రూపొందింది. నిజంగా ప్రేమ అనేది ఒక బూటకమేనా అనే ఆలోచనలో పడ్డాడు రఘు. ఏమో?

ఏదీ నిశ్చయించుకోలేకపోయాడు. తిరిగి తాను రమణ, పద్మ - యిరువురినీ ప్రేమిస్తున్నాననే మాయలో పడ్డాడు.

పద్మ తనహృదయంలో గాఢంగా హత్తుకుపోయింది. రమణపై తనకుగల ఫ్యాసీన్సి క్రమంగా ఎగిరిపోతున్న దేమో నని భయంవేసింది. రమణ ఈమధ్య తనని కలుసుకోవడం లేదు. విచిత్రంగా మారిపోతున్నది. ఆమెపై తనకుగల ప్రేమ ఎందుకో తగ్గిపోతున్నట్లు తోచింది, రఘుకి. తనపైకూడా ఆమెకి ప్రేమ తగ్గిపోతున్నదా? సహజంగా తగ్గిపోయేవుం టుంది. ఈఊరికి ఆఊరు ఎంతో ఆఊరికి ఈఊరంతే దూర మని చెబుతారు పెద్దలు - రఘుకి అందులో ఎంతో సత్యం కనపడింది. ప్రేమికులమధ్య ఒక పదిసంవత్సరాలపాటు ఎడ బాటు కలిగి, ఆ తరువాత వాళ్ళు కలుసుకోవడం జరిగితే ఎట్లావుంటుందనే ఆలోచన కలిగింది రఘుకి. ఎల్లా వుంటుంది? మొదటి అన్యోన్యత, వివిధవిషయాలలో మొదటవుండిన ఏకీ భావం వుండదు. విభిన్నప్రకృతులతో, విభిన్న మనస్తత్వాలతో కలుసుకోవడం జరుగుతుంది. ఎడబాటు కలగడంతోనే పరి స్థితులు మారిపోతాయి. విభిన్నపరిస్థితులలో విభిన్నఅభి రుచులు అలవడుతాయి. క్రమేణా కాలం వారిలో మొదట వుండిన ఏకీభావాన్ని తుడిచివేస్తుంది. విభిన్నఅభిరుచులుగల యిరువురువ్యక్తులు కలుసుకున్నప్పుడు సహజంగా బోర్ అవడం జరుగుతుంది. మొదట ఆ ఐక్యభావాన్ని తమసంబం ధాలలో తిరిగి నెలకొల్పడానికి విశ్వప్రయత్నం చేస్తారు. చివరికి విఫలులౌతారు. విఫలులు కావడంతోనే ఒకరంటే ఇంకొకరికి బోరెత్తిపోతుంది. అల్లాగే కొంతకాలంపాటు ఒక

చోట ఉండడం జరిగితే, యిరువురిమధ్యా విద్వేషాలు చెలరేగు తాయి. తత్ఫలితంగా ఒకరిని ఒకరు అసహ్యించుకోవడం జరుగుతుంది. అయితే ప్రేమికులకు చాలాకాలంవరకు ఎడబాటుకలిగితే, వాళ్ళల్లో మొదటవుండిన ప్రేమ చిరస్థాయిగా వుండడం అసంభవమన్నమాట! కాలం క్రమేణా ప్రేమని తుడిచివేస్తుందన్నమాట! ప్రేమికులు కొత్తపరిస్థితుల్లో కొత్త మనుషులు కావడం సహజమేనన్నమాట! కాని కవులు ప్రేమకి అమరత్వాన్ని ఎందుకు ఆపాదిస్తారు. ఇంత తాత్కాలికమైన ఉద్రేకాన్ని అంత హృదయంగమంగా చిత్రించడ మెందుకో!

బహుభార్యాత్వం ప్రబలిఉన్నరోజుల్లో ఒకపురుషుని దృష్టిని ఒకేస్త్రీపై లగ్నంచేయడానికిప్రేమని అంత మహోత్తరంగా చిత్రించివుంటారేమో! సంఘసంక్షేమందృష్ట్యా ప్రపంచంలో ఏకపత్నీవ్రతాన్ని నెలకొల్పడంకోసం. కవులు ప్రేమకి ఒకమహాత్వాన్ని ఆపాదించివుంటారు. బహుశా తరువాతి కవులుకూడా సంఘసంక్షేమందృష్ట్యా ఈవిషయంలో ఆదికవులఅడుగుజాడల్ని అనుసరించివుంటారు. నేటిపరిస్థితుల దృష్ట్యాకూడా బహుభార్యాత్వం విసర్జనీయమే. అందువల్ల రమణాపద్మలమధ్య ఎవరినోఒకరిని ఎన్నుకోవడం అవసరమని భావించాడు రఘు. కాని, ఎవరిని వదలుకోవడమా అన్న విషయమే తేలలేదు. రమణ తనని వదలుకోవడానికి ఇష్టపడితే ఏ చిక్కూ వుండదు. అప్పుడు తను తనకులంకానిపిల్లని పెళ్ళిచేసుకోవాల్సివస్తుంది. తనకి కులాలంటే ఏమాత్రం నమ్మకంలేనిమాట నిజమేకాని, ఎప్పుడూ మనుషులచేతలువారి

భావాలకన్నా వందసంవత్సరాలు వెనకబడిఉంటాయి. కులాల విషయంలో తనకు ఎంతనమ్మకంలేకపోయినా, తీరాసమయానికి సాహసించి ఇంకొకకులంఅమ్మాయిని తాను పెళ్ళి చేసుకో గలడా? ఏమో, చెప్పడంకష్టం. కాలమే ఆ సంగతి నిర్ణయించి చెప్పగలుగుతుంది. అంతవరకు వేచిఉండడం అవసరం. సంఘాన్ని ఎదిరించి అయినా తను విశ్వసించిన విషయాన్ని ఆచరించడంలో మనస్సుకి ఎంతోశాంతి లభిస్తుంది. లేకపోతే జీవితం యమయాతనగా మారుతుంది.

ఈ ఆలోచనలతో ఎంతకాలం గడిచిపోయిందో తెలి యదు. ఇంతలోకే దాసీది మగసాలలోకి భోజనంతీసుకొ చ్చింది దాసీది భోజనంతీసుకురావడం రఘుకి ఆశ్చర్యాన్ని కలిగించింది. 'భోజనంచేయకండా వెళ్ళిపోదామా' అని అను కున్నాడు. కాని అది భావ్యంగా వుండదని తోచింది. తనని ప్రోత్సహించిన రెండవశక్తి పద్మ అని చెప్పడం గొప్ప పొర పాటైంది. దానితో పద్మకి కోపమొచ్చి వెళ్ళిపోయిఉంటుంది. చేసిన పొరపాటుని ఇప్పుడు సరిదిద్దుకోవడం ఎల్లా? తను అన్న సంగతి, పద్మ తన తలిదండ్రులకు చెప్పివేయదుకదా? చెప్పే ప్రకృతిగలదైతే తనకి అన్నం ఎందుకు పంపిస్తుంది? ఇట్టిపరిస్థి తుల్లో తను ఎంతో శాంతంగా వ్యవహరించడం చాలా అవసరం.

దాసీది టేబుల్పైన అన్నివస్తువులూ అమర్చినతరు వాత 'ఒకమాటు మీ చిన్నదొరసానిని రమ్మనిచెబుతావా?' అన్నాడు రఘు దాసీదానితో. 'చిన్నదొరసానికి కాస్త తలనొప్పిగా ఉంది. మిమ్మల్ని భోజనంచేయమని చెప్పింది''

అని దాసీది సమాధానంచెప్పింది. ఆతరువాత రఘు విధిలేక భోజనంచేయడం ఆరంభించాడు. కంచంచుట్టూ గిన్నెల్లో ఎన్నో వస్తువులు ఉన్నాయి. కాని రఘుకి ఏవస్తువూ రుచించ లేదు. ఏదో కాస్త ఎంగిలిపడి లేచాడు. దాసీది తాంబూలం తీసుకొచ్చి యిచ్చింది. తాంబూలంవేసుకొని పదిహేను నిమిషాలపాటు రఘు పద్మకోసం నిరీక్షించాడు. ఆమె రాకపోవడంతో విసిగి అక్కడినించి ఇంటికి బయల్దేరాడు. వాకిలి గుమ్మం దాటుతుండగా 'చిన్నదొరసాని రేపు ఒకమాటు మిమ్మల్ని దయచేయమన్నది' అని దాసీది చెప్పింది. రఘు వినీవిననట్లుగా గుమ్మందాటి ముందుకు సాగాడు.

రఘు ఆ మరునాడు పద్మయింటికి వెళ్ళలేదు. రెండవ రోజున ఉదయమే, ఒక చీటీ తీసుకొని ఒక పనిమనిషి రఘు యింటికి వచ్చాడు. 'నావల్ల పొరపాటు ఏమైనా జరిగితే క్షమించండి. వెంటనే ఒకమాటు దయచేయండి' అని వ్రాసి వుంది. 'సరే నీవు వెళ్ళ'మని పనిమనిషితో చెప్పి, రఘు పద్మ యింటికి బయల్దేరాడు. తాను వెళ్ళేసరికి పద్మ దివాన్‌ఖానాలో కూర్చున్నదల్లా లేచి నిలబడింది.

'ఏం? నిన్న ఎందు కల్లా వెళ్ళిపోయావు?' అన్నాడు.

తలవనితలంపుగా వచ్చిన ప్రశ్నకి పద్మ సమాధాన మేమీ చెప్పలేకపోయింది.

రఘు వెళ్ళి ఒకసోఫాలో కూర్చున్నాడు. అతనికి ఎదురుగా పద్మ కూచుంది.

'ఆరోజున నే నన్నమాటకు కోపంవచ్చిందా?'

పద్మ లేదన్నట్లు తల ఊపింది.

'మ రెండు కల్లా వెళ్ళిపోయావు?'

'రమణవిషయంలో గొప్పఅపచారం చేస్తున్నానేమో నని నా భయం.'

'అపచారంచేస్తున్నది నువ్వా, నేనా?'

'నా మూలకంగా మీరు.'

'మొత్తానికి ఉభయులమూ దోషులమే నన్నమాట.'

'మీరు వెంటనే పెళ్ళి ఎందుకు చేసుకోగూడదు?'

'భలే గొప్పఐడియా! కాని, పెళ్ళాన్ని పోషించడం ఎల్లాగు?'

'మీ సంసారానికి సరిపోయేటంతడబ్బు వస్తే పెళ్ళిచేసు కుంటారా?'

'నేను పెళ్ళిచేసుకోకపోవడం నీకు బాధగా వుందా?'

'బాధగావుందని కాదు. ఒక సమస్య తేలిపోతుందని.'

'నీ సమస్యలు తేల్చుకోవడానికి, నన్ను బలిగా వాడు కుందామనా?'

'మీరు నమ్మండి, నమ్మకపోండి - మీరు పెళ్ళి కాకుండా వుంటే ఏదో ప్రమాదం సంభవిస్తుందని నా అను మానం.'

'అందుకోసం వెంటనే నా పెళ్ళిచేసివేయడానికి ప్రయత్ని స్తున్నావన్నమాట!'

'మీరు ఏమన్నా అనుకోండి - కాని ఇప్పటినించి మా రిక్కడికి రాకుండావుండండి.'

'అది నా తరం కాదు.'

'మరి ఎల్లానండీ?'

'రమణకి నీవ్వూ ద్రోహం తలపెట్టవద్దు - నేనూ తలపెట్టను. కాని, ఒకవేళ రమణ నీ వివాహానికి అంగీకరిస్తే నీవు మాత్రం నన్ను తప్పకుండా పెళ్ళిచేసుకోవాలి.'

'రమణ నా వివాహానికి అంగీకరిస్తుందని మీకు నమ్మకంఏమిటి?'

'రమణతో నా వివాహం పొసగదని, నా అంతరాత్మ చెబుతున్నది. ఈమధ్య నన్ను ఒక్క సారైనా చూడడానికి రానిమనిషి, నన్ను పెళ్ళిచేసుకుంటుందంటే నేను ఎల్లా నమ్మను?'

'రెండు సంవత్సరాలక్రింతం మీకోసం పీటలమీద పెళ్ళిని వదులుకుంది.'

'అది రెండుసంవత్సరాల క్రిందటిమాట.'

'అంటే, రెండుసంవత్సరాల్లో రమణ మారిపోయిందనా మీఉద్దేశం?'

'నాపట్ల ఆమె కనపరుస్తున్న నిర్లక్ష్యంచూస్తే అల్లానే భావించవలసివస్తున్నది '

'బ్రాహ్మణేతరకన్యని వివాహమాడడానికి మీ కెట్టి అభ్యంతరం లేదా?'

'అభ్యంతరండుంటే, ఇంతదూరం ముందుకు సాగేవాడినే కాను.'

'నా కెన్నడూ అపకారంచేయరు కదూ?'

'బొందిలో ప్రాణం ఉన్నంతవరకూ నీకు అపచారం తలపెట్టను.'

'ఒకవేళ మీరు రమణని పెళ్ళిచేసుకోవడం జరిగితే నేను యావజ్జీవం బ్రహ్మచారిణిగా గడుపుతాను. సంతోషంగా – మీఉభయులకూ నా శక్తికొలదీ సేవచేస్తాను.'

'అంత త్యాగానికి నేను అర్హుడిని కానేమో!'

'ఆ సంగతి నిర్ణయించవలసింది నేను; మీరు కాదు.'

రఘు, పద్మలు అన్నిసంగతులూ ఎట్టిదాపరికం లేకండా ముఖాముఖి సంభాషించుకున్నారు. ఈ సంభాషణ వల్ల ఉభయులకీ ఎంతో సంతృప్తి కలిగింది.

'ఈగొడవల్లోపడి అసలుసంగతి మరచిపోయాను. మీ కాలేజీపరిస్థితులు ఎల్లా ఉన్నాయి?'

'చాలామంది విద్యార్థినులు కాలేజీకి వెడుతున్నారు. మిగిలిన కొద్దిమంది ఏమిచేయడానికీ తోచక నానాఅవస్థలు పడుతున్నారు.'

'నాగపూర్‌కి రావడానికి ఎవరైనా సంసిద్ధంగా ఉన్నారా?'

'ఏఒక్కరూ సిద్ధంగా లేరు.'

'కారణం?'

'కారణం ఏమీ లేదు. ఎవ్వరూ తమఅమ్మాయిని ఒంటరిగా నాగపూరుకి పంపించడానికి యిష్టపడడంలేదు.'

'అయితే, స్త్రీలకళాశాలకి సంబంధించినంతవరకు ఉద్యమం విఫలం అయిందన్నమాట.'

'అల్లాగే కనపడుతుంది.'

'ఒకపని చేస్తావా?'

'చెప్పండి.'

'రేపు మీకళాశాల ముఖ్యకార్యకర్తలనందరినీ, ఒక మాటు సమావేశపరుస్తావా?'

'సరే.'

'అయితే, ఇంక నేను వెళ్ళివస్తాను.'

'భోజనంచేసి వెళ్ళండి.'

'లేదు, ఈరోజు చాలా పను లున్నాయి. రేపు వచ్చి నప్పుడు భోజనంచేస్తాను.'

'అయితే ఒక్కక్షణం ఆగండి.'

పద్మ లోపలికివెళ్ళి చెక్కుబుక్కు తీసుకొచ్చింది. గబగబా చెక్కుబుక్కులో సంతకాలుచేసి రఘుచేతి కిచ్చింది.

'ఇప్పుడు చెక్కుబుక్ ఎందుకు?'

'డబ్బు మీకు అవసరం ఉంటుంది. మీదగ్గరే ఉంచు కోండి.'

చెక్ బుక్ తీసుకొని రఘు బయల్దేరాడు.

మరునాడు స్త్రీలకళాశాల ముఖ్యకార్యకర్తలందరూ పద్మయింట్లో సమావేశమైనారు. సుమన్, ఆయెషా, రమ ణలుకూడా ఆ సమావేశానికి వచ్చారు. రఘు వాళ్ళతో సం ప్రదించాడు. సంప్రదింపుల ఫలితంగా తేలిం దేమిటంటే, ఎవ్వరూ నాగపూర్ కి రావడానికి సంసిద్ధంగాలేరనీ, సమ్మె కొనసాగించడానికికూడా యిష్టపడడంలేదనీని నాగపూర్ రాక పోయినా సమ్మె కొనసాగించవలసిందిగా, రఘు మరీ మరీ చెప్పాడు. సుమన్, ఆయెషా, పద్మలు ఆ సంవత్సరం చదువు మానుకోవడానికి అంగీకరించారు. కాని, మిగిలినవా రెవ్వరూ ఒప్పుకోలేదు. సమ్మె మానివేసి, తిరిగి కాలేజీకి

వెడుతామని పట్టుపట్టారు. విద్యార్థినులు తిరిగి కాలేజీకి వెళ్ళ డంవల్ల ఉద్యమానికి ఎంత ద్రోహం జరిగేదీ రఘు వాళ్ళకి వివరించి చెప్పాడు. కాలేజీలో చేరడానికి ఉద్యుక్తులైన విద్యార్థినులకు స్త్రీలకళాశాల విద్యార్థిసంఘ కార్యదర్శి నాయకత్వం వహించింది. విద్యార్థులు చదువులు మానుకొని, ఉద్యమాల్లో చేరడం ఏమాత్రం తగదని వాదించింది.

'నీ వేమి చేయదలచుకున్నా' వని రఘు రమణని అడి గితే 'నేను ఒకసంవత్సరం అనవసరంగా వ్యర్థంచేసుకోజాల' నని నిక్కచ్చిగా చెప్పింది. దానితో విద్యార్థినులలో రెండు వర్గాలు ఏర్పడ్డాయి. సమ్మె ఆపివేయవలెననేవర్గం మొదటిది- సమ్మె ఎట్టిపరిస్థితుల్లోనైనా కొనసాగించడం అవసరమనేవర్గం రెండవది. రెండవవర్గానికి సుమన్, ఆయెషా, పద్మలు నాయ కత్వం వహించారు. ఇంటింటికీ వెళ్ళి విద్యార్థినులను క్యాన్ వాస్ చేశారు. రమణ విరోధిపక్షంలో చేరినప్పటికీ సమ్మె ఆపివేయవలసిందిగా ప్రచారం ఏమీ చేయలేదు. కాని ఆ పక్షంవేపు మొగ్గి, రోజూ ఆమె కాలేజీకి వెళ్ళడం చూచి రఘు ఎంతో చింతించాడు.

రఘుచదువు ఆసంవత్సరం కొనసాగలేదు. చందాలు వసూలుచేయడంతో, నాగపూర్‌లోని విద్యార్థులకు అన్నిసౌక ర్యాలు సమకూర్చడంతో గడిచిపోయింది. ఉర్దూపత్రికలు ఉద్యమంపైన దుమ్మెత్తిపోశాయి. చర్యాసంఘసభ్యుల్ని వెంటనే అరెస్టుచేయవలసిందిగా ప్రభుత్వానికి విజ్ఞప్తిచేశాయి. కాని ప్రభుత్వం చర్యాసంఘసభ్యులకి వ్యతిరేకంగా ఎట్టిచర్య తీసుకోలేదు. కొంతకాలానికి నాగపూర్‌లో విద్యార్థులకి

సంవత్సరపరీక్షలైనాయి. పరీక్షలిచ్చి విద్యార్థులు హైద్రాబాద్‌కు తిరిగివచ్చారు. పరీక్షాఫలితాలు తెలిశాయి. నాగపూర్‌కువెళ్ళిన చాలామంది విద్యార్థులు పరీక్షలో ప్యాసైనారు. మరుసటిసంవత్సరం తిరిగి విద్యార్థులు నాగపూర్‌కు వెళ్ళడమా లేదా అనే సమస్య చర్చకువచ్చింది. ఉస్మానియా విశ్వవిద్యాలయం నాగపూర్‌కి వెళ్ళిన విద్యార్థులనందరినీ ఎట్టివిచక్షణలేకుండా చేర్చుకోవడానికి అంగీకరించింది. గత సంవత్సరపు వ్యయప్రయాసలదృష్ట్యా విద్యార్థులు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో చేరడమే సముచితమని చర్యాసంఘం తీర్మానించింది. దానితో వందేమాతరం విద్యార్థులందరూ ఉస్మానియావిశ్వవిద్యాలయంలో చేరారు. కాగా, చర్యా సంఘం రద్దుచేయబడింది. రఘు తిరిగి ఎం.ఏ. లో చేరాడు. పద్మ, సుమన్, ఆయెషాలు ఇంటర్‌సీనియర్‌లో చేరారు. ఉవ్వెత్తున ప్రారంభమైన 'వందేమాతరం' ఉద్యమం చివరకి విఫలమైంది.

# 12

రఘుణ ఇంటర్ ఫస్టుక్లాసులో ప్యాసైంది. ఇంటర్ తరువాత బి. ఎస్. సి. లో చేరడానికి ఆమెకు ఏమాత్రం మనస్కరించలేదు. జీవితంలో ఏ ఆశయం లేకండా నలుగురితో పాటు నారాయణ అన్నట్లు ఉన్నతవిద్యనభ్యసించడం ఆమెకు అర్థరహితంగా తోచింది.

సాధారణంగా విద్యార్థులు ఇంటర్ తరువాత బి. ఏ.. బి. ఏ. తరువాత ఎం. ఏ. అల్లా క్లాసులతరబడి గుడ్డిగా చదు

వుకుపోతారు. అల్లా ఎందుకు చదువుతున్నారంటే ఏమీ చెప్పలేరు. ఊరికే కాలయాపనచేయడానికిబదులు, ఏదో చదువుకోవడం మంచిదనే అభిప్రాయంతో చదువుకుపోతారు. జీవితంలో ఒక ఆశయమంటూ ఏర్పరుచ్చుకోరు. ఆ ఆశయం కోసం కృషిసల్పడం అంతకన్నా ఉండదు. ఉదరపోషణార్థం ఏదో ఉద్యోగం సంపాదించాలి. దానికోసం ఉన్నతవిద్యలు అభ్యసించాలి. కాగా, చదువుపైన శ్రద్ధ ఉండదు. పరీక్షల్లో ఉత్తీర్ణులంకావడం ఎల్లాగాఅని ఆలోచిస్తారు. పాఠ్యగ్రంథాల్ని ఒకసారైనా తాకకండా, గైడ్‌లతో కాలంవెళ్ళబుచ్చి, పరీక్షల్లో ఆవచ్చింది కాస్తా కక్కేసి, గండంతప్పించుకుంటారు.

రమణ ఎన్నడూ తక్కినవిద్యార్థులవలె చదువుకొని ఎరగదు. మెట్రిక్యులేషన్ ప్యాసుకావడంతో, తనకు అభిరుచిగల విషయాలేమిటా అని ఆలోచించింది. తను జీవితంలో ఏమిచేయదల్చుకున్నదీ ముందుగానే తేల్చుకున్నది. తదనుగుణంగా పాఠ్యవిషయాల్ని ఎన్నుకున్నది. తాను డాక్టర్ కావలెనని రమణ మొదటే నిశ్చయించుకుంది.తదనుగుణంగా జంతుశాస్త్రాన్నీ వృక్షశాస్త్రాన్నీ ఇంటర్‌లో అభిమానవిషయాలుగా ఎన్నుకున్నది.మొదటినుంచీ ఆవిషయాల్ని శ్రద్ధగాచదివింది.ఇంటర్ ఫస్టుక్లాస్‌లోఉత్తీర్ణురాలైంది. మెడికల్ కాలేజీలో చేరదామనుకుంటే ఆమెకు ధనాభావం అడ్డువచ్చింది. నారాయణరావుకి నెలకి వందరూపాయలజీతం – కరువుబత్తెం మొదలైనవన్నీ కలిసి దాదాపు 150 రూపాయలు వస్తాయి. ఈ మొత్తంతో సంసారం గడవడమే కష్టంగావుంది. ఇట్టిపరిస్థితుల్లో రమణకి వైద్యవిద్య ఎల్లా చెప్పించగలడు? మెడికల్

కోర్న శ్రీమంతులకే అలవికానివిద్య. ఆ చదువులో ఎంతో ధనం వెచ్చించాల్సిఉంటుంది. ఇంతవ్యయంతో కూడుకున్న విద్యని తాను చెప్పించజాలనని రమణకి నిక్కచ్చిగా చెప్పాడు. కాగా, ఆమెచదువుకోసం తాను అప్పులుచేయలేనని కూడా విస్పష్టపరిచాడు.

పెళ్ళికంటే ఎవరైనా డబ్బు అప్పు యిస్తారు. చదువుకంటే ఈభారతదేశంలో ఎవ్వరూ అప్పు యివ్వరు. కాలాన్నిబట్టి విలువలు మారడం అవసరమని భారతీయులు ఎన్నడూ గ్రహించరు. బూజుపట్టిన పాతవిలువల్నే అంటిపెట్టుకొని ఉంటారు. కూతురుకి చదువు చెప్పించకపోతే ఎందుకు చెప్పించడంలేదని ఎవ్వరూ అడగరు. అదే ఈడువచ్చినతరువాత కూతురుకిపెళ్ళిచేయకపోతే ఎందుకుచేయలేదని ప్రజలు కాకులలాగా పొడుచుకు తింటారు. ఎదిగినపిల్లని ఇంట్లో అట్టేపెట్టుకోవడం కష్టసాధ్యమైపోతుంది. 'పిల్లకి ఈడు వచ్చింది. ఎప్పుడు పెళ్ళిచేస్తావు?' 'ఈడువచ్చిన పిల్లను ఇంట్లో ఎన్నాళ్ళుంచుకుంటావు?' 'పెళ్ళిచేయడం చేతకాకపోతే, ఒక అయ్యచేతులో పెట్టి దండంపెట్టరాదా?' మొదలైన ఎత్తిపొడుపు మాటలు విని నారాయణరావుకు ప్రాణం విసుగెత్తిపోయింది. పెళ్ళిచేసుకోమంటే రమణ పెండ్లి చేసుకోదు. నీ కిష్టమొచ్చిన వరుణ్ణి ఎన్నుకోమన్నా, 'చదువు పూర్తిఅయిన తరువాత గాని నేను పెళ్ళి చేసుకో' నని మొండికేస్తుంది. 'ఆడపిల్లలకి చదువేమి' టని రమణచెవిలో యిల్లుకట్టుకొని చెప్పిచూచాడు నారాయణరావు. కాని లాభంలేకపోయింది.

రమణ కడు స్వతంత్రాలోచనగల పిల్ల. తన భవిష్యత్తుని తానే తీర్చిదిద్దుకోవాలని ఆమె ఆశయం. తత్ఫలితంగా గొర్రెదాటుగా యితరులను అనుకరించడం మానుకొని అన్ని విషయాలలో స్వతంత్రంగా వ్యవహరించడం నేర్చుకుంది. ఏది తప్పో ఏది తప్పుగాదో, ఏది నీతో ఏది అవినీతో తన జీవితానికి సంబంధించినంతవరకు తానే నిర్ణయించుకుంటుంది. తన స్వవిషయాల్లో యితరులజోక్యానికి ఏమీ చోటుఇవ్వాదు. మూడుసంవత్సరాలక్రితం పెళ్ళిచేసుకొమ్మంటే 'నాకు పెళ్ళి వ' ద్దని నిరాకరించింది. కాని 'బావని చేసుకుంటా' నని ఎన్నడూ అనలేదు. బావపైన రమణకి మొదటినుంచి ప్రేమ ఉన్నమాట నిజమే. కాని ఏది మంచి, ఏది చెడు అని నిర్ణయించుకోలేని ఆ అజ్ఞానదశలో తాను పెళ్ళివిషయంలో తొందరపడి రఘుని పెళ్ళిచేసుకోవడం సముచితంకాదని నిశ్చయించుకుంది. అప్పట్లో తాత్కాలికంగా ఉద్రేకోద్వేగాలలో కొట్టుకుపోయినా, పెళ్ళివిషయంలోఎట్టిపొరపాటూ చేయలేదు. కాలుజారి ఊబిలో పడిపోకుండా తీసుకోవలసిన జాగ్రత్త తీసుకుంది.

పెళ్ళి ఆగిపోయి, పద్మ యింట్లోంచి వెళ్ళిపోయిన తరువాత రమణ కావాలని ఎన్నడూ రఘుని కలుసుకోలేదు. కాకతాళీయన్యాయంగా రఘు పద్మయింట్లో కనపడడం తటస్థిస్తే, నలుగురితోపాటు తనూ అతనితో మాట్లాడింది. పద్మ ఇంట్లోవున్నప్పుడు అతనితో తను కొంత చనువుగా వుంటే ఉండవచ్చు. తండ్రికి ఎదురుతిరిగి ఒక వీరోచితకార్యాన్ని జరిపినప్పుడు, ఎవరైనా కాస్త సానుభూతిని ఆశించడం కద్దు.

సానుభూతిని అర్థించడంలో కొంత చనువుగా వుండక తప్పదు. ఆ చనువుని అపార్థంచేసుకోవడం గొప్పపొరపాటు.

రమణ పెళ్ళిచేసుకోవడానికై అంగీకరించకపోవడంలో నారాయణరావుకు ఆమెవిద్యపట్ల ఒక విముఖత ఏర్పడింది. నారాయణరావు ప్రాచీనసంప్రదాయంలో పుట్టిపెరిగిన మనిషి కనుక, సహజంగా అతను తన కూతురుకి పెళ్ళిచేయడం తన ప్రథమ కర్తవ్యంగా భావించాడు. ఏదో ఆడపిల్లలందరూ చదువుకోవడం చూచి అందరికిమల్లేనే అతనూ మొదట తన కూతురిని బడికి పంపించాడు. కాని ఎన్నడూ కూతురుచదువు పట్ల శ్రద్ధవహించలేదు. కాగా, 'ఆడపిల్లలకు చదు వెందుకు?' అనే ధోరణిలో వ్యవహరించాడు. కాని రమణ మొదటినించీ శ్రద్ధగా చదివి, ప్రతిసంవత్సరం వరుసగా పరీక్షలు ప్యాసు అవుతూవచ్చింది. తనకు ఇంగ్లీషు రాకపోవడంవల్ల నారాయణరావు ఎన్నడూ తనకూతురిని ఏమి చదువుతున్నా వని అడగనూలేదు; శ్రద్ధగా చదువుకొమ్మని నిర్బంధించనూలేదు. ఏదో రోజూ సూర్యుడు ఉదయించి అస్తమించినట్లే, నారాయణరావుకు తెలియకుండా రమణచదువు సాగిపోతూ వచ్చింది. మెట్రిక్యులేషన్ ప్యాసుకావడంతో రమణని చదువు ఆపివేసి పెళ్ళిచేసుకొమ్మని చెప్పాడు. తండ్రిసలహాను పెడచెవిని బెట్టి, రమణ ఇంటర్‌లో చేరింది. ఇంటరు రెండు సంవత్సరాలూ నారాయణరావు రమణని పెళ్ళిచేసుకొమ్మని పోరుతూనే వున్నాడు. ఇంతలోకే రమణ ఇంటరు ప్యాసు అయింది. వైద్యవిద్య నభ్యసించడానికి సమకట్టింది. ఇదే అదనుగా ఎంచి నారాయణరావు రమణచదువుకు కావల్సిన

ధనాన్ని వ్యయపరచడానికి నిరాకరించాడు. వందరూపాయల జీతంతో తనతండ్రి తనకు చదువు చెప్పించలేడని రమణకి కూడా తెలుసు. కాగా, అతనికి అప్పు తీసుకురావడానికికూడా పిత్రార్జితం ఏమీ లేదు. ఇట్టిపరిస్థితుల్లో రమణమాత్రం తండ్రిని చదువు చెప్పించమని ఎల్లా నిర్బంధించగలదు! 'నీ చదువుకయ్యే ఖర్చు నేను భరించజాల' నని తండ్రి నిర్మొహమాటంగా చెబితే, విని మౌనంవహించింది.

రమణకి బి.ఎస్.సి. లో చేరడానికి మనస్సు ఒప్పలేదు. పోనీ నర్సింగ్‌కోర్సు చదివితే? బి.ఎస్.సి. లో చేరడంకన్నా బాగానే వుంటుంది. నర్సింగ్ కోర్స్ చదివితే కొంత స్టయిఫండుకూడా యిస్తారు. కాగా ఈ కోర్సు తన ఆశయానికి కడు చేరువగావుంటుంది. తండ్రికి కొంతభారం తగ్గుతుంది. ముందుముందు పరిస్థితులు అనుకూలపడితే నర్సింగ్‌వృత్తిలో తనకొచ్చిన జీతంలో కొంతధనం వెనకవేసుకొని మెడిసన్ చదువుకోవచ్చు. అంతగా వీలుపడకపోతే రోగులకి సేవ చేస్తూ సుఖంగా జీవితం గడుపవచ్చు. ఎంత ఆలోచించినా, ఎన్నివిధాల ఆలోచించినా అప్పటిపరిస్థితుల్లో నర్సింగ్ కోర్సు చదువుకోవడమే ఉత్తమంగా కనపడింది రమణకి. వెంటనే నర్సింగ్‌కోర్సుకి సంబంధించిన వివరాలన్నీ సేకరించడం మొదలుపెట్టింది. మెడికల్‌కాలేజీలో సీటుకోసం దరఖాస్తు పెట్టుకోవడం ఏదో లాంఛనప్రాయంగా పెట్టుకుంది గాని, నర్సింగ్‌కోర్సులో చేరడానికి నిశ్చయించుకున్నతరువాత, సీటువచ్చిందీ, లేనిదీ ఎన్నడూ కనుక్కోలేదు. దరఖాస్తు పెట్టుకున్నసంగతికూడా విస్మరించడానికి ప్రయత్నించింది.

నర్సింగ్‌కోర్సులో ఇచ్చే స్టయిఫండ్ ఉత్సాహజనకంగానే కనపడింది. దీనివల్ల తనకు కొంతకాకపోయినా, కొంతయినా ఆర్థికస్వాతంత్ర్యం లభిస్తుందని సంతోషించింది. కాగా, నర్సింగ్‌కోర్సులో నర్సెస్‌క్వార్టర్స్‌లో వుండి చదువునేర్చుకోవాలి. దీనివల్ల పెళ్ళిపోరు కొంతతగ్గుతుంది. మనస్సు కొంతవరకు ప్రశాంతంగావుంటుంది. అవసరమైన వివరాలన్నీ సేకరించిన తరువాత, కోర్సు తనకు అన్నివిధాలా అనుకూలంగా వుంటుందని తోచడంతోనే సీటుకోసం దరఖాస్తు పెట్టుకుంది. వెంటనే సీటు దొరికింది.

సీటు దొరికిందే తడవుగా తాను నర్సింగ్‌కోర్సులో చేరుతున్నానని, తనతండ్రికి తన కృతనిశ్చయాన్ని తెలియజేసింది. 'బ్రాహ్మణజన్మ ఎత్తి మాదిగవృత్తి అవలంబిస్తావా' అని తండ్రి అవహేళనచేశాడు. 'రోజుకు పదిసార్లు స్నానం చేయనిది బ్రాహ్మణజన్మ గడవదే! అల్లాంటిది రోజుకు పది కాన్పులుచేసి, ఆ ఛండాలమంతా ఇంట్లో కలుపుతావా?' అని విసుక్కున్నాడు. కాని రమణ తన పట్టు వదలలేదు. 'ఏమైనాసరే, నేను ఆ కోర్సు చదవకతప్ప' దని నిక్కచ్చిగా చెప్పింది. కూతురుమంకు నారాయణరావుకు బాగా తెలుసు. గట్టిగా ఎదిరిస్తే ఇంట్లోంచి వెళ్ళిపోతుందేమోనని భయం. అందుకోసం ఏదో చెప్పవలసినరీతిగా చెప్పి, మౌనంవహించాడు. 'ఇంతచదువూ చదివి, చివరకి కిరస్తానీవృత్తి అవలంబిస్తావా?' అని కాలేజీలో ఒకస్నేహితురాలు రమణని వెక్కిరించింది. 'ఆ వృత్తిలో చేరి కిరస్తానీవాళ్ళలాగ పెళ్ళిచేసుకోకండా వుంటావా?' అని యింకొకస్నేహితురాలు ఎత్తిపొడిచింది.

ఈ వెక్కిరింపులూ, ఎత్తిపొడుపులూ రమణపైన ఏమీ పని చేయలేదు. బాగాఆలోచించి ఒకనిశ్చయానికివచ్చినతరువాత వెనుదిరగటం అంటూ ఆమెతత్వంలో లేదు. వివాహమే తమ జీవితలక్ష్యంగా ఎన్నుకునే అమ్మాయిల్నిచూచి ఆమె అసహ్యించుకొంది. 'బి. ఏ. తరువాత ఏం చేస్తా' వని ఏ అమ్మాయినైనా అడిగితే వెంటనే వివాహంచేసుకుంటా' నని చెబుతుంది. ఏకారణంవల్లనైనా వివాహం జరగకపోతే, ఉద్యోగంకోసం ప్రయత్నిస్తానని చెబుతుంది. ఆ ఉద్యోగం చేస్తామని చెప్పడంకూడా, నిజంవిచారిస్తే ఏకొద్దిమందో. అందరూ గొర్రెదాటుగా వివాహంతో అంతమొందుతారు. పురుషులు అల్లా కాదు. వారిలో ఏ కొద్దిమంది అయినా వివాహంచేసుకోకండా తమజీవితాల్ని తమ ఆశయసాధనకి బలిపెడతారు. స్త్రీలు అల్లాఎందుకుచేయరు? ఎప్పుడూ వాళ్ళు తమ సౌఖ్యాన్నే ఎందుకు దృష్టిలో ఉంచుకుంటారు? వివాహమే తమజీవితలక్ష్యంగా ఎందుకు ఎన్నుకుంటారు? బ్రహ్మచారిణులుగా ఎందుకు జీవితాన్ని గడపరు? తమ జీవిత లక్ష్యానికి అడ్డువస్తే వివాహాన్నే పరిత్యజించగలధైర్యం స్త్రీలకి ఏనాడు వస్తుంది?

ఆధునిక యువతికీ, ప్రాచీన స్త్రీకీ గల వ్యత్యాసం ఎక్కడ వుంది? నేటి స్త్రీ, ఏవో అవకాశాలు ఉన్నాయి కనుక చదువు నేర్చుకుంటున్నది. అక్షరాస్య కాగలుగుతు న్నది. కాని, ప్రాచీన సంప్రదాయాల్లో పడి గిలగిల తన్నుకుం టున్నది. స్వతంత్రాలోచన లేక, విషమపరిస్థితులకు తలొగ్గు తున్నది. తత్ఫలితంగా సర్వతోముఖంగా అభివృద్ధిచెందలేక

పోతున్నది. గదులుగదులుగా జీవితాన్ని గడుపుతున్నది. నేర్చుకున్నవిద్య ఒక గదిలో బంధించివేయబడుతున్నది. దాని వెలుగులు ఏర్పర్చుకున్న ఇనుపగోడల ద్వారా జీవిత సమస్యలపైన ప్రసరించలేకపోతున్నాయి. ప్రాచీనసంప్రదాయాలగది నిజం విచారిస్తే ఒక చీకటికొట్టు. తాతలూ, తండ్రులూ, అమ్మమ్మలూ, తల్లులూ కలకాలంనించీ అనుసరిస్తూవస్తున్న సంప్రదాయాలు, ఇంకొకగదిలో పదిలపరుపబడుతున్నాయి. ఈ సంప్రదాయాలు మంచివా, చెడ్డవా అని వితర్కించుకోవడమే మహాపాపం! అల్లా వితర్కిస్తే వాటి పవిత్రతనే దూషించినట్లు అవుతుంది. అందువల్ల వాటిని గూర్చి ఏమీ ఆలోచించగూడదు. ఆర్జించిన విద్యా విజ్ఞానాలతో వాటిని పరీక్షించగూడదు. పవిత్రవారసత్వంగా వాటిని శిరసావహించాలి. వాటికి భక్తిశ్రద్ధలతో అంజలి ఘటించాలి. ఇట్టిపరిస్థితుల్లో స్త్రీకి విముక్తి ఎక్కడ వుంది? కొందరు ఆధునికయువతులు ఈ దారుణపరిస్థితులకి ఎదురుతిరిగితేతప్ప సంఘానికి విముక్తిలేదు. రమణ ఈ దారుణపరిస్థితుల్ని గట్టిగా ఎదుర్కోడానికి నిశ్చయించుకుంది. స్వతంత్రాలోచనలతో తనజీవితాన్ని తాను తీర్చిదిద్దుకోవడానికి సంకల్పించుకుంది. ఎన్ని కష్టాలనయినా ఎదిరించి తన జీవితాశయాన్ని సాధించడానికి రమణ కృతనిశ్చయురాలైంది. తన ఆశయసాధనకి వివాహం అడ్డువస్తే వివాహాన్నే పరిత్యజించడానికి తలపెట్టింది. చివరికి నర్సింగ్‌కోర్సులో చేరడానికి సంబంధించిన ప్రయత్నాలన్నీ చేయడంలో నిమగ్నమైంది. రెండురోజుల తరవాత నర్సింగ్‌కోర్సులో అడ్మిషన్ తీసుకొని, హాస్టల్‌కు

వెళ్ళిపోవడానికి సర్వసన్నాహాలు పూర్తిచేసుకొని పద్మని చూడడానికి వెళ్ళింది.

కుశలప్రశ్నల అనంతరం తాను నర్సింగ్ కోర్సులో చేరాననీ, ఆ మరునాడు హాస్టల్‌కు వెళ్ళిపోతున్నాననీ రమణ పద్మతో చెప్పింది.

'మొదట మెడిసన్‌కు వెడుతానన్నావు. ఇప్పుడు ఈ కోర్సు తీసుకోవడానికి కారణం?'

'మెడిసన్ అయితే అయిదుసంవత్సరాలు చదవాలి. ఈ కోర్సు నాలుగుసంవత్సరాలలో పూర్తి అవుతుంది.'

'అంత తొందరగా కోర్సు పూర్తి చేసుకోవాల్సిన అవసరం ఏం వచ్చింది?'

'అవసరం ఏర్పడిందికనుకనే ఈ కోర్సులో చేరాను.'

'ఆ అవసర మేమిటని అడగవచ్చునా?'

'నీవు అడగావచ్చు, నేను చెప్పావచ్చు.'

'అయితే కాస్త చెపుతావా, విని సంతోషిస్తాను.'

'దాచుకోవడానికి ఏముందికనక, చెప్పకపోవడానికి.'

'చెప్పదలచుకున్నప్పుడు అంత ఊరించడ మెందుకు?'

'నేను చెప్పకండా ఊరిస్తున్నాననా నీభావం?'

'ఊరిస్తున్నావో లేదో నాకు తెలియదు. కాని అనవసరంగా కాలయాపన చేస్తున్నావనిమాత్రం చెప్పగలను.'

'ఇందులో కాలయాపనచేయడం ఏముంది? మాయింటి పరిస్థితులు నీకు తెలియనివి కావు. మానాన్న నాకు మెడిసన్ చెప్పించలేడు.'

'అంటే ధనాభావంవల్ల చేరలేదన్నమాట?'

'ఇంకా అన్నమాట ఏమిటి? ధనాభావంవల్ల నేనని స్పష్టంగా చెబుతున్నప్పుడు!'

'నేను ఒకమాట చెబుతాను వింటావా?'

'వినదగ్గదయితే తప్పకుండా వింటాను.'

'అయితే నీవు మెడికల్ కాలేజీలో చేరు. నీకు కావల్సినడబ్బు నేను ఇస్తాను.'

'నీ ఔదార్యానికి నా కృతజ్ఞతలు. కాని, నేను నీ దగ్గర డబ్బుతీసుకోను.'

'ఎందుచేత ?'

'ఎందుచేత ఏమిటి ? నాకు యిష్టంలేదు.'

'ఇష్టంలేకపోవడానికికూడా ఒకకారణం అంటూ వుండడం అవసరం కదూ ?'

'కారణంఉండే అయిష్టత ఏర్పడింది'

'ఆకారణమే ఏమిటని నేను అడుగుతున్నది ?'

'నా స్వార్జితంపైన నేను జీవించదలచుకున్నాను.'

'స్టైఫండ్ దొరకకపోతే ఏమిచేసేదానివి ?'

'ఏమిచేసేదాన్ని ? చదువు మానేసి, దాయిగా చేరేదాన్ని.'

'అయితే నేను డబ్బుయిస్తే తీసుకోవన్నమాట ?'

'తీసుకోను.'

'ఎంతబలవంతంచేసినా ?'

'ఎంతబలవంతంచేసినా తీసుకోను.'

'చివరకి నా స్నేహితాన్నికూడా వదలుకోవాల్సి వచ్చినా ?'

'నీవు అంత పిచ్చిగా ప్రవరిస్తావని నేను అనుకోను.'

'ఒకవేళ పిచ్చిగా ప్రవర్తిస్తే ?'

'అప్పుడు నా ఖర్మం అనుకుంటాను.'

'అంతేకాని, నీవు జీవితంలో ఏర్పాట్చుకున్న నియమా లను వదులుకోలేవన్నమాట ?'

'వదులుకోలేకపోతున్నందుకు ఎంతో చింతిస్తున్నాను.'

'స్నేహితుల్నీ, బంధువుల్నీ కోల్పోయి ఈనియమాల వల్ల జీవితంలో ఏమి సాధిస్తావని ?'

'ఆత్మశాంతి, మనఃస్థిమితం.'

'ఇవిమాత్రం సాధించడం దేనికి ?'

'రోగగ్రస్థులు, రోగపీడితులసేవ చేయడంకోసం.'

'నీకే డబ్బుంటే మెడికల్ కాలేజీలో చేరడానికిబదులు నర్సింగ్ కోర్సులో చేరేదానివా ?'

'లేదు.'

'డబ్బులేకపోవడంవల్లనే, నీ ఆశయాన్ని కొద్దిగా మార్చుకొని, ఒకమెట్టు కిందికి దిగావన్నమాట ?'

'లేదు – నా ఆశయాన్ని ఏమీ మార్చుకోలేదు. నర్సింగ్ వృత్తిలో చేరి, డబ్బుగడించి, ఉద్యోగానికి సుదీర్ఘ మైన శలవుపెట్టి ఎం. బి., బి. ఎస్., కోర్సు పూర్తిచేస్తాను.'

'అల్లా ఎంతకాలమని చదువుతావు ?'

'గొప్పడాక్టర్నిఅయ్యేవరకూ చదువుతూనేవుంటాను.'

'ఎం.బి, బి.ఎస్. పూర్తిచేయడంతో గొప్పడాక్టర్‌వి అయిపోతావా ?'

'కానేమోనని నా భయం. అందువల్ల విదేశాలకు వెళ్ళి ఎం. ఎస్. కోర్సు పూర్తిచేస్తా.'

'విదేశాలకి వెళ్ళడానికి డబ్బు ఏదీ ?'

'ఎం. బి. బి. ఎస్. తరువాత కొంతకాలంపాటు ఉద్యోగంచేస్తాను. అవసరమైనడబ్బు కూడడంతో ఉన్నత విద్యకోసం విదేశాలకు వెళ్ళిపోతాను.'

'డబ్బుఉంటే ఈ కోర్సుఅంతా త్వరలో ముగించుకో వచ్చుకదా !'

'అంతత్వరలో ముగించవలసినఅవసరమేమీ కనపడ డం లేదు. అనుభవంకలిగినకొద్దీ ఉన్నతవిద్యనభ్యసించడమే మేలని తోస్తున్నది.'

'ద్రాక్షపళ్ళు దొరకకపోతే, పులుపెక్కువ అని సంతృప్తిచెందినట్లు ఉన్నాయి నీమాటలు'

'నీకు అల్లా తోస్తే తోచివుండవచ్చు. కాని నేను మాత్రం ఆ దృష్టితో మాట్లాడడంలేదు.'

'పోనీ ఒకపని చేస్తావా?'

'చెప్పు'

'నాదగ్గర డబ్బు ఉచితంగా తీసుకోకపోతే అప్పుగా తీసుకో.'

'ఆ అప్పు చెల్లించలేకపోతే?'

'నేను ఏమీ అనుకోను.'

'నీవు ఏమీ అనుకోని మాట నిజమే! కాని, అప్పుడు నా దృష్టి చదువుపైన కాక అప్పుపైనే ఉంటుంది. కాగా, స్నేహితం ఉన్న చోట డబ్బుకు సంబంధించిన లావాదేవీలు ఉండకూడదు. అది ఎప్పటికైనా స్నేహితానికి ముప్పే.'

'ఇంక నీతో వాదించి లాభం లేదు. ఇంకే విషయాన్ని గూర్చి అయినా మాట్లాడుకుందాము?'

'కోపం వచ్చిందా?'

'నీ నియమాలు, నీ కట్టుబాట్లూ చూచి నేను కోప్పడడం దేనికి? కాని, మనుషుల కోసం నియమాలా, నియమాల కోసం మనుషులా అనేదే నా సందేహం?'

'ఏ నియమాలైనా కొంత యిబ్బంది కలిగించక మానవు. అంత మాత్రాన జీవితంలో క్రమశిక్షణనే మాను కుంటామా?'

'మానుకొమ్మని నేను చెప్పడం లేదు. కాని ఏ నియమాలైనా మనుషుల కోసమేనని గుర్తించడం అవసరమని చెబుతున్నాను.'

'ఆ సంగతి గుర్తించే నాకు అవసరమని భావించిన కొన్ని నియమాల్ని నా జీవితంలో ఏర్పరుచుకున్నాను. అవి ఇతరులకి బాధాకరంగా పరిణమిస్తే నా మట్టుకు నేను ఏమీ చేయలేను.'

'నీకు దయాదాక్షిణ్యాలంటూ ఏకోశాన్నైనా ఉన్నాయా?'

'సాధకుడి నియమాలన్నీ లోకానికి కఠినంగానే కన పడుతాయి.'

'సరే! మళ్ళీ ఎప్పుడు కనపడతావు?'

'నీవు నన్ను వదిలించుకోదల్చుకున్నా, నేను నిన్ను జీవితాంతవరకూ వదలుకోలేను.'

'నీ జీవితాంతంవరకూ నాకు కోపం తెప్పించి, విసిగించి వేధిస్తావన్నమాట.'

'కాదు, కోపంవస్తే బతిమాలుకుంటాను. నేను తప్పు చేస్తే క్షమించమని వేడుకుంటాను.'

'నేను క్షమించకపోతేనో?'

'అంతా ఒట్టిదే. క్షమించక ఏం చేస్తుంది నా పద్మ! నన్ను తప్పకండా క్షమించితీరుతుంది.'

'నిజంగానా?'

'ఇంకా నీకు సందేహం దేనికి?'

'రమణా!'

'పద్మా!!'

ఎందుకో ఉభయులూ ఒండొరులను గట్టిగా కావలించుకున్నారు. ఎంతసేపటికి ఉభయుల బాహుబంధం ఏమాత్రం సడలలేదు. ఎందుకో బరువెక్కిన ఉభయుల హృదయాలు కాస్త తేలికైనాయి.

'ఈమధ్య నీకు రఘు కనపడ్డాడా?'

'లేదు.'

'కనపడితే నేను నర్సింగ్ కోర్సులో చేరానని చెబుతావా'

'సరే'

'ఇంక నేను వెళ్ళిరానా?'

'ఉఁహుఁ! వెళ్ళడానికి వీల్లేదు.'

'ఎందుకని?'

'నాతో కలిసి భోజనంచేసి వెళ్ళు.'

'అని ఆజ్ఞా?'

'ఆఁ, ఆజ్ఞే!'

'మహారాజ్ఞిఆజ్ఞను శిరసావహిస్తున్నాను.'

రమణ, పద్మలు ఆ రోజున కలిసి భోజనంచేశారు. ఎంతోసేపు కబుర్లుచెప్పుకున్నారు. కారులో రమణ తనఇంటికి తిరిగి వెడుతో మూడుసంవత్సరాలక్రితం, తాను పద్మయింట్లో గడిపినరోజులు జ్ఞాపకంతెచ్చుకుంది. ఆరోజులు ఎంత ఉత్సాహంగా గడిచాయి. అప్పట్లో మొదటిసారి తాను తండ్రికి ఎదురుతిరిగింది ఏదో మహత్కార్యాన్ని సాధించినట్లు సంతృప్తి జెందింది. నేడు కూడా తాను తండ్రిని ఎదిరిస్తున్నది. కాని, ఎందుకో అప్పటిఉత్సాహం తనకు ఈతిరుగుబాటులో కనపడడంలేదు. అప్పటి తిరుగుబాటులో బాల్యచాపల్యం ఎక్కువగా ఉంది. తను రఘుని ప్రేమిస్తున్నాననేభావం మిళితమైవుండేది. ఎంత త్యాగమైనా చేయడానికి సంసిద్ధంగావున్న ఒకస్నేహితురాలు తనకు లభించిందనే అహంభావం ఉండేది. కాని నేడో? నేడుకూడా తనకు ప్రాణతుల్యమైన స్నేహితురాలు ఉంది. రఘు ఉన్నాడు. తానూ వుంది. కాగా, తన జీవితమే ఒకపెద్ద తిరుగుబాటుగా మారింది. కాని జీవితంలో ఆ అభిరుచి, ఉత్సాహం ఆ అమాయకత్వం లేవు. కాని, కళ్ళముందు ఒకనిర్దుష్టమార్గం మాత్రం కనపడుతున్నది. ఆ నిర్దుష్టమార్గం కనపడడంతో రఘు తన దృష్టిపథంనించి క్రమంగా జారిపోతున్నాడు. ఉత్సాహానికి బదులు తనని ఏకాగ్రత ఆవహిస్తున్నది. ఆశయసాధనకే హృదయం తహతహలాడుతున్నది

తన ఆశయంముందు యావత్ప్రపంచమే మరుగుపడుతున్నది. స్నేహితానికన్నా, ప్రేమకన్నా మహత్తర లక్ష్యాన్ని దేనినో సాధించడానికి తాను సమకట్టింది. ఆ ఆశయానికి తన ప్రేమని బలిపెట్టింది. స్నేహితాన్ని నిర్లక్ష్యంచేసింది. తత్ఫలితంగా రఘుకీ, పద్మకీ తను తీరని అపకారం చేసింది. ఇంక తనకు వెనకచూపు ఉండడానికి వీలులేదు. తన కోరికలూ, వాంఛితాలూ, ఎన్ని మంటిలో కలిసినా తాను ముందుకు నడవవలసిందే! ఇంక తను వెనుకకు మళ్ళడానికి వీలులేదు. మళ్ళకూడదుకూడా. పాపం! రఘు తననిగూర్చి ఎన్నికలలుకంటున్నాడో! ఎన్నిదివ్యహర్మ్యాలు నిర్మించుకుంటున్నాడో! రఘుని తలచుకున్నకొద్దీ రమణకి అతని పైన జాలి ఎక్కువైంది. ఏ మొహంపెట్టుకొని, తాను 'నిన్ను నేను పెళ్ళిచేసుకో' నని అతనితో చెబుతుంది. ప్రేమకన్నా మహత్తర ఆశయాన్ని దేనినో తాను సాధించదలచుకున్నానని అతన్ని ఎలా నమ్మించగలుగుతుంది? తను పెళ్ళిచేసుకోవడం లేదని తెలియడంతోనే, అతనికి ఎల్లా వుంటుంది? తండ్రి చనిపోవడంతోనే ఆ విషాద సంఘటనకి తట్టుకోలేక అతను సత్యాగ్రహంలో చేరడానికి సమకట్టాడు. అసలు సత్యాగ్రహంలోచేరడం తప్పనికాదు. తనకు ఆ ఉద్యమంపట్ల విశ్వాసంకుదిరి, చేరితే తప్పక చేరి తీరాల్సిందే. అతను సత్యాగ్రహంలో చేరితే తాను ఎన్నడూ కాదనదు. కాగా అందరికన్నా ఎక్కువగా సంతోషించేది తనే. కాని మానసికంగా దెబ్బతిని, ఆర్థికంగా తన కాళ్ళపైన తాను నిలువలేక సత్యాగ్రహంలో చేరుతానంటే మాత్రం తాను

ఒప్పుకోదు. పద్మ పుణ్యమా అంటూ ఆ గండం తప్పిపోయింది. పద్మ ఆర్థికంగా తోడ్పడడం మూలాన రఘు తిరిగి నిలవదొక్కుకో గలిగాడు. ఇప్పుడు తాను అవివాహితగా ఉండదలచినానని విని తిరిగి మానసికంగా దెబ్బతినడు కదా! హతాశయుడై తిరిగి ఏ ఉద్యమంలోనో చేరడానికి సమకట్టడు కదా? అప్పుడు అడ్డుపడి అతని సంకల్పాన్ని మార్చివేసిన పద్మ తిరిగి అల్లా జరగడమే సంభవిస్తే ఇప్పుడుమాత్రం అడ్డుపడకుండా వుంటుందా? ఇంక రఘుయావజ్జీవితం పద్మపైన ఆధారపడవలసిందేనా? తను ఏవిధంగాకూడా అతనికి తోడ్పడడానికి వీలులేదా? ఉన్న ఒక్కవీలూ తను అవివాహితగా వుండడానికి నిశ్చయించుకోవడంతో అదృశ్యమైపోయింది.

తన జీవితం రఘు జీవితంతో విడిపోయింది. స్వతంత్ర మార్గాన్ని అవలంబించింది. ఇంక ఈ రెండు జీవితాలూ తిరిగి కలుసుకోవడం అసాధ్యం. దేనికి తోచిన దారిన అది వెళ్ళవలసిందే. రఘు ఏ ఆధారం లేకండా స్వతంత్రంగా బ్రతకలేడు. అతని జీవితానికి ఒకఆలంబం చాలా అవసరం. ఆ ఆలంబము ఎవరు సమకూర్చగలుగుతారు? స్వతంత్రంగా జీవించలేని వ్యక్తులకి పద్మ ఒక ఆలంబంగా ఎంతో ఉపకరిస్తుంది. ఆమె తన విచక్షణాశక్తివల్ల ఇతరులపైన ఆధారపడే జీవితాన్ని ఉన్నతపథాలలో నడుపగలుగుతుంది. పోనీ రఘు పద్మని పెళ్ళిచేసుకుంటే? నిజమే, ఎందుకు చేసుకోకూడదు? ఉభయులదీ ఒకేకులం కాకపోతే మాత్రం ఏం? ఆ పట్టింపులన్నీ పాతతరంవాళ్ళకి ఉండాలి. అంతేకాని ఆధునికులకి ఏమాత్రం ఉండడానికి వీలులేదు. నిజమే, బాగానే వుంటుంది.

ఎన్నివిధాల ఆలోచించినా రఘు పద్మని పెళ్ళిచేసుకోవడమే సమంజసంగా తోస్తున్నది. పద్మ రఘు జీవితాన్ని స్వర్గ తుల్యంగా మార్చివేయగలదు. ఉభయులూ సహృదయులు. వాళ్ళిద్దరికీ పొత్తుకుదరడం ఎంతో బావుంటుంది. ఏవిధంగా నైనా తను వాళ్ళిద్దరికీ వివాహం జరిగేటట్టు చూడాలి. తాను ఏమిచేస్తే వాళ్ళు పెళ్లిచేసుకుంటారు. తను పద్మతో ఈ విషయమై మాట్లాడితే ఏమైనా లాభం వుంటుందా? తనని అపార్థంచేసుకోదుగదా! అపార్థంచేసుకోడానికే ఎక్కువ అవకాశాలు కనబడుతున్నాయి. ఈ విషయమై తను వెళ్లి పద్మతో చెబితే 'నాకోసం నీవు త్యాగంచేయడం నా కేమాత్రం ఇష్టంలే'దని కూడా ఆమె అనవచ్చు. కాగా తను రఘుని పెళ్ళిచేసుకోననికూడా మొండికేయవచ్చు. పోనీ తాను కొంతకాలంపాటు రఘు, పద్మలకి కనపడకుండా వుంటే ఎల్లా వుంటుంది? ఈ మధ్య రఘు పద్మయింటికి తరచుగా వెడుతు న్నాడు. తను కనపడకపోతే రఘు తనని మరచిపోవచ్చు. పద్మకూడా సహజంగా తనని మరచిపోతుంది. తను కనపడ కుండా వుంటే వాళ్ళే తనని చూడడానికి హాస్టల్‌కి వస్తే? అప్పుడు తాను వాళ్ళతో అమర్యాదగా ప్రవర్తిస్తే ఒకటి రెండుసార్లు సహించి మూడవసారి వాళ్ళే రావడం మాను కుంటారు. అంతగా మానుకోకపోతే అప్పటి కప్పుడు ఏదో ఆలోచించి ఒక విరుగుడు వేయవచ్చు.

దానితో వాళ్ళకి తనపైన తప్పక మనస్సు విరుగు తుంది. అప్పుడు వాళ్ళుఉభయులకీ పెళ్ళిచేసుకోవడానికి మార్గం సుగమం అవుతుంది.

274

# 13

రఘు కాలేజీలో చేరినది మొదలు శ్రద్ధగా చదువుకో వడం మొదలుపెట్టాడు. పాఠ్యగ్రంథాలకన్నా పాఠ్యేతర గ్రంథాలపైన అతనికి ఆసక్తి ఎక్కువైంది. ప్రాచీన, అధునాతన గ్రంథకర్తల ఉద్గ్రంథాలన్నీ చదవడం ప్రారంభించాడు. కీట్సు, షెల్లీ, వర్డ్స్‌వర్తు, బైరన్‌ల కవిత్వాన్ని ఎంతో ఉత్సాహంగా చదివాడు. స్కాటు, డికెన్సుల నవలలు తిరుగవేశాడు. ఆ తరువాత అతనిదృష్టి రష్యన్ రచయితల పైకి మళ్ళింది. డాస్టవస్కీ, టాల్‌స్టాయ్, గోర్కీలపైన క్రమేణా మోజుహెచ్చింది. ఆతరువాత ఇంగ్లీషుసాహిత్యం లోని ఆధునిక రచయితల్ని తీసుకున్నాడు. జేమ్సు జాయెస్, వర్జినియాఉల్ఫులు ఒకకొత్తవెలుగునిప్రసాదించారు. ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామం సాహిత్యాభివృద్ధికి ఎంతగానో తోడ్పడింది. కొత్త రచయితల్ని సాహిత్యాకాశంలో నిల బెట్టింది. 'న్యూరైటింగ్' అనే ప్రచురణలద్వారా ఎందరో కొత్తరచయితలు పైకివచ్చారు. రఘు ఈ ప్రచురణల నన్నిటినీ బాగా చదివాడు. ఇంతేకాక ఈలియట్, ఆడన్, స్పెండర్, డిలిన్‌థామస్, ఇజరాపౌండ్ మొదలైన ఆధునిక కవుల గ్రంథాల్ని తిరుగవేశాడు. నవలాకారులలో సోమర్ సెట్‌మాహం, క్రిస్టఫర్‌ఇషర్‌వుడ్, హెమింగ్వే, హక్స్‌లే, జీన్‌పాల్‌సాత్రే, ఆంద్రీజీడ్, సారాయన్, విలియం ఫాకునర్, ఫారెస్టర్, జోలా, బాల్‌జాక్‌ల గ్రంథాలు అవలో కనంచేశాడు. నాటకరచయితలలో అతనికి షా, యూజిన్

ఓనీల్, ఆనిసీ విలియమ్సులు వచ్చారు. ఈ గ్రంథావలో కనంలో రఘుకిమాసాలు, సంవత్సరాలు గడిచిపోతున్నాయి. అతనికి ఒక కొత్త ప్రపంచాన్ని చూపెడుతున్నాయి. ఒక కొత్తవెలుగుని ప్రసాదిస్తున్నాయి. రఘు గంటలతరబడి పుస్తకాలు ఓపికగా చదవడం నేర్చుకున్నాడు. ఈ పుస్తకాలు అతనికి విజ్ఞానానికి విజ్ఞానం, వినోదానికి వినోదం సమకూరుస్తున్నాయి. జీవితంలో ఒక కొత్తఅనుభవాన్ని తెచ్చిపెడుతున్నాయి.

రఘుఒక్క సాహిత్యావలోకనతో సంతృప్తి జెందలేదు. రాజకీయాలపట్లకూడా గొప్ప ఆసక్తి కనబరచడం మొదలెట్టాడు. భారత రాజకీయాలు, అందులో ముఖ్యంగా స్థానిక రాజకీయాలు శ్రద్ధగా పరిశీలించడం మొదలుపెట్టాడు. యుద్ధాశయాలవిషయంలో కాంగ్రెస్‌కీ, బ్రిటిష్‌ప్రభుత్వానికీ తగాదాలురావడం, బ్రిటిషుఇండియాలో కాంగ్రెస్ మంత్రివర్గాలు రాజీనామాలివ్వడం, యుద్ధవిజయానంతరం వలస రాజ్యాలకు స్వాతంత్ర్యాన్ని ప్రసాదించవలెనని కాంగ్రెస్ పట్టుపట్టడం, యుద్ధాశయాలలో వలసరాజ్య స్వాతంత్ర్య ప్రదానం ఒకభాగంగా వుండవలెనని కోరడం, వ్యక్తిగత సత్యాగ్రహం విఫలం కావడం మొదలైన విషయాలను గమనిస్తూ వచ్చాడు.

స్థానికంగా హైదరాబాద్ సంస్థానంలో మతవైషమ్యాలు పెచ్చుపెరిగిపోతూఉన్నాయి. ఇత్తెహాదుల్ ముసల్మీన్‌కు నిజాంరాష్ట్రంలో ఆడించేదేఆటగా, పాడించేదే పాటగా పరిణమించింది. కాంగ్రెస్ ద్విజాతిసిద్ధాంతాన్ని ఎన్నడూ

ఒప్పుకోలేదు. 'ముస్లింలు వేరు, హిందువులు వేరు. ఈ రెండు మతాలకి ఎక్కడా సామరస్యం కుదరదు.' అనే వాదాన్ని ఎన్నడూ అంగీకరించలేదు. బ్రిటిషుఇండియాలోని ముస్లిం లీగు ప్రోద్బలంతో 'ఇత్తెహాదుల్ ముసల్‌మీన్' సంస్థానంలో ద్విజాతిసిద్ధాంతాన్ని ప్రచారం చేస్తున్నది. హిందువులు, ముస్లింల మధ్య మతవైషమ్యాన్ని రెచ్చగొడుతున్నది. ఈ మతవైషమ్యాలవల్ల సంస్థానంఅంతటా ఏనాడైనా మత కలహాలు చెలరేగవచ్చు. రఘుకి సంస్థానపరిస్థితులు చాలా దారుణంగా కనపడ్డాయి. గాంధీజీ పుణ్యమా అని ఆయన జోక్యంవల్ల కారాగారశిక్ష ననుభవిస్తున్న స్టేటుకాంగ్రెస్ సత్యాగ్రహులు విముక్తులైనారు. అఖిలభారత సంస్థాన మహాసభ ప్రోద్బలంవల్ల భారతదేశంలోని వివిధ సంస్థానాలలో బాధ్యతాయుత పరిపాలన కోసం ఉద్యమాలు ప్రారంభమైనాయి. యావద్భారతం ప్రజాఉద్యమాలతో అల్లకల్లోలంగా వుంది. ఈ ఉద్యమాల ఫలితంగా ప్రజలలో గొప్ప జాగృతి కలిగింది. గొప్ప ఉత్సాహంతో ప్రజలు తక్కిన సంస్థానాల్లో పని చేస్తున్నారు. అట్టి దేమీ హైదరాబాద్‌లో లేకపోవడం రఘుకి విచారకరంగా తోచింది. కొన్ని సంవత్సరాల క్రితం కిషన్‌ప్రసాద్‌కు బదులు సర్ అక్బర్ హైదర్ సంస్థానంలో ప్రధానమంత్రి అయినాడు. అతని హయాంలో సంస్థానంలో ఏవో గొప్ప మార్పులు జరుగనున్నవని బ్రిటిషుఇండియా లోని జాతీయనాయకులను మభ్యపెట్టడానికి అవసరమగు సంస్కరణలను సూచించడానికి ఒక కమిటీని నియమించాడు. దానికి అధ్యక్షుడు అరవముదు అయ్యంగార్. అందువల్ల ఈ

కమిటీకి "అయ్యంగార్ కమిటీ" అని నామకరణం చేయబడింది.

నిజాంరాష్ట్రంలో నామమాత్రంగా "శాసనసభ" అనే ఒక సంస్థ 1894 లో స్థాపించబడింది. దానిని విస్తృతపరచడానికీ, తగినసంస్కరణల్ని సూచించడానికీ నిజాం 1920 లో ఒకఫర్మానా జారీచేశాడు. ఆ ఫర్మానాగతి ఏమైందో ఎవ్వరికీ తెలియదు. ఫలితంమాత్రం శూన్యమైంది. ఈమధ్య నిజాం రాష్ట్రంలోని ఆంధ్రులు, మహారాష్ట్రులు, కన్నడులు, ముస్లింలు కలిసి "హైద్రాబాద్ పీపుల్సు కన్‌వెన్‌షన్" అన్నపేరుతో ఒకసంస్థను స్థాపించారు. ఇందులో 23గ్గురు సభ్యులు. ఒకవేపు అయ్యంగార్‌కమిటీ నగరంలో సమావేశాల్ని జరుపుతుంటే హైద్రాబాద్ పీపుల్సుకన్‌వెన్‌షన్' ఆంధ్రపితామహ శ్రీ మాడపాటి హనుమంతరావుపంతులుగారిఅధ్యక్షతక్రింద ఇంకొకవేపు సమావేశాలుజరిపి ప్రజలవాంఛితాల ననుసరించి వలయు రాజ్యాంగసంస్కరణలను సూచిస్తూ అయ్యంగార్‌కమిటీకి ఒక సమగ్రనివేదికను పంపించింది. ఈ నివేదిక ఉర్దూ, ఇంగ్లీషు, తెనుగు, హిందీ, ఈనాలుగుభాషలలో ప్రకటింపబడింది.

రాజ్యాంగసంస్కరణలవిషయంలో ప్రజాభిప్రాయాన్ని సేకరించడంకోసం ప్రాంతీయమహాసభలకన్నా ఒక కేంద్ర సంస్థ ఉండడం చాలాఅవసరమని గుర్తించి కొందరు కార్యకర్తలు, నాయకులు కలిసి స్టేటుకాంగ్రెస్‌ని స్థాపించడానికి సంకల్పించారు. స్థాపనకుపూర్వమే నిజాంప్రభుత్వం స్టేటు కాంగ్రెస్ మతపాక్షికసంస్థ అని ప్రకటించి నిషేధించింది.

దానితో సత్యాగ్రహం, ఆతరువాత సత్యాగ్రహులు విడుదల కావడం జరిగింది. ఇదేసమయంలో "అయ్యంగార్ కమిటీ" సిద్ధంచేసినరాజకీయసంస్కరణలు ప్రభుత్వామోదాన్ని పొంది ప్రకటింపబడ్డాయి. రఘు ఈసంస్కరణలను కడుశ్రద్ధగా చదివాడు. శాసనసభాధికారాలు కడు సంకుచితంగా వున్నట్లు రఘుకి తోచాయి. మంత్రులు శాసనసభకు బాధ్యులుగా వుండడానికిబదులు నిజాంకు బాధ్యతవహించడం విచిత్రంగా కనపడింది. రాష్ట్రఆయవ్యయపట్టికను విచారించడానికి శాసనసభకు ఏమాత్రం అధికారంలేదు. కాగా, నూటికి పదిమంది జనసంఖ్యమాత్రమే గల మహమ్మదీయుల్ని ఈ సంస్కరణలు శాసనసభలో మెజారిటీవర్గంగా మార్చడానికి సమకట్టాయి. మైనారిటీవర్గాన్ని మెజారిటీవర్గంగా మార్చడం, మెజారిటీ వర్గాన్ని శాసనసభలో మైనారిటీగాచేయడం ఈ సంస్కరణల ప్రత్యేకతగా కనపడింది. రఘుకి ఈ సంస్కరణలు ఎంతో దారుణంగా కనపడ్డాయి. సంస్కరణలలో బాధ్యతాయుతపరిపాలనప్రసక్తే ఎక్కడా లేదు. సహజంగా ఒక్క "ఇత్తెహాదుల్ ముసల్మీన్' తప్ప హైదరాబాద్‌లో ఈ సంస్కరణల్ని ఏ ప్రజాసంస్థా అంగీకరించలేదు.

అత్రాఫ్‌బిల్దా (ప్రస్తుతపు హైదరాబాద్‌జిల్లా) లోని మల్కాపురంలో జరిగిన ఏడవ ఆంధ్రమహాసభ, రాష్ట్రవాసులు ఈసంస్కరణలతో ఏలాటిసంబంధంపెట్టుకోకూడదనీ, వీటిని బహిష్కరించవలసిందనీ ఉద్బోధించింది. రఘు ఈ మహాసభకు వెళ్ళి మహాసభ వర్యలలో ఒక ప్రేక్షకుడుగా పాల్గొన్నాడు. సంస్కరణలకుసంబంధించిన తీర్మానం మహాసభలో

చర్చకువచ్చినప్పుడు ప్రజలు కనపరిచిన ఉత్సాహోద్వేగాలు చూచి వారిలో ఎంతో రాజకీయచైతన్యం ఉన్నట్లు గ్రహించాడు. ఈ రాజకీయచైతన్యాన్ని ఆంధ్రమహాసభ సక్రమ మార్గంలో పెడుతున్నందుకు రఘు సంతసించాడు. ఎనిమిదవ మహాసభ నల్లగొండజిల్లాలోని మల్కాపురంలో జరిగింది. రఘు ఆ మహాసభకు వెళ్ళలేదు. పత్రికలలో అధ్యక్షోపన్యాసం, మహాసభ అంగీకరించిన తీర్మానాలు చూచాడు. ఆ తరువాత రఘుకి ఆంధ్రమహాసభ రాజకీయాలపైన ఆసక్తి తగ్గింది. కారణం, ఆంధ్రమహాసభ నిశితవిమర్శలతో సంతృప్తిజెంది ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఎట్టి ప్రత్యక్షచర్య తీసుకోకపోవడమే.

ఇంతలోకే బ్రిటిష్ఇండియాలో "క్విట్ ఇండియా" ఉద్యమం ప్రారంభమైంది. గాంధీజీ ఈ ఉద్యమంద్వారా 'భారతదేశాన్నుంచివైదొలగండి" అని బ్రిటిషువారికి హెచ్చరికచేశారు. వెంటనే బ్రిటిష్ప్రభుత్వం అగ్రనాయకుల్ని అరెస్టుచేసింది. వారిని ప్రజలకు తెలియనిచోట నిర్బంధించింది. జాతీయనాయకులు అరెస్టుకావడంతో ఉద్యమాన్ని నడపడానికి ఎవ్వరూ మిగలలేదు. ప్రజలే ఈ కార్యభారాన్ని తమనెత్తిపైన వేసుకొని ఉద్యమాన్ని కొనసాగించారు. రైళ్ళపట్టాలు తొలగించారు. తంతితీగల్ని తెగగొట్టారు. ప్రభుత్వకార్యాలయాలను తగలబెట్టారు.

బ్రిటిషుఇండియాలో 'క్విట్ఇండియా' ఉద్యమం ముమ్మరంగా సాగుతూవుంటే సంస్థానంలో ఎట్టిసంచలనం లేకపోవడం చూచి రఘుకి ఎంతో విచారమేసింది. ఈ సంద

ర్భంలో హైద్రాబాద్‌లోని సుల్తాన్‌బజార్‌లో రఘుకి బాల బాలికలఊరేగింపులు ఏవో కొన్ని కనపడ్డాయి. బాలబాలికల గుంపులలోంచి 'క్విట్ ఇండియా' నినాదాలు కొన్నిసార్లు వినపడ్డాయి. అంతే, ఆతరువాత సంస్థానంలో ఎట్టిసంచలనం లేదు. చడీచప్పుడులేకండా ప్రజాజీవితం గడిచిపోవడం చూచి రఘుకి ఆశ్చర్యమేసింది.

ఆంధ్రమహాసభ జాతీయవాదులు, కమ్యూనిస్టుల తగాదాలలోపడి నలిగిపోతున్నది. హైద్రాబాద్ ప్రజలకి విముక్తి ఏమీ కనపడలేదు. ప్రజాహితజీవితం అంధకారబంధురమైంది. ఇంతలోకే 'ఇత్తెహాదుల్ ముసల్మీన్' స్థాపకుడూ నాయకుడూ అగు బహద్దుర్ యార్‌జంగ్ చనిపోయాడు. ఇత్తెహాదుల్ ముసల్మీన్‌లో అధ్యక్షపదవికోసం పోటీలు బయల్దేరాయి. మతవిద్వేషాలు యథా రీతిని చెలరేగుతూనే ఉన్నాయి. ఇంతలోకే రఘు ఎం. ఏ., ప్యాసుఅయినాడు. సెకెండ్‌క్లాసు మాత్రమే వచ్చింది. సంస్థానంలో ప్రబలిన రాజకీయ నిరుత్సాహం అతని చదువులోనూ కనపడింది.

ఎం. ఏ. ప్యాసుఅయినతరువాత, భవిష్యత్‌కార్యక్రమాన్నిగూర్చి అతనికి ఏమీతోచలేదు. స్నేహితులు హైద్రాబాద్ సివిల్‌సర్వీసుకు కూర్చోమని సలహాఇచ్చారు. ఈవిషయమై పద్మని అడిగితే మీయిష్టమని సమాధానం చెప్పింది. కొంతకాలంపాటు హైద్రాబాద్‌సివిల్‌సర్వీసుకు కూర్చోవడమా లేదా అనే సందిగ్ధావస్థలో పడ్డాడు రఘు. ప్రజాహితం ఏకోశానాలేని ప్రభుత్వానికి ఒక ఉపకరణంగా మారడం, అతనికి ఏమాత్రం నచ్చలేదు. సివిల్

సర్వీసులో చేరడానికి బదులు, ఏ కాలేజీలోనో లెక్చరర్‌గా చేరడం సముచితంగా ఉంటుందని అతనికి తోచింది. లెక్చరర్ ఉద్యోగంకోసం ప్రయత్నంచేయడం మొదలెట్టాడు. ఎక్కడికి వెళ్ళినా తన రాజకీయజీవితం అడ్డువస్తున్నది. తను 'వందే మాతరం' ఉద్యమంలో ప్రముఖపాత్ర వహించడం రఘుకి ఉద్యోగాన్వేషణలో తీరని మచ్చగా పరిణమిస్తోంది. తీరా ఉద్యోగందొరికేసరికి, పోలీసురిపోర్టు తనకి విరుద్ధంగా వుంటున్నది. దానితో అధికారులు ఉద్యోగమివ్వడానికి నిరాకరిస్తున్నారు. ఒక ఉద్యమంలో పాల్గొన్నవారిపై ఈవిధంగా నిజాంప్రభుత్వం పగసాధించడం అతనికి ఘోరంగాతోచింది. సివిల్‌సర్వీసులో చేరనందుకు, రఘు తననితాను అభినందించుకున్నాడు.

పొట్టపోసుకోవడానికి మార్గమేమీ కనపడకపోవడంతో అతనిఆశలన్నీ నిరాశలైనాయి. భవిష్యజ్జీవితాన్ని గూర్చి అతను కన్న స్వప్నాలన్నీ నేలమట్టమైనాయి. ఆస్తి లేదు. ఉద్యోగం లేదు. ఇంక బ్రతుకును ఎల్లా ఈడ్వడమా అనే చింత అతన్ని పట్టి వేధించసాగింది. చదువుకున్న రోజుల్లోఇతరులదగ్గరనుంచి ఆర్థికసహాయంపొందడంలో అతనికి తప్పేమీ కనపడలేదు. కాని చదువుముగించడంతో పద్మ దగ్గరనించి ఏదో మహాత్కార్యాన్ని సాధిస్తున్నట్లు సహాయం పొందడం అతనికి నీచంగా తోచింది. రెండుమూడు నెల్లనుంచి పద్మదగ్గరికికూడా వెళ్ళడం మానేశాడు. ఒకటిరెండుసార్లు పద్మ కబురు పంపినా వెళ్ళలేదు. అయినా ప్రతినెలా రెండు వందలరూపాయలు పద్మ దగ్గరనుంచి మనియార్డరు వస్తూనే

వుంది. అందువల్ల పద్మయిచ్చిన చెక్కుబుక్కు ఎన్నడూ ఉపయోగించుకోలేదు. ఒకసారి మనియార్డరు తిరగ్గొడుదా మనుకున్నాడు. ఒకటిరెండుసార్లు పద్మ తనయింటికికూడా వచ్చింది. తను యింట్లోలేనని తల్లితో బొంకించాడు. పద్మ ఉన్నంతసేపూ పక్కయింట్లోకి వెళ్ళి కూచున్నాడు. మని యార్డరు తిరగ్గొడితే ఈ మహానగరంలో తనగతేమవుతుంది? ఏమవుతుందా? నిలువనీడలేకుండాపోతుంది. అప్పుడు తనని ఎవరు ఆదుకుంటారు? ప్రేమావతీపేటకి వెళ్ళిపోతే? నిజమే బాగానేవుంటుంది. చాలావరకు ఖర్చు తగ్గిపోతుంది. తను నగరంలో ఒకగది తీసుకొని, ఏ హోటలులోనో భోజనంచేసి కాలంగడుపవచ్చు. నెలవిడిచి నెల పద్మపంపించే మనియార్డరు తిప్పివేయవచ్చు. దీనికి తను మొహంతప్పించి తిరగడం ఎందుకు? పద్మతో అన్నివిషయాలూ చర్చించి వందరూపా యలుమాత్రమే పంపించమని ఆమెని ఒప్పిస్తే బాగుండదూ? మూడుసంవత్సరాలనించి తనకు చదువుచెప్పిస్తున్నమనిషికి తాను కనపడకుండా మొహంతప్పించి తిరగడం భావ్యమా? ఏదో ఉద్యోగప్రయత్నంలో ఉన్నాడని భావించి, బహుశా పద్మ, తను వాళ్ళఇంటికి వెళ్ళకపోయినా ముభావంగా ఉం టున్నది. కాని, కావలెనని తాను వెళ్ళడంలేదని తెలిస్తే ఒక్కక్షణమైనా పద్మ తననిచూడకుండా ఉండగలదా? ఆసంగతి తెలిస్తే రాత్రింబగళ్ళు ఇక్కడే కూచొని తను కనపడే వరకూ మరి వెళ్ళదు. అట్టిపరిస్థితుల్ని తాను చేతులారా సృష్టించుకోవడం, రఘుకి ప్రమాదకరంగా కనపడింది. తనకి ఉద్యోగందొరకడంలేదని పద్మకి చెబితే తప్పా? 'వందే

మాతరం' ఉద్యమం, అధికారులదృష్టిలో తనపాలిట ఒక తీరనిమచ్చ అయిందని విస్పష్టపరుస్తే తప్పా? ఇన్నిరోజులు పద్మ విషయంలో తాను చిన్నవాడికిమల్లే ప్రవర్తించినందుకు రఘుకి ఎంతో సిగ్గేసింది.

ఒక రోజు రఘు పద్మయింటికివెడితే ఆమె యింట్లో లేదు. రమణదగ్గరికి వెళ్ళిందని చెప్పారు. మరునాడు వెళ్ళాడు. మరునాడుకూడా రమణయింటికే వెళ్ళిందని అన్నారు. ఆ తరువాత రెండురోజులు వెళ్ళడం మానుకున్నాడు. మూడవ రోజు వెడితే పద్మ కనబడింది.

'మూడు రోజులక్రితం వరుసగా రెండు రోజులు వచ్చాను. దేవిగారి దర్శనం కాలేదు' అన్నాడు రఘు, వెళ్ళీ వెళ్ళడంతోనే.

'నేనూ ఈమధ్య మీయింటికి రెండుసార్లు వచ్చాను. దేవరవారిదర్శనంకూడా కాలేదు' అంది పద్మ దెబ్బకి పై దెబ్బతీస్తో.

'చాల్లే, నీ తెలివికి సంతోషించాను. ఇంతకీ నిన్ను రమణదగ్గరికి ఎవరు వెళ్ళమన్నారు?' అన్నాడు రఘు కొంచెం కోపంగా.

'ఎవ్వరూ వెళ్ళమనలేదు. నేనే వెళ్ళాను' అంది పద్మ ప్రశాంతంగా.

'ఇప్పటినించి నీవు అక్కడికి వెళ్ళడానికి వీలులేదు' అన్నాడు రఘు కొంచెం దూకుడుగా.

'కారణం అడగవచ్చునా?' అంది పద్మ కొంచెం జంకుతో.

'కారణం ఏముంది? ఇటీవల ఆమె ప్రవర్తన ఏమీ బాగాలేదు' అన్నాడు రఘు కొంచెం మొహం చిట్లిస్తో.

'ఆసంగతి మీకు ఎవరు చెప్పారు?' అని అడిగింది పద్మ కొద్దిగా ఆశ్చర్యపోతో.

'రమణ ఈమధ్య ఎవరితోనో హద్దుమీరి తిరుగుతోందట. మీరైనా కాస్త రమణకి చెప్పండని అతని తమ్ముడు ఈమధ్య నాదగ్గరికి ఒకరోజున వచ్చాడు.' అన్నాడు రఘు విసుగుతో.

'ఆవ్యక్తి పేరేమిటో మీకు తెలుసునా?' అని అడిగింది పద్మ మళ్ళీ.

'ఏదో, విలియమ్ అని ఆ అబ్బాయి చెప్పినట్లు జ్ఞాపకం' అన్నాడు రఘు మొహంలో మరీ అసహ్యాన్ని కనపరుస్తో.

'నేను రెండుసార్లు వెళ్ళినా నాకు రమణ కనపడలేదు. ఆమె క్లాస్‌మేటు 'మేరీ' అనే ఆమె కనపడింది. రమణని గూర్చి అడిగితే 'ఏ విలియమ్‌తోనో షికారు వెళ్ళిఉంటుంది. ఆమె మీ కెందుకు కనపడుతుం'దని అంది. ఆతరువాత మాటలసందర్భంలో తెలిసింది ఈ మేరీ విలియమ్ చెల్లెలు' అని పద్మ తనకు తెలియవచ్చిన సంగతులు వివరించింది.

'అయితే ఈ విషయాలు నీదాకాకూడా వచ్చాయన్నమాట' అన్నాడు రఘు, ఇంక పద్మని కన్విన్సు చేయడం మరీ సులభమని అనుకుంటో.

'ఆ విలియమ్‌కి ఇదివరకే ఒకపెళ్ళి నిశ్చయమైందట! ఇప్పుడు రమణతో తిరుగుతూ, ఆఅమ్మాయిని చేసుకోడానికి

నిరాకరిస్తున్నాడట!' అంది పద్మ ఇదివరకే తానుచెప్పినవివ రాలకి మరికొన్ని జతపరుస్తో.

'రమణ ఇల్లా తయారవుతుందని నేను కలలోకూడా అనుకోలేదు' అన్నాడు రఘు, ఆశ్చర్యాన్ని ధ్వనిస్తున్న కంఠంతో.

'నామట్టుకు నేను రమణ జీవితంలో ఏదో ఘన కార్యాన్ని సాధిస్తుందనుకున్నాను కాని, ఇల్లాచెడిపోతుందని ఎన్నడూ అనుకోలేదు' అంది పద్మ జాలిఉట్టిపడుతున్న కంఠంతో.

'తండ్రికీ, బంధువులకీ, స్నేహితులకీ ఎదురుతిరిగి విలి యమ్‌ని సాధించింది. ఇంతకన్నా ఘనకార్యం ఏముందికనక జీవితంలో సాధించడానికి?' అన్నాడు రఘు వెటకారంగా.

'రమణకి మొదటినించీ చదువంటే ఎంతో శ్రద్ధ. ప్రస్తు తం ఆ శ్రద్ధంతా ఎక్కడ ఎగిరిపోయిందో!' అంది పద్మ గొప్ప విస్మయంతో.

'విలియమ్ కనపడడంతోనే ఎగిరిపోయివుంటుంది' అన్నాడు రఘు మరీ వెటకారంగా.

'మనం రమణకి చెప్పిచూస్తే ఏమైనా లాభం ఉంటుం దంటారా?' అంది పద్మ ప్రశ్నార్థకంగా.

'ఈషణ్మాత్రమైనా లాభంఉండదని నా నమ్మకం. వ్యవహారం ఇదివరకే చేతులుదాటిపోయింది' అన్నాడు రఘు సమాధానంగా.

'ఇక కర్తవ్యం?' అని మళ్ళీ ప్రశ్నించింది పద్మ.

'కర్తవ్య మేముంది? ఎవరిఖర్మకి వాళ్ళని వదలివేయ డమే మనం చేయవలసినపని' అన్నాడు రఘు, వ్యవహారాన్ని తేల్చివేస్తున్న ధోరణిలో.

'ఏవో పాడుమాటల్లో పడి అసలుసంగతే అడగడం మరచిపోయినాను. ఇంతకీ మీ ఉద్యోగప్రయత్నాలు ఎల్లా కొనసాగుతున్నాయి?' అని అడిగింది పద్మ ఆతురతగా.

'సాగడ మేముంది? ఎక్కడ ప్రారంభించానో అక్కడే ఉన్నాయి.' అని చెప్పాడు రఘు నిరుత్సాహంగా.

'అంటే ప్రయత్నలోపం కాదుగదా!' అని, పద్మ ప్రశ్నార్థకంగా రఘువంక చూచింది.

'ప్రయత్నలోపం ఎందుకవుతుంది? నేను వందే మాతరం' ఉద్యమంలో పాల్గొనడం ప్రభుత్వానికి నచ్చలేదు' అన్నాడు రఘు, ఉద్యోగం దొరకని కారణాన్ని వివరిస్తో.

'వందేమాతరం' ఉద్యమంలో పాల్గొనడం వాళ్ళ దృష్టిలో గొప్ప నేరంగా పరిణమించిందన్నమాట' అంది పద్మ, రఘుఉద్దేశాన్ని గ్రహిస్తో.

'నేరంగా పరిగణించడంవల్లనే, ఉద్యోగమివ్వడానికి నిరాకరిస్తున్నా' రన్నాడు రఘు, సంగతి సందర్భాలు విశదీకరిస్తో.

'అయితే, అటువంటిప్రభుత్వాన్ని మీరు ఉద్యోగం కోసం యాచించడంకూడా నా కేమాత్రం ఇష్టంలేదు' అంది పద్మ తనఉద్దేశాన్ని విస్పష్టపరుస్తో.

'మరి ఏ ప్రభుత్వాన్ని యాచించమంటావు, ఉద్యోగం కోసం?' అని అడిగాడు రఘు పద్మ ఉద్దేశ మేమిటో అర్థంకాక.

'ఏ ప్రభుత్వాన్నీ యాచించవద్దు. మనకు డబ్బు లేనప్పుడు ఉద్యోగాన్నిగూర్చి ఆలోచించుకోవచ్చు' అంది పద్మ అతనిప్రశ్నకి జవాబుగా.

'అంటే నీ ఉద్దేశం?' అన్నాడు రఘు, పద్మఉద్దేశం అర్థంకాక తికమకపడుతో.

'చెబితే ఏమీ అనుకోరుగద?' అని పద్మ అతనికేసి ప్రశ్నార్థకంగా చూచింది.

'అంత సంకోచం దేనికి? చెప్పు నీఉద్దేశ మేమిటో?' అని అడిగాడు రఘు పద్మని.

'ఎలాచెప్పాలో నాకు తోచడంలేదు' అంది పద్మ కొద్దిగా సంకోచపడుతూ.

'నీ కెల్లాతోస్తే అల్లాచెప్పు!'అన్నాడు అతను కొంచెం లాలనగా.

'అయితే ఒకమాటు మీరు అటువేపు తిరగండి' అంది పద్మ గోముగా.

'ఎందుకు?' అని అడిగాడు రఘు మరీ అర్థంకాక.

'ఎందుకూ గిందుకూ అని అడగకండి, చెప్పానుగా ఒకమాటు అటుకేసి తిరగమని?' గునుస్తూ పద్మ ఎంతో ముద్దుగా ఆ రెండువాక్యాలు ఉచ్చరించింది.

'రఘు ఏదో మంత్రంపెట్టినట్లు పద్మ సూచించినవేపుకు తిరిగాడు. పద్మ చప్పునవచ్చి రఘుకి నమస్కారం చేసింది.

'అదేమిటి కాళ్ళుపట్టుకుని నమస్కారం చేస్తున్నావు?' అన్నాడు రఘు ఏమీ తోచక.

'ఏమీలేదు- ఊరికేనే చేశాను' అంది పద్మ మాటలు తడబడుతూ-

'ఏదీ, ఒకమాటు నాకేసి చూడు' అన్నాడు రఘు, ఆమె గడువపట్టుకొని తల పైకి ఎత్తుతూ.

పద్మ చెక్కిళ్ళు సిగ్గుతో ఎర్రబారాయి. కిందిపెదవి గులాబిరేకుకిమల్లే సన్నగా వొణికింది.

రఘు తన కళ్ళనే తను నమ్మలేకపోయినాడు. పద్మని రెండుచేతులతో లేవనెత్తాడు. పద్మ రఘుని చూడలేక పోయింది. రెండుకళ్ళూ మూసుకుంది.

'ఒకమాటు కళ్ళు తెరువు'

'... ... ... ...'

'అమ్మ దొంగా! కళ్ళు తెరవ్వూ?'

'... ... ... ...'

'నేను మంత్రం వేసి, కళ్ళు తెరుచుకునేలాగ చేస్తాను'

'... ... ... ...'

రఘు రెండుకళ్ళనూ సన్నగా ముద్దుపెట్టుకున్నాడు. మంత్రంపారలేదు. కళ్ళు తెరుచుకోలేదు. వివశమై మరీ మూసుకుపోయినాయి.

రఘు పెదవులు కళ్ళమీదినుంచి చెక్కిళ్ళ పైకి జారాయి. అక్కడే చాలాసేపు తారట్లాడి పక్కకి తొలగి పెదవుల్ని అందుకున్నాయి. పెదవులు అందడంతోనే పెదవులు గట్టిగా ఆమె పెదవుల్ని బిగించాయి. రఘుచేతులు పద్మ శరీరాన్ని [illegible]నవేసుకొని, అశాంతిగా వీపుని రాచేస్తున్నాయి. పెదవులబంధం సడలింది. పెదవులు వీడలేక వీడలేక విడిపో

యినాయి. అమాంతంగా పద్మతల కిందికిజారింది. రఘు పద్మ గదువ పట్టుకొని తల పైకి ఎత్తాడు. పద్మకళ్ళు తిరిగి మూతలు పడ్డాయి.

'ఒకమూటు కళ్ళు తెరువు?'

'ఊఁ, హుఁ'

'ఎందుకు తెరవవు?'

'నాకు సిగ్గేస్తుంది.'

'పోనీ నేను కళ్ళుమూసుకుంటాను, నువ్వు తెరువు'

'మొదటమీరుమూసుకోండి, తరువాత నేను తెరుస్తాను.

'ఇదుగో కళ్ళుమూసుకున్నాను'

పద్మ నెమ్మదిగా కళ్ళు తెరిచింది. కాని రఘు కళ్ళు మూసుకోకపోవడం చూచి, తల పక్కకు తిప్పేసింది. ఒక క్షణంపాటు ఉభయులచూపులు కలిశాయి.

'నన్ను మోసగించారు కదూ?'

'మోసగించింది నీవా, నేనా?'

'మీరు'

'నీవు.'

'మీరని మీకు కదూ చెప్పేది.'

'నేనా? నేనా? ఉండు నీపనిపట్టిస్తా'.

ఒకచేతిపైనపద్మనివాల్చి, రెండవచేతిని బొమ్మలపైకి పోనిస్తూ, రఘు గట్టిగా ముద్దుపెట్టుకున్నాడు పద్మని.

'ఇప్పుడు చెప్పు మోసగించింది నేనా, నీవా?'

'నేనేనని ఒప్పుకుంటున్నానుగా-ఇంక వదలండి'

రఘు పద్మని, తనబాహుబంధంనించి వదిలాడు. లోపలికి పరుగెత్తుకొని వెళుతూ, చప్పున వెనక్కితలతిప్పి 'మీరు' అని సన్నగా అరచి, పద్మ లోపలిగుమ్మానికి వ్రేలాడగట్టిన కర్టెన్ వెనకాల అదృశ్యమైంది.

కదులుతున్నకర్టెన్‌కి కళ్ళప్పగించి అల్లాగే నిలబడి పోయాడు రఘు. ఒక నిమిషంతరువాత తేరుకొని, వెళ్ళి సోఫాలో కూర్చున్నాడు.

అయిదునిమిషాల తరువాత పద్మ గులాబిరంగు సిల్కుచీర కట్టుకొని, ఎర్రని మఖ్‌మల్ జాకెట్టు వేసుకొని, చేతితో రూపాయినోట్లకట్ట పట్టుకొని దివాన్‌ఖానాలోకి వచ్చింది.

'లేవండి, వెడదాం'

'ఎక్కడికి?'

'మీరు లేవండి చెబుతాను-'

రఘు లేచి పద్మకి ఎదురుగా వెళ్ళాడు.

'ఇది కాస్త మీదగ్గర ఉంచండి' అని పద్మ నోట్లకట్ట రఘుకి అందించింది.

రఘు నోట్లకట్ట అందుకున్నాడు. పద్మ వెలుపలికి దారి తీసింది. రఘు ఆమెను అనుసరించాడు. వెలుపల కారు సిద్ధంగా ఉంది. ఒకరివెంట ఒకరు కారుదగ్గరికి వెళ్ళారు. డ్రైవరు కారు తలుపు తీశాడు. పద్మ కారుఎక్కింది. డ్రైవరు తలుపువేయబోతే 'ఉండ' మని వారించింది. తను కారులో ఇంకొక పక్కకు జరిగింది. వెనకసీటులోకి రమ్మని రఘుకి కళ్ళతో సూచించింది. రఘు కారుఎక్కి పద్మపక్కన కూర్చున్నాడు. డ్రైవరు తలుపువేశాడు. పద్మ రఘుచేతిలోంచి నోట్లకట్ట

తీసుకొని, పదిరూపాయలు ఎంచి డ్రైవరుకి ఇచ్చింది. డ్రైవరు డబ్బుతీసుకొని శాల్యూట్ చేశాడు. కారు కదిలింది. దారిలో బిచ్చగాళ్ళు కనపడినప్పుడల్లా కారుఆపమని పద్మ డ్రైవర్‌కు చెప్పింది. 'ఎక్కడికి పోనిమ్మంటారు' అని డ్రైవరు నమ్రతగా ప్రశ్నించాడు. 'తిన్నగా పోనీ' అని పద్మ అంది. కారు నెమ్మదిగా ముందుకు సాగుతున్నది. 'మీయింటికి దారి చెప్పండి' అని పద్మ రఘుతో వినీవినపడనట్లు చెప్పింది. 'ఫీలుఖానాకు పోనీ' అని రఘు డ్రైవరుతో అన్నాడు. మధ్య బిచ్చగాళ్ళు కన్పించినప్పుడల్లా కారుఆగింది. పద్మ కన పడినబిచ్చగాడికల్లా ఒక్కొకరూపాయినోటు దానంచేస్తూ ముం దుకు సాగింది. ఫీలుఖానాకి వెళ్ళేసరికి పద్మచేతిలోని రూపా యలకట్ట అయిపోయింది. పద్మ రఘుయింట్లోకి వెళ్ళి అతని తల్లి వరలక్ష్మికి నమస్కారంచేసింది. 'ఏమిటమ్మా ఈనాడు నమస్కారం చేస్తున్నావెందు' కని ఆమె అడిగితే 'ఏమీ లేదండీ, ఈరోజు నా పుట్టినరోజు' అని బొంకింది. కాసేపు ఆమెతో కబుర్లుచెప్పి, తిరిగి తనయింటికి బయద్దేరింది. వాకిలి గుమ్మందాకా వరలక్ష్మి వెళ్ళి పద్మని సాగనంపింది. 'వస్తా నండీ, ఇంక మీరు లోపలికి వెళ్ళం'డని చెప్పి పద్మ కారు దగ్గరికి వెళ్ళింది. రఘు పద్మని కారుదాకా అనుసరించాడు. 'మళ్ళీ ఎప్పుడు కనపడుతారు? అని సన్ననిగొంతుతో రఘుని ప్రశ్నించింది. 'రేపుసాయంత్రం వస్తా'నని రఘు సమాధానం చెప్పాడు. కారుకదిలింది. మలుపు తిరిగింది. వరలక్ష్మి లోపలకి వెళ్ళిపోయింది. రఘు కారువెళ్ళిన దిక్కుకి కళ్ళు అప్పగించి అక్కడే నిలబడిపోయాడు.

# 14

రామనాథం రుక్మిణిని కొట్టాడు. కాని ఆమె హృదయంలో తనపట్ల ప్రేమని వెలిగించలేకపోయాడు. రామనాథం తనని ఎందుకు కొడుతున్నాడో, వెంటనే ఎందుకు తనతో బాగామాట్లాడుతున్నాడో రుక్మిణికి అర్థంకాలేదు. ఆమె అర్థంచేసుకోవడానికికూడా ప్రయత్నించలేదు. కొడితే పడింది; దూషిస్తే సహించింది. కాని ఎన్నడూ ఎందుకుకొడుతున్నావ్, ఎందుకు తిడుతున్నావ్ అని అడగలేదు. అతని స్వభావమే అంత అని మౌనం వహించింది. రుక్మిణిహృదయం తనపట్ల స్పదించకపోవడంతో రామనాథానికి మాటమాటకి చిరాకువేయడం మొదలుపెట్టింది. విసుగు కలుగ నారంభించింది. ఒకేయింట్లో వుంటూ ఒకరితో యింకొకరు మాట్లాడుకోకుండా రోజులతరబడి గడపడం నేర్చుకున్నారు. ఒకమూల రామనాథం వుంటే, ఆయింట్లో ఇంకొకమూల రుక్మిణి ఉంటుంది. ఎవరిభావాల్లో వాళ్ళు నిమగ్నులైఉంటారు. రెండూ రెండులోకాలు-ఒకలోకానికి ఇంకొక లోకంతో సంబంధంవుండదు.

రుక్మిణి జీవితంలో ఎందుకు ఇంత నిరుత్సాహంగా నిస్తేజంగా వుంటుందా అని రామనాథంఆలోచిస్తాడు. అప్పుడే కోపం అప్పుడే సంతోషం ఏమిటూ అని రుక్మిణి ఆలోచిస్తుంది. ఒకరిదృక్పథాన్ని ఇంకొకరు అర్థంచేసుకోరు. ఒకరిఉద్దేశాన్ని ఇంకొకరు సానుభూతితో చూడరు. 'నన్ను రుక్మిణి ఎందుకు ప్రేమించడం లేదా?' అన్న ఆరాటంతప్ప ప్రేమించక

పోవవడానికి కారణాలు ఏమిటా? అని రామనాథం ఆలోచించడు. ఏవో పండ్లు కొనుక్కొస్తాడు - పూలు కొనుక్కొస్తాడు. వాటివంక రుక్మిణి చూడనైనాచూడదు. ఆమె వాటివంకచూడలేదని రామనాథానికిబాధ. 'ఈ పూలు ఎంతో బాగున్నాయండీ' అని పూలుపెట్టుకొని తనకు చూపించలేదనీ, పండ్లు వలిచి 'ఇదుగోనండీ, ఈ కాస్త తినండి' అని తనకి పండ్లతొనలు అందించలేదనీ రామనాథం వ్యథ. మంచం తీసుకొస్తే 'ఎంతచక్కని మంచం తెచ్చారు! ఎంతఅయిం' దని రుక్మిణి అడగదు. కుర్చీలు తెస్తే ఒక కుర్చీలో తానుకూచొని ఇంకొకకుర్చీలో రామనాథాన్ని కూర్చోమని బలవంతపెట్టదు. ఈ చిన్ని చిన్ని ముచ్చట్లు తీరకపోవడంతో రామనాథానికి చిరాకెత్తుతుంది. రుక్మిణిని గొడ్డుబాదినట్లు బాదుతాడు. తాను హృదయంలేని ఒక బండతో సంసారంచేస్తున్నట్లు భావిస్తాడు. ఇక రుక్మిణో? పండువలిచి చేతికి అందిస్తేనేగాని తినదు. లేకపోతే నాకెందుకొచ్చిందని పండ్లవంకైనా చూడదు. ఏజన్మలోకూడా ఆమె పూలు పెట్టుకోలేదు. పూలు పెట్టుకోవటమంటే ఆమెకి ఒక విధమైన భయంకూడా. అందువల్ల పూలవైపే పోదు. ఇవన్నీ చూచి 'ఉత్సాహంగా ఎందుకులే' వని అడిగితే 'ఎందుకులేను ఉత్సాహంగానే వున్నానే' అంటుంది. దానితో రామనాథానికి వళ్ళుమండుతుంది. చేతికందినకర్ర తీసుకొని బాదేస్తాడు. రుక్మిణి పెడబొబ్బలు పెడుతూ ఏడ్వదు. తనలోతానే కుళ్ళికుళ్ళి ఏడుస్తుంది. అలా కుళ్ళికుళ్ళి ఏడ్చేవాళ్ళని చూస్తే రామనాథానికి మరీ అసహ్యం. దానితో అతను రుక్మిణిని మరీ

బాదేస్తాడు. రుక్మిణి మరీ కుళ్ళికుళ్ళి బయటికి వినపడకుండా ఏడుస్తుంది. 'నన్ను కొట్టకండి మీకుపుణ్యముంటుంది. మీరు చెప్పినట్లల్లా చేస్తా' నని రుక్మిణి తనని ప్రాధేయపడాలని రామనాథం కోరిక. అల్లా జరగకపోవడంతో 'తాను ఒక బండను పట్టుకొని బాదుతున్నానా?' అన్నసందేహం అతనికి కలుగుతుంది. ఇంక లాభంలేదని అతను బాదడం మానుకుంటాడు. అంతటితోఅతనిలో నిరుత్సాహం ప్రవేశిస్తుంది. ఈ మనిషితో సంసారంచేయడం కష్టమని భావిస్తాడు.

రుక్మిణి ఎందుకు ఉత్సాహంగా ఉండదన్న సమస్య తిరిగి అతనికళ్ళముందు నిలిచి, అతన్ని భయపెడుతుంది. ఆ భయానికి అతనికి పిచ్చెత్తినట్లు అవుతుంది. ఆ పిచ్చిలో ఇంట్లోవస్తువులన్నీ పగలకొడుతాడు. చెంబులూ, బిందెలూ నేలకేసి బాదుతాడు. దానితో ఇల్లు నరకకూపంగా తయారవుతుంది. ఆ నరకకూపాన్ని చూచి అతను సహించలేడు. వెళ్ళి మంచంమీదపడుకుంటాడు. అంతటితో ఆరోజు ఇంక ఇద్దరికీ భోజనాలు వుండవు. రుక్మిణి ఇంకొకపక్క చెరగుపరచుకొని పడుకుంటుంది. ఇల్లా ఎన్ని రోజులని సంసారం గడుస్తుంది? ఒకరోజున రామనాథంప్రాణం పూర్తిగా విసిగిపోయింది. ఆ హృదాయాన్ని ఇంక స్పందింపజేయలేనని అతనికి నిక్కచ్చిగా తెలిసిపోయింది. వస్తువులన్నీ బద్దలుకొట్టి, విసిగివేసారి ఇంట్లోంచి బయల్దేరి వెళ్ళాడు. ఆ పోవటం మళ్ళీ తిరిగి ఇంటికి రాలేదు. రామనాథం రుక్మిణి సౌందర్యాన్ని చూచి భ్రమిశాడు. హృదయాన్ని తరచి చూడలేదు. రుక్మిణి తెచ్చిపెట్టుకొని ఉత్సాహాన్ని ప్రదర్శించలేకపోయింది.

పైపై మెరుగులు కనపడకపోవడంతో రుక్మిణికి హృదయం లేదని నిశ్చయించుకున్నాడు రామనాథం.

రామనాథం వయ్యారాన్ని ఒలకపోసే పడుపుకత్తెను ఆశించాడు. గాంభీర్యమే భూషణంగాగల ఒక మహాయిల్లాలు అతనికి లభించింది. ఆ వెలలేని రత్నానికి అతను విలువకట్ట లేకపోయాడు. ఒక అమూల్యరత్నాన్ని బండరాయి అనుకు న్నాడు. బండరాయితో సంసారంచేయడం కష్టమనితోచి ఆమెని పరిత్యజించి వెళ్ళాడు. ఆ అమూల్యరత్నానికి పరిత్య జించినంతమాత్రాన నష్టమేమీ కలుగదు. పరిత్యజించినవా డిదే నష్టమంతా.

రామనాథం యిల్లువదలివెళ్ళడంతో రుక్మిణికి బ్రతుకు గడవడమే కష్టమైపోయింది. చేతిలో ఒక్కదమ్మిడీ లేదు. శరీరంపైన ఒక్క నగా లేదు. ఇంట్లో బియ్యమున్న నాలుగు రోజులు ఏదో ఉడకేసుకొని నాలుగుమెతుకులు ఎంగిలిపడింది. బియ్యం అయిపోవడంతో చేబదుళ్ళకి బయల్దేరింది. ఎన్నిరోజు లని బదుళ్ళుపుట్టిస్తుంది? రోజులు గడిచినకొద్దీ రామనాథం తిరిగి వస్తాడనే ఆశ మటుమాయం కాజొచ్చింది. చుట్టూ శ్రామికకుటుంబాలు. ఎన్నిరోజులని తిండిగింజలు బదుళ్ళు ఇస్తారు. ఏరోజు కారోజు కష్టపడితేనేగాని, వాళ్ళకి బ్రతు కులు గడవవు. తమ బ్రతుకులే గడవడం దినదినగండంగా వుంటే, వాళ్ళు యితరులకు ఏం పెట్టగలుగుతారు? పైగా అవి యుద్ధంరోజులు. తిండిగింజలధరలు విపరీతంగా పెరిగిపో తున్నరోజులు.

బియ్యం దొరకడంలేదు. బియ్యంకోసం రేషన్ దుకాణాలముందు పెద్ద పెద్ద క్యూలు తయారవుతున్నాయి. ఆ దొరకినబియ్యం ఎవ్వరికీ చాలడంలేదు. కాసింత అన్నం వండుకొని, శ్రామికులు జొన్నరొట్టెలతో కాలం వెళ్ళబుచ్చాల్సివస్తున్నది. ఆ దొరికే జొన్నలుకూడా మంచివికావు. పచ్చజొన్నలు, తెల్లజొన్నలు కొనుక్కోవడానికి శ్రామికుల దగ్గర తగినంత డబ్బువుండదు. రుక్మిణి నలుగురితోపాటు ఆ పచ్చజొన్నలకి కూడా నోచుకోలేదు. జీవితంలో మొదటి మాటు కటికిదారిద్ర్యం అనుభవించాల్సివచ్చింది.

నాలుగురోజులు గడిస్తే ఇంటికి బాడుగ యిచ్చుకోవాలి. ఏమిచేయడానికీ ఆమెకు తోచలేదు. గంటలతరబడి పెద్దపెద్దక్యూలల్లో ఎండకీవానకీ నిలబడి తిండిగింజలు తెచ్చుకునే శ్రామికులదగ్గర బదుళ్ళుఅడగడం రుక్మిణికి దుర్భరంగా తోచింది. మొదట కొన్నిరోజులు అడగక తప్పింది కాదు. కాని ఎన్నిరోజులని అల్లా జీవితం గడుపుతుంది? వెంటనే ఏదైనా ఉపాయం ఆలోచించాలనుకుంది. హేమావతీపేటకు వెళ్ళిపోతే? ఎట్లా వెడుతుంది? వెళ్ళినా పతితని—కులంలేని మనిషిని ఆ ఊళ్ళో ఆదరించేవారెవరు? తండ్రి తన మర్యాద కాపాడుకోవడానికి ఇంట్లోంచి వెళ్ళగొడతాడు. పక్కనున్న ఎల్లమ్మకి తనబాధలన్నీ చెప్పి ఏదైనా బ్రతుకునడిచేమార్గం చూపించమని బ్రతిమిలాడింది. రుక్మిణిఅవస్థచూచి ఎల్లమ్మ ఆమెపైనజాలిపడింది. పట్టెమంచం కుర్చీలు అమ్మివేయమని సలహా యిచ్చింది. రుక్మిణి తీరా అమ్మడానికి సిద్ధపడితే చుట్టుపక్కల కొనేవాళ్ళు ఎవరూ కనపడలేదు. ఇది మార్గం

కాదని ఎల్లమ్మ తనకొడుకుతో చెప్పి వాటిని ఆక్షన్‌వాళ్ళ కిప్పించింది. ఆక్షన్‌వాళ్ళకివ్వడంతోనే చేతికి డబ్బు ఎక్కడ వస్తుంది? ఆక్షన్ అయ్యేవరకూ డబ్బుకోసం కాచుకొని కూచోవాలి.

ఎల్లమ్మ రెండు రూపాయలు రుక్మిణికి బదులు యిచ్చింది. వాటితో ఏమి చేయాలో రుక్మిణికి తోచలేదు. అవి తిరిగి ఎల్లమ్మచేతిలోనే పెట్టి వాటితో తిండిగింజలు కొనుక్కొని రమ్మని చెప్పింది. రుక్మిణికి రేషన్‌కార్డు లేదు. ఒక రోజంతా పనిమానుకొని, ఎల్లమ్మకొడుకు కార్డు తెచ్చిపెట్టాడు. ఎల్లమ్మ రెండు రూపాయలతో కొంచెం పచ్చజొన్నలూ, కొంచెం తెల్లజొన్నలు, ఒకపావుశేరు బియ్యం కొనుక్కొచ్చిపెట్టింది. ఆ గింజలతో రుక్మిణికి కొన్నిరోజులు కాలక్షేపం అయింది. మళ్ళీ యింట్లో గింజలు నిండుకున్నాయి. పందిరిమంచం కుర్చీలడబ్బు ఇంకా చేతికి అందలేదు. డబ్బు అందినా ఎన్నిరోజులు వస్తుందని? మహా అయితే ఒకనెల మించితే రెండునెల్లు. రెండునెల్ల తరువాత తిరిగి ఇదే దుస్థితి వస్తుంది. అప్పుడు ఏం చేయడం?

ఎల్లమ్మా, ఆమె కోడలు నర్సమ్మ ఒక సిగరెట్ ఫ్యాక్టరీలో పనిచేస్తున్నారు. తనుకూడా వాళ్ళతోపాటు ఆ ఫ్యాక్టరీలో చేరితే? రుక్మిణి ఎల్లమ్మను సలహా అడిగింది. ఎల్లమ్మ రుక్మిణి సౌందర్యం చూచి మొదట కొంత బెదిరింది. రోజూ కూలీలకు డబ్బు పంచిపెట్టే మేస్త్రీ 'ఈమె సౌందర్యాన్ని చూచి ఊరుకుంటాడా ?' అని సందేహించింది. రుక్మిణిని పనిలో చేర్చితే ఒకప్రమాదం, చేర్చకపోతే ఇంకో ప్రమాదం.

ఇంత నాజూకైన అమ్మాయి ఇంకే మోటుపనీ చేయలేదు. ఆ గ్రామికకుటుంబాలలో ఉప్పరిపనీ, రోడ్లమరమ్మత్తుపనీ చేసేవాళ్ళు కొందరు ఉన్నారు. ఆ మోటుపనులు ఈమె చేయగలుగుతుందా? చేయలేదని ఎల్లమ్మ తీర్మానించుకుంది. సిగరెట్ కార్ఖానాలో తప్ప ఇంకెక్కడా ఈ అమ్మాయి పని చేయలేదని నిశ్చయించుకుంది. కాని అక్కడ పని చూసుకొని, డబ్బుచెల్లించే మేస్త్రీ చాలాచెడ్డవాడు. యౌవనపు పొంగులో ఉన్నాడు. కాస్త అందంవున్నమనిషి కంటబడితే చాలు వెంటబడతాడు. లొంగదీసుకునేవరకూ వేధిస్తాడు. సరిగ్గా కూలిడబ్బులు ఇవ్వడు. మధ్యలో పనిలోంచి వెళ్ళగొడుతాడు. ఈ పరిస్థితంతా మొదటే రుక్మిణికి చెప్పడమా లేక మానుకోవడమా అనే సందిగ్ధావస్థలో పడింది ఎల్లమ్మ.

రుక్మిణి చూస్తే ఏదో కలిగినయింటిపిల్లలాగా కనపడింది. జీవితంలో ఏదో పెడదారులుపట్టి ఈదుస్థితికి వచ్చింది. తనవల్ల తరువాత చిక్కుల్లోపడితే చింతిస్తుంది. ఉన్నకష్టనిష్ఠూరాలు ముందుగానే చెప్పివేయడం మంచిదని ఎల్లమ్మకు తోచింది. దానితో రుక్మిణికి పరిస్థితులన్నీ వివరించింది. అది విని రుక్మిణి శరీరం ఝుల్లుమన్నది. శరీరం అమ్ముకోకుండా న్యాయంగా బతకడానికి ఆస్కారం కనపడక ఎంతో చింతించింది. కాని, రుక్మిణి కూలికి వెళ్ళక ఏంచేస్తుంది? పొట్ట ఎట్లా గడుపుకుంటుంది? ఇంకా మంచం, కుర్చీలడబ్బు చేతి కందలేదు. ఈమధ్య ఎల్లమ్మే తనకు కావల్సినడబ్బు యిచ్చి రుక్మిణి పొట్ట గడుపుతున్నది. ఒకనాడు ఎల్లాజరగాల్సివుంటే అల్లా జరుగుతుం దనుకొని, రుక్మిణి ఎల్లమ్మని పనిలోకి తీసుకెళ్ళ

మని అడిగింది. 'పాతికరూపాయలు లంచంయివ్వానిదే ఆ చచ్చి నోడు పనిలోకి చేర్చుకో'డని చెబితే, రుక్మిణి నిర్ఘాంత పోయింది. రోజుగడవడమే కష్టంగావున్నప్పుడు రుక్మిణి పాతిక రూపాయలు ఎక్కడనుంచి తెచ్చియిస్తుంది? పాతికరూపాయలు రుక్మిణికోసం ఒక్కసారే అప్పుపుట్టించడానికి ఎల్లమ్మకుకూడా తాహతులేదు. నగకుదువపెడితే అప్పు పుడుతుంది. తగని కాలంలో శ్రామికకుటుంబాలకి నగలు ఎక్కడ వుంటాయి? ఒకటిరెండురూపాయలంటేఎలాగో అప్పుపుట్టించవచ్చు. మహా ఎక్కువైతే పదిదాకా పుట్టించవచ్చు. కాని, అంతకు మించితేమాత్రం శ్రామికకుటుంబాలకి సాధ్యంకాదు. పాతిక రూపాయలు అప్పుపుట్టించడానికి ఎల్లమ్మ తన అశక్తతను వెలి బుచ్చింది. తనూ తనకోడలూ చేరినప్పుడు చెరిఅయిదు రూపాయలతో పని గడిచిపోయింది. కాని, ఈయుద్ధం రావడం తోనే అన్నివస్తువులధరలు పెరిగిపోయినట్లే లంచం రేటుకూడా విపరీతంగా పెరిగింది. అయిదునుంచి పాతిక అయింది. పాతిక రూపాయలు యిచ్చుకోవడంకోసం మరికొన్నిరోజులు, అంటే మంచంకుర్చీలడబ్బు వచ్చేదాకా ఆగవలసివచ్చింది.

మంచానికి, కుర్చీలకు ఎనభైరూపాయలు వచ్చాయి. రుక్మిణి పాతికరూపాయలు ఎల్లమ్మకి యిచ్చింది. తన తిండి గింజలకోసం ఇంకొకపదిరూపాయలు చెల్లించింది. పదిహేను రూపాయలు యింటిబాడుగ యిచ్చింది. అంత పెద్దయింట్లో ఉంటే నెలనెలకి పదిహేను రూపాయలబాడుగ కట్టుకోవడం కష్టం. అందువల్ల రుక్మిణి ఒకచిన్నయింట్లోకి మారింది. అది యిల్లు అని అనడానికి వీలులేదు. ఒకటే గది. పురాతత్వ

శాస్త్రపరిశోధకులు గొప్ప పరిశోధనచేస్తేకాని, ఆ గదికి ఒక కాలంలో సున్నంకొట్టేవారని నిర్ణయించడానికి వీలులేదు. ఆ గదికప్పు, గోడలూ పొగచూరి ఉన్నాయి. ఎల్లమ్మసలహా ననుసరించి రుక్మిణి ఆ గదినే అద్దెకుతీసుకుంది. బాడుగకింద ముందుగానే అయిదురూపాయలు అడ్వాన్సు యిచ్చింది. రుక్మిణి మిగతారూపాయలు ఎల్లమ్మదగ్గరే ఉంచింది. మరు నాడు రుక్మిణి ఒక మామూలుచీర కట్టుకొని ఎల్లమ్మతో పాంచ్ మినార్ సిగరెట్ ఫ్యాక్టరీకి కాలినడకని బయల్దేరింది. పాతవాల్టాదినుంచి ముషీరాబాద్‌కు నాలుగుమైళ్ళదూర మైనా ఉంటుంది. అంతదూరం రుక్మిణి ఎన్నడూ నడిచి ఎరుగదు. ఈడ్చుకుంటూ ఈడ్చుకుంటూ అంతఉదయమే అక్కడికి వెళ్ళేసరికి కాళ్ళు బొబ్బలెక్కాయి. కాని రుక్మిణి ఆ సంగతి ఎల్లమ్మకు కాని, ఎల్లమ్మకోడలు నర్సమ్మకుకాని చెప్పలేదు.

వెళ్ళివెళ్ళడంతోనే ఎల్లమ్మ తనని ఒకగదిలోకి తీసి కెళ్ళింది. అక్కడ ఒకఅతను ఒకకుర్చీలో కూర్చుని ఉన్నాడు. అతనిముందు ఒకపెద్ద వెడల్పాటి టేబుల్ వుంది. ‘మా అమ్మాయే - పేరు రుక్మిణి’ అని ఎల్లమ్మ తనని అతనికి పరి చయంచేసింది. అతను రుక్మిణిని ఎగాదిగా చూచాడు.

‘ఇంతకుముందు ఎక్కడైనా పనిచేసిందా?’ అని అతను అడిగాడు. ‘ఈమధ్య ఈ ఖర్మపట్టింది. ఇంతకుముందు ఎక్కడా ’పనిచేయలే’దని చెప్పింది. ఎల్లమ్మ అతనిపేరు ‘రషీద్’అనీ, అతను యజమాని అన్నకొడుకనీ, కూలీలందరూ చిన్నదొర అని పిలుస్తారనీ ఆతరువాత రుక్మిణితో చెప్పింది.

మేస్త్రీ బారినించి రుక్మిణిని తప్పించివేయడానికి ఎల్లమ్మ ఆమెని నేరుగా చిన్నదొరకి పరిచయంచేసింది. అతను ఏవేవో ప్రశ్నలు రుక్మిణిని అడిగాడు. వాటన్నిటికీ ఎల్లమ్మ రుక్మిణి తరఫున సమాధానాలుచెప్పింది. ప్యాకెట్సులో సిగరెట్లు ప్యాకుచేసేపని యిచ్చారు రుక్మిణికి. పని తేలికైందే. సులువుగానే చేసుకోవచ్చు. ఆ పని యివ్వడంతోనే 'రషీద్' రుక్మిణిపైన మోజుపడ్డాడని ఎల్లమ్మ తెలుసుకుంది. కొంచెం జాగ్రత్తగా వుండమనికూడా రుక్మిణికి హెచ్చరికచేసింది.

'రషీద్' ఆరోజు అంతా కాలుకాలిన పిల్లికిమల్లే ప్యాకింగ్‌రూమ్‌లోనే గడిపాడు. అంత ఈడుకూడా లేదు రషీద్‌కి. మహావుంటే 22,23 ఏళ్ళు. అందరూ ఆడవాళ్లే. కాగా, అందరూ పడుచువాళ్ళే. ఆగదిలో అన్ని కులాల వాళ్ళూ, అన్నిమతాలవాళ్ళూ ఉన్నారు. రషీద్ ప్యాకింగ్ గదిలోకి వచ్చినప్పుడల్లా వాళ్ళు చిరునవ్వులు చిలకరిస్తు న్నారు. అతనిని పలకరించడానికీ, అతనితో మాట్లాడడానికీ తహతహలాడుతున్నారు. కాని, ప్యాకింగ్‌గదిలోని అమ్మా యిలచిరునవ్వు లేవీ రషీద్‌పైన పనిచేయడంలేదు. ఏదో అలవాటుకొద్దీ అతను వాళ్ళతో ఛలోక్తులాడుతున్నాడే కాని ఆ చిరునవ్వులపైన దృష్టి లేదు. అతనిమనస్సు అంతా రుక్మిణిపైనే లగ్నమైవుంది. రుక్మిణిని ఏదో పలకరిస్తాడు. ఏదో అడుగుతాడు. రుక్మిణి ఏదో తోచీతోచక సమాధానం చెబు తుంది. అతనికి ఏమాత్రం సంతృప్తిలేదు. గదిలోవున్న అమ్మాయిలంతా అతన్ని గౌరవిస్తున్నారు. తమతో మాట్లా డడమే మహాభాగ్యంగా భావిస్తున్నారు. కాని తను ఎన్నిసార్లు

వచ్చినా, ఏదో నెపంతో ఎన్నిసార్లు పలకరించినా, రుక్మిణి చలించడంలేదు. తన అశాంతిని గమనించడంలేదు. రుక్మిణిని ఎల్లా ఆకర్షించాలో అతనికి తోచలేదు. ఆమెని తనపట్ల ఎల్లా సుముఖంచేసుకోవాలో పాలుపోలేదు. రషీద్ అశాంతిని ప్యాకింగ్ గదిలోని అమ్మాయిలంతా గమనిస్తూనే ఉన్నారు. అతను రుక్మిణిని పలకరించడం చూస్తూనే ఉన్నారు. అందరికీ అర్థమైనా రుక్మిణికి, రషీద్ ఉద్దేశం అవగతంకాలేదు. ఆమె తనధోరణిలో తాను ఉంది. తనపనిలో తాను ఉండిపోయి కాలాన్ని నెళ్ళబుచ్చుతున్నది. కారణం విలాసవతుల హావ భావచేష్టలు ఆమెకు ఇంతవరకు అలవడకపోవడమే. జీవితంలో తన ప్రేమని నర్మగర్భంగా వ్యక్తపరచవలసిన అవసరం ఆమెకు ఎన్నడూ కలుగకపోవడమే. నేరుగా రుక్మిణిని సమీపించి లాభంలేదని, రషీద్‌కు తోచింది. సిగ్గుతో రుక్మిణి ముందడుగు వేయలేకపోతున్నదని అతని ఉద్దేశం.

తొలియావనంలోవున్న యువతుల్ని కదిలించి వాళ్ళని సుముఖంచేసుకోవటం చాలా కష్టంతో కూడుకున్నపని. వాళ్ళకి మొదట సిగ్గు అడ్డంవస్తుంది. దానిని వాళ్ళు అధిగమించగలిగినా, భవిష్యత్తునుగూర్చి ఏదో అవ్యక్తమైనభయం వాళ్ళని ఆవరించివుంటుంది. నేరుగా వాళ్ళనిసమీపిస్తే ఈ రెండింటిని తొలగించివేయడం కష్టమని రషీద్ భావించాడు. తొలియావనంలోవున్న యువతులు తమతమ ప్రియులముందు తమహృదయాల్ని విప్పలేరు. వాళ్ళతో మనసిచ్చి మాట్లాడలేరు. సిగ్గుచే ఫ్యాన్సీలో కొట్టుకుపోతారు. అందువల్ల రషీద్ నేరుగా రుక్మిణిని సమీపించడానికి బదులు ఎల్లమ్మద్వారా

పరోక్షంగా సమీపించడానికినిశ్చయించుకున్నాడు. వెంటనే ఆఫీసుగదిలోకి వెళ్ళి ఎల్లమ్మకు, ఒకమాటు రమ్మని కబురం పాడు. ఎల్లమ్మ ఇటువంటివిషయాల్లో బాగా రాటు తేలినమనిషి. ఉభయులూ యిష్టపడితే వాళ్ళని ఒకచోట సమకూర్చడానికి ఆమెకి ఎట్టిఅభ్యంతరం లేదు. రషీద్ ఫ్యాక్టరీ యజమాని అన్నకొడుకు. యజమానికూతురుని చేసుకుంటాడని వినికిడి. తొలియౌవనంలో ఉన్నాడు. అమ్మాయిలంటే అతనికి సరదా. కాస్తోకూస్తో అందంగల ఏఅమ్మాయి ఫ్యాక్టరీలోచేర డానికివచ్చినా మొదట ప్యాకింగ్ గదిలో పని యిస్తాడు. రషీద్ కూడా ఒకసంవత్సరంనించి మాత్రమే ఫ్యాక్టరీలో పనిచేస్తు న్నాడు. అతనువచ్చిరావడంతోనే ~~ఈడుమళ్ళిన~~వాళ్లనిప్యాకింగ్ గదిలోంచి తొలగించివేశాడు. యువతులందరినీ ప్యాకింగ్ గదిలో పోగుచేశాడు. ఆ ఫ్యాక్టరీలో రషీద్‌మాటకు తిరుగు లేదు.

రషీద్ ఫ్యాక్టరీలో మానేజర్ పని చేస్తున్నా, అతన్ని కూలీలందరూ 'మానేజర్' అని పిలువరు. చిన్నదొర అని పిలుస్తారు. రషీద్ తనని పిలిచాడని చప్రాసీ [ప్యూన్] వచ్చి పిలవడంతోనే ఎల్లమ్మకు అతను ఎందుకు పిలిచాడో అర్థమైంది. రషీద్‌కి ఇటువంటి విషయాల్లో ఎన్నోసార్లు ఇది వరకే సహాయంచేసిపెట్టింది. అతను ఏఅమ్మాయిపైనఅన్నా మోజుపడితే, ఎల్లమ్మ ఆ అమ్మాయిదగ్గరికి వెళ్ళి పని సాను కూలంచేసేది. దీనివల్ల ఎల్లమ్మకు జీతంకూడా బాగా పెరిగింది. పని సానుకూలమైనప్పుడల్లా రషీద్ అయిదో, పదో ఆమె చేతిలోకూడా పెట్టేవాడు. ఎల్లమ్మకోడలునర్సమ్మ అనాకారి.

అందువల్లకోడలువిషయంలో ఆమెకుఎట్టిభయంలేదు. కోడలు మొదట ప్యాకింగ్‌గదిలో పనిచేసేది. కాని రషీద్ ఆమెని అక్కడినించి తొలగించివేశాడు. రషీద్ మొదటిసారి పిలిపించి, ఇటువంటిపని అప్పజెప్పినప్పుడు పని సానుకూలమవుతుందో లేదో అని ఎల్లమ్మ కాస్త జంకింది. అప్పగించినపని చేయక పోతే తనఉద్యోగం ఉంటుందో ఊడుతుందోఅని భయపడింది. ఎదుటిమనిషి ఒప్పుకుంటుందో లేదోఅని బెంగపడింది. చేయక పోతే ఏమవుతుందో, చేస్తే ఏం పాపం ఒడిగట్టుకుంటానో అనే సందిగ్ధావస్థలో పడింది. కాని మొదటిసారి అప్పగించిన పని ఇట్టే సానుకూలం కావడంతో రషీద్ దగ్గర ఆమెపరపతి హెచ్చింది.

రషీద్‌దగ్గర అంతపలుకుబడి వున్నా మేస్త్రీకి రుక్మిణిని ఫ్యాక్టరీలో చేర్చడానికి పాతికరూపాయలు యివ్వాక తప్పింది కాదు. అతను చాలా చెడ్డవాడని వినికిడి. అందుకోసమే రుక్మిణిని అతనివిషయంలో కాస్త జాగ్రత్తగా వుండమని హెచ్చరికచేసింది. పాతికరూపాయలు చెల్లించకపోతే ఫ్యాక్టరీలో చేరడానికే ఆస్కారం ఉండదు. చేరినా, ఆ మేస్త్రీ, ఏదోనెపంమీద చేరినమనిషిని తొలగించివేస్తాడు. కాగా, ఈవిషయాలన్నీ రషీదుతో చెప్పడానికి ఎల్లమ్మకు మనస్కరించలేదు.

ఏదో పొట్టకూటికి మనుషులు ఎన్నో వేషాలువేస్తారు. ఈ వేషాలువేసి నాలుగురాళ్ళు అధికంగా గడిస్తారు. తను మాత్రం ఆ వేషాలన్నీ వేయడంలేదు. వీలునుబట్టి తను మాత్రం డబ్బుగడించడంలేదు. మేస్త్రీ మంచి కీలకస్థానంలో

వున్నాడు. అతను డబ్బుగడించడానికి అవకాశాలు చాలా వున్నాయి. తను అటువంటి కీలకస్థానంలో లేదు. అందువల్ల తనకి అవకాశాలుకూడా ఎక్కువగా లేవు. తను అతనికిమల్లే ఎక్కువడబ్బు సంపాదించలేకపోతున్నది. ఇద్దరికీ ఇదీ భేదం. ఇందులో ఒకరు దోషులు, ఇంకొకరు నిర్దోషు లని చెప్పడానికి వీలులేదు. ఉభయులు దోషులే. కాని తనూ ఒక దోషి అనేసంగతి ఎల్లమ్మకి తట్టలేదు. మేస్త్రీవిషయంలో 'ఎవరి ఖర్మకి వాళ్ళే బాధ్యులు. తన కెందుకొచ్చిం దీ గొడవ' అని ఎల్లమ్మ మౌనంవహించింది. కాని 'తన మౌనంవల్ల సాంఘికంగా గొప్పఅన్యాయం జరుగుతున్నదని ఆమె ఎన్నడూ గుర్తించలేదు.

ఎల్లమ్మ రషీద్‌ని చూచింది. అతను 'తనకు రుక్మిణిని సమకూర్చవలసినదిగా' కోరాడు. ఎల్లమ్మ రెండు రోజులు గడువు అడిగింది. పని తొందరగా చేసిపెడితే మంచి ఈనాం (బహుమానం) ఇస్తానని రషీద్ ఎల్లమ్మకి ఆశ చూపాడు. కావలిస్తే మీరు ముగ్గురూ ఇప్పుడే వెళ్ళిపోవచ్చు నని చెప్పాడు. ఒక అయిదురూపాయిల కాగితం చేతికి అందించాడు. రేపుకూడా రానక్కరలేదని చెప్పాడు.

రషీద్ గదిలోంచి వెలుపలికి రావడంతోనే ఎల్లమ్మకి పని సానుకూలమౌతుందో లేదో అనే బెంగ పట్టుకుంది. పనికాకపోతే తనూ, తన కోడలు, రుక్మిణి ఉద్యోగాలు పోతాయి. ఉద్యోగాలు పోతే ఆ కాటకంరోజుల్లో తిరిగి ఉద్యోగాలు దొరకడం కష్టం. అందరూ పస్తులుపడుకోవాల్సివస్తుంది. రుక్మిణి చూస్తే గొప్పఇంటి అమ్మాయిలాగా కనపడుతున్నది.

ఆమె పెడదారులుపట్టినమాట నిజమే. కాని, అది ఏ దుష్టుడి ప్రోద్బలంవల్లనో జరిగివుంటుంది. రుక్మిణి ఎంతో అమాయకురాలు. ఆమె తన స్వబుద్ధితో పెడదారులుపట్టిందనడం కల్ల.

ఎల్లమ్మ వెంటనే రుక్మిణినీ కోడలినీ తీసుకొని ఇంటికి బయల్దేరింది. దారిపొడుగునా ఆమె తనకోడలితోగాని రుక్మిణితోగాని ఏమీ మాట్లాడలేదు. ఇంటికివెళ్ళిన కాస్సేపటికి రుక్మిణిగదిలోకి ఒంటరిగావెళ్ళింది. రుక్మిణికి సంగతి సందర్భాలన్నీ వివరించింది. రషీద్‌ని పొగిడింది. కాని ఆ పొగడ్త రుక్మిణిపైన ఏమీ పనిచేసినట్టు కనపడలేదు. ఇంక ఆ ధోరణివల్ల ఏమీ లాభంలేదని వెంటనే గుర్తించి ప్లేటు మార్చింది. ఒప్పుకోకపోతే మనం ముగ్గురమూ ఉద్యోగాలకి నీళ్ళు వదులుకోవాల్సివస్తుందని, నొక్కి చెప్పింది. ఈ కాటకంరోజుల్లో తిరిగి ఉద్యోగాలు దొరకడం దుర్లభమని విస్పష్టపరిచింది. ఏ ఉప్పరిపనో చేసి బ్రతకడం మనకు చేతకాదని, ఒకరోజు పని దొరికితే పదిరోజులు పని దొరకక పస్తుండవలసివస్తుందనీ మరీ మరీ చెప్పింది.

తనమూలకంగా ఎల్లమ్మకీ ఆమెకోడలికీ ఉద్యోగాలు పోవడం రుక్మిణికి ఏమాత్రం మనస్కరించలేదు. తను ఎంతో అభాగ్యురాలు. తను ఎక్కడికి వెళ్ళినా ఏదో ఒకఅన్యాయం జరగడం చూచి రుక్మిణి ఎంతో విచారించింది. తనవల్ల ఇతరులు ఎందుకు బాధపడాలి? తనదురదృష్టం ఇతరులను పట్టి ఎందుకు భాధించాలి? తనకు ఏ ఆధారం లేనప్పుడు ఎల్లమ్మ తనకు ఒక ఆధారం కల్పించింది. తనకు 'నా' అనేవాళ్ళు

ఎవరూ లేనప్పుడు, తనకు అండగా నిలిచింది. తను పస్తులు చేస్తుంటే చూచి సహించలేకపోయింది. తను అడగనిదే తనకు అవసరమైనప్పుడల్లా డబ్బిచ్చి, తనని కష్టాలనుంచి గట్టెక్కించింది. ఎల్లమ్మ తనకి అంత ఉపకారంచేస్తే తను ఆమెకు ప్రత్యుపకారం ఏమీ చేయలేదా? తనశీలం ఎన్నడో పోయింది. ఇప్పుడు తను రషీద్‌కి లొంగిపోనంత మాత్రాన తన శీలాన్ని నిలబెట్టుకోగలదా? తను ఎన్నడో చెడిపోయింది. ఇప్పుడు రషీద్‌కి లొంగిపోయినంతమాత్రాన తనకు వచ్చిననష్టమేమిటి? కాగా తను ఒప్పుకుంటే ఎల్లమ్మకుటుంబాన్ని ఒక మహావిపత్తునుంచి కాపాడడానికి వీలవుతుంది. ఉపకారం చేసినవాళ్ళకి సాధ్యమైనంతవరకు ప్రత్యుపకారం చేయాలి. కలలోనైనా అపకారం తలపెట్టకూడదు. ఇప్పుడు తను మౌనం వహిస్తే, ఎల్లమ్మకుటుంబానికి తీరని అపకారం జరిగిపోతుంది. అది చూచి తను సహించగలుగుతుందా? లేదు. ఎన్నటికీ సహించలేదు. తను ఎన్నికష్టాలపాలైనా ఇతరులకి ఎట్టి అపకారం జరగకుండా చూడడం తనవిధి.

'చెప్పు, ఏం చేయమంటావో చెప్పు. నువ్వు ఏంచేయమన్నా నేనుచేయడానికి సిద్ధమే' అని రుక్మిణి ఎల్లమ్మని కౌగలించుకొని గొల్లున ఏడ్చింది. యెల్లమ్మమనస్సుకరిగింది. 'తను చేయకూడని పనిని రుక్మిణితో చేయిస్తున్నానా?' అనే సందేహం జీవితంలో మొదటిమాటు యెల్లమ్మకు కలిగింది. కాని తనుమాత్రం ఏంచేయగలుగుతుంది. తనూ చదరంగంలో ఒక పావే. మొట్టమొదటే ఇటువంటి పనుల్లోకి దిగకుండా ఉండాల్సింది తను. తీరా దిగి, ఇప్పుడు విచారించి ఏంలాభం?

రుక్మిణి అంగీకరించకపోతే తమ కుటుంబానికి గొప్పవిపత్తు సంభవించేమాటనిజమే. ఏదో కడుపులో చల్లకదలకుండా జీవితం గడచిపోతున్నది. ఇట్టి పరిస్థితుల్లో కావాలని కష్టాలు కొని తెచ్చుకోవడం యెందుకు? ఉన్న ఉద్యోగాలు వదలిపెట్టుకొని దొరకని కొత్తవాటికోసం ప్రయత్నం చేయడం యెందుకు?

మానవజీవితం కొన్ని పరిస్థితులకి అలవాటుపడుతుంది. ఆ పరిస్థితుల్ని మార్చివేయడానికీ కొత్తపరిస్థితుల్ని కల్పించుకోవడానికీ యెన్నడూసాహసించదు. 'కావాలని ఉన్నపరిస్థితుల్ని మార్చివేస్తే భవిష్యజ్జీవితం ఎల్లా మారుతుందో' అనే బెంగ, భయం మానవుల్ని పట్టి వేధిస్తాయి. అందువల్ల సాధారణంగా ఉన్నపరిస్థితులతోనే సంతృప్తి చెందడానికి ప్రయత్నిస్తారు. ఉన్న పరిస్థితుల్ని మార్చివేయడానికిఎంతోసాహసం కావాలి. ఎంతో ఉపజ్ఞత కావాలి. ముందువెనకలు జాగ్రత్తగా ఆలోచించి ఒక నిర్ణయానికిరాగల శక్తి వుండాలి. పరిస్థితులఒత్తిడివల్ల ఉన్న పరిస్థితుల్నిమాత్రం అవగాహనచేసుకోగలిగారు. కాని, పరిస్థితులు మార్చివేయడంకూడా అసంభవమని ఎల్లమ్మ రుక్మిణులకి ఎన్నడూ తోచలేదు. ఉభయులకీ తగినవిద్యాగంధంలేకపోవడమే దీనికి ముఖ్యకారణం. అవిద్య-పరిస్థితులకు తల ఒగ్గడం ఉభయులకు నేర్పింది. మారాలోచనలేని పిరికితనాన్ని ఉభయులకి ఉగ్గుపాలతో రంగరించిపోసింది. ప్రవాహంలో పూచికపుల్లకిమల్లే, పరిస్థితులకు అనుగుణంగా కొట్టుకుపోవడం నేర్పింది. రెక్కలువంచి కాయకష్టంచేసి పొట్టపోసుకోవడానికి మానం పణంగాపెట్టవలసిన అగత్యమేమిటో అవిద్య విడమర్చి చెప్పలేకపోయింది. 'పొట్టపోసుకోదలిస్తే మానాన్ని

బలిపెట్టవలసిందే' ననే తలాతోకాలేని ఆలోచనను ప్రేరే పించింది. దానితో రుక్మిణి రషీదుకి లొంగిపోవడమే మంచిదని ఎల్లమ్మ ఒకనిశ్చయానికివచ్చింది. వెంటనే తనకౌగిలిలోవున్న రుక్మిణికళ్ళు తుడిచింది. ఆమెని ఓదార్చింది.

'నీకోసంకాకపోయినా మాకోసమైనా నీవు రషీద్‌ని అంగీకరించ' మని, రుక్మిణిని మరీమరీ బుజ్జగించింది. 'మా బ్రతుకులు నీచేతిలో వున్నాయి. పాలముంచినా నీటముం చినా నీవే గతి' అని రుక్మిణిని ప్రాధేయపడింది. యెందుకో యెల్లమ్మకి అమాంతంగా దుఃఖం ముంచుకొచ్చింది. 'పూర్వ జన్మలో ఏం పాపం చేశానో, ఈ జన్మలో ఒకమాణిక్యాన్ని ఒక మసిగుడ్డకి అంటగడుతున్నా' నని గొల్లున ఏడ్చింది యెల్లమ్మ. 'నా ఖర్మ అల్లావుంటే నీవు ఏం చేస్తావు యెల్లమ్మా?' అని రుక్మిణి యెల్లమ్మ కళ్ళనీళ్ళుతుడిచింది. కాని యెవరికీ దుఃఖం ఆగలేదు. ఉభయులూ, చేసేదేమీలేక ఏడుస్తూ కూచున్నారు. పస్థితులకి యెదురీదలేని అశక్తతని ఉభయులూ కన్నీళ్ళద్వారా ప్రకటించుకున్నారు. మానవ జీవితంలో అవిద్య, అజ్ఞానంవల్ల కలిగే లోటుని యెడ తెరిపిలేని కన్నీటి ప్రవాహంద్వారా లోకానికి చాటారు. ఉభయులూ ఏకధారగా యెంతసేపు ఏడ్చారో యెవరికీ తెలియదు. ఏడ్చి, ఏడ్చి ఇద్దరికీ కళ్ళు వాచిపోయినాయి. ఇద్దరికళ్ళూ బాగా యెరుపెక్కాయి. యెల్లమ్మ కొంతసేపటికి తేరుకొని, నీళ్ళతో రుక్మిణికళ్ళు తుడిచింది. తనకళ్ళు తుడుచుకున్నది. అప్పటికే నాల్గువేపులా చీకట్లు అలుముకున్నాయి. రుక్మిణి గదిలో చీకట్లు మరీ దట్టమవుతున్నాయి.

వెలుతురునంతా నెమరువేసి పొట్టబోసుకునే సాయం త్రాలను లోకంబొనుండి యెవరు తప్పించివేయగలరు? అదేవిధంగా తన అందచందాలని దిగతాగటానికి సమకట్టిన 'రషీద్ రాహువు' ని యెవరు అడ్డగలరు? యెందుకో తనకు సాయంత్రాలంటే యెంతో భయం. అవి తనకు ఏదో ఆపదని సూచిస్తాయి. ఏదో ఆందోళన తెచ్చిపెడుతాయి. తనకిమల్లేనే ప్రపంచంలో యెంతోమంది సాయంత్రాలంటే భయపడే వాళ్ళు ఉండిఉంటారు. వాళ్ళ ఉపశాంతికోసం లోకంనించి ఈ సాయంత్రాలని తప్పించి వేయడం సాధ్యమా? అదేవిధంగా తనపైకి దూకడానికి ఉరికివస్తున్న రషీద్‌ని అడ్డగించడం యెల్లమ్మకి సాధ్యమా? రుక్మిణికి రెండు పనులూ అసాధ్యంగానే తోచాయి. యెంత వద్దనుకున్నా సాయంత్రాలు రాకమానవు. చీకట్లు పడకమానవు. యెంత ఇష్టంలేకపోయినా వాటిని తప్పించుకొని తిరగడం అసాధ్యం. కాగా వాటిని భరించక తప్పదు. తప్పనిసరి అయినప్పుడు రషీద్‌నికూడా తనకి యిష్టంలేని సాయంత్రాలకి మల్లేనే భరిస్తే? స్తోమత, శక్తి లేనప్పుడు ప్రపంచంలో మనం ఏ అప కారాన్ని తప్పించుకొని తిరగగలం? ఇంటిపైన పిడుగు పడు తున్నప్పుడు దానిని అడ్డుకోలేమని తెలిసికూడా అడ్డుకోవడా నికి ప్రయత్నించడమెందుకు? పోనీ శిరసావహిస్తే? కొంత మన శ్శాంతి అయినా కలుగుతుంది. అప్పటికి ఒకసమస్య అయినా తీరిపోతుంది. రషీద్‌బారినుంచి తను తప్పించుకోలేనప్పుడు సంతోషంగా అతనికి సుస్వాగతం చెప్పడమే విధ్యుక్తంగా తోచింది రుక్మిణికి. అతనంటే ఇష్టంలేనప్పుడు అతనికి సుస్వా

గతం చెప్పడానికి సంతోషం యెక్కడినించి వస్తుందిమరి? సహజంగా రాకపోతే బలవంతంగా తెచ్చిపెట్టుకోవాలి. అక్కడికీ సాధ్యంకాకపోతే సంతోషం వచ్చినట్లు నటించాలి.

ఆ భావం కలగడంతోనే రుక్మిణి వెంటనేవెళ్ళి రషీద్‌ని పిలుచుకుర'మ్మని యెల్లమ్మకిచెప్పింది. అనుకోనివిధంగావచ్చిన రుక్మిణి అంగీకారానికి యెల్లమ్మ ఉబ్బి తబ్బిబ్బయింది. ఏమి చేయాలో యెల్లమ్మకి వెంటనే ఏమీ తోచలేదు. అప్పటికే బాగా చీకటిపడింది. ఇప్పుడు రషీద్‌కోసం వెడితే యెక్కడ కనపడుతాడని? రేపటివరకు ఆగితే? రేపటివరకు రుక్మిణి మనస్సు మారకుండా వుంటుందా? ఇటువంటిపనులు యెంత తొందరగా జరిగితే అంతమంచిది. రేపటివరకుఆగితే ఏమి కీడు వాటిల్లుతుందో? ఆగక, చేయదగ్గపనేమీ కనపడలేదు ఎల్లమ్మకి. క్షణంసేపు ఆలోచించి, ఏమీతోచక 'ఆ తతంగ మంతా నాకు వదిలేసెయ్యి'అని రుక్మిణికి సమాధానం చెప్పింది. రుక్మిణి ఆ మసకచీకటిలో ఒకసారి ఎల్లమ్మవంక చూసి, ఆమె ముఖకవళిక ఏమీ అర్థంకాం మౌనంవహించింది. రుక్మిణిఅంగీకారం లభించడంతోనే ఇంక అట్టేసేపు అక్కడ ఉండడం ఇష్టంలేక 'రేపుఉదయం కనపడుతా' నని చెబుతూ ఎల్లమ్మ తనయింటికేసి బయల్దేరింది. రుక్మిణి లేచి, ఇంట్లో దీపంవెలిగించింది. ఉదయంచేసిన పచ్చజొన్నరొట్టె కాస్తంత తిని, నేలమీద మేనువాల్చింది. ఉదయం నాలుగుమైళ్ళు సాయంత్రం నాలుగుమైళ్ళు సిగరెట్‌ఫ్యాక్టరీకి వెళ్ళిరావడం మూలాన పక్కపైన మేనువాల్చిందే తడవుగా ఆమెకు నిద్ర పట్టింది.

ఎల్లమ్మ మరునాటిఉదయం రుక్మిణికి కనపడలేదు. మధ్యాహ్నం వచ్చి గంగాళంలో నీళ్ళుకాగబెట్టి రుక్మిణికి తలంటిపోసింది. 'ఇప్పుడు ఈ తలంటిపోయడ మెందుకు?' అని రుక్మిణి యెన్నిసార్లు అన్నా యెల్లమ్మ వినిపించుకోలేదు. సాయంత్రం తలఆరినతరువాత ఆమెకు జడ వేసింది. మల్లెపూలు తెప్పించి తలలో ముడిచింది. 'ఏమిటీసన్నాహం?' అని ఆమె అడుగుతే, 'ఏముంది! ఏమీలే'దంది. ఉన్నవాటిలో ఒక మంచి చీర తీసి, రుక్మిణికి కట్టింది. శుభ్రమైన రవిక తీసి తొడుక్కోమ్మని చెప్పింది. 'యెందు కీ సన్నాహం?' అని మరీమరీ గుచ్చిగుచ్చి అడిగితే 'రాత్రికి రషీద్ వస్తా' డని వినీవినపడనట్లు చెప్పింది. దీపాలుపెట్టినతరువాత తనయింటికి వెడుతూ, పెందలాడే భోజనంచెయ్యమనీ తలుపు గడియ వేయకండా ఓరగా వేసిఉంచమనీ, హెచ్చరికచేసింది. చేసిన హెచ్చరిక చాలక 'రషీద్ వచ్చేసరికి పదిదాటవచ్చు' అని చూచాయగా చెప్పింది. 'అతనిరాక నేను ఒకకంట కనిపెడుతూనే ఉంటాను. నీవుమాత్రం నిద్రపోకు' అని తిరిగిహెచ్చరిక చేసింది. 'వాకిలి ఓరగావేసి ఉంచడం మరిచిపోకేం' అని అంటూ ఆమె తనయింటికి వెళ్ళిపోయింది.

కాలచక్రం తిరుగుతున్నది... నిమిషాలు క్రమంగా గంటలలోకి మారుతున్నాయి... ఏడు... యెనిమిది... ... తొమ్మిది దాటింది... ... తలంటుకొని కొప్పులో పూలు ముడుచుకొని శుభ్రమైన దుస్తులుధరించి ఆకర్షవంతంగా సిద్ధమై, రషీద్కోసం దారితెన్నులుకాయడం రుక్మిణికి యెంతోఅసహ్య మేసింది. తనజీవితంపై తనకే రోతకలిగింది.

తన బ్రతుకు ఒక బోగందాని బ్రతుకుగా మారినందుకు రుక్మిణి యెంతో దుఃఖించింది. యెంతో విచారించింది. కాని నెమిలి కంటినీరు వేటగాడికి ఏంముద్దు?...... నెమిలి ఏడ్చినంత మాత్రాన వేటగాడు దానిపైన బాణంవేయడం మానుకుంటాడా? జాలిపడి వెనుదిరిగిపోతాడా? నెమిలిహృదయం గాయపడి రక్తంవరదల్ని ప్రవహింపచేస్తుందని కరుణిస్తాడా?...... తొమ్మిదిదాటటంతోనే ఎల్లమ్మ ఆరుబయటికివచ్చి వేటగాడి అడుగులచప్పుడుకోసం చెవియొగ్గి ఇటూఅటూ పచార్లు చేయడం మొదలెట్టింది....పచార్లలో అరగంటదాటింది. ఇంతలోకే ఏదో అడుగులచప్పుడు ఏవేపునించి వినపడిందో ఎల్లమ్మ తనచూపుని ఆవేపుకి సారించింది...కనుచూపు మేరలో వేటగాడు దృగ్గోచరమైనాడు......ఎల్లమ్మ ఎదురుగావెళ్ళి వేటగాడికి సుస్వాగతం చెప్పింది......వేటగాడు వేటకి కావలసిన అన్నిహంగులతో కంటికి పొడకట్టాడు...... ఎల్లమ్మ మారుమాటాడకుండా వేటమృగం బంధించివున్న గదికి దారితీసింది......వేటగాడు ఎల్లమ్మని అనుసరించాడు. ఎల్లమ్మ గదితలుపు తెరిచింది......వేటగాడు గదిలోపలికి వెడుతో ఎల్లమ్మచేతికి పాతికరూపాయలు అందించాడు...... ఎల్లమ్మ రూపాయలు కొంగులో కట్టుకుంటుండగా, గదితలుపులు మూసుకున్నాయి. కాసేపటికి తలుపుసందుల్లోంచి ఇవతలకి చిమ్ముకొస్తున్న వెలుతురు బయటికి కనపడడం ఆగిపోయింది. గదిలో చీకట్లు అలముకున్నాయి. ఆ కారుచీకట్లలో వేటగాడికి వేటమృగం వశమైపోయింది.

# 15

రమణ ఆసుపత్రినుంచి తనగదికి వచ్చి పడకకుర్చీలో జేరగిలపడింది. ఉదయంనుంచీ సాయంత్రందాకా ఆసుపత్రిలో ఎడతెరపిలేకండా పనిచేయడంవల్ల శరీరమంతా బాగా నొప్పులుపెడుతున్నాయి. మెదడు అలసి దిమ్మెక్కింది. లేచి స్నానంచేద్దామంటే ఏమాత్రం ఓపికలేదు.

చీకటిపడుతున్నది. ఉస్మానియాఆసుపత్రి గోడల మీదినుంచి నీరెండలు జారుతున్నాయి. గదిలో క్రమంగా చిరుచీకట్లు అలముకుంటున్నాయి. ఆసుపత్రిఆవరణలోని చెట్లపైన కాకులు 'కావు కావు' మని చప్పుడు చేస్తున్నాయి. గుంపులు గుంపులుగా ఒకచెట్టుపైనుంచి ఇంకొకచెట్టుమీదికి ఎగురుతున్నాయి. ఆరాత్రికి ఏదోఒకచెట్టుమీద స్థావరం ఏర్పరచుకోవడానికి ప్రయత్నిస్తున్నాయి. ఒకగుంపు ఒకచెట్టుపైన ఆగిపోతే ఇంకొకగుంపు ఇంకొకచెట్టుమీదికి ఎగిరివెడుతున్నాయి. ఆసుపత్రి ఆవరణలో వున్న చెట్లనన్నిటినీ ఏవిధమైన పోటీలుపడకండా తమలోతాము పంచుకుంటున్నాయి. రమణ ఆ కాకులఅరపులు వింటూ గుంపులు గుంపులుగా అవి ఒకచెట్టుపైనించి ఇంకొకచెట్టుపైకి ఎగరడం చూస్తూ ఎంతోకాలం గడిపింది. చీకట్లు చిక్కబడడంతో కాకులగోల అణగింది. చీకటితునకలు చీకట్లలో విలీనమైనాయి. వాతావరణాన్ని ఏదో అసహజమైన నిశ్శబ్దత ఆవరించింది. గదిలో చీకటిఅలలు తేలిఆడుతున్నాయి. ఎందుకో రమణకి తను చీకట్లలో కూరుకుపోతున్నట్లు తోచింది. తనకీ

ప్రపంచానికీ మధ్య చీకటిగోడలు మొలుస్తున్నట్లు తోచింది. ఎందుకో అమాంతంగా రమణని ఒంటరితనం ఆవరించింది.

తను ఇంక జీవితంలో ఏకాకిగా బ్రతకవలసిందేనా? ఎట్టి ఆశ్రయంగాని, రక్షణగాని లేకండా ఒంటరిగా జీవించ వలసిందేనా? చిన్నతనంలో తనకు ఏదైనా కాస్త తట్టు తగిలితే, ఎంతమంది తనచుట్టూ చేరి ఓదార్చేవారని! ఎంతమంది తనని సమాధానపెట్టేవారని ! ఎంతమంది తనని ఎత్తుకునేవారని! ఎంతమంది తనబాధని పంచు కునేవారని! వాళ్ళబుజ్జగింపులు వింటోంటే నిజంగా వాళ్ళు తనబాధని పంచుకుంటున్నట్లే కనపడేది. తాతయ్యా ఎత్తుకునే వాడు. తండ్రీ, పినతండ్రులు యెత్తుకునేవాళ్ళు. ఒక రేమిటి? తల్లి, పినతల్లి, అత్తయ్యా, మామయ్యా, అత్తయ్యతల్లి - అందరూ తనని యెత్తుకునేవాళ్ళే! ఇప్పుడు వాళ్ళంతా ఏమైనారు?

వేంకటరామయ్యమామ గతించాడు. వరలక్ష్మి అత్తయ్యా, జిజియాబాయి నాయనమ్మా నగరంలోని ఏ మారుమూలల్లోనో పడిఉన్నారు. ఈశ్వరరావుచిన్నాయన ఆస్తిపాస్తులన్నీ కోల్పోయి ప్రేమావతీపేటలో దినదిన గండంగా జీవితాన్ని గడపుతున్నాడు. తనతండ్రి నారాయణ రావుకు పింఛన్ అయింది. ఆరోజుఉదయమే అతను తనతల్లి తోసహా తన తాతగారిగ్రామం గొల్లపల్లికి వెళ్ళిపోయినాడు. ఆరుసంవత్సరాలక్రితం తనతండ్రి గొల్లపల్లిలో కొంత పొలం కొన్నాడు. ఒక చిన్నయిల్లు కట్టించుకున్నాడు. ఉన్న కాస్త పొలం సేద్యంచేసుకొని, జీవితశేషం ప్రశాంతంగా గడప

డానికి సమకట్టాడు. ఇక మిగిలింది రుక్మిణిఅక్కయ్య, రఘు బావ. రుక్మిణిఅక్కయ్య యెవరితోనో లేచిపోయిందని చెబుతారు. అక్కయ్య అలాంటిస్వభావంగల మనిషి కాదు. అయినా విద్యావిహీన - నిరక్షరకుక్షి - అమాయకురాలు. విద్యావిహీనని మోసగించడం చాలా సులువు - ఏ ఆకర్షణ చూపి, ఆమెను యెవరు లేవదీసుకొనిపోయినారో తెలియదు. లేచిపోయినా సుఖంగా వుందో లేదో కూడా తెలియదు. అంతటి అమాయకురాలు సుఖంగావుంటుందనే నమ్మకం కూడా లేదు. యెన్నికష్టాలు పడుతున్నదో! యెన్నిఅవస్థలు అనుభవిస్తున్నదో!

ఇక రఘుబావ - కొన్నిలతలు ఏదైనాచెట్టు ఆధారం లేకపోతే ఎదగనట్లే, రఘుబావ జీవితంలో స్వతంత్రంగా తన కాళ్ళపైనతాను నిలువలేడు. అతనికి యెవరోఒకరి ఆధారం కావాలి. జీవితంలో యెవరోఒకరి మార్గదర్శకత్వం కావాలి. అతనికి పద్మ మార్గదర్శకత్వం లభించింది. రఘుబావకి జీవితంలో ఒకచుక్కానిని ఏర్పర్చడంకోసం తను పద్మస్నేహాన్ని అతనికి సమకూర్చిపెట్టింది. కావాలని తాను తనచుట్టూ నీలాపనిందల్ని అల్లుకున్నది. ఆ నీలాపనిందలవల్ల తనంటే రఘుబావకీ, పద్మకీ అసహ్యంవేసేట్లు చేసింది. ఆ అసహ్యమే వాళ్ళని మరీ సన్నిహితపరిచింది. ఉభయులమధ్య గాఢతర బంధాన్ని ఏర్పర్చింది. జీవితంలో తను కోరుకున్నదికూడా సరిగ్గా అంతే. తను పన్నినపన్నాగం విజయవంతమైంది. వాళ్ళు ఏక్షణాన్నైనా పెళ్ళిచేసుకోవచ్చు. వేరు వేరు కులాలు కావడంవల్ల వాళ్ళవివాహానికి కొన్నిఅడ్డంకులు కలుగవచ్చు

వరలక్ష్మి అత్తయ్య, జిజియాబాయి నాయనమ్మ వాళ్ళ వివాహానికి అభ్యంతరం చెప్పవచ్చు. ఈ అభ్యంతరం గమనించి రఘుబావ పద్మని వివాహమాడడానికి ముందు వెనుకలు చూడవచ్చు. కాని పద్మ మహాపట్టుదల మనిషి. తను అనుకున్నపని తప్పక చేసితీరుతుంది. రఘుబావది మంచి రొమాంటిక్ తత్వం. పద్మదికూడా రొమాంటిక్ స్వభావమే. ఉభయుల స్వభావాలూ ఒకేరకం కావడంవల్ల, ఇరువురి మనస్తత్వాలు కలసిపోతాయి. ఇరువురూ సుఖపడతారు. ఉభయులకు పెళ్ళిజరిగిపోతే, వాళ్ళకి తనపై గల దురభిప్రాయాన్ని ఇట్టే తొలగించివేయవచ్చు. దానికి అట్టేకాలం పట్టదు.

తను మొదట రఘుబావను ప్రేమించినమాట నిజమే; కాని నిజం విచారిస్తే అది ప్రేమ కాదేమో! దాన్ని ఫ్యాన్సీఅన్నా తప్పులేదు. యౌవనారంభంలో తను 'రఘుబావని ప్రేమిస్తున్నా' నని అనుకుంది. కాని, ఒకటిరెండు సంవత్సరాలు గడవడంతో, అది ప్రేమ కాదని తెలిసిపోయింది. యౌవనపుపొంగు అని సువిదితమైంది. తను వివాహంచేసుకోనని ఎదురుతిరగడంతో తన యౌవనం ఒకఆలంబాన్ని కోరింది. రఘుబావరూపంలో ఆ ఆలంబము అప్పట్లో కనపడింది. దానితో తాను రఘుబావని ప్రేమిస్తున్నానని భ్రమించింది. కాని, కొంతకాలం గడవడంతో తనజీవితంలో తనకు ఒక ధ్యేయం కనపడింది. ఆ ధ్యేయంకోసం తన సర్వస్వాన్ని బలిపెట్టవలసివచ్చింది. ధ్యేయం విస్పష్టపడడంతో ఫ్యాన్సీ- అందులో రఘుబావపై తనకుగల ఫ్యాన్సీ ఎగిరిపోయింది. అంతటితో తనధ్యేయసాధనకోసం,

తను త్యాగాలుచేయడం ప్రారంభించింది. వివాహాన్ని తృణీక రించింది. సంఘానికి ఎదురుతిరిగింది. 'స్త్రీ పురుషుడికిమల్లె ఒక ఆశయసాధనకోసం అవివాహితగా ఎందుకు ఉండకూడదు?' అని తనలో తాను వితర్కించుకుంది 'అవివాహితగావుంటే తప్పేమిటో'దనే నిశ్చయానికి వచ్చింది తాను.

వివాహమే స్త్రీజీవితపరమావధా? అయితే పురుషుడికి ఎందుకు కాకూడదూ? కొందరుపురుషులు ప్రపంచంలో అవి వాహితులుగా వుండి ఏదో మహదాశయంకోసం తమ నిండుజీవితాల్ని బలిపెడుతున్నప్పుడు, కొంతమంది స్త్రీలు మాత్రం ఏదో మహోన్నత ఆశయంకోసం తమ జీవితాల్ని ఎందుకు త్యాగంచేయకూడదు? త్యాగంచేయడంలో తప్పేమిటి ? విద్య, వివాహం మొదలైనవి వ్యక్తిగతసమ స్యలు. వాటిని వ్యక్తులు, తమతమ పరిస్థితుల్నిబట్టి పరిష్కా రంచేసుకోవలసిందే. నేటియువకుల వరదక్షిణదాహానికి తట్టు కోలేక, ఎందరుబాలికలు అవివాహితలుగా వుండడంలేదు. నిర్బంధంగా అవివాహితలుగావుంటే తప్పులేదా? ఒకఆశయ సాధనకోసం ఐచ్ఛికంగా అవివాహితలుగా వుంటే తప్పొ చ్చిందా? అయినా 'ఫలానివారికి పెళ్ళికాలేదు, ఫలానివారికి పెళ్ళిఅయింది' అనే ధోరణిలో సంఘం ఎందుకు ఆలోచిం చాలి? 'వాళ్ళవాళ్ళకి యిష్టమొస్తే పెళ్ళిచేసుకుంటారు, లేకపోతేలేదు' అనే ధోరణిలో ఎందుకు ఆలోచించగూడదు?

చిన్నతనంలో తనకు కాస్త దెబ్బతగిలితే, ఇంటిల్లి పాదీ తనచుట్టూ మూగేవారు. ప్రేమావతీపేటలోని తమ ఇంటినిండా తమకి ఆప్తులూ, సన్నిహితులైనవాళ్ళుండేవాళ్లు.

ఇప్పుడు వాళ్ళంతా ఏమైనట్టు? వాళ్ళమధ్య తనకి భద్రత వుండేది. రక్షణ ఉండేది. ఇప్పుడు కాలంమారింది. కాలంతో పాటు పరిస్థితులు మారాయి. ఆధునికవిద్య కొత్తఆశయాల్ని రేకెత్తించింది. ఆర్థికంగా పరిస్థితులు తారుమారయినాయి. ఆర్థికచిక్కులవల్ల తలా ఒకదారిపట్టారు. ఎవరిపొట్ట వాళ్ళు పోసుకోవడం మొదలెట్టారు.

మొదట తనతండ్రి ప్రేమావతీపేట యింటితో తెగ తెంపులు చేసుకున్నాడు. తన బతుకు తాను బ్రతకడం నేర్చుకున్నాడు. దానితో ఒక చెట్టుకుగల రెండుకొమ్మల్లో ఒక కొమ్మ విడిపోయింది. ఆర్థికపరిస్థితులే దీనికి ముఖ్యకారణం. తనతండ్రి పొట్టపోసుకోవడానికి నగరాలకి ఎగబాకాడు. తన మామ వేంకటరామయ్యకూడా అంతే. నలుగురితోపాటు విధిలేక తమపిల్లలకి ఆధునికవిద్య చెప్పించారు. దానితో కొత్త భావాలు మొగ్గలుతొడిగి విరియబూశాయి; దానితోడు తాను కాలానుగుణంగా తనకుటుంబానికి ఎదురుతిరిగింది. వివాహంచేసుకోడానికి నిరాకరించింది. నర్సింగ్‌కోర్సు చదవడానికి సమకట్టింది. తనతండ్రి తను నర్సింగ్‌కోర్సు చదవడం భావ్యంకాదని గోలపెట్టాడు. కాని తాను అతనిసలహాని పాటించలేదు. మొదట తాను మెడిసన్ చదువుదామనుకుంది. కాని ధనాభావం తనకు అడ్డువచ్చింది. ఇతరుల దగ్గరినుంచి సహాయంపొందడం యిష్టంలేక, తనకాళ్ళపై తాను నిలచే ఉద్దేశంతో తాను నర్సింగ్‌కోర్సులో చేరింది. దానితో తనకీ తనయింటికీ మధ్యగల సంబంధం చాలావరకు తెగిపోయింది. తాను ఏ ఎనిమిదిరోజులకు ఒకసారో యింటికి వెళ్ళేది. తన

తలిదండ్రులతో ముక్తసరిగా మాట్లాడేది. దానితో తనకీ, తనతలిదండ్రులకీ మధ్య గల ఆత్మీయత సన్నగిల్లింది. పింఛన్ పుచ్చుకొని, తండ్రి గొల్లపల్లికి వెళ్ళిపోవడంతో తన తలి దండ్రులకీ తనకీ పూర్తిగా సంబంధం తెగిపోయింది.

తనతండ్రి చదువుమాని తనని గొల్లపల్లికి రమ్మ న్నాడు. తన కిష్టమొచ్చినవరుణ్ణి చూచుకొని పెళ్ళిచేసు కొమ్మని చెప్పాడు. లేకపోతే 'నీవు నాకూతురివి కావు, నేను నీతండ్రిని కాను' అని గోలపెట్టాడు. 'నేటినుంచీ ఇంక నీమొ హం చూడను.' అని ఖచ్చితంగాచెప్పి, గొల్లపల్లికి పట్టరాని కోపంతో విసురుగా వెళ్ళిపోయాడు. ఆవాక్యం విని, తనహృ దయం తరుక్కుపోయింది. ఎంతో కష్టంవేసింది. ధైర్యం చిక్కబట్టుకొని, తండ్రిపలికిన శూలాలలాంటిమాటల్ని తాను సహించింది. కాని నేటితో తన తలిదండ్రులకీ, తనకీ మధ్య గల గాఢానుబంధం పుటుక్కునవిరిగింది. ఇంక దాన్నిఅతకటం దుర్ఘటం. తనజీవితానికీ, తనతలిదండ్రుల జీవితానికీ మధ్య ఒకపెద్ద అఖాతం ఏర్పడింది. ఆ అఖాతాన్ని పూరించడం ఇంక దుర్ఘటం. గాఢానుబంధం విరిగిపోవడంతో, తను అరక్షణీయ అయింది. తనకు భద్రత లేకుండాపోయింది. తన తలి దండ్రులు తనజీవితాన్నీ, తనఆశయాల్నీ అర్థంచేసుకోవడం అసంభవం. వాళ్ళకోసం తానువెనకడుగువేయడం అసాధ్యం. తను వెనుకంజవేయడం, తనకి మృత్యుతుల్యం అన్న మాట! తను వెనకచూపు చూడడానికి వీలులేదు. ప్రపం చంతో పాటు తాను ముందంజవేయవలసిందే. తన తలిదం డ్రుల మోస్తరు తాను ఆధునికత్వాన్ని చూచి దిగ్భ్రమ

చెందకూడదు. ఆశ్చర్యచకితురాలు కాకూడదు. ఆధునిక యుగంలో వుంటూ ఆధునికత్వాన్ని చూచి అసహ్యించుకో కూడదు. ఆధునికత్వంలోని లోతుపాతుల్ని తాను అర్థంచేసు కోవాలి. పూర్వాపరాల్ని తాను చక్కగా సమన్వయం చేసుకోవాలి.

ఇది విజ్ఞానయుగం, పైగా అణుయుగం. ఈఅణుయుగం మానవుడికి, ఎన్నో కొత్త లోకాల్ని తెరుస్తున్నది. ఎన్నో కొత్త అవకాశాల్ని కల్పిస్తున్నది. లోకం అందిస్తున్న విజ్ఞాన మంతా మనవారసత్వం. ఈ వారసత్వాన్ని పరిగ్రహించి మనం ముందుకు సాగాలి కొత్త వెలుగుల్ని వెలిగించాలి. కాలం మారుతున్నది. కాలంతోపాటు విలువలు మారుతు న్నాయి. పాత విలువలు దిగజారిపోతున్నాయి. వాటిస్థానే మనం కొత్తవిలువల్ని స్థాపించుకోవడం ఎంతైనా అవసరం. జమీందారీవిధానం క్రమంగా రద్దుఅవుతున్నది. ఆ స్త్రీవల్ల సంక్రమించేరక్షణ అడుగంటడంతో మానవుడు ప్రపంచంలో ఏకాకిగాభావించు కుటుంన్నాడు. సమిష్టికుటుంబం మానవుడికి ఒకవిధమైన భద్రతను సమకూర్చింది. తను పడుతున్న కష్టాల పట్ల సానుభూతి చూపే ఒక ఆప్తబృందాన్ని అతనికి ప్రసా దించింది. కాని నేటి ఆర్థికపరిస్థితుల ఒత్తిడివల్ల ఈ సమిష్టి కుటుంబాలు చీలిపోతున్నాయి. కుటుంబసభ్యులు పొట్ట చేత పట్టుకొని, నేడు తలా ఒకదారి పడుతున్నారు. నేడు కుటుంబ మంటే భార్యాభర్తలు, సంతానంవరకె కుదించుకుపోయింది. అయ్యో! పినతండ్రులు, పెద్దతండ్రులు వీడిపోయినారే! అని వాపోయి లాభంలేదు. పినతండ్రి, పెదతండ్రి పిల్లలు మనకు

దూరమైపోయినారే అని చింతించి ప్రయోజనం ఉండదు. అలనాటి రక్షణ, భద్రతలకు దూరమైపోయినామే అని భయపడకూడదు. కింకర్తవ్యతావిమూఢులం కాకూడదు.

ఒకకాలంలో మనకు ఆస్తి రక్షణనిచ్చింది. భద్రతని సమకూర్చింది. కాని నేడు మన యోగ్యత విజ్ఞానాలు మనకు భద్రతనిస్తున్నాయి. మనకు అవసరమైన యోగ్యత, విజ్ఞానం ఉంటే మనం ఈ విశాలవిశ్వంలో పొట్టపోసుకోగలం. 'మన భవిష్యత్తు ఎలా వుంటుందో!' అనే ఆవేదన ఆ కాలంలోకూడా వుండేది. ఈ కాలంలోనూ ఉంది. కాగా ఈకాలంలో ఈ ఆవేదనకి కొంచెం పదను ఎక్కువైంది. అంతకుమించి భేదం ఏమీలేదు.

పాతవిలువలస్థానే కొత్తవిలువలు స్థాపించుకోవాలి. ఇదీ యుగధర్మం. పాతవిలువలు దిగజారిపోతున్నందుకు మనం దిగ్భ్రమచెందకూడదు. ఆశ్చర్యచకితులం కాకూడదు. పాత విలువలు యెందుకు దిగజారిపోతున్నాయో మనం దీర్ఘంగా ఆలోచించాలి. పూర్వాపరాల్ని మేధశ్శక్తితో సమన్వయ పరచుకోవాలి. యుగధర్మానికి అనుగుణంగావుండే కొత్తవిలు వల్ని సృష్టించుకోవాలి. పాతవిలువల్ని అంటిపెట్టుకొని, వాటినే జీవితంలో ఆదర్శంగా నిలుపుకోవడానికి ప్రయత్నించడం మూఢలక్షణం.

నేటిమానవుడు రినైజాన్సు పేరట పాతవిలువల్ని పున రుద్ధరించడానికి పూనుకోవడం కడు శోచనీయం. నగరానికి ఎగబ్రాకుతో, గ్రామాల్ని నగరాలుగా మార్చడానికి ప్రయత్నిస్తో, నేటిమానవుడు నగరజీవితాన్ని అసహ్యించుకుంటు

న్నాడు. స్కూళ్ళలో, కాలేజీలల్లో విద్యనభ్యసిస్తో ప్రాచీన గురుకుల విద్యాపద్ధతిని గూర్చి కమ్మని కలలుకంటున్నాడు. తన కళని అజంతా, ఎల్లోరా, హరప్ప, మహెంజోదారో అమరావతీ శిల్పాల్లో చూచి లొట్టలువేస్తున్నాడు. తన సంస్కృతిని వేదవేదాంగాల్లో దర్శించి ఉవ్విళ్ళూరుతున్నాడు. ఆధునిక సమస్యలకి ప్రాచీన గ్రంథాలలో పరిష్కారమార్గాలను వెతుకుతున్నాడు. ఆధునికజీవితం తెచ్చిపెడుతున్న సమస్యల్ని అతను అర్థంచేసుకోలేకపోతున్నాడు. వాటి పరిష్కారానికై నేటి సాంఘికపరిస్థితులకి అప్రయోజనకారిగా పరిణమించిన ప్రాచీన సంప్రదాయాల్ని, కట్టుబాట్లనీ, విలువల్నీ వెతుకుతున్నాడు. పాతగోతుల్ని తవ్విపోస్తున్నాడు.

ఒకకాలంలో మన ప్రాచీన సంస్కృతి మహోజ్వలస్థితి నందుకున్నమాట నిజమే. మన ప్రాచీన సంస్కృతి మనకు నేడు ప్రోత్సాహకారి అయితే కావచ్చు. భూత భవిష్యత్ వర్తమానకాలాలకి అవినాభావసంబంధం వుందంటే యెవరూ కాదనరు. కాని నేటి సమస్యలను ప్రాచీనమైనవిలువలతో తూచి, సమన్వయమార్గాన్ని ఏర్పరచడానికి ప్రయత్నించడం ముఖ్యంగా గర్హించదగ్గ విషయం. నేడు కుల నియమాలు, కట్టుబాట్లు తారుమారైనాయి. ఇంకా మేము బ్రాహ్మలం, మేము క్షత్రియులం, మేము వైశ్యులం, మేము రెడ్లం, మేము కమ్మవారం అని కులాచారాల్ని పాటించడం హాస్యాస్పదమైనవిషయం. నేటిబ్రాహ్మడు బ్రాహ్మడు కాడు. క్షత్రియుడు క్షత్రియుడుకాడు. సాంఘికపరిస్థితుల ఒత్తిడివల్ల జాతియావత్తూ ఒక సంకరజాతిగా పరిణమించింది. 'అయ్యో

మనది సంకరజాతే అని విచారించవలసిన అగత్యం నేడు యేమాత్రంలేదు. 'వివిధకులాల పవిత్రత నాశనం అయిందే' అని వాపోవవలసిన అవసరం అసలే లేదు. ఈ సాంకరత్వం లోంచి నేడు ఒక మహత్తరమైన జాతి పుట్టుకొచ్చింది. అదే నేటి భారతజాతి. ఇది మనకు గర్వకారణమైన విషయం. ఈ భారతీయతకోసం మనం యెన్ని బ్రాహ్మణత్వాలనైనా బలి పెట్టడానికి సంసిద్ధంగా వుండాలి. అదే నేటి యుగధర్మం.

పాతగోతుల్ని తవ్వినా పరిష్కారమార్గం లభించక పోవడంతో నేటి భారతీయుడు మనసంస్కృతికి ఏదో తీరని దెబ్బతగిలిందని వాపోతున్నాడు. మనసంస్కృతికి ఏదో ప్రమాదం సంభవించిందని గావుకేకలు పెడుతున్నాడు. నిజం విచారిస్తే మనసంస్కృతికి యెట్టిప్రమాదం కలుగలేదు. మన సంస్కృతీవాహిని పాతవిలువల్ని విసర్జిస్తూ, కొత్తవిలువల్ని పరిగ్రహిస్తూ, భూతభవిష్యద్వర్తమానకాలాల్ని సమన్వయ పరుస్తూ, అజరామరంగా ప్రవహిస్తూనేవుంది. పాతనీటిస్థానే కొత్తనీరు వస్తున్నది. కొత్తనీరు చాలా పుష్టికరమైందే కాక ప్రాణప్రదమైందికూడా. ... ... ...

తన ఆలోచనలకి రమణకే నవ్వువచ్చింది.'పిట్టకొంచెం కూతఘనం' అన్నట్టుంది తనధోరణి. ప్రపంచసమస్యల్ని గూర్చి క్షుణ్ణంగా ఆలోచించి తీర్పు చెప్పడానికి తనకేమి అధికారముందని? వయస్సునుబట్టిగాని, అనుభవాన్నిబట్టిగాని తీర్పుచెప్పడం అటుంచి, సరిగ్గా ఆలోచించడానికికూడా తనకి అర్హత లేదే! అట్టిపరిస్థితుల్లో తను ప్రపంచసమస్యల్నిగూర్చి ఆలోచించడానికి పూనుకోవడం రమణకి గొప్పసాహసంగా

కనపడింది. అయినా తనవి సరిఅయిన ఆలోచనలని బల్లగుద్ది చెప్పడానికికూడా తనకు కావలసిన ప్రమాణాలులేవే!తను పొర పడివుండవచ్చు - తప్పుగా ఆలోచించి వుండవచ్చు. తాను ఈ క్లిష్టసమస్యల్ని గూర్చి ఆలోచించవలసిందిమాత్రం ఇప్పుడు కాదు - తాను మంచి అనుభవం గడించాలి. ప్రపంచసమ స్యల నిజస్వరూపాన్ని తాను క్షుణ్ణంగా అర్థంచేసుకోవాలి - అప్పుడుగాని తనకి ఆయాసమస్యల పరిష్కారమార్గాన్ని సూచించడానికి అర్హత కలుగదు......

తనకు సంబంధించిన సమస్యల విషయంలో తాను ఏమాత్రం పొరపడలేదు, పెడదారులుపట్టలేదు. అంతవరకు మాత్రం నిజం. తాను ధైర్యంగా, ఒంటరిగా తనసమస్యల్ని ఎదుర్కొన్నది. పరిష్కారమార్గాల్ని అన్వేషించింది- తదను గుణంగా తాను వ్యవహరించింది. వివాహమే తన జీవిత పరమావధిగా తాను బ్రతకదలచలేదు. తన జీవితంలో వివాహం ఒక అప్రధానమైన విషయం. అందువల్లనే తనకోసం తండ్రితెచ్చిన సంబంధాన్ని నిరాకరించింది. తండ్రితో పోట్లా డింది. వివాహాన్ని పడగొట్టింది. తాను 20 వ శతాబ్దపు యువతిగా బ్రతుకదలచింది. తనకాళ్ళపై తాను నిలబడ దలచింది. నేడు స్త్రీకి ఆర్థికస్వాతంత్ర్యం వుంటేనే గాని ఆమెకి సంఘంలో గౌరవం లేదు. తాను ఆర్థిక స్వాతంత్ర్యంకోసం పాటుపడదలచింది. తన మనస్తత్వానికి సరిపడేవృత్తిని ఎన్నుకుంది. తాను మొదట మెడిసన్ చదువ దలచుకుంది. కాని తన ఆర్థికదుస్థితివల్ల ఆ ఆశయం నెరవేర లేదు. అందువల్ల తను నర్సింగ్ కోర్సు తీసుకుంది. నర్సింగ్

కోర్సు తీసుకున్నందుకు తనను అందరూ అవహేళనచేశారు. తాను లెఖ్కచేయలేదు. ఇంక రెండుసంవత్సరాలు కళ్ళు మూసుకుంటే తాను నర్సునిఅయిపోతా ననుకుంది. ఈ వృత్తిలో తాను కొంతడబ్బు వెనకవేసుకుంటే, ఆతరువాత తను మెడిసన్ చదువుకోవచ్చు. మానవసేవ చేయవచ్చు. తన ఆశయానికి వివాహం అడ్డువచ్చింది. తను వివాహాన్నీ తద్వారా రఘుబావనీ పరిత్యజించింది. తనమీద లేనిపోని నీలాపనిందలు వేసుకొని రఘు పద్మలను సన్నిహితపరచింది. ఇందులో తాను ఎక్కడా పొరపడలేదు. పూర్వాపరాలు దీర్ఘంగా ఆలోచించి ఒక నిర్ణీతమార్గాన్ని ఏర్పర్చుకొని తదనుగుణంగా తాను వ్యవహరించింది. తనకు సంబంధించి నంతవరకు తాను యెక్కడా పొరపడలేదని తోచడంతో, రమణకి తనచుట్టూ అలముకున్న చీకట్లలో ఒక ఆశారేఖ కనపడింది.

అపోహలు ఎల్లకాలం వుండవు. కొంతకాలానికి రఘు, పద్మలు తనని సవ్యంగా అర్థంచేసుకోక తప్పదు. తన తలి దండ్రులకి తనపైన మరికొంతకాలానికి సదభిప్రాయం కలుగక మానదు. దీనికోసం అట్టేకాలం వేచివుండవలసినపని లేదు. రెండుసంవత్సరాలు ఓపికపడితే చాలు_ అన్నిసమస్యలూ పరిష్కారమవుతాయి. చీకట్లు చెదరిపోతాయి. వెలుగులు ప్రసరిస్తాయి. ఆలోచనల దొంతరలమధ్య రమణ హృదయంలో ఒక ఆశాభావం మొలకెత్తింది. ఆ ఆశాభావానికి చిహ్నంగా ఒక సన్నని చిరునవ్వు ఆమెపెదవులపైన నాట్యంచేసింది.

# 16

రఘు సంవత్సరంపాటు ఉద్యోగప్రయత్నాలు జరిపి, ఇంక లాభంలేదని తేల్చేసుకొని, 'లాచదువుదామా' అనే ఆలోచనలో పడ్డాడు. పద్మని అడిగితే 'మీయిష్టం' అని సమాధానం చెప్పింది. ఒక సంవత్సరంపాటు రికామీగా గడపటంతో అతనికి విసుగువేసింది. అతను యెక్కిన గడప లెక్కలేదు. యెక్కడా పని సానుకూలం కాలేదు. ఉద్యోగప్రయత్నంలో ఏ ఆఫీసుకు వెళ్ళినా, అతన్ని వందేమాతరం ఉద్యమం వెంటాడింది. ఏ ఆఫీసర్‌ని చూచినా, అతని గతచరిత్ర అతని పురోభివృద్ధికి ప్రతిబంధకంగా నిలిచింది. ఇట్టి పరిస్థితుల్లో అతనికి ఉద్యోగం దొరుకుతుందనే ఆశసన్నగిల్లింది. ఉద్యోగవిషయంలో పద్మని విచారించిచూస్తే 'మీరు ఉద్యోగం కోసం ప్రయత్నించడం నాకేమాత్రం ఇష్టంలే'దని నిక్కచ్చిగా చెప్పింది. కాగా 'ఉద్యోగం కోసం అటువంటి పాక్షిక ప్రభుత్వాన్ని పట్టుకొని పాకులాడడం నాకేమాత్రం ఇష్టంలే'దని బల్లగుద్దిచెప్పింది. దానితో రఘు ఉద్యోగప్రయత్నాలు ఆగిపోయాయి కాని, ఏ వ్యాపకం లేకుండా జీవితంగడపం రఘుకి దుర్భరంగా తోచింది. రోజుకి యెన్నిగంటలని పద్మయింట్లో గడుపుతాడు? యెన్నిసార్లు చూచిన పిక్చర్లే చూస్తాడు?

కవులు తమకావ్యాల్లో జీవితాన్ని యెంతో అందంగా చిత్రిస్తారు. రచయితలు చిలువలు పలువలు పెట్టి జీవితాన్ని ఒక రంగురంగుల ఇంద్రధనుస్సుగా అభివర్ణిస్తారు. కాని నిజా

నికి జీవితం ఒక మొనాట. నీ క్షణ క్షణం యెంతో భారంగా గడుపవలసివస్తుం . క్షణాలు గడువవు. క్షణమొకయుగంగా కనపడుతుంది. అందులో ఏపనీ లేకండా రోజులు, మాసాలు, సంవత్సరాల తరబడి గడపాలంటే, మరీ దుర్భరంగా వుం టుంది. అందుకోసం ఏదైనా చేయాలనే ఆలోచన రఘుని పట్టివేధించింది. 'ఏమిచేయడమా?' అనే ప్రశ్న అతనికళ్ళ ముందు ఆకాశంఎత్తున లేచింది. పోనీ రాజకీయాల్లో ప్రవే శిస్తే? సంస్థానరాజకీయాలు అతనికి అసహ్యంగా కన పడ్డాయి. మరి భారతరాజకీయాలో?

భారతరాజకీయాకాశంలో గొప్ప ప్రతిష్టంభన ఏర్పడింది. 1942 లో ప్రారంభమైన 'క్విట్ ఇండియా' ఉద్య మాన్ని సామ్రాజ్యశక్తులు నిర్దాక్షిణ్యంగా అణచివేశాయి. నిజంవిచారిస్తే బ్రిటిషుప్రభుత్వం 'క్విట్ ఇండియా' ఉద్య మాన్ని దూరదృష్టిలేక చేతులారా తెచ్చిపెట్టుకున్నది. 1939 సెప్టెంబర్ ఒకటవ తేదీన లార్డ్ లిన్‌లిత్‌గో అక్షరాజ్యాలకి వ్యతిరేకంగా యుద్ధాన్ని ప్రకటించడంతో ఈ ముప్పు వాటి ల్లింది. అతను భారతదేశాన్ని, జాతీయనాయకులలో ఎవరి తోనూ సంప్రదించకుండా, యుద్ధంలో పడద్రోశాడు. బ్రిటిష్ ప్రభుత్వం 'ప్రజాస్వామికంకోసం' 'స్వాతంత్ర్యంకోసం' అక్ష రాజ్యాలతో పోరాడుతున్నదని అతను ప్రకటించాడు. దీనికి 'ఎవరిస్వాతంత్ర్యం?' అని పండిత జవహర్‌లాల్ నెహ్రూ ప్రశ్నించారు. నాజీఇజంతో యుద్ధంచేస్తూ బ్రిటన్ తన సామ్రాజ్యవాదాన్ని వదలుకోలేకపోయింది.

బ్రిటిష్ ప్రభుత్వ యుద్ధాశయాలతో ఏకీభవించలేక 1939 నవంబరు మాసంలో వివిధ రాష్ట్రాలలోని కాంగ్రెస్ మంత్రివర్గాలు రాజీనామా లిచ్చాయి. అప్పట్లో యావద్భారతదేశంలో రాజకీయంగా గొప్ప ప్రతిష్టంభన ఏర్పడింది. బ్రిటిష్ ప్రభుత్వం మంత్రివర్గాల రాజీనామాలవల్ల యుద్ధ ప్రయత్నానికి గొప్ప విఘాతం కలగడం గమనించి 1942 మార్చి 22వ తేదీన సర్ స్టాఫర్డ్ క్రిప్సుని, వివిధపార్టీలతో సంప్రదింపులు జరిపి వాటితో ఒక ఒప్పందానికి రావడానికై భారతదేశానికి పంపించింది. క్రిప్సుమిషన్ కాంగ్రెసు సమైక్యభారతానికి, ముస్లింలీగ్ విభజితభారతానికి ఒకసమన్వయం అని చెప్పవచ్చు. కాగా యుద్ధానంతరం భారతదేశానికి డొమినియన్ ప్రతిపత్తి ప్రసాదించడానికి వాగ్దానంచేయబడింది. క్రిప్సు 1942 మార్చి 22వ తేదీనించి ఏప్రిల్ 11వ తేదీ వరకు భారతదేశంలో వివిధపార్టీలతో సంప్రదింపులు జరిపాడు. భారతదేశంలోని అన్నిపార్టీలు చివరకు మితవాదులతో సహా క్రిప్సు ప్రతిపాదనల్ని నిరాకరించాయి. క్రిప్సుపథకం విఫలం కావడంతో యావద్భారతం గాంధీజీపై తనదృష్టిని మరల్చింది. తిరిగి అతన్ని నాయకత్వం వహించమని వేడుకొంది. గాంధీజీ ప్రజలకోరిక ననుసరించి నాయకత్వంవహిస్తూ భారతదేశాన్నుంచి వైదొలగవలసిందిగా, బ్రిటిషుప్రభుత్వానికి 'హరిజన' పత్రికలో హితవుచెప్పారు ఈ హితవే 'క్విట్ ఇండియా' ఉద్యమానికి నాందీప్రస్తావనగా మారింది. 1942 ఆగస్టు7వ తేదీన అఖిలభారత కాంగ్రెసుకమిటీ 'క్విట్ ఇండియా' తీర్మానాన్ని పరిశీలించడానికి బొంబాయిలో సమావేశమైంది.

ఆగష్టు 9వ తేదీన, కాంగ్రెస్ కార్యవర్గసభ్యులూ, గాంధీజీ అరెష్టు అయినారు. అగ్రనాయకులు అరెష్టుకావడంతో, దేశంలో గొప్ప అరాజకం ఏర్పడింది. ఉద్యమాన్ని నడపడానికీ, నాయకత్వంవహించడానికీ ఏ నాయకుడూ లేకపోవడంతో, ప్రజలే స్వయంగా ఉద్యమాన్ని నడిపారు. నాయకుల అరెష్టుకు అసమ్మతిసూచకంగా దేశమంతటా సమావేశాలు జరిపారు. ఊరేగింపులు చేశారు. బ్రిటిష్‌దమననీతిని వేయినోళ్ళతో ఖండించారు. రైలుపట్టాలుతొలగించారు. తంతితీగెలు నరికివేశారు. ప్రభుత్వకార్యాలయాలకినిప్పంటించారు. దేశంలోకొన్నిభాగాలలో ప్రభుత్వంపనిచేయడం స్థంభించింది. అసంఖ్యాకంగా ప్రజలు అరెష్టుఅయినారు. ప్రభుత్వ దమననీతి పెచ్చుపెరిగిపోయింది.

సంయుక్తరాష్ట్రాల్లో నిరాయుధులైన ప్రజలపైన బ్రిటిష్ ప్రభుత్వం విమానాలమీదినుంచి మరఫిరంగులతో కాల్పులు జరిపింది. ప్రజల్ని చిత్రహింసచేసింది. జనవరి 1943కి ఉద్యమాన్ని పూర్తిగా అణచివేసింది. ప్రజలపైన సమిష్టి జుల్మానాలను విధించింది. ఆతరువాత బెంగాల్‌లో పెద్ద కరవు వచ్చింది. లక్షలాది ప్రజలు కలకత్తా వీథుల్లో క్షుద్బాధతో మరణించారు. 'అన్నమో రామచంద్రా' అని అలమటించారు. బ్రిటిషుప్రభుత్వంఉదాసీనతే దీనికి ముఖ్య కారణం. ఇంతలోకే గాంధీజీధర్మపత్ని కస్తూరిబా, కార్యదర్శి మహాదేవ్ దేశాయి గాంధీజీ నిర్బంధంలోవున్న పూనాలోని ఆగాఖాన్ భవనంలో మరణించారు. యావద్భారతాన్ని దుఃఖసాగరంలో ముంచెత్తారు. ఆ తరువాత గాంధీజీ

రక్తపుపోటుతో, మలేరియాతో బాధపడ్డారు. ప్రభుత్వం గాంధీజీని విధిలేక విడుదలచేసింది.

ఈమధ్య సంస్థాన రాజకీయాల్లో చెప్పుకోదగిన మార్పేమీ జరుగలేదు. 1940 లో ముస్లింలీగ్ భారతవిభజన లేక పాకిస్థాన్ సంస్థాపన తమ రాజకీయధ్యేయంగా ప్రకటించి నప్పటినుంచీ, ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంస్థానంలో ద్విజాతి సిద్ధాంతాన్ని విరివిగా ప్రచారంచేయడం మొదలెట్టింది. ప్రజలలో మతవిద్వేషాలను క్రమంగా పురికొల్పుతూ వచ్చింది. నిజాంప్రభుత్వం పాక్షికదృష్టి అవలంబించడంతో రోమిలాలు, అరబ్బులు, (ముస్లింలలోని కొన్ని తెగలు) సంస్థానమంతటా సాయుధులై తిరగటం మొదలెట్టారు. హిందువులకు ఆయుధాల్ని ధరించడానికిహక్కు లేదు. తత్ఫలితంగా ముస్లింల సాయుధవిజృంభణముందు హిందువులు అవనతవదనులై, భయవిహ్వాలులై మెలగడంతప్ప గత్యంతరం కనపడలేదు. ఇట్టి పరిస్థితుల్లో, చొరవచేసుకొని పని చేయడానికి చెప్పుకోతగ్గ రాజకీయాలు ఏమీ కనపడలేదు రఘుకి. మీదు మిక్కిలి సంస్థానమంతటా అరాచకపరిస్థితులు వికటాట్టహాసం చేస్తున్నాయి. ఈ అరాచకశక్తుల్ని ఎదుర్కోడానికి ఎన్ని గుండెలు ఉండాలి? స్టేటు కాంగ్రెస్ ఏమీ చేయలేక పోతున్నప్పుడు, తను ఒక్కడూ ఏమి చేయగలడు? పోనీ 'లా' చదువుకుంటే? పద్మని ఇదివరకు ఒకసారి అడిగితే 'మీ యిష్ట'మని చెప్పింది. పోనీ ఇంకొకసారి పద్మతో ఈ విషయాన్నిగూర్చి ప్రస్తావించి, 'లా' లో చేరుతానని చెబితే?

ఎందరో యువకులు ఎం. ఏ., ఎం. ఎస్. సి. పూర్తి చేసి, ఏమిచేయడానికీ తోచక గొర్రెదాటుగా, ఆలోచనా రహితంగా 'లా' లో చేరినట్టే రఘు ఎల్. ఎల్. బి.లో చేర దల్చుకున్నాడు—కాని చేరేముందు పద్మఅంగీకారం పొందడం అవసరమని భావించి, వెంటనే పద్మయింటికి బయల్దేరాడు. దారిపొడుగునా ఎల్. ఎల్. బి.లో చేరడమే ఉత్తమంగా అతనికి తోచింది. కాగా తనకి ఇంక ప్రభుత్వోద్యోగం దొరకడం దుర్లభం. ఏదైనా స్వతంత్రవృత్తి అవలంబించాలి. రఘుకి అప్పట్లో స్వతంత్రవృత్తులు రెండే కనబడ్డాయి. ఒకటి మెడిసన్ చదివి ప్రాక్టీసు చేయడం, రెండవది 'లా' చదివి ప్రాక్టీస్ చేయడం. ఇప్పుడు తను మెడిసన్ చదవడం అసంభవం కనక, విధిలేక 'లా' చదవడానికి నిశ్చయించుకున్నాడు.

రఘు పద్మయింటికి వెళ్ళిన కాసేపటికి, పద్మ దివాన్ ఖానా (డ్రాయింగ్ రూమ్) లోకి వచ్చింది. రఘు కూర్చున్న సోఫాలోనే అతనిపక్కకువచ్చికూర్చుంది.ఒకనిమిషంతరువాత

'నాన్నగారితో మాట్లాడాను. వారికి ఎట్టిఅభ్యంతరం లేదు' అని నెమ్మదిగా అంది.

'ఏ విషయంలో?' అన్నాడు రఘు పరధ్యానంగా.

'మీరు ఇక్కడ వున్నారా? లేక ఇంకెక్కడైనా ఉన్నారా?' అని అడిగింది పద్మ కొంటెగా.

'ఈమధ్య ఒక్క నీహృదయంలో తప్ప, ఇతరత్రా ఉండడం మానేశాను' అన్నాడు రఘు పద్మకళ్ళల్లోకి సూటిగా చూస్తూ.

పద్మ చెక్కిళ్ళు సిగ్గుతో ఎర్రబారాయి.

'అయితే నా హృదయంలోని పరమాత్మతో మాట్లాడుకోనా ?' అని అడిగింది పద్మ కాస్త తెప్పరిల్లి.

'కాని ఆపరమాత్మ నీతో పలకడు ఉలకడు' అన్నాడు రఘు ఏదో తెచ్చిపెట్టుకున్న గాంభీర్యంతో.

'పూజిస్తాను - ధ్యానిస్తాను - చివరికి సుముఖంచేసు కుంటాను' అంది పద్మ, ఆ వాక్యాలలో ఎంతో అందాన్ని ఒలకబోస్తూ.

'అప్పటికీ సుముఖం కాకపోతే ?' అని ప్రశ్నించాడు రఘు, తెచ్చిపెట్టుకున్న గాంభీర్యాన్ని కొంత సడలింపజేస్తూ.

'ఘోర తపస్సుచేస్తాను - చివరకి ప్రసన్నుడు అయ్యే వరకు వదలను' అంది పద్మ, కంఠంలో తన దృఢసంకల్పాన్ని ధ్వనింపజేస్తూ.

'సుందరీ! నీ ఘోరతపస్సుకు సంతసించితిని. ఏమికావలయునో కోరుకో' అన్నాడు రఘు, ఒక్కొక్కమాటని అసహజంగా ఉచ్చరిస్తూ.

'తమ సాన్నిధ్యము దక్క, నేను వేరొండు కోరను' అంది పద్మ, సోఫాలో రఘుముందు నిజంగా మోకరిల్లుతో.

ఉభయులూ తమ శృంగార చేష్టలకి గొల్లున నవ్వుకున్నారు. రఘు సోఫామీద మోకరిల్లిన పద్మని లేవనెత్తి వామహస్తంతో ఆమెని తన కౌగిలిలో బంధిస్తూ, దక్షిణ హస్తంతో ఆమెగదువని స్పృశించి, ఆమెమొహాన్ని పైకి లేవనెత్తాడు. కళ్ళల్లోకి చూస్తూ 'ఏమిటి సంగతి ?' అని లాలనగా అడిగాడు.

'మీరు నన్ను వదిలేస్తే చెబుతా'నని అంది పద్మ, తన కళ్ళల్లోంచి రఘుచూపుల్ని తప్పించివేస్తో.

'చేతికి దొరికిన మనిషిని వదిలివేయకమే!' అన్నాడు రఘు, కౌగిలిని మరీ బిగిస్తో.

'అబ్బ! మీతో మెలగడం కష్టం' అంది పద్మ అయిష్టాన్ని నటిస్తో.

రెండవచేతినికూడా పద్మవీపుమీదికి పోనిచ్చి పద్మ తలని ఎడమచేతిమీదుగా మోచేతిలోకి జార్చి, రఘు పద్మని సుదీర్ఘంగా ముద్దుపెట్టుకున్నాడు. ఒక క్షణం తరవాత పద్మ తలని మోచేతిలోంచి తీసి, రఘువక్షంలో దూర్చింది. కుడి చెయ్యి రఘువీపుమీదుగా పోనిచ్చి, ఎడమచేతితో రఘు చొక్కా గుండీని తిప్పుతో, 'మన వివాహానికి నాన్నగారికి ఎట్టి అభ్యంతరంలే'దని చెప్పింది పద్మ రఘుతో.

రఘుశరీరంపైన హఠాత్తుగా వందబిందెల చన్నీళ్లు పోసినట్లైంది. రఘు ఏమీ మాట్లాడలేకపోయాడు. అతను తన చెవులన్ని తాను నమ్మలేకపోయాడు. పైన సీలింగ్ ఫ్యాన్ తిరుగుతున్నా, అతనికి శరీరమంతా ముచ్చెమటలు పోస్తు న్నాయి.

రఘు పద్మతో ఏదో కులాసాగా కాలక్షేపంచేస్తున్నాడే గాని, వివాహానికి సంబంధించిన అంశాన్ని గూర్చి అతను ఎన్నడూ తీవ్రంగా ఆలోచించలేదు. పద్మనివివాహంచేసుకుం దామనిగాని, చేసుకోవద్దనిగాని అతనికి ఎన్నడూ తట్టలేదు. ఆధునికయువకులకు మల్లే, అనాలోచితంగా, యౌవనం అందించే ఉద్వేగవాహినిలో అతను పడిపోయాడు. ఆ ఉద్వే

గం ఏ గట్టుకు చేరుస్తుందో, అతను ఎప్పుడూ ఆలోచించ లేదు. జీవితంలో ఏదో సుఖాన్ని అతను వాంఛించాడు. ఆ సుఖం అతనికి పద్మరూపంలో కనపడింది. ఆమెరూపాన్ని ఆరాధించాడు. ఆమెఅందాన్ని కళ్ళతో తనివితీరా తాగే శాడు. కాని ఆ రూపంగాని, ఆ అందంగాని ఒకరోజున తనని నిలేసి 'నా సంగతేమిటి?' అని తనని ప్రశ్నిస్తుందని అతను కలలోకూడా అనుకోలేదు. అందువల్ల ఆ ప్రశ్న రావడం తోనే, అతను ఉక్కిరిబిక్కిరైనాడు. ఏమీ సమాధానం చెప్పలేకపోయాడు.

ఆధునికయువతి ప్రకృతి, అందులో ముఖ్యంగా భారత నారి మనస్తత్వం దీనికి భిన్నంగా వుంటుంది. తాను ప్రేమిం చిన వ్యక్తిని ఆమె తన స్వంతంచేసుకోవడానికి ప్రయత్ని స్తుంది. అతని ఆశ్రయం పొందటానికి కృషిచేస్తుంది. తన ఆస్తిగా అతన్ని ఆక్రమిస్తుంది. అతనికి ఎక్కడా ఊపిరిసలప నివ్వదు. ఇరవైనాలుగు గంటలు అతన్ని తన కళ్ళముందు బంధించి వుంచడానికి తన శాయశక్తులా ప్రయత్నిస్తుంది. ఆ బంధించి వుంచడం ప్రేమతోనే కావచ్చు. కాని కొంత కాలానికి ఈ ప్రేమే, అతన్ని ఊపిరిపీల్చుకోవడానికి వీలు లేకుండా చేస్తుంది. అతని స్వాతంత్ర్యాన్ని హరిస్తుంది. అప్పుడు ఈ ప్రేమబంధం అతనికి దుస్సహంగా పరిణమిస్తుంది. ఆధునికయువకుడు సుఖాన్ని ఆశించి ఆధునికయువతిని సమీపిస్తాడు. ఆధునికయువతి ఈమైత్రివల్ల వలసినసౌఖ్యాన్ని పొందుతో, యావజ్జీవనం అతనిసామీప్యాన్నీ, ఆశ్రయాన్నీ పొందటానికి ప్రయత్నిస్తుంది. రక్షణను ఆశిస్తుంది. భద్ర

తను కోరుతుంది. ఆ భద్రత లభించకపోవడంతో ఎదురు తిరుగుతుంది. తను ప్రేమించిన వ్యక్తినే అసహ్యించుకుంటుంది. దీనికి ముఖ్యంగా రెండు కారణాలు ఉన్నాయి. మొదటి కారణం లోకం ఏమనుకుంటుందోననేభయం. స్త్రీకి ఆర్థికస్వాతంత్ర్యం లేకపోవడం రెండవకారణం. ఈ రెండు కారణాల వల్ల, స్త్రీ పురుషుని దృష్టిలో, వింతగా ప్రవర్తించడంలో ఆశ్చర్యమేమీ లేదు.

'ఏమిటి ఆలోచిస్తున్నారు?' అని అడిగింది పద్మ గోముగా.

'ఆఁ, ఏమీలే'దని తప్పించుకోడానికి ప్రయతించాడు రఘు.

'కాదు. ఏదో ఆలోచిస్తున్నారు, చెప్పరూ?' అని తిరిగి అడిగింది పద్మ ఆప్యాయంగా.

'ఈ సంబంధాన్నిగూర్చి మాఅమ్మ ఏమంటుందా? అని ఆలోచిస్తున్నాను.' అన్నాడు రఘు, ఆమె ఈ సంబంధానికి ససేమిరా ఒప్పుకోదని, తన కంఠంలో ధ్వనింపజేస్తూ.

'కులంగానిపిల్లని పెళ్ళిచేసుకోవడానికి ఆమె ఏమాత్రం యిష్టపడకపోవచ్చు' అంది పద్మ, తన సందేహాన్నికూడా వెలిబుచ్చుతో.

'ఒక్క కులభేదం లేకపోతే, ఆమె ఈ సంబంధానికి ఎగిరి గంతువేసేది' అన్నాడు రఘు, కొద్దిగా తన తల్లిని వెనకవేసుకొస్తూ.

'ఆమెని ఒప్పించడానికి మార్గమేదీ లేదా?' అని అడిగింది పద్మ, కొంచెం ఆదుర్దాగా.

'లేదనే నా అనుమానం. అయినా ఆలోచించడం మంచిది' అన్నాడు రఘు, పద్మఆదుర్దాని తొలగించివేసే ఉద్దేశంతో.

'పోనీ ఇద్దరంవెళ్ళి నచ్చచెప్పడానికి ప్రయత్నిస్తే?' అని అడిగింది పద్మ ఓటమిని ఒప్పుకోడం ఇష్టంలేక.

'అయినా లాభంవుంటుందనే నమ్మకం నాకు ఏ మాత్రం లేదు' అన్నాడు రఘు, తనతల్లి మనస్తత్వాన్ని విశదీకరిస్తో.

'లాభంఉండదని నాకూ తెలుసు; కాని ప్రయత్నించడం మన విధి' అంది పద్మ, తమ ఉభయుల విధ్యుక్తాన్ని విశదీకరిస్తో.

'ఆమె ఎల్లాగూ ఒప్పుకోదని తెలిసికూడా, ప్రయత్నించడం అవసరమనుకుంటావా?' అని అడిగాడు రఘు, ఈవిషయంలో తనతల్లిని ఎదుర్కోవడం ఇష్టంలేక.

'వాళ్ళతరానికీ మనతరానికీ, భావాలకి సంబంధినంత వరకు హస్తిమశకాంతర భేదం వుంది. ఆ తరంవాళ్ళకి కులంపట్టింపులు ఎక్కువ. మనకి కులాలంటే ఏమాత్రం నచ్చవు. కాగా ఆధునికభావసంపర్కం లేనిదే కులాలంటే ఈసడింపుకలగదు'అంది పద్మ, రెండుతరాలమధ్యగల విభేదాన్ని విశదీకరిస్తో.

'అందుకోసమే వాళ్ళతో కులాలవిషయంలో వాదించి లాభం ఉండదని నేను మరీమరీ చెప్పడం' అన్నాడు, రఘు తల్లికి నచ్చచెప్పడం తప్పిపోతుందనే ఉద్దేశంతో.

'వెనకటితరంవాళ్ళు మారనిమాట నిజమే. ఆమాటకు వస్తే, ఈ తరంవాళ్ళంమాత్రం మనం పూర్తిగామారామా? మనచెప్పేచేతలకి వందసంవత్సరాల తేడా వుంది. మనం కులాలని నమ్మకపోయినా, ఇండ్లలోకి వెళ్ళడంతోనే కులం కట్టుబాట్లని తు. చ. తప్పకుండా పాటిస్తున్నాం' అంది పద్మ యువతరంనీతిని విమర్శిస్తో.

'ఆమాట నిజమే. మనభావాలు వందసంవత్సరాల ముందు వుంటే మనచేతలు వంద సంవత్సరాలు వెనకబడిఉన్నాయి.' అన్నాడు రఘు పద్మభావాన్ని మరికొంత విపులీకరిస్తో.

'అందువల్ల వెనుకటితరంవాళ్ళు మనభావాల్ని అర్థం చేసుకుని మనని అనుసరించాలనడం అర్థరహితమైనవిషయం. కాలం భావాలకిసంబంధించినంతవరకు ఈ రెండుతరాల్ని విడదీసింది. ఏ తరంవాళ్ళయినా ఎవరికినచ్చినభావాల్నివారు అనుసరించడం శ్రేయోదాయకం' అంది పద్మ తననిశ్చితాభిప్రాయాన్ని వ్యక్తపరుస్తో.

'ఈ రెండుతరాలకి సమన్వయం కుదర్చడానికి మార్గమేమీ లేదా?' అన్నాడురఘు పైకి ఆలోచిస్తున్నధోరణిలో.

'విశాలహృదయులైతే సమన్వయం కుదురుతుంది. లేకపోతే లేదు' అంది పద్మ సమాధానంగా.

'అంటే?' అని ప్రశ్నించాడు రఘు పద్మధోరణి అర్థం కాక.

'ఉదాహరణకి మా నాన్నగారినే తీసుకోండి - మా నాన్నగారికియువజనులఆశయాలు అర్థంకావు; అంతమాత్రాన

వాటిని ఆయన విమర్శించడు. మీ యుగధర్మం మీది, మా యుగధర్మం మాది. మీ యుగధర్మాన్ని మీరు అనుసరించండి - మా యుగధర్మాన్ని మేము అనుసరిస్తాం. మీతో మాకు పేచీవద్దు. అదేవిధంగా మేము మీతో పేచీపడం' అని ఒకసమన్వయమార్గానికి దారితీస్తారు' అంది పద్మ.

'మా అమ్మధోరణి మీ నాన్నగారిధోరణికి పూర్తిగా వ్యతిరేకంగా ఉంటుంది. మనం ఉభయులం పెళ్ళిచేసుకుంటున్నామని తెలియడంతోనే, వర్ణసంకరం జరుగుతున్నదని గోలపెడుతుంది. మా పూర్వుల్ని రౌరవాదినరకానికి ఈడుస్తున్నానని నన్ను దూషిస్తుంది - ఏడుస్తుంది - తల నేలకేసి బద్దలుకొట్టుకుంటుంది. అప్పటికీ నేను మొండికేస్తే, నా ఖర్మానికి నన్నువదలి, తనమానానతాను ఎక్కడికైనా వెళ్ళిపోతుంది' అన్నాడు రఘు, చల్లకొచ్చి ముంత దాచడం యిష్టంలేక.

'నామూలకంగా మీకు మీ తల్లికీ, అమ్మమ్మకీ దూరంకావలసివస్తుందన్నమాట?' అంది పద్మ పరిస్థితుల్ని అర్థంచేసుకునే ధోరణిలో.

'నేను నిన్నూ వదులుకోలేను, మా అమ్మనీ వదులుకోలేను. తత్ఫలితంగా చివరకి ఏమిచేయడానికీ తోచక గిలగిల తన్నుకుంటున్నాను.' అన్నాడు రఘు డగ్గుత్తికతో.

'ఇట్టిపరిస్థితుల్లో నేను నిర్మొహమాటంగా మాట్లాడ్డం చాలా అవసరం - నామాటలు మీకు కఠినంగాతోచినా తోచవచ్చు - అంతమాత్రాన నేను నిజంచెప్పడానికి జంకకూడదు - జంకితే, నేను నా విధ్యుక్తధర్మాన్ని నిర్వర్తిం

చినదాన్ని కాజాలను.' అంది పద్మ తాను చెప్పబోయే విష యానికి నాందీ ప్రస్తావనగా.

'నీవు ఎంతకఠినంగా మాట్లాడినా, నాకు కోపంరాదు. నా హితముకోరి నీవు మాట్లాడుతున్నావు. ఆసంగతి నే నెన్నటికి మరచిపోను' అన్నాడురఘు పద్మపై తనవిశ్వాసాన్ని మోపుతో.

'నేను ఆమాట అనకూడదుగాని, మీతల్లి అంతగా మొండిపట్టుపడితే మీరు ఆమెని వదులుకోవడమే మంచిది. నేను స్వార్థాన్ని ఆశించి ఈమాట చెప్పడంలేదు - మీ పురోభివృద్ధిని దృష్టిలోవుంచుకొనే చెబుతున్నాను' అంది పద్మ కుండబద్దలుకొట్టినట్టు.

'చెప్పు ఏంచేయమంటావో చెప్పు - నీవు చెప్పినట్లల్లా చేస్తాను' అని దిగాలుపడి కళ్ళల్లో నీళ్ళు నింపుకున్నాడు రఘు.

పద్మ వెంటనే రఘుతలని తనఒళ్ళోకితీసుకొని, అతని తలవెంట్రుకల్లో తనవేళ్ళుపోనిస్తూ, 'కళ్ళల్లో నీళ్ళు నింపుకుం టారా? తప్పుకదూ. నేనుండగా మీకు దిగులెందుకూ?' అని గోముగా ఓదార్చింది పద్మ రఘుని.

రఘుకి చెలమల్లాగా కళ్ళల్లో నీళ్ళుఊరాయి. కంటి నీటిని తనకొంగుతో ఒత్తుతూ, 'మీతల్లికి మనం ముందుగానే ఈవిషయంచెప్పడం మనధర్మం. మీరుఒక్కరూ చెప్పలేక పోతే, మీతోపాటు నేనుకూడా వచ్చి చెబుతాను' అంది పద్మ రఘుకి ధైర్యాన్నిస్తూ.

రఘు పద్మలు ఆ సాయంత్రమేవెళ్ళి వరలక్ష్మికి తాము వివాహంచేసుకుంటున్నసంగతి చెప్పడానికి నిశ్చయించారు.

రఘు ఆ మధ్యాహ్నమంతా పద్మయింట్లోనే గడిపాడు. అక్కడే భోజనంచేశాడు. సాయంత్రం నాలుగుగంటలకి ఫలహారంచేసి, టీతాగాడు. కాస్త చల్లబడినతరువాత, ఉభయులూ కారులో ఫీలుఖానాకి బయల్దేరారు. దారిపొడుగునా రఘుని 'తమవివాహంసంగతి తల్లికి ఎల్లాచెప్పడమా' అనే సమస్య బాధించింది. ఎంత ఆలోచించినా, తనతల్లికి నచ్చచెప్పేవిధానమేమీ కనపడలేదు. కాగా అతనికి ఎడమకన్ను అదరడం మొదలుపెట్టింది. మూఢవిశ్వాసాలపైన అతనికి ఎట్టినమ్మకం లేకపోయినా, ఏమి కీడు వాటిల్లుతుందో అనే భయంపట్టుకుంది. మగవాడికి ఎడమకన్ను అదరడం మంచిదికాదని, తనతల్లిచెప్పగా విన్నాడు. నేడు తప్పక ఏదో కీడు జరుగుతుందని తనమనస్సుకూడా చెబుతున్నది. పోనీ ఇంకొకమంచిరోజు ఏదైనాచూచి తనతల్లికి తమ వివాహాన్నిగూర్చి చెబితే? తీరా బయలుదేరి 'ఇంకొకరోజున ఎప్పుడైనా మాఅమ్మదగ్గిరికి వెడుదాంలే' అని పద్మకి ఇప్పుడు నచ్చచెప్పడం ఎల్లా! 'ఏమైతే అది అవుతుంది' అని చివరకి రఘు గుండెదిటవుపర్చుకున్నాడు. ఇంతలోనే కారుతమసౌధముందు ఆగింది. పద్మతోసహా రఘుకారులోంచి దిగాడు- నాలుగడుగులు వేయడంతోనే, తనయిల్లువచ్చింది. ఏమైతే అదవుతుందని తిరిగి గుండెధైర్యం తెచ్చుకొని ఇంట్లోకి వెళ్ళాడు.

దేవుడికి వత్తులుచేస్తూ వరలక్ష్మి పడమటిమనసాలలో కూచుంది. ఉభయులూ వరలక్ష్మినిసమీపించారు. వెళ్ళీవెళ్ళడంతోనే, పద్మ వరలక్ష్మికి వంగినమస్కారంచేసింది. అతన్ని

కూడా నమస్కారం చేయమన్నట్లు, రఘు కేసి చూచింది. రఘుకూడా తనతల్లికి వంగి నమస్కారంచేశాడు. రఘు పద్మ ఉభయులూ తనకి ఒకేమాటు నమస్కారంచేయడం వర లక్ష్మికి ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆమె ఆ ఆశ్చర్యంలో, వీ రుభయులలో ఏఒక్కరినీదీవించలేదు. 'ఏమిటివిశేషం'అన్నట్లు ఉభయులవంక చూసింది. ఇద్దరిలో ఏ ఒక్కరికీ మాట పెగ ల్లేదు. ఉభయులూ ఒకేసారి జంటగా నమస్కారంచేయడం లో ఏదో విశేషం వుందని ఆమె ఇట్టే గ్రహించింది. ఎంతకీ రఘు మాట్లాడకపోవడంతో, పద్మ విసిగి, 'మేము ఇద్దరమూ పెళ్ళిచేసుకోదలిచా' మని, విస్పష్టంగా వినపడేటట్లు, సన్నని గొంతుకతో చెప్పింది. 'ఏమిటే! పెళ్ళిచేసుకుంటారా, మీకే మైనా మతిపోలేదుకద?' అని వరలక్ష్మి ఉత్తరక్షణంలో ఉభ యులపైనా విరుచుకుపడింది. 'మగవాడికి వాడికిసిగ్గులేకపోతే, ఆడజన్మమెత్తిన నీకైనా సిగ్గువుండఖ్కరలే?' అని పద్మని ప్రశ్నించింది. పద్మ ఏమీ సమాధానంచెప్పకపోవడంతో వరలక్ష్మి మరీ విజృంభించింది. 'వాడు బ్రాహ్మడు, నీవు శూద్రురాలివి. వాడిని పెళ్ళిచేసుకుంటానని చెప్పడానికి నీకు నోరు యెట్లావచ్చిందే?' అని అడిగింది. వరలక్ష్మి యెంత గట్టిగా అరిచినా, శూలాలలాంటి యెన్నిమాటలన్నా పద్మ నోరువిప్పలేదు. 'అగ్నిహోత్రంలాంటి పవిత్రమైన వంశంలో ఉప్పలంలాగా నీ వెక్కడపుట్టాడే?'అని గొల్లున ఏడ్చింది తల్లి 'ఈరోజు లేచీలేవడంతోనే ఎవరిమొహం చూశానో, ఈ దుర్వార్త వినవలసివచ్చింది' అని వాపోయింది. జిజియా బాయి లోపలినుంచి కూతురికి సహాయంగా వచ్చి 'వాడు

కాలం, పాడుబుద్ధులూ' అని వ్యాఖ్యానించింది. 'మీరు పెళ్ళిచేసుకోండి లేక గంగలోనే పడండి, నేను మాత్రం ఈక్షణమే ఈయింట్లోంచి వెళ్ళిపోతాను' అని వరలక్ష్మి ఏడుస్తూ అరిచింది. ధోరణి శృతిమించి రాగానపడడం గమనించి, పద్మ వెనుదిరిగి వాకిలిగుమ్మంవేపు నడిచింది. రఘుకూడా పద్మని అనుసరించాడు. 'బ్రాహ్మణజన్మయెత్తి నీ కీ పాడుబుద్ధులు యెల్లాపుట్టాయిరా?' అని రఘుని సూటిగా ప్రశ్నించిందితల్లి.'యెవరైనా నూరిపోస్తేతప్ప వాడికి స్వతహాగా ఈబుద్ధిపుట్టివుండదు' అని జిజియాబాయి వరలక్ష్మికి పక్కతాళంవేసింది. 'నాకు కొడుకే పుట్టలేదనుకుంటాను - ఒక్కకూతురే పుట్టిందనుకుంటాను' అన్నది వరలక్ష్మి. పద్మకి శరీరంపైన తేళ్ళూ, జెర్రులూ పాకినట్లయింది. 'నా కొడుకు పుట్టడంతోనే చనిపోయాడు. ఒక్కకూతురుమాత్రమే బ్రతికి వుంది' అనివరలక్ష్మి అరిచేసరికి, పద్మకళ్ళల్లో అమాంతంగా నీళ్ళు తిరిగాయి. పొంగిపొరలివస్తూవున్న దుఃఖాన్ని ఆపుకోలేక, వినకూడనివాక్యం చెవుల్లో పడ్డందుకు రెండు చేతులతో చెవులు మూసుకుంటూ, వెలుపలికి పరుగెత్తింది.

రఘు ఆమె వెనకే పరుగెత్తి, పద్మని అందుకున్నాడు. నడిసందులో రెండుచేతులతో ఆమెనుచుట్టేసి, తనచేతిరుమాలుతో ఆమెకళ్ళుఅద్దుతూ, కారుదాకా ఆమెని నడిపించుకొనివెళ్ళి, కారులో ఎక్కించాడు. తనువెళ్ళి ఆమెప్రక్కన కూచున్నాడు. ఈ వింత చోద్యాన్ని చూడడానికి సందుకిరెండువైపులావున్న గుమ్మాలముందు గుమిగూడిన అమ్మలక్కల్ని తమ దుఃఖంలో ఆ జంట పరికించ లేదు.

కారు ముందుకుసాగింది. సందుమలుపుదాటడంతోనే తాను యింకా పద్మని కౌగిలించుకొనే వున్నానన్న పరిజ్ఞానం రఘుకి కలిగింది. రఘు కౌగిలివదిలి పద్మపక్కగా కూర్చున్నాడు. దారిపొడుగునా ఇద్దరూ మౌనంగానే ఉన్నారు. ఒండొరులతో ఏఒక్కరూ మాట్లాడటానికి ప్రయత్నించలేదు. రఘు ఆ రాత్రి మహరాజ్‌గంజ్‌లోనే వుండిపోయినాడు. తెల్లవారి ఫీలుఖానాకి వచ్చిచూస్తే ఇంట్లో తనతల్లిగాని, తన అమ్మమ్మగాని కనపడలేదు. ఇంట్లోని తమభాగానికి తాళం వేసివుంది. ఇంటియజమాని తాళంచెవి తీసుకొచ్చి రఘుచేతి కిచ్చాడు.

వరలక్ష్మి మహా పట్టుదలమనిషి - తను అనుకున్నపని మొండిగా చేసితీరుతుంది. ఇంక తనతల్లి పట్నానికి తిరిగి రాదనే సందేహం కలిగి, రఘుకి ఇంటితాళం తీస్తోండగా అమాంతంగా దుఃఖం పొంగిపొరలివచ్చింది. జీవితంలో మొదటిసారిగా అతను ఏకాకిగా ఫీలయ్యాడు. నిన్నటి వరకూ, అతనికి ఇల్లంటూ ఒకఆశ్రయం ఉంది. అది నేటితో విచ్ఛిన్నమైంది - ఆశ్రయం యెగిరిపోయింది - అతనికి ఒంటరితనం మిగిలింది.

# 17

వరలక్ష్మి ప్రేమావతీపేటకి వెళ్ళిపోయిన రెండుమాసాలకు రఘు పద్మల వివాహం కాచిగూడాలోని తల్లాభవనంలో మహావైభవోపేతంగా జరిగింది. వర్ణాంతరవివాహం కావడం వల్ల పెళ్ళికి పెళ్ళికొడుకుబంధువులు యెవ్వరూ రాలేదు.

పెళ్ళికూతురుతరఫున వచ్చిన బంధువులుకూడా చాలా తక్కువే. ఎవరో కొద్దిమంది ఆప్తులు, సన్నిహితులుమాత్రం వచ్చారు. వివాహంవేదోక్తంగా ఆర్యసమాజపద్ధతిననుసరించి, జరిగింది. వర్ణాంతరవివాహాన్ని ధర్మశాస్త్రంఒప్పుకోదు. అందువల్ల ఆర్యసమాజపద్ధతిని వివాహం జరుపవలసివచ్చింది. పెళ్ళికి సుమన్, ఉమేషాలు వచ్చారు, కాని రమణ రాలేదు. అసలు రమణని పెళ్ళికి ఎవ్వరూ పిలువ లేదు. పూర్వాచార పద్ధతిననుసరించి నాలుగురోజులపెళ్ళి జరుపక ఒక్కరోజులోనే పెళ్ళి ముగించి వేశారు.

పెళ్ళి జరిగిన మరునాడు పాశ్చాత్యపద్ధతిలో పెద్ద విందుఏర్పాటుచేశారు. ఆ విందుకి ఎందరో ఉన్నతప్రభుత్వోద్యోగులు వచ్చి, వధూవరులకి ఎన్నో కానుకలు బహూకరించారు. కానుకలన్నీ పెద్దటేబుల్పైన అమర్చబడినాయి. వచ్చిన అత్తరుదానులకీ, పుస్తకాలకీ, పాన్‌దాన్‌లకీ, పన్నీరుబుడ్లకీ లెఖ్ఖలేదు. విందుకు వచ్చినవారు తమ తమ హోదాలనుబట్టి వధూవరులకి విలువైన కానుకలు బహూకరించారు. కానుకలకి ఒక టేబుల్ సరిపోకపోతే, రెండవ పెద్ద టేబుల్ దానిపక్కన అమర్చారు. కొంతసేపటికి ఆ రెండవ టేబుల్కూడా కానుకలతో నిండిపోయింది.

సరిగ్గావిందుసమయానికి వధూవరులపేరట ఒక పార్సిల్ వచ్చింది. వధూవరులు పార్సిలు అందుకొని విప్పిచూస్తే, అందులో ఒక బొమ్మ, ఉమర్ ఖయ్యాం రుబాయత్‌ల పుస్తకము—మంచి డీలక్సు ఎడిషన్ - ఉన్నాయి. బొమ్మని చూడడంతోనే వధూవరులచుట్టూ మూగిన అతిథులు

గొల్లున నవ్వారు. పద్మ సిగ్గుచే, నలుగురిముందర తల క్రిందికి వాల్చింది. సుమన్, ఆయెషాలు ఆ బొమ్మని చూచి, ఎవ్వరికీ వినపడకండా, పెళ్ళి పూర్తికాకముందే కొడుకుని కన్నావు. ఎంత జాణవే! అంటూ పద్మచెవులుకొరికారు. ఆరోజు అంతా, పద్మని గేలిచేశారు. వేధించుకుతిన్నారు. పద్మ కోపాన్ని నటించింది. బుంగమూతిపెట్టింది. కాని వాళ్ళు ఒకమానాన పద్మని వదలిపెట్టలేదు. 'ఛీ, నాదగ్గిరికి రాకండి. నాతో మాట్లాడకండి' అని విసిరికొడితే, రఘుస్నేహితం మరిగినతరువాత నీకు మా స్నేహితం ఏమి నచ్చుతుంది. మా మాటలు ఏమి నచ్చుతాయి? అని దెప్పి పొడిచారు. పద్మ ఆడినప్రతిమాటకీ వ్యాఖ్యానాలుచేసి, తప్పుడు అర్థాలు తీశారు.

బొమ్మ, ఉమర్‌ఖయ్యాం రుబాయత్‌లు ఎవరు పంపించారో తెలియదు. 'ఒక స్నేహితురాలి శుభాకాంక్షలతో' అని వ్రాసిన చీటీమాత్రం ఆ పార్సెలులో వుంది. తన కాలేజీ స్నేహితులంతా పెళ్ళికీ, విందుకీ వచ్చినట్లే. 'ఎవరబ్బా! ఈ వింత కానుక పంపించింది?' అని పద్మ ఎంతో సేపు ఆలోచించింది. ఏమీ క్లూ దొరకలేదు. రమణ కాదు కద? రమణే అయివుంటుంది. రమణ సంగతి తలచుకోవడంతోనే పద్మశరీరంపైన తేళ్ళూ, జెర్రులూ పాకాయి. 'తనకీ రమణకీ ఏం సంబంధం?' అనుకుంది. ఆ కానుకల్నీ, వాటిని పంపిన స్నేహితురాలిని మర్చిపోవడానికి శాయశక్తులా ప్రయత్నించింది. కాని అప్పుడప్పుడూ, రమణ మొహం పద్మ కళ్ళల్లో తళుక్కున మెరవడం మొదలెట్టింది. విందు తరువాత

మీరాబాయి బరోడ్కర్ పాటకచ్చేరీ జరిగింది. బరోడ్కర్ ఎంతో అందంగా పాడింది. పాటకచ్చేరీ ముగిసేసరికి, రాత్రి ఒంటిగంట దాటింది. అతిథులకి వీడ్కోలు యిచ్చి, ఆనాడు పెళ్ళివారు పక్కల మీద మేనులు వాల్చేసరికి రాత్రి రెండు గంటలయింది.

తురకలు, క్రిస్టియన్లు, హిందువులు, అగ్రవర్ణాల వారూ, అందరూ ఆనాడు విందుకు వచ్చారు. పాశ్చాత్య పద్ధతిపైన అందరూ ఏకపంక్తిని భోజనంచేశారు. వర్ణాంతర వివాహానికి వర్ణాంతరవిందు, పద్మకి ఒక శుభచిహ్నంగా కన పడింది. కూతురుపెళ్ళికి ఆంజనేయులుగారు డబ్బును ప్రవాహంలాగా ఖర్చుపెట్టాడు. అంత పెద్దపెట్టున పెళ్ళి ప్రయత్నాలు జరగడం చూచి, వివాహానికి అయిన అపార మైన ఖర్చులు చూచి రఘు ఆశ్చర్యచకితుడైనాడు. జీవి తంలో మొదటిసారిగా అతనికి శ్రీమంతం అంటే ఏమిటో తెలిసివచ్చింది. డబ్బు జీవితాన్ని ఎంత సుఖమయంచేస్తుందో అతనికి మొదటిసారిగా అర్థమైంది. పద్మకి పెట్టిన నగలకి లెఖ్ఖలేదు. తెచ్చిన ఖరీదైన చీరలకు అంతులేదు. తనకు ఎన్నో సూట్లు కుట్టించారు. ఒక గుడ్డకన్నా ఇంకొక గుడ్డ మెరుగైంది. పది సంవత్సరాలు ఏ సూటుగుడ్డలూ కొన కండా జీవితాన్ని వెళ్ళదీయవచ్చు. కాగా పెళ్ళికి ముందు ఆంజనేయులుగారు తన పేరట 50 వేల రూపాయలు బ్యాం కులో వేశారు. పద్మ పేరట ఇంకొక 50 వేలరూపాయలు వేశారు. ఈ ధనప్రవాహం చూచి, ఆంజనేయులుగారు ఎంత గొప్ప జాగీర్దారో రఘు అంచనావేయలేకపోయాడు.

కాగా తనకి హిమాయత్‌నగర్‌లో ఒక బంగళా కట్టించి యిస్తామని చెప్పారు.

ఇంత డబ్బుతో తను ఏ ఉద్యోగంకోసం ప్రయత్నించ వలసిన పని వుండదు. బ్యాంకు యిచ్చిన వడ్డీతో సుఖంగా కాలక్షేపం చేయవచ్చు. వడ్డీతో బ్రతకచూడడం, తన సంకుచితహృదయానికి నిదర్శనం కాదు కద! బీద కుటుంబంలో పుట్టి, తన హృదయం సంకుచితం కాలేదుకద? ఒక బీదవాడికి అమాంతంగా లెఖ్కలేనంత డబ్బు దొరికితే, వాడు ఆ డబ్బు ఎట్లా కాపాడుకోవడమా? అనే ఆలోచిస్తాడు. వాడు ఇరవైనాలుగు గంటలు ఆ డబ్బుని వేయి కళ్ళతో కాపలా కాస్తాడు. దానిలోనుంచి ఒక కానీకూడా ఖర్చుపెట్టడానికి యిష్టపడడు. తనకు ఆ డబ్బు దైవికంగా దొరికిందనేమాట మరిచిపోతాడు. తన సహజ ఔదార్యాన్ని కోల్పోతాడు. పిసినిగొట్టుగా మారిపోతాడు. తనుకూడా 'ఆవిధంగానే తయారవుతానా?' అనే ఆలోచన రఘుని పట్టి పీడించింది. ఏనాటికైనా బీదవాడు బీదవాడే - శ్రీమంతుడు శ్రీమంతుడే. ఎంతడబ్బు లభించినా తరతరాలుగా శ్రీమంతుడికి సంక్రమించిన ఔదార్యం, బీదవాడికి రాదు. అమాంతంగా డబ్బు లభించడంతోనే బీదవాడు సౌమ్యుడవుతాడు. అందరి చెప్పుచేతులలో మెలగుతాడు. కృతజ్ఞతతో కృంగిపోతాడు. వ్యక్తిత్వాన్ని, తద్వారా జీవితాన్నే కోల్పోతాడు. స్వతంత్రాలోచనని వదులుకుంటాడు. జీవితంలో ఎట్టిసంచలనం లేకండా మోడుగా బ్రతుకుతాడు-తనగతీ అంతేఅవుతుందా? ఏమో......ఎవరు చెప్పగలరు?..................

విందునాటిరాత్రి సుమన్ ఆయెషాలు పద్మదగ్గర పడుకున్నారు. పెద్దమంచం. ముగ్గురుపడుకున్నా ఇంకా చోటు మిగిలివుంది. మరుసటిరాత్రి కార్యం. ఆ ఒక్కరాత్రి సుమన్ ఆయెషాలు పద్మతో గడపదలచుకున్నారు. పద్మకూడా ఆ ఒక్కరాత్రి స్వాతంత్ర్యాన్ని అనుభవించదలచుకున్నది. స్నేహితులతో ముచ్చటగా ఆరాత్రి వెళ్ళబుచ్చ దలుచుకున్నది. ముగ్గురు స్నేహితులూ ఎంతోసేపు కబుర్లు చెప్పుకున్నారు. కొంతసేపు ఆయెషా సుమన్‌లు, పద్మను ఉడికించారు. పద్మకి రెండురోజులనించీ జీవితమే సంతోషంగా మారింది. ముచ్చటగా, హాయిగా గడుస్తున్నది. జీవితంలో, ఆశలు చిగిర్చి, మొగ్గలు తొడిగి, వెన్నెలలు విరియబూస్తున్నాయి. కమ్మని కలల్ని కల్పిస్తున్నాయి. సంతోషంగాని, దుఃఖంగాని మితిమీరితే నిద్రపట్టదు. రాత్రిళ్ళు నక్షత్రాలు లెఖ్ఖపెడుతో గడపవలసివస్తుంది. నగరసీమల్లో, నక్షత్రాలు కూడా కనపడవు. దివ్యహార్మ్యాల కప్పులతో ఆచ్ఛాదితమవుతాయి. నక్షత్రాలు కనపడకపోవడంతో, పద్మ బంగళా కప్పుకేసి, సీలింగ్ ఫాన్ కేసిచూస్తో కొంతకాలంగడిపింది. కాని కన్నుమూసుకున్నా నిద్రరావడంలేదు. సుమన్ పడుకున్నట్టుంది. పద్మపక్కకి ఒత్తిగిల్లి సుమన్‌కి శాలువాకప్పుతుండగా ఆయెషా కళ్ళు తెరిచింది.

‘ఏం, ఇంకా నిద్రపోలేదా?’ అని పద్మ ఆయెషాని అడిగింది.

‘లేదు, ఎంతప్రయత్నించినా నిద్రరావడంలేదు’ అంది, ఆయెషా, పద్మప్రశ్నకి జవాబుగా.

'గట్టిగా కళ్ళుమూసుకొని నిద్రపోతే, అదేవస్తుంది' అంది పద్మ ఆయెషాకి నిద్రపోవడానికి ఒకమార్గాన్ని సూచిస్తో.

'ఆ కిటుకు తెలిసినదానివి నీవెందుకు నిద్రపోలేదు?' అని ఎదురుప్రశ్న వేసింది ఆయెషా పద్మని.

ఆ ప్రశ్నకి ఇద్దరూ గొల్లున నవ్వుకున్నారు. కాసేపు మౌనంగా గడిచింది.

'పద్మా!'

'ఊఁ!'

'నేనొకసంగతి చెబుతాను వింటావా?'

'నాకు ఇష్టంలేని సంగతి కాదుగదా?'

'కొంతవరకు ఇష్టంలేని సంగతే. అయితే వినవా?'

'పోనీ నాలుగురోజులతరువాత చెప్పగూడదూ? ఈ రోజే చెప్పడం దేనికి?'

'తప్పదు, ఇప్పుడే చెప్పాలి'

'ఈ శుభసమయంలో నాకు యిష్టంగానిసంగతి చెప్పి, నామనస్సు ఎందుకు నొప్పించడం చెప్పు?'

'నీమనస్సు నొప్పించడం నాఉద్దేశం కాదు. తేలిక పరచడానికే ఈసంగతి చెబుతున్నాను'

'అయితే వినకతప్పదంటావా?'

'ఊహుఁ, తప్పదని ఇదివరకే చెప్పానుగా?'

'తప్పనిసరి అయినప్పుడు, వినకతప్పుతుందా? చెప్పు, ఏఁ చెప్పదలచుకున్నావో.

'రమణవిషయంలో మీ రుభయులూ పొరపడ్డారు'

ఏ ఉభయులో పద్యానికి అర్థమైంది.

'మేముభయులం పొరబడ్డా, లోకం పొరబడదే?'

'లోకాన్ని మోసగిస్తే లోకంకూడా పొరపడుతుంది'

'అంటే నీఉద్దేశం?'

'ఏమీలేదు. ఎవరితో అల్లరి చిల్లరగా తిరిగి రమణ చెడిపోయిందనుకున్నారో, ప్రపంచంలో ఆ వ్యక్తిఅంటూ ఒకడు లేడు'

'అంటే 'విలియమ్' అంటూ ఒకవ్యక్తి లేడంటావా?'

'లేడనకదూ. నేను చెప్పడం'

'మేరీ అనే అతనిచెల్లెల్ని నేను కళ్ళారాచూస్తే?'

'మేరీ ఉండవచ్చు. కాని విలియమ్ లేడు'

'విలియమ్‌కి ఒకతమ్ముడు ఉన్నాడా?'

'విలియమ్‌కి కాదు, మేరీకిఉన్నాడు. ఆతమ్ముడే రఘుని కలుసుకొని, తనకు విలియమ్‌అనే అన్నవున్నాడనీ,ఆఅన్నతో రమణ అల్లరిచిల్లరగా తిరుగుతున్నదనీ, దానికి ఫలితంగా విలియమ్, తనకి మొదట నిశ్చయించిన అమ్మాయిని పెళ్ళిచేసుకోవడానికి నిరాకరిస్తున్నాడనీ, కల్లబొల్లికబుర్లన్నీ చెప్పాడు. వాటినన్నిటినీ రఘు అమాయకంగా నమ్మివేశాడు.'

'నేను ఒకమాటు రమణగదికివెడితే, మేరీకలిసి, తనకి విలియమ్‌అనే ఒకఅన్న ఉన్నాడనీ, అతనితో రాత్రి అనక, పగలనక రమణ షికారుకొడుతున్నదనీ, చదువుమానేసి పూర్తిగా చెడిపోతున్నదనీ చెప్పిందే?'

'చెప్పమంటే చెప్పింది. అందులో మేరీతప్పు యేమీ లేదు'

'ఎవరు చెప్పమన్నారు? ఎందుకు చెప్పమన్నారు?'

'ఇంకెవరు, రమణే చెప్పమంది. తననిగూర్చిన పుకార్లన్నీ రమణే లేవదీసింది.'

'అయితే రమణనిగూర్చిన పుకార్లు అన్నీ, మనకాలేజీలో ఎలా వ్యాపించాయి'

'దానికి కొంతవరకు కారణం నేను. కొంత వరకు సుమన్'.

'ఈ పన్నాగంలో మీ రుభయులూ కూడా ఉన్నారన్నమాట?'

'నే నున్నాను కాని, సుమన్ లేదు'

'అంటే?'

'ఏమీలేదు. కాలేజీలో ఈ పుకార్లు వ్యాపింపజేయడానికి రమణ నన్ను ప్రోత్సహించింది. ఆసంగతి నేను సుమన్‌తో చెప్పకుండా. నేను ఆమెను ఈ పుకార్లు వ్యాపింపజేయడంలో ఉపయోగించుకున్నాను.'

'తననిగూర్చి దుష్ప్రచారం చేసుకోవడంలో రమణ ఉద్దేశం?'

'ఇంకా అర్థం కాలేదా?'

పద్మ అర్థంచేసుకోవడానికి ప్రయత్నిస్తో మౌనంవహించింది. ఆ సంగతి గమనించి ఆయెషా వివరించింది,

'రమణ ఒక కాలంలో రఘుని ప్రేమించినమాట నిజమే - కాని అది ప్రేమకాదు, ఫాన్సీ అని తెలుసుకోవడంతోనే, ఆమె రఘుకి దూరంగా ఉండడం మొదలెట్టింది. రఘుకాని, నీవుకాని ఈ సంగతి గమనించలేదు. మీ ఉభ,

యుల మన స్తత్వాలు వెలిగారానికి బంగారం అతికినట్లు సమ్మిళితం అవుతాయని తోచడంతో, రమణ మీ ఉభయుల స్నేహాన్ని ప్రోత్సహించింది. ఇట్టి పరిస్థితుల్లో తాను మీ ఉభయులతో స్నేహితంగా వుంటే, ఏనాడైనా ప్రమాదం సంభవిస్తుందని గుర్తించింది. తాను ప్రేమించక పోయినా, రఘు అప్పటికింకా రమణని ప్రేమిస్తూనే వున్నాడు. అతని హృదయంపైన బలంగా దెబ్బతీయక పోతే, ఏమాత్రం ప్రయోజనం వుండదని రమణ గ్రహించింది. తను అవినీతిపరు రాలని తప్పుడు ప్రచారం చేసింది. దానితో ఆమె విషయంలో రఘుమనస్సు విరిగింది. తత్ఫలితంగా మీ రుభయులూ సన్నిహితులైనారు. కాగా మీరుభయులూ పెళ్ళిచేసుకునేవరకూ తాను బైటపడగూడ దనుకుంది. ఇప్పుడు మీ పెళ్ళి జరిగిపోయింది. ఇదే మంచితరుణమని భావించి, నేను యథార్థ విషయాలు నీముందు పెట్టాను.'

పద్మ రమణ విషయంలో తానుచేసిన పొరపాటుకు అమితంగా పశ్చాత్తాపపడింది. తనకీ, రమణకీ మధ్య కలిగిన అభిప్రాయభేధానికి ఎంతో చింతించింది.

'నేను రమణసొత్తును హరించి కులుకుతున్నాను. కాగా ఆమెని పెళ్ళికికూడా పిలువలేదు, ఎంతటి నీచురాల్ని' అని పద్మ తనని తాను నిందించుకుంది.

'అదిగో అక్కడే పొరపడుతున్నావు. రఘు రమణ సొత్తు ఎన్నటికీ కాదు. అతన్ని ఆమె ప్రేమించడం లేదు. అతన్ని నీవు మనసారా ప్రేమించావు. అతను ఎప్పుడూ నీ సొత్తే' అని ఆమె పద్మపొరపాటును సరిదిద్దింది.

'రమణ, రఘుని ప్రేమించడంలేదన్నసంగతి నీకు బాగా తెలుసునా?' అని అడిగింది పద్మ ఆయెషాని చాలా ఆతురతతో,

'బాగా తెలుసు కనకనే, పెళ్ళిజరిగిన మరునాడే నీకీ సంగతి ధైర్యంగా చెబుతున్నాను' అంది ఆయెషా, తనకు గట్టిగా తెలిసినవిషయాన్ని పద్మముందు బల్లగుద్ది చెబుతో.

'నన్ను ఇంకొక మూడురోజుల వరకు, ఇంటినించి కదలనివ్వరు. లేకపోతే నేనే వెళ్ళేదాన్ని. రేపు ఒకమాటు నీవు సుమన్ కలిసివెళ్ళి, రమణని ఇక్కడికి తీసుకువస్తారా?' అని ఆతురతగా అడిగింది పద్మ ఆయెషాని.

'అంతతొందరపడితే లాభముండదు. నీవు ఈ మూడు రోజుల్లో ఎప్పుడైనా సమయంచూచుకొని, రఘుకు రమణ సంగతంతా చెప్పు. ఆ తరువాత మనమంతా ఆమె హాస్టల్‌కి కలిసివెళ్ళి రమణని లాక్కొద్దాం. స్నేహితుల మంతా, ఒక రోజు హాయిగా గడుపుదాం. ఈ మధ్య పెళ్ళికివచ్చిన మీా బంధువులుకూడా చాలావరకు వెళ్ళిపోతారు. అప్పుడు మీా ఉభయులకీ కూడా కొంత ఊపిరిపీల్చుకోవడానికి అవకాశ ముంటుంది' అని విశదీకరించింది ఆయెషా పద్మ ప్రశ్నకి సమాధానంగా.

'కాని రమణ పెళ్ళికిరాలేదే? అనే కొరత మిగిలి పోతుంది' అంది పద్మ సందేహిస్తో.

'ఇప్పటికే ఆ కొరత మిగిలిపోయింది. ఆ వెలితిని పూరించడం ఇక దుర్లభం కనక ఈ మూడురోజులు కూడా ఓపికపట్టడం మంచిది' అని హితవు చెప్పింది ఆయెషా పద్మకి.

స్నేహితు లిద్దరి హృదయాలూ, ఒకరి హృదయం ఇం కొకరికి విప్పకోవడంవల్ల ఎంతో తేలికపడ్డాయి. ఉభయులూ కాసేపటికి, ఒళ్ళుమరచి హాయిగా నిద్రపోయారు.

మరుసటిరాత్రి కార్యం జరిగింది. వధూవరులు ఇంద్ర భోగం అనుభవించారు. యావత్ప్రపంచాన్నే మరచి ఒకరి కౌగిలిలో ఒకరు విలీనమైనారు.

ఆ మూడురోజులూ ఆయెషా సుమన్‌లు పద్మయిం ట్లోనే ఉండిపోయినారు.

కార్యంనాటి సాయంత్రం పద్మని అలంకరిస్తోండగా 'ఈ అందానికి నా కళ్ళే చెదిరిపోతున్నాయి. ఇంక రఘు ఎల్లా భరించగలుగుతాడు' అని గేలిచేసింది ఆయెషా. దానికి పెళ్ళికూతురుచుట్టూ పోగైనవాళ్ళంతా గొల్లుమన్నారు.

మరునాడు, 'రాత్రి ఏంజరిగిందో చెప్పవూ?' అని ఆయెషా సుమన్‌లు ఆరోజంతా పద్మని వేధించుకుతిన్నారు. సిగ్గుతో పద్మకి తలనరికినంతపనైంది. కాస్త కళ్ళుమూస్తే 'పాపం రాత్రంతా నిద్రలేదుగామాలు. పోనీ కాసేపు పడుకోనీ' అని ఉడికించేవాళ్ళు. ఆ అవహేళన లన్నీ పద్మకు తాత్కాలికంగా కొంత చిరాకు కలిగించినా, మధురంగానే వున్నాయి. ఎవరో చక్కలిగింతలుపెట్టినట్లుంది.

ముచ్చటగా మూడురాత్రులూ గడిచిపోయినాయి.

బంధువు లందరూ, ఒక్కొక్కరుగా వెళ్ళిపోవడం మొదలెట్టారు.

పెళ్ళి మహావైభవంగా జరిగిందని, పెళ్ళికొచ్చినబంధు వులంతా ఏకగ్రీవంగా అభిప్రాయపడ్డారు.

తన అత్తగారూ, ముత్తువతల్లీ, రమణా, పెళ్ళికి రాక పోవడం, పద్మ ఒక కొరతగా భావించింది. అత్తగారిదగ్గరికి వెళ్ళి నమస్కారంచేసి వస్తే? బాగానేవుంటుంది. కాని ఏమని తిడుతుందో! అంతదూరం వెళ్ళి తిట్లుతినిరావడం దేనికని, పద్మ మౌనం వహించింది. 'నాకొడుకు పుట్టగానే చచ్చాడనుకుంటాను' అని వరలక్ష్మి ఆనాడు అన్న మాటలు జ్ఞాపకానికివచ్చి, పద్మ నిలువునా కంపించిపోయింది. దానితో ఆమె అత్తగారిదగ్గరికి వెళ్ళిరావడానికి సాహసించలేకపోయింది.

నాలుగవరోజున ఆంజనేయులుగారు 'నాకు పద్మ ఎంతో, నీవూ అంతే. నాకు మీరుభయులూ సమానులే. అందువల్ల నివు నీ భార్యతో ఎక్కడో దూరంగా వుండడాని కన్నా, మాకు కలిగిన కలో, అంబలో తాగుతూ మాతోనే వుండిపోవలసింద'ని రఘుని ప్రాధేయపడ్డాడు. అప్పుడు పద్మ, ఆమెషా, సుమన్ లుకూడా అక్కడే ఉన్నారు. రఘు మామగారి ప్రాధేయతకు ఏమీ సమాధానం చెప్పలేక భార్యవంక చూచాడు. అప్పుడు పద్మ 'మాకు మాత్ర మెవరున్నారు. మిమ్మల్ని వదలి మేము ఎక్కడికి వెడుతా'మని భర్తపక్షాన తండ్రికి సమాధానంచెప్పింది. ఆంజనేయులుగారు ఆ సమాధానానికి సంతృప్తిగా డ్రాయింగ్ రూములోంచి వెళ్ళిపోయారు. 'ఒక్క కూతుర్ని వశంచేసుకున్నది చాలక, వాళ్ళ యిల్లుకూడా వశంచేసుకుంటున్నావా' అని సుమన్ ఆంజనేయులుగారు వెళ్ళిపోయినతరువాత రఘుని గేలిచేసింది. 'వాళ్ళకి ఆణిముత్యంలాంటి ఒకకొడుకు ఉన్నాడు. న్యాయ

శాస్త్రరీత్యా యిల్లు అతని స్వాధీనంలో వుంటుంది కాని, నా స్వాధీనంలోకి ఎలావస్తుంది?' అని రఘు డిఫెన్సు పెట్టుకు న్నాడు. 'ఆణిముత్యాన్ని నేనేనా బావా' అని పద్మతమ్ముడు పదేళ్ళవాడు రఘుని అడిగాడు. 'నీ తల్లిదండ్రులకి నీవు ఆణి ముత్యానివి, నాకుగాదోయ్' అని రఘు కొంటెగా సమా ధానం చెప్పాడు. దానికి అందరూ గొల్లుమన్నారు.

సాయంత్రం నాలుగు గంటలకి టీ తాగి, రఘు, పద్మ, సుమన్, ఆయెమాలు కారులో రమణదగ్గరకు వెళ్ళారు. రమణ కారుచప్పుడు వినడంతోనే వెలుపలికి వచ్చింది. కారు దిగడంతోనే పద్మని గట్టిగా కావలించుకుంది. 'పెళ్ళి కాకముందే కొడుకుని కన్నావట నిజమేనా!' అని అడిగింది. 'అమ్మ, దొంగా నీవా ఆ బొమ్మని పంపించింది' అని పద్మ చిరునవ్వు నవ్వింది. 'ఏం, బావా, బాగున్నావా?' అని రమణ రఘుని పలకరించింది. 'బాగున్నాను' అని రఘు సమాధానం చెప్పడంతో, 'నీవు పద్మకళ్ళకి బాగుండవచ్చుకాని, నాకళ్ళ కేమీ బాగాలేవని' రమణ అతన్ని గేలిచేసింది. 'దృష్టి దోషం' అని విసిరికొట్టాడు రఘు రమణని. 'పెళ్ళయినప్పటి నించీ మాటలు బాగానేర్చావే' అని రఘుని రమణ ఒక విసురువిసిరింది. రమణ తన గదివేపు దారితీస్తుండగా 'నిన్ను అరెస్టుచేసి వెంటనే తీసుకురమ్మని మహారాణిగారి ఆజ్ఞ' అంది సుమన్, రమణచేతిని అందుకుంటూ. 'కాదు ప్రార్థన' అని సుమన్‌ని సరిదిద్దింది పద్మ. దానితో అందరూ గోలగా కారులో కూచున్నారు. కారుకదిలింది. ఆరోజంతా రమణ ఉత్సాహంగా పద్మయింట్లో గడిపింది. మరునాటివుదయం

హాస్టల్‌కి తిరిగి వెళ్ళింది. ఆనాడంతా, ఆకాశం నిర్మలంగా వుంది. ఎక్కడా మబ్బులు లేవు. మబ్బులన్నీ విచ్చుకున్నాయి. ఆకాశంలో సూర్యుడు దేదీప్యమానంగా వెలుగుతున్నాడు.

# 18

ఈమధ్య జపాను మణిపూర్ పైన ముట్టడిజరిపింది. ఈ ముట్టడితో యావద్భారతప్రజలు భయవిహ్వాలులైనారు. భారతనాయకులు సత్యాహింస మార్గాలను అనుసరించి, శత్రువును ఎదుర్కోవలసిందిగా ప్రజల్ని ఉద్బోధించారు. ఈ ప్రబోధంవల్ల ప్రజలకి కొంత ధైర్యంవచ్చింది. చాలావరకు సంఘటితపడ్డారు. శత్రువు భారతదేశంలోని కొన్ని ప్రాంతాలలో బాంబులు విసిరాడు. కొన్ని రేవుపట్టణాలు కొంత వరకు ఖాళీఅయినాయి. కొందరు మొండిధైర్యంచేసి నగరాల్ని ఖాళీచేయడానికి నిరాకరించారు. దేశమంతటా ఏ. ఆర్. పి. శిక్షణ ప్రారంభమైంది. 'బ్రిటన్‌స్థానాన్ని ఏ ఇతర దేశంకూడా స్వీకరించడానికి వీల్లేదు. అది భారతప్రజలు సహించరు. కాగా బ్రిటిషువారుకూడా భారతదేశంనుంచి వైదొలగవలసిందే' అని భారతనాయకులు విస్పష్టంగా ప్రకటించారు. కాని ఇంతలోకే అదృష్టవశాత్తు జపానువారు భారతదేశంనుంచి ఉపసంహరించుకున్నారు. దానితో ప్రజలలో ఒకవిధమైన సంతృప్తి ఏర్పడింది. ఈ సంఘటన జరిగిన కొన్నిరోజులకు యూరపులో యుద్ధం అంతమొందింది. ఈ వార్త భారతప్రజలకు సంతోషకారణమైంది.

కొంతకాలానికి లార్డ్ వేవెల్, భారత రాజకీయ ప్రతిష్ఠంభనని తొలగించివేసే ఉద్దేశంతో భారతనాయకులకి కొన్ని ప్రతిపాదనల్ని చేశాడు. ఈ ప్రతిపాదనల ననుసరించి వైస్రాయి, కమాండరన్ చీఫ్ పదవులు తప్ప వైస్రాయికౌన్సిలోని పదవులన్నీ భారతీయం చేయబడుతాయి. కౌన్సిల్‌లో ముస్లింలు అగ్రవర్ణాలవారు సరిసమానంగా వుంటారు. ఈసందర్భంలో వేవెల్ ప్రతిపాదనల్ని చర్చించడానికి అగ్రనాయకులు వైస్రాయిలాడ్జిలో సమావేశమైనారు. కాని చివరకి ఈ సంప్రదింపులు విఫలమైనాయి. కాని ఎందుకో త్వరలో భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధిస్తుందని ప్రజలు విశ్వసించడం మొదలుపెట్టారు. ప్రజలలో ఎంతో ఆశాభావంపొడచూపింది. ఇంతలోకే మిత్రరాజ్యాలు హిరోషిమా, నాగసాకిలపైన అణుబాంబులువిసరడంతో ద్వితీయ ప్రపంచమహాసంగ్రామం అంతమొందింది. ద్వితీయ సంగ్రామం అంతమొందడంతో ఒక్క భారతదేశంలో తప్ప ప్రపంచమంతటా ప్రజలలో ఉత్సాహోద్రేకాలు వెల్లివిరిశాయి. 'కాని ఏ ఆశయాలకోసమైతే మీరు పోరాడారో, ఆ ఆశయాల్నే మీరు మాకు వర్తింపజేయనంతవరకు మీరు యుద్ధంలో గెలవడం మాకు సంతోషదాయకమైనవిషయం ఎన్నటికీ కాజాల'దని భారతనాయకులు మిత్రరాజ్యాలకు విస్పష్టపరిచారు. ఇంతలోకే సాధారణ ఎన్నికలు జరిగాయి కాంగ్రెస్ ఎన్నికల్లో అఖండ విజయాన్ని సాధించింది. ప్రజలలో కాంగ్రెస్‌కు గల పలుకుబడిని చూచి బ్రిటిష్‌ప్రభుత్వానికి అమితమైన ఆశ్చర్యం కలిగింది.

ఎన్నికల అనంతరం భారతీయనావికులు ప్రభుత్వంపైన తిరుగుబాటు జరిపారు. కారణం భారతనావికుల్ని బ్రిటిష్ నావికులతో సమానంగా చూడకపోవడమే. ఇది భారతీయ నావికులకు ఆగ్రహకారణమయింది. ఈతిరుగుబాటు ఒకరేవు నుంచి ఇంకొక రేవుకు ప్రాకింది. బ్రిటిష్‌ప్రభుత్వం భారతీయ నావికులపైన కాల్పులుజరిపింది. ఎన్నోవిధాల ఈ తిరుగుబాటును అణచివేయడానికి చూచింది. కాని ఏమాత్రంలాభంలేక పోయింది. విప్లవవీచికలు ఇతర సైనిక స్థావరాల్లో వీచడం మొదలెట్టాయి. భారతనావికులపట్ల సానుభూతి సూచకంగా భారత వైమానికదళాలు సమ్మెకట్టాయి. పరిస్థితులు పూర్తిగా విషమిస్తున్నట్లుకనపడ్డాయి. దానితో రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యపుపునాదులు కదిలాయి. బ్రిటిషుప్రభుత్వం ఎక్కువ కాలం భారతదేశంలో మనజాలదని విస్పష్టపడింది. బ్రిటిషు ప్రభుత్వం త్వరలో భారతీయులతో కాళ్ళబేరానికి రాకతప్ప దని తోచింది. సర్దార్ పటేల్ జోక్యం కలుగజేసుకోవడం మూలాన భారతీయనావికుల తిరుగుబాటు అంతమొందింది. దానితో బ్రిటిషుప్రభుత్వానికి ఒక పెద్దగండం తప్పిపోయింది.

భారతదేశానికి బ్రిటిషు క్యాబినెట్ మిషన్ రాకతో భారతస్వాతంత్ర్యం కనుచూపుమేరలోకి వచ్చింది. సర్ స్టాఫర్డ్ క్రిప్సు, ఏ వి. అలెగ్జాండర్, లార్డ్ పెథిక్ లారెన్సులు ఈ క్యాబినెట్ మిషన్ సభ్యులు. వీరు భారతదేశానికి విచ్చేసి వివిధపార్టీలనాయకులతో సంప్రదింపులు జరిపారు. భారతీయులు రాజ్యాంగపరిషత్తును ఏర్పరచుకొని తమ భవిష్యత్ రాజ్యాంగాన్ని తాము నిర్ణయించుకోవచ్చునని వారు సూచిం

చారు. ఈలోగా ఒక తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పరచి దానిలో చేరవలసిందిగా వివిధపార్టీలను కోరారు. కాంగ్రెస్ తాత్కాలికప్రభుత్వంలో చేరడానికి అంగీకరించింది. ఆ తరువాత రాజ్యాంగ పరిషత్తుకు ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికల్లో తిరిగి కాంగ్రెస్ అఖండవిజయాన్ని సాధించింది. కాగా రాజ్యాంగవిషయాలు బాగా తెలిసిన కొందరు నిపుణుల్ని, కాంగ్రెస్ తన పక్షాన అభ్యర్థులుగా నిలబెట్టి వారిని గెలిపించింది. రాజ్యాంగపరిషత్తుకు ముస్లింలీగుకూడా తన సభ్యుల్ని నిలబెట్టింది. ముస్లింస్థానాల్ని చాలావరకు ఆక్రమించింది. కాని ముస్లింలీగు మాత్రం మొదట తాత్కాలిక ప్రభుత్వంలో చేరలేదు. దానితో తాత్కాలిక ప్రభుత్వాన్ని నడిపే బాధ్యత పూర్తిగా కాంగ్రెస్‌పైన పడింది. కాంగ్రెస్ తాత్కాలిక ప్రభుత్వానికి తన అభ్యర్థుల్ని సూచించింది. కాంగ్రెసు సూచించిన అభ్యర్థులతో తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడింది.

పాకిస్తాన్ లభించనందుకు అసమ్మతిసూచకంగా, లీగ్ ప్రత్యక్షచర్యాదినాన్ని జరుపడానికి నిశ్చయించింది. ఆ ప్రత్యక్ష చర్య ఏ రూపం దాలుస్తుందో ఎవ్వరికీ తెలియదు. కాంగ్రెసు తాత్కాలిక ప్రభుత్వంలో పదవీస్వీకారం చేసేరోజున లీగ్ ప్రత్యక్షచర్య మతకలహాలరూపేణా ప్రారంభించింది. ఆరోజున బొంబాయి, కలకత్తా, ఢాకాలలో మతకలహాలు పెద్దపెట్టున ప్రారంభమైనాయి. ఈ మతకలహాలు అస్సాం, బీహార్‌లకు వ్యాపించాయి. ఒకవేపున మతకలహాల్ని ప్రోత్సహిస్తోనే లీగ్ ఇంకొకవేపున తాత్కాలిక ప్రభుత్వంలో చేరింది.

ప్రభుత్వంలో చేరి యిబ్బందులు కలుగజేయడమే దాని ప్రధానాశయం. లీగ్ తాత్కాలిక ప్రభుత్వంలో బాధ్యతాయుత పదవుల్ని స్వీకరించినా మతకలహాలు సమసిపోలేదు. కాగా అవి భయంకర స్వరూపాన్ని దాల్చాయి. భారత దేశాన్ని విభజించి పాకిస్తాన్ని సృష్టించకపోతే, ఈ మత కలహాల్ని అంతమొందించడం అసాధ్యమని లీగ్ వాదించింది. ఈ అరాచకపరిస్థితుల్ని అదుపులో పెట్టడం బ్రిటిషు ప్రభుత్వానికి అసాధ్యంగాతోచింది. చేసేదేమీలేక, బ్రిటిష్ ప్రభుత్వం లండన్లో ఒక మహాసభని సమావేశపరిచింది. లార్డ్ వేవెల్ నాయకత్వంక్రింద కాంగ్రెసు లీగు నాయకులు ఈ సమావేశానికి వెళ్ళారు. చివరకి లండన్ సమావేశంకూడా విఫలమంతమైంది. బ్రిటిష్ ప్రభుత్వం రాజ్యాంగపరిషత్తులోని వివిధ పార్టీల సహకారాన్ని ఈ మహాసభద్వారా పొందలేకపోయింది. ఇంతలోనే రాజ్యాంగపరిషత్తు సమావేశాలు ప్రారంభమైనాయి. లీగు ఈ సమావేశాల్ని బహిష్కరించింది. ఆ తరువాత లార్డ్ మౌంటుబాటన్, చివరి రాజప్రతినిధిగా భారతదేశానికి విచ్చేశారు. అతని ఆగమనానికి పూర్వం పంజాబులో ప్రారంభమైన మతకలహాలు, భారతదేశ విభజన వరకు కొనసాగుతూనే వచ్చాయి. చివరకి భారత దేశాన్ని చీల్చి పాకిస్తాన్ సృష్టింపబడింది. 1947 ఆగస్టు 15 వ తేదీన భారతదేశం, పాకిస్తానులకు స్వాతంత్ర్యం సిద్ధించింది.

భారతదేశంలో ఇన్ని మహత్తర సంఘటనలు జరిగినా హైద్రాబాద్కు చివరకు చీమకుట్టినట్లైనా లేదు. అది ఈ

మధ్య తన స్వతంత్ర ప్రతిపత్తినిగూర్చి కమ్మని కలలుకంటూ వచ్చింది. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో అంతర్జాతీయ న్యాయశాస్త్ర దృష్ట్యా, హైదరాబాద్‌కు ఏవిధంగా స్వతంత్రప్రతిపత్తి గలదో, ప్రత్యేక పరిశోధనలు గావించబడ్డాయి. ఆ బూటకపు పరిశోధనలన్నీ విద్యార్థులకు బోధించబడ్డాయి. ఆ పరిశోధనలను విద్యార్థులెవ్వరూ ఎదిరించడానికి వీలులేదు. విశ్వవిద్యాలయపు న్యాయశాఖ ముఖ్యంగా ఈ పరిశోధనలను జరిపింది. రఘు ఈమధ్యనే 'లా' కళాశాలలో చేరడం వల్ల, అతను హైద్రాబాద్ స్వాతంత్ర్యప్రతిపత్తికి సంబంధించిన పాఠాలన్నీ ఎంత యిష్టంలేకపోయినా దిగమ్రింగాల్సి వచ్చింది. పద్మ ఎం. ఏ. లో చేరడంవల్ల 'ఆమె పూర్వపుణ్య విశేషమా?' అన్నట్లు, ఆమెకు ఈ పాఠాలన్నీ నేర్చుకునేగతిపట్టలేదు. రఘుకి ఈ దారుణానికి వ్యతిరేకంగా తిరుగుబాటు జరపడానికి తగిన సాహసం లేదు. తక్కిన విద్యార్థులంతా ఆ దారుణాన్ని మౌనంగా దిగమ్రింగుతూవుంటే, తను ఒక్కడు ఎదురుతిరిగి ఏమి సాధించగలడు? అందువల్ల మెదలకుండా ఊరుకున్నాడు.

హైద్రాబాద్‌లో ఖాసిం రజ్వీ ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంస్థకు అధ్యక్షుడైనాడు. అధ్యక్షపీఠం అలంకరించడంతోనే, ఇత్తెహాదుల్ సభ్యులకి సైనికతత్వం బోధించాడు. 'రజాకార్ల' పేరట ఒక సైనికదళాన్ని సంస్థ అంతర్భాగంగా సృష్టించాడు. హైద్రాబాద్‌లోవుండి హిట్లర్, ముసోలినీలు మరణించినా ఏకలవ్యుడుగా, వారి సైనిక తత్వాన్ని జీర్ణించుకున్నాడు. 'బ్లాక్ షర్ట్సు' వంటి ఒకఉద్యమాన్ని 'రజాకార్ల'

పేరట లేవదీశాడు. రజాకార్లంటే స్వచ్ఛంద సేవకులు. వీళ్ళు ప్రజలకు చేసే స్వచ్ఛంద సేవ వర్ణనాతీతం. ప్రజలను లూటీ చేయడం, దోపిడీచేయడం, గృహాలకి నిప్పంటించడం, మత విద్వేషాల్ని పురికొల్పడం, ముస్లింల ఆధిక్యాన్ని వేనోళ్ళ చాటడం మొదలుగాగల పనులు చేయడంలో ఈ స్వచ్ఛంద సేవకులు కడు సమర్థులు. ఈ రజాకార్లు హైద్రాబాద్‌కు చేసినసేవల్ని, హైద్రాబాదు చరిత్రలో రక్తాక్షరాలలో వ్రాయవచ్చు. ఎందరో అమాయకుల్ని ఈ రజాకార్లు చిత్ర వధచేశారు. ఎందరో మానవతులమానాన్నితీశారు. ఎన్నో గృహాల్ని తగులబెట్టారు. వీరు జరిపిన అమానుష చర్యలకీ ఘాతుక కృత్యాలకీ లెక్ఖలేదు. కలకాలంనుంచీ ఎంతో సఖ్యతతో మెలగుతూ వచ్చిన హిందువులనీ, ముస్లింలనీ చీల దీశారు. వారిలో మతవిద్వేషాల్ని పురికొల్పారు. మతం పేరిట సంస్థానంలో రక్తపునదులుప్రవహింపజేశారు. సాయుధ పాణులై సంస్థానమంతటా సైనికవిన్యాసాలు జరిపి, ప్రజల్ని భయవిహ్వలుల్ని చేశారు. రజాకార్ల స్వేచ్ఛావిహారాన్ని చూచి, హైద్రాబాదు ప్రధాని సర్ మీర్జా ఇస్మాయిల్ వారిని అదుపులో పెట్టవలసిందిగా నిజాంకు విన్నవిం చాడు. నిజాం అతనిహితవును పెడచెవినిపెట్టాడు. సర్ మీర్జా భారతదేశంలో హైద్రాబాదును చేర్చవలసిందిగా నిజాంకు మరీ మరీ చెప్పాడు. నిజాంనవాబు ఆయనసలహాలను త్రోసి పుచ్చడంతో శలవుపై బెంగుళూరు వెళ్ళి అక్కడినించి తన ప్రధానిపదవికి రాజీనామా యిచ్చాడు. నిజాం అతని రాజీ

నామా అంగీకరించి ఛత్తారీ నవాబుని ప్రధానిగా నియమించాడు.

మొదటినించీ భారతసంస్థానాలకీ, బ్రిటిషుప్రభుత్వానికీ ఒడంబడికలరూపేణా ప్రత్యేక సంబంధం వుంది. బ్రిటిషుప్రభుత్వం భారతదేశంనించి వైదొలగిపోవడంతో ఆ సంబంధం విచ్ఛిన్నమైపోయింది. బ్రిటిషు ప్రభుత్వ పారమౌంటసీ అంతమొందడంతో, సంస్థానాలకి సంబంధించినంతవరకూ, ఒక ప్రత్యేక పరిస్థితి ఏర్పడింది. ఈ పరిస్థితిని ఎదుర్కోడానికై భారతప్రభుత్వం సర్దార్ పటేల్ ఆధీనంలో, ఒక సంస్థానశాఖని స్థాపించింది. లార్డ్ మౌంటుబాటను చివరి రాజప్రతినిధిగా భౌగోళిక సామీప్యాన్నీ, ప్రజానివృత్తినీ దృష్టిలో వుంచుకొని, ఏదో ఒకదేశంలో చేరవలసిందిగా సంస్థానాధీశులకు హితవు చెప్పాడు. భారతదేశం, పాకిస్తానులు బ్రిటిషుప్రభుతకి ఇండియాలో ప్రాతినిధ్యం వహిస్తున్నాయనికూడా విస్పష్టపరచాడు. 1947 ఆగస్టు 15 వ తేదీనాటికి మూడు సంస్థానాలు తప్ప, తక్కినవన్నీ 'ఇన్స్ట్రుమెంట్ ఆఫ్ ఆక్సెషన్' పైన సంతకాలుచేసి భారతదేశంలో చేరాయి. అంతవరకు భారతదేశంలో చేరని సంస్థానాలలో హైద్రాబాదు ఒకటి. మిగిలిన రెండు సంస్థానాలు జునాఘడ్, కాశ్మీరు. జునాఘడ్ సమస్య త్వరలోనే తృప్తికరంగా పరిష్కారం పొందింది.

హైదరాబాద్ చుట్టూ భారతదేశంతో చుట్టబడి వుంది. కాగా సంస్థానంలో నూటికి పదిమంది ముస్లింలు మాత్రమే. భౌగోళిక సామీప్యాన్నిబట్టిగా, నిప్రజానివృత్తిని

బట్టిగానీ చూస్తే హైద్రాబాద్ సహజంగా భారతదేశంలో చేరవలసింది. కాని రజాకార్ల ప్రోద్బలంతో హైద్రాబాద్ ప్రభుత్వం, భారతదేశంలో సంస్థానాన్ని చేర్చక, అనవసర కాలయాపన జరుపుతూవచ్చింది. భారతజాతీయప్రభుత్వం హైద్రాబాద్ప్రభుత్వంతో ఎంతో న్యాయంగా, ఎంతో మర్యాదగా ప్రవర్తించింది. భారతప్రభుత్వంమర్యాదను దానిబలహీనతగా ఎంచి, రజాకార్ల నాయకుడు ఖాసిం రంజ్వీ హైద్రాబాద్ ఒక ముస్లింరాజ్యమనీ, అది చిరకాలం నించీ స్వతంత్రంగా వుంటూవచ్చిందనీ, హైద్రాబాద్ స్వతంత్రసేనలు ఢిల్లీపైన దండెత్తి "రెడ్ఫోర్ట్" పైన ఆసఫ్ జాహిపతాకాన్ని (నిజాంవంశానికి సంబంధించిన పతాకాన్ని) ఎగురవేయగలవనీ, అప్పుడు బంగాళాఖాతపు పవిత్ర జలాలు వినమ్రతతో నిజాంపాదపద్మాల్ని కడగగలవనీ ప్రగల్భాలు పలికాడు. భారతదేశానికి వ్యతిరేకంగా వైమానిక, నౌకా, పదాతిదళాలు సమాయత్తంచేయబడగలవని, సుదీర్ఘ ప్రకటనచేశాడు. ఈ ప్రగల్భాలు, సుదీర్ఘప్రకటనలు, రజాకార్ల సైనికవిన్యాసాలు ప్రజల్ని భయవిహ్వాలులను గావించాయి. 'రజాకార్ల దౌర్జన్యాన్నుంచి హైద్రాబాద్కుఎప్పుడు విముక్తి కలుగుతుందా ?" అని ప్రజలు ఆవేదనపడ్డారు. ఏనాటికైనా తమకష్టాలు ఈడేరితే, భారతప్రభుత్వ సహకారంతో ఈడేరవలసిందేనని విశ్వసించారు. తమదృష్టిని భారతప్రభుత్వంపైన నిలిపారు. తమకష్టాలు గట్టెక్కేరోజును త్వరితపరచవలసిందిగ భగవంతుని ప్రార్థించారు.

1947 ఆగస్టు 14 వ తేదీ రాత్రి 12 గంటలకు ఢిల్లీలో అధికారప్రదానోత్సవం జరిగింది. ఆనాటి రాత్రి భారతరాజ్యాంగపరిషత్తు సమావేశమై, బ్రిటిషుప్రభుత్వం దగ్గరనుంచి పరిపాలనాధికారాన్ని పరిగ్రహించింది. ఆక్షణం నించీ, భారతావని సర్వస్వతంత్రరాజ్యంగా రూపొందింది. ఆనాడు భారతప్రజలకు గొప్పపండుగ. యావద్భారతదేశం అమితోత్సాహంతో భారతస్వాతంత్ర్యోత్సవాన్ని జరుపు కుంది. ఆనాడు భారతప్రజల ఆనందోత్సాహాలకు ఒక పరిధి లేదు. భారతదేశంలో ఆబాలగోపాలం ఆనాడు ఆనందడోలి కలలో ఊగారు. 150 సంవత్సరాల బ్రిటిషుపరిపాలన అంత మొందినందుకు భగవంతునికి కృతజ్ఞతాంజలులు ఘటించారు.

ఆల్ ఇండియా రేడియో 14 వ తేదీ రాత్రి ఏర్పాటుచేసిన అధికారప్రదానోత్సవానికి సంబంధించిన ప్రత్యేక ప్రసారాల్ని హైద్రాబాద్ ప్రజలు భక్తిశ్రద్ధలతో విన్నారు. తమ నాయకుల కంఠాలు రేడియోలో విని, సంతోషాతిశయంతో ఉప్పొంగిపోయారు. మరునాడు పెద్ద పెట్టున పండుగ జరుపుకోవడానికి సమాయత్తపడ్డారు. తెల్ల వారి కరకర ప్రొద్దుపొడుస్తుండగా హైద్రాబాద్ సంస్థానంలో అనేకమంది ప్రజలు భారత త్రివర్ణపతాకాన్ని తమతమ యిండ్లపైన భక్తిపురస్సరంగా ఎగురవేశారు. త్రివర్ణపతా కాన్ని ఎగురవేసిన కొద్దిసేపటికి, హైద్రాబాద్ పోలీసులు, అందులో ముఖ్యంగా జిల్లాల్లో పతాకాన్ని తొలగించివేయ వలసిందిగా ఆదేశించారు. కొన్నిచోట్ల అసలు భారతపతా కాన్నే ఎగురవేయనీయలేదు. ఆ పతాకాన్ని ఎగురవేస్తే,

మతకలహాలు జరుగగలవని భయపెట్టారు. రాజధానీనగరంలో కొందరు ఉత్సాహవంతులైన యువకులు తమతమ వాహనాలపైన జాతీయపతాకాన్ని ఆనాడు ఎగురవేసుకుంటే వారిని అరెస్టుచేశారు. యావద్భారతదేశంలో రోజులతరబడి భారత స్వాతంత్ర్యోత్సవాలు జరిగాయి. కాని హైదరాబాద్ సంస్థానంలో ముచ్చటగా ఒకరోజైనా జరుపుకోవడానికి ప్రజలు నోచుకోలేదు. భారతజాతీయపతాకాన్ని విదేశపుజెండాగా హైదరాబాద్ ప్రభుత్వం ఆనాడు పరిగణించింది. 15 వ తేదీ నాడు ప్రజలనెవ్వరినీ పతాకవందనోత్సవాన్ని జరుపుకోనివ్వలేదు. స్వాతంత్ర్యదినోత్సవం జరిగిన కొన్ని రోజులకు ప్రజలు జాతీయపతాకాన్ని ఎగురవేయదలిస్తేదానితోపాటుఆసఫ్‌జాహి జెండానికూడా ఎగురవేయడం అవసరమని ఉత్తర్వులు జారీ చేసింది. ఆసఫ్‌జాహి జండాని ఎగురవేయడానికి ప్రజలెలా అంగీకరిస్తారు? ఆ జండాని ఎగురవేయడం ఇష్టంలేక, ప్రజలు జాతీయపతాకాన్నికూడా విధిలేక ఎగురవేయడం మానుకున్నారు. రజాకార్లు మాత్రం ఆగస్టు 15 వ తేదీన సంస్థానమంతటా ఆసఫ్‌జాహి పతాకాన్ని ఎగురవేసి, హైదరాబాద్ స్వాతంత్ర్యోత్సవాన్ని జరుపుకున్నారు. ఆనాడు పెద్దపెట్టున సైనికవిన్యాసాలు జరిపారు. జాతీయ ముస్లింలుగానీ, హిందువులుగానీ, తదితరమతాలవారుగాని—ఒక్క రజాకార్లుతప్ప హైదరాబాద్ స్వాతంత్ర్య దినోత్సవంలో పాల్గొనలేదు.

భారత స్వాతంత్ర్యానికి పూర్వమే భారతతాత్కాలిక ప్రభుత్వం హైదరాబాదును భారతదేశంలోచేర్చి, విదేశాంగ వ్యవహారాలు, రక్షణ, రాకపోకల సౌకర్యాల్ని తమపరం

చేయవలసిందిగా నిజాంను కోరింది. నిజాం ఎటూ తేల్చక, వృధా కాలయాపనచేస్తూ వచ్చాడు.

భారతస్వాతంత్ర్యానంతరం హైద్రాబాదు ప్రధాని ఛత్తారీ నవాబు, రాజ్యాంగవిషయాలకు సంబంధించిన నిజాం సలహాదారుడు సర్ వాల్టర్ మాంక్టన్, సర్ సుల్తాన్ అహమద్‌లు కలిసి ఒకరాయబారవర్గరూపంలో ఢిల్లీకి వెళ్ళి, భారతప్రభుత్వంతో సంప్రదింపులు జరిపారు. ఒక సంవత్సరానికిగాను భారతప్రభుత్వంతో ఒక స్టాండ్‌స్టిల్ అగ్రిమెంటు కుదుర్చుకొని, ఆఒడంబడిక చిత్తు ప్రతిని హైద్రాబాద్‌కు నిజాం సంతకం కోసం తీసుకువచ్చారు. ఆ చిత్తు ఒడంబడికపైన సంతకం చేస్తానని మొదట నిజాం వాగ్దానంచేసి, ఆ తరువాత తన వాగ్దానాన్ని ఉపసంహరించుకున్నాడు. మరునాటి ఉదయం, రాయబారవర్గ సభ్యులు, చిత్తు ఒడంబడికను నిజాం సంతకం కోసం, కింగ్‌కోఠీకి తీసుకువెళ్ళాల్సి వుంది.

ఆ మరునాటి తెల్లవారుజామున రజాకార్లు ఛత్తారీ నవాబు, సర్ వాల్టర్ మాంక్టన్, సర్ సుల్తాను అహమద్‌ల నివేశస్థలాల్ని చుట్టుముట్టారు. వారిని కింగ్‌కోఠీకి వెళ్ళకండా అడ్డగించారు. ఛత్తారీ నవాబు మీసాల్ని పీకివేశారు. మరుసటిరోజుకుగాని ఈ గందరగోళం తగ్గలేదు. ఆరోజున తిరిగి రాయబారవర్గసభ్యులు చిత్తు ఒడంబడికను నిజాం దగ్గరికి తీసుకువెళ్ళారు. నిజాం దానిపైన సంతకంచేయడానికి నిరాకరించాడు. దానితో ఛత్తారీనవాబు, సర్ వాల్టర్ మాంక్టన్, సర్ సుల్తాన్ అహమద్‌లు రాయబారవర్గ సభ్యత్వానికి రాజీనామాలు ఇచ్చారు. ఆ తరువాత ఇత్తె

హాద్ ముసల్‌మీన్‌సభ్యులతో కూడుకొనిన ఒక రాయబార వర్గం ఏర్పర్చబడింది.

ఈ కొత్త రాయబారవర్గానికి నవాబు మోయిన్ నవాజుజంగ్ నాయకత్వం వహించాడు. భారతప్రభుత్వం హైద్రాబాదులో ఇటీవల జరిగిన సంఘటనల్ని కూడా లక్ష్యం చేయకండా, కొత్త రాయబారవర్గంతో, కడు ఓపికతో తిరిగి సంప్రదింపులు ప్రారంభించింది. భారత గవర్నర్ జనరల్ లార్డ్ మౌంటుబాటెన్ సంస్థాన రాయబారవర్గంతో కడు చాకచక్యంతో మెలిగాడని వినికిడి. ఈ సంప్రదింపుల ఫలితంగా నవాబు మోయిన్ నవాజుజంగ్ ఒక సంవత్సరంపాటు, విదేశాంగవ్యవహారాలు, రక్షణ, రాకపోకల సౌకర్యాలు, భారతప్రభుత్వానికి అప్పగించడానికి అంగీకరించాడు. నిజాం ఏమాత్రం కాలయాపన జరుపకుండా, కొత్తగా కుదిరిన ఒడంబడికపైన వెంటనే సంతకంచేశాడు. హైద్రాబాదుకు సంబంధించిన సంప్రదింపులు ఫలప్రదమైనందుకు ప్రజలు ఎంతో సంతసించారు. భారత ప్రభుత్వాన్ని చెయ్యెత్తి ఆశీర్వదించారు.

ఛత్తారీ నవాబు తన ప్రధానిపదవికి రాజీనామా నిచ్చాడు. దానితో మీర్ లాయఖ్ అలీ హైద్రాబాదు ప్రధాని అయినాడు. ఇతను ఇత్తెహాద్ సభ్యుల అనుయాయి. ఇత్తెహాద్‌సభ్యుల ఒత్తిడివల్ల నిజాం నవాబు ఇతనికి ప్రధాని పదవిని ప్రసాదించాడనివినికిడి. పింగళి వేంకటరామా రెడ్డి ఈ ఇత్తెహాద్ ప్రభుత్వంలో ఉపప్రధాని అయినాడు. మీర్ లాయఖ్ అలీ కార్యనర్గసభ (క్యాబినెట్) పదవీస్వీకారం

చేయడంతోనే, రజాకార్లకి ఆడించేదేఆటగా, పాడించేదేపాటగా పరిణమించింది. రజాకార్లు సంస్థానమంతటా విచ్చలవిడిగా, విధ్వంసకచర్యలు కొనసాగిస్తూవచ్చారు. లాయఖ్ ఆలీ ప్రభుత్వం పదవీస్వీకారం చేయడంతోనే పాకిస్తాను ప్రభుత్వానికి పెద్ద మొత్తంలో ఋణం యిచ్చింది. భారతప్రభుత్వానికి వ్యతిరేకంగా ఒక కరెన్సి ఆర్డినెన్సుని జారీచేసింది. ఈ ఆర్డినెన్స్ భారతప్రభుత్వానికి ఆగ్రహకారణమైంది. వారు, హైద్రాబాదుని దారిలోపెట్టడానికి మార్గాంతరమేమీకనబడక, హైద్రాబాదుకి వ్యతిరేకంగా ఆర్థికఆంక్షల్ని విధించారు. కాని వారు ఆర్థికఆంక్షల్ని పూర్తిగా అమలు జరుపలేదు. ఒక్క మందులసరఫరా మాత్రం నిషేధించారు. ఆహారపదార్థాలు భారతదేశంనించి హైద్రాబాదుకు విరివిగా వస్తూనే ఉన్నాయి.

హైద్రాబాదుప్రభుత్వం లండనులోని ఆధునిక యుద్ధపరికరాల్ని కొంటున్నదని, ఈమధ్య హైద్రాబాదుకు వార్తలు వచ్చాయి. దీనికి నిదర్శనంగా సిడ్నీ కాటన్ అనే ఆస్ట్రేలియా యువకుడు కరాచీమీదుగా విమానంలో లండను నుంచి హైద్రాబాదుకు ఆయుధాలు చేరవేస్తూవచ్చాడు. ఈ విషమపరిస్థితుల్లో, స్టాండ్‌స్టిల్ ఒడంబడిక స్థానే ఒక కొత్త ఒడంబడికను కుదుర్చుకోవడానికై డిల్లీలో ప్రారంభమైన సంప్రదింపులు విఫలమైనాయి. లార్డ్ మౌంటు బాటను భారతదేశంనించి వెళ్ళిపోయేముందు, తన ప్రత్యేక ప్రతినిధి అలెన్ క్యాంపుబెల్‌జాన్‌సన్‌ని హైద్రాబాదుకు పంపించి అతనిద్వారా ఢిల్లీకి సంప్రదింపులకై రావలసిందిగా

నిజాంను కోరాడు. లార్డ్ మౌంటుబాటన్ ఒక మాసం లోపుగా హైదరాబాదుసమస్యని ఏవిధంగా పరిష్కారం చేయగలుగుతాడనీ, యూరపుకి సంబంధించినంతవరకు కాని స్టిట్యూషనల్ మోనార్కీ ప్రయోజనకారిఅవుతేకావచ్చుకాని ప్రాచ్యదేశాలలో అది అర్థరహితమైనదని, నిజాం అలెన్ క్యాంపుబెల్ జాన్సన్‌కి పెంకెగా సమాధానం చెప్పాడు. ఆ తరువాత భారతప్రభుత్వం వెంటనే రజాకార్లసంస్థని నిషేధించి, స్టాండ్ స్టిల్ అగ్రిమెంటుక్రింద హైదరాబాదు నించి ఉపసంహరించుకోబడిన భారతసేనలకి తిరిగి సంస్థానంలో ప్రవేశించడానికి సౌకర్యాల్ని కలుగజేయవలసిందిగా నిజాంను కోరింది. భారతప్రభుత్వంవారి ఈ కోరికను నిజాం పెడచెవిని పెట్టాడు. ఈమధ్య రజాకార్ల అవినీతి మరీ పెచ్చుపెరిగింది. భారతదేశపు సరిహద్దులపైన ముట్టడులు జరపడం ప్రారంభించారు. దీనితో ప్రజల్లో హాహాకారాలు బయల్దేరాయి. ఒక్క సంస్థానప్రజలే కాకుండా పొరుగున వున్న భారత రాష్ట్రాల ప్రజలుకూడా రజాకార్ దుండగీడుల అమానుష కృత్యాలకి గురికావలసివచ్చింది. రజాకార్ల పాపం రోజు రోజుకు పండడం మొదలుపెట్టింది.

## 19

సంస్థానంలో రోజురోజూ పరిస్థితులు విషమించడం గమనించి స్టేటుకాంగ్రెసు నిజాంప్రభుత్వానికి వ్యతిరేకంగా ఒక మహత్తర ఉద్యమాన్ని లేవదీయడానికి సంకల్పించింది. 'ఉద్యమాన్ని సంస్థానంనుంచి నడపడమా? లేక పొరుగున

వున్న భారతీయరాష్ట్రాలనించి నడపడమా ?' అనే సమస్య స్టేటుకాంగ్రెస్ నాయకుల్ని ఎదుర్కొన్నది. సంస్థానంనుంచి నడపడమే సముచితమని కొందరు అభిప్రాయపడ్డారు. ఉద్యమాన్ని సంస్థానంనుంచి నడిపితే అది విజయవంతం కావడం దుర్ఘటమనీ, పొరుగురాష్ట్రాలనుంచి నడిపితే, ఉద్యమం ఫలప్రదం కావడానికి ఎన్నో అవకాశాలు ఉన్నాయనీ, కాగా ఉద్యమంపట్ల పొరుగురాష్ట్రాలప్రజల సహాయ సానుభూతుల్ని చూరగొనవచ్చుననీ, వారికొందరు అభిప్రాయపడినారు. తత్ఫలితంగా కొందరు నాయకులు సంస్థానంలోవుండి ఉద్యమాన్ని నడుపడానికీ, మరికొందరు సరిహద్దులకు వెళ్ళి అక్కడినించి ఉద్యమాన్ని కొనసాగించడానికీ నిశ్చయించుకున్నారు. వెంటనే అగ్రనాయకులు స్టేటు కాంగ్రెస్ చర్యాసంఘాన్ని స్థాపించారు.

సంస్థానప్రజలలో బహుళ సంఖ్యాకులు ఆంధ్రులు. జనాభానుబట్టి ఆ తరువాత మహారాష్ట్రులు, కన్నడులూ వస్తారు. ఆంధ్రులు బెజవాడలో, ఒక సత్యాగ్రహశిబిరాన్ని స్థాపించారు. మహారాష్ట్రులు, కన్నడులూ బొంబాయి, మైసూర్ సరిహద్దుల్లో శిబిరాల్ని ఏర్పాటు చేశారు. ఆంధ్రులు తమ ఉద్యమాన్ని విరివిగా ప్రచారంచేయడానికై, కొన్ని పత్రికలుకూడా నడిపారు. సత్యాగ్రహశిబిరాలనుంచి రోజూ వందలాది సత్యాగ్రహులు సంస్థానంలో ప్రవేశించి సత్యాగ్రహంచేయడం మొదలుపెట్టారు. ఇదీ స్టేటుకాంగ్రెస్ ఉద్యమ ప్రథమదశ.

ఈ దశలో ఖమ్మం, వరంగల్లు, హైద్రాబాద్ నగరాలలో వందలాది సత్యాగ్రహులు అరెస్టుకావడం మొదలెట్టారు. ఈవిధంగా సత్యాగ్రహోద్యమం ఎన్నోరోజులు సాగింది. రెండవదశలో స్టేటుకాంగ్రెస్నాయకులు సంస్థానంలోని తాటిచెట్లనీ, ఈతచెట్లనీ నరికివేయవలసిందిగా ప్రజల్ని ఆదేశించారు. ఆసందర్భంలో లక్షలాది తాటిచెట్లూ, ఈతచెట్లూ నరికివేయబడినాయి. కొంతకాలం తరువాత, రాజధానీనగరంలో వున్న నాయకుల ఆదేశాలు గానీ, సరిహద్దులలోవున్న నాయకుల ఆదేశాలు గానీ ప్రజలకి అందడం దుర్ఘటమైంది. నిజాం ప్రభుత్వం సరిహద్దులలో కాంగ్రెస్ నాయకులు నడుపుతున్న పత్రికల్ని సంస్థానంలో ప్రవేశించకుండా నిషేధించింది. సత్యాగ్రహవార్తల్ని ప్రకటిస్తున్న అనేక భారతదేశపు పత్రికల్ని కూడా నిషేధించారు. దానితో ఎక్కడ ఏంజరుగుతున్నదీ ప్రజలకు తెలియలేదు. సరిహద్దుల నుంచి స్టేటులోకి వార్తావహుల్ని పంపిస్తే, నిజాంప్రభుత్వం వారిని వెన్నాడి అరెస్టుచేయడం మొదలెట్టింది.

స్టేటుకాంగ్రెస్ సత్యాగ్రహపు మూడవదశలో, అగ్రనాయకుల ఆదేశాలు సకాలానికిఅందకపోవడంతో, ఎక్కడికక్కడ నాయకులు బయల్దేరి ఉద్యమాన్ని కొనసాగించారు. ఉద్యమం పూర్తిగా ప్రజలస్వాధీనంలోకి వచ్చింది. వారు చిన్నచిన్న గ్రామాలలోకూడా సత్యాగ్రహంచేయడం ప్రారంభించారు. ఎక్కడబడితే అక్కడ ఈతచెట్లను, తాటిచెట్లనీ నరికివేశారు. గ్రామాలలో పోలీసులపై తిరుగబడ్డారు. రజాకార్లు ఇదే అదనుగా ఎంచి ఉద్యమనాయకులపైన విరు

చుకుపడ్డారు. ఎక్కడ సత్యాగ్రహం జరిగితే, అక్కడ మత కలహాల్ని బయల్దేరదీశారు. ప్రజలను చిత్రహింసచేశారు. హత్యలు గావించారు, దోపిడీలుచేశారు, మానవతుల మానాల్ని కొల్లగొట్టారు. రజాకార్లు సాయుధపాణులై ఒక గ్రామంనుంచి ఇంకొకగ్రామానికి జీపులలో, మోటారు సైకిళ్ళపైన ప్రయాణాలుచేసి, ప్రజలను భయవిహ్వాలుల్ని చేశారు. తమ ఉద్యమానికై రజాకార్లు గ్రామీణుల దగ్గర నుంచి పెద్దమొత్తాలలో డబ్బువసూలుచేశారు. డబ్బుయివ్వని వారిని నడివీథిలో పట్టుకొని తన్నారు. అక్కడికీ యివ్వ డానికి నిరాకరిస్తే, అమాయకప్రజల్ని పిస్తోళ్ళతో కాల్చి చంపారు. రజాకార్ల ఘాతుకచర్యలవల్ల, సంస్థానమంతటా, అరాచక పరిస్థితులు ఏర్పడ్డాయి. నిజాంప్రభుత్వం అధీనంలో ఏ ఒక్క ప్రాంతము లేదు. సంస్థాన రాజకీయకోశంనుంచి "న్యాయమూ, పరిపాలనా" అనే మాటలే ఎగిరిపోయినాయి. ప్రజలు భయభ్రాంతులై రాజధానినగరానికి వెల్లువగా ప్రవహించడం మొదలెట్టారు. కాస్త డబ్బున్నవాళ్ళు 'బ్రతుకుజీవుడా' అని పొరుగురాష్ట్రాలకువలసవెళ్ళడం ఆరం భించారు. సంస్థానంలో ఏ ఒక్కరికీకూడా రక్షణ లేకుండా పోయింది. లక్షలాది హిందువులు సంస్థానంనించి రోజూ వెళ్ళి పోవడం గమనించి నిజాంప్ర త్వం పొరుగురాష్ట్రాలలో అల్పసంఖ్యాకులుగా వున్న ముస్లింలను సంస్థానానికి దిగుమతి చేసింది. వారికి వృత్తుల్నికల్పించింది. ఆవాసాలు ఏర్పర్చింది. సంస్థానంలో ముస్లింలసంఖ్య హెచ్చించడమే వీరి ప్రధానా శయం. రజాకార్లు మామూలుదుస్తుల్లో పొరుగురాష్ట్రాలను

వెళ్ళి ఆయాప్రాంతాలనుంచి ముస్లింలను సంస్థానానికి రప్పించ డంలో నిజాం ప్రభుత్వానికి ఎంతో తోడ్పడ్డారు. రాజధాని నగరంలోని ఏ పేవ్‌మెంట్లపైన చూచినా, పొరుగురాష్ట్రాల నుంచి దిగుమతి అయిన ముస్లిం కాందిశీకులే.

పదివేల రూపాయలు రజాకార్ నిధికి చెల్లిస్తేనే కాని సంస్థానంలో మీ ఆస్తిపాస్తులు సురక్షితంగా వుండజాలవని ఆంజనేయులుగారికి, ఉర్దూలో అనేక అకాశరామన్న ఉత్త రాలు రావడం మొదలెట్టాయి. ఆంజనేయులుగారికి సంస్థా నంలో నాలుగు జాగీర్ గ్రామాలున్నాయి. వీటి సంవత్సరా దాయం 30 వేలు. ఈ నాలుగు గ్రామాలలో అన్నిటికన్నా పెద్దగ్రామం రఘునాథపల్లె. దానిచుట్టూ మరో మూడు గ్రామాలు ఉన్నవి. రఘునాథపల్లెలో ఒక పెద్దబంగళా, దానిచుట్టూ ఒకకోట ఉంది. దానికి ఎదురుగావున్న చిన్న బంగళాలో జాగీర్ ఆఫీసువుంది. లోగడ వీరు గోలకొండనవా బులకు సామంతులుగా వుండేవారు నవాబులకి కప్పాన్ని చెల్లిస్తూ. వారితలలో నాలుకగా వ్యవహరించారు. ఆరోజుల్లో పదిహేను గ్రామాలవరకు వీరిఅధీనంలో వుండేవని వినికిడి. పోయినవిపోగా ప్రస్తుతం నాలుగుగ్రామాలు మాత్రం మిగి లాయి. ఆంజనేయులుగారు మొదట రజాకార్ల దగ్గరనుంచి వచ్చిన ఉత్తరాలను లెఖ్ఖచేయలేదు. కాని రోజులుగడుస్తున్న కొద్దీ, వాటిసంఖ్య హెచ్చిపోవడంతో, అతనికి ఆందోళన ప్రారంభమైంది. గ్రామంలో అపారబంధుజనంతో వుండడం సురక్షితంకాదని, వారు ముందుగానే జాగ్రత్తపడి యావత్తు సంసారాన్ని హైద్రాబాదుకు కదిలించుకొని వచ్చారు.

అప్పుడప్పుడు రఘునాథపల్లికివెళ్ళి, జాగీర్ వ్యవహారాలు చూచుకొని, గ్రామంలో ఒకటిరెండు రోజులకన్నా ఎక్కువ కాలం ఉండక, హైదరాబాదుకు తిరిగివస్తూ ఉండేవారు. జాగీర్ ఆఫీసులో డబ్బుఏమీ ఉంచేవారుకాదు. నగలూ, రొక్కమూ, ముందుగానే హైదరాబాదుకుచేర్చి, ఇంపీరియల్ బ్యాంకులో పెట్టారు మరికొంతధనం పొరుగు రాష్ట్రాలలోని బ్యాంకులో ఉంచారు. తమ చేతిలో ఖర్చులకు సరిపోను డబ్బుమాత్రమే ఉంచుకునేవారు.

సంస్థానంలో పరిస్థితులు మరీ విషమించడం గమనించి నాలుగురోజులపాటు పొరుగురాష్ట్రాల్లో తలదాచుకొనిరావడం మంచిదేమో అనే ఆలోచనలోపడ్డారు. ఆంజనేయులుగారు ఈవిషయమై పద్మని సంప్రదించారు. రఘు అభిప్రాయాన్ని తీసుకున్నారు. రాజధానీనగరంలో సైనికవిన్యాసాలుతప్ప పెద్దపెట్టున ఎట్టిఅల్లరులూ జరగకపోవడంవల్ల, పొరుగు రాష్ట్రాలకి వలసవెళ్ళడం అంతఅవసరంకాదేమోనని భార్యాభర్తలు అభిప్రాయపడ్డారు. పొరుగురాష్ట్రాలకి వెళ్ళదలుచుకుంటే ఇంతకుముందే వెళ్ళితే బాగుండేది. ప్రస్తుతం రజాకార్లు రైళ్ళపైన ముట్టడులు జరుపుతున్నారు. కాగా, పొరుగురాష్ట్రాలకి వెళ్ళే రైళ్ళని వాళ్ళు ఒకకంట కనిపెడుతున్నారు. రైలుప్రయాణం ప్రమాదంతో కూడుకున్నది. పోనీ, కార్లలోవెడుదామనుకుంటే దారిపొడుగునా ఏ సంఘటన జరిగినా జరగవచ్చు. ఇట్టి పరిస్థితుల్లో పొరుగురాష్ట్రాలకి వలసవెళ్ళడం సముచితంకాదని ముగ్గురూ నిశ్చయించుకున్నారు. కాగా. పద్మకి నెలతప్పి మూడుమాసాలైంది.

దూరప్రయాణం చేస్తే ఎటువంటికీడు వాటిల్లుతుందో అని భయపడి ఆంజనేయులుగారు తాత్కాలికంగా వలసవెళ్ళడానికి సంబంధించిన తమఆలోచనలు విరమించుకున్నారు.

ఆంజనేయులుగారికి తిరిగి రజాకార్లదగ్గరినించి ఇంకొక ఉత్తరం వచ్చింది. ఈసారి వచ్చినఉత్తరం చాలా ఘాటుగా వుంది. రెండురోజుల్లో పదివేలరూపాయలు చెల్లించకపోతే ఆతరువాతజరిగే సంఘటనలకి తాము ఏమాత్రం బాధ్యులం కామని అందులో విస్పష్టపరచబడింది. ఈసారి తప్పక ఏదో జరిగితీరుతుందనికూడా ఆంజనేయులుగారికి అనుమానంవేసింది. స్టేటుకాంగ్రెసుకుఅయితే అతను పదివేలు కాదు ఇరవై వేలుకూడా యిచ్చివుండును. కాగా, వాళ్ళు నిర్బంధంగా చందాలువసూలుచేయరు. మనకి తోచినంత యిస్తేసంతోషంగా స్వీకరిస్తారు. కాగా అది ప్రజాసంస్థ. ప్రజల హితాన్ని కోరి పనిచేస్తున్నది. ఆంజనేయులుగారు, అడిగించు కోకండానే స్టేటుకాంగ్రెస్‌కు వెయ్యిరూపాయలు చందా యిచ్చారు. రజాకార్లకి పదివేలరూపాయలు యివ్వడానికి ఆంజనేయులుగారికి ఏమాత్రం మనస్కరించలేదు. ఒకవేళ యివ్వడమేజరిగితే అదే డబ్బు వినియోగించి వాళ్ళుప్రజలను హింసిస్తారు. జరిగేది ఎలాగూ జరగకమానదు. అట్టిసంస్థకు చందాలిచ్చి పాపాన్నికొని తెచ్చుకోవడంకంటే, మానంవహించడం మేలని భావించారు ఆంజనేయులుగారు. నగరంలోని యింటిచుట్టూ, పదిమంది నమ్మకస్తులైన మనుషుల్ని కాపలా పెట్టారు. ఇంటిపైన ముట్టడి జరిగితే, దానిని ఎదుర్కోవడానికి సంసిద్ధపడ్డారు. ఇత్తెహాద్ సంస్థకు ఎట్టిచందా యివ్వలేదు.

ఒకరోజు గడిచింది, రెండవరోజు గడిచింది. మూడవరోజున రజాకార్లముట్టడికోసం ఎదురుచూచారు. మూడవరోజు కూడా గడిచిపోయింది. ఇంటిపైన ఎట్టిముట్టడి జరగలేదు. నాల్గవరోజు గడిచింది. ఎట్టిసంఘటన జరుగలేదు. అయిదవ రోజు సాయంత్రం రఘునాథపల్లినుంచి ఒకమనిషివచ్చి, రజాకార్లు యింటితాళాలు విరగ్గొట్టి ఒక్క ధాన్యంతప్ప ఇంట్లో ఏమీ లేకపోవడంవల్ల ఆగ్రహించి, ఇంటికి నిప్పంటించారని చెప్పాడు. పెద్దలు గట్టినయిల్లు పరశురామప్రీతి అయినందుకు ఆంజనేయులుగారు ఎంతో చింతించారు. రజాకార్లు ఎంత వరకూ జిల్లాల్లోనే ఘాతుకచర్యలు జరుపుతున్నారు గాని రాజధానీనగరం పైన ఏమాత్రం దృష్టిసారించడంలేదు. రాజధానీనగరంలో పెద్దపెట్టున విధ్వంసకచర్యలు జరిపితే, అవి బయటపడి భారతదేశంలోని పత్రికలకి ఎక్కగలవని వాళ్ళ భయం. అందువల్ల రాజధానీనగరంలో ఒకటో అరో హత్య గావించడం తప్ప పెద్దపెట్టున ఎట్టిచర్యలు జరపడానికి రజాకార్లు పూనుకోలేదు.

ఇటీవల స్టాండ్‌స్టిల్ ఒడంబడికస్థానే, ఒక కొత్త ఒడంబడిక కుదుర్చుకోవడానికై భారత హైద్రాబాద్ ప్రభుత్వాలమధ్య జరిగిన సంప్రదింపులు విఫలమైనాయి దీనితో ఖాసింరజ్వీ ఆగ్రహావేశుడైనాడు. హైద్రాబాద్ ఒక సర్వస్వతంత్రరాజ్యమనీ, దానికి వ్యతిరేకంగ వేలెత్తిచూపిన వారిచేతులేగాక, ఆ చేతుల్ని అదుపు ఆజ్ఞలలో పెడుతున్న వారిచేతులుకూడా నరికివేయబడగలవని హెచ్చరిక చేశాడు. ఇదివరకే, సంస్థానంలో పూర్తిగా అరాజకత్వం ప్రళయతాం

డవం చేస్తున్నది. ఖాసిం రజ్వీ ఈ ప్రకటనతో విద్వేషానలం సంస్థానమంతటా మిన్నుముట్టింది. ఈ విద్వేషానలానికి 'ఇమ్రోజ్' ఉర్దూపత్రికా సంపాదకుడు షోయిబుల్లాఖాన్ ప్రప్రథమంగా గురిఅయినాడు. ఇతను జాతీయవాది. హైద్రాబాద్‌కి స్వతంత్రప్రతిపత్తి (స్టేటస్) ఎన్నడూ లేదనీ, అది భారతావనిలో తదితర సంస్థానాలవలెనే చేరక తప్పదనీ ఒక సంపాదకీయ వ్యాఖ్యలో ఉద్ఘాటించాడు. మొదటినుంచీ అతను సంస్థానంలో రజాకార్లకు వ్యతిరేకంగా నిలిచి వారి ఘాతుకచర్యల్ని ఖండిస్తూవచ్చాడు. రజాకార్ ఉద్యమానికి అతను పక్కలో ఒక బల్లెంగా పరిణమించాడు. హైద్రాబాద్ ఒక స్వతంత్రరాజ్యమని రజాకార్లు ప్రకటిస్తే, లార్డ్ రీడింగు వైస్రాయిగా ఉన్నకాలంలో బ్రిటిష్‌ప్రభుత్వం ఈ స్వతంత్ర ప్రతిపత్తిని అంగీకరించలేదనీ, దేశ స్వాతంత్ర్యానంతరం బ్రిటిషుప్రభుతకు నేడు ప్రాతినిధ్యం వహిస్తున్న భారతప్రభుత్వంకూడా దానిని అంగీకరించజాలదనీ, అతను విస్పష్టపరచాడు. అతని భావాలు రజాకార్లకి కొరకరాని కొయ్యలుగా పరిణమించాయి. అనేకసార్లు ఖాసిం రజ్వీ 'ఇమ్రోజ్' పత్రికద్వారా షోయిబుల్లాఖాన్ వెలువరిస్తున్న భావాల్ని ఖండించాడు. హైద్రాబాద్ ప్రభుత్వం ఎన్నో సార్లు పత్రికపై జుర్మానాలను విధించింది. ప్రభుత్వం విధించిన జుర్మానాలకిగాని, ఖాసిం రజ్వీ బెదిరింపులకిగాని జడవక, అతను తన పత్రికద్వారా సంస్థానానికి ఇతోధిక సేవచేస్తూ వచ్చాడు. ముస్లిం అయివుండికూడా అతను రజాకార్‌సంస్థను ఎదిరించడం, ఖాసీంరజ్వీకి మరీ ఆగ్రహకారణమైంది. అతను

రజాకార్లకు వ్యతిరేకంగా వేలెత్తి చూపుతున్నాడు. స్టేటు కాంగ్రెస్ చెప్పుచేతుల్లో అతను మెలగుతున్నాడని ఖాసిం రజ్వీ భావించి అతన్ని హత్యగావించవలసిందిగా, రజాకార్లకు రహస్యంగా ఉత్తర్వులు జారీచేశాడని వినికిడి. నిజం విచారిస్తే షోయిబుల్లాఖాన్‌కి స్టేటుకాంగ్రెస్‌కీ ఎట్టిసంబంధం లేదు. కొన్ని కొన్ని విషయాలలో అతను స్టేటుకాంగ్రెస్‌ను కూడా తన పత్రికద్వారా విమర్శించేవాడు. ముస్లింలీగ్ తాత్కాలికప్రభుత్వంలో చేరకపూర్వం, భారత జాతీయకాంగ్రెస్ ముస్లింప్రతినిధిగా సర్ షఫాత్ అహమ్మద్‌ఖాన్‌ని ప్రభుత్వంలో చేర్చుకుంది. అతను ప్రభుత్వంలో చేరిన కొలది రోజులకి మతోన్మాదులైన కొందరు లీగ్‌సభ్యులు అతన్ని హత్యగావించారు. షోయిబుల్లాఖాన్ హత్యకి, ఈ సంఘటన ప్రోత్సాహకారణమైంది. ఒకనాడు షోయిబుల్లాఖాన్ తన పత్రికాకార్యాలయంలో చాలారాత్రివరకు పనిచేసి, ఇంటికి వెడుతుండగా, రజాకార్లు అతన్ని హత్యగావించారు. అతని కుడిచేతిని నరికేశారు. షోయిబుల్లాఖాన్ హత్యతో, హైద్రాబాదు రాజకీయాకాశంనుంచి ఒక మహోజ్వలతార రాలిపోయింది.

ఆ తరువాత రజాకార్లు భారతదేశానికి వ్యతిరేకంగా యుద్ధప్రయత్నాలు పెద్దపెట్టున ప్రారంభించారు. మతోన్మాదులైన ముస్లింలకు ఆయుధాలను విరివిగా పంచిపెట్టారు. 'దారుల్ ఇస్లాం' ఇత్తెహాదుల కేంద్రకార్యస్థానం, సైనిక విన్యాసాలకి కూడలిస్థానం అయింది. నగరంలోని ఈ కార్యస్థానంలో దివారాత్రులు సైనికవిన్యాసాలుజరగడం ప్రారంభ

మైనాయి. జిల్లాలవారీగా రజాకార్లు పెరేడ్లు జరిపి, సైనిక దుస్తుల్లోవున్న ఇత్తెహాద్ నాయకుడికి సైనికవందనం చేయడం మొదలెట్టారు. వేలకొలది సంఖ్యలలో, రజాకార్లు జిల్లాల నుంచి నగరానికి వెల్లువగా ప్రవహించనారంభించారు. ఈవిధంగా ఉత్తేజితులైన రజాకార్లు ఒకనాటిరాత్రి నగరానికి దాదాపు ఇరవైమైళ్ళ దూరంలోవున్న బీబీనగర్ పైన జీపులూ, మోటార్ సైకిళ్ళపైన వెళ్ళి ముట్టడి జరిపారు. రాత్రంతా వర్ణించడానికి కూడా అలవికాని ఘాతుకకృత్యాలు జరిపారు. దోపిడీలు జరిపారు, ఇండ్లకునిప్పంటించారు, మానవతుల మానభంగం చేశారు. ఆనాటి రాత్రి రజాకార్లు జరిపిన అమానుషకృత్యాలు చరిత్రలో ఎన్నడూ మనం కనీ వినీ ఎరుగం.

## 20

రాత్రి తొమ్మిదిగంటలైంది. ఇంకా రషీద్ ఇంటికి తిరిగిరాలేదు. ఎన్నడూ ఇంటికిరావడానికి రషీదు ఇంతఆలస్యం చేయలేదు. ఏ పిక్చర్ కైనా వెళ్ళలేదుకదా? బహుశా పిక్చర్ కే వెళ్ళివుంటాడు. అందుకోసమే ఈరోజు ఇంత ఆలస్యమైంది. పిక్చర్ కివెడితే పదిగంటలకిగాని రాడు. పదిగంటలు అయివుంటుందా? ఇంతకుముందేకదూ, ఎల్లమ్మ ఎనిమిదిన్నర అయిందని చెప్పింది. ఆమె వెళ్ళి మహాఅయితే ఒక అర గంట అయివుంటుంది. అంటే తొమ్మిది దాటివుంటుంది. అంటే అతను పిక్చర్ కివెడితే తిరిగిరావడానికి ఇంకొకగంట వ్యవధివుంది. ఆ గంట ఎల్లాగడపడమో రుక్మిణికి తోచలేదు.

పోనీ, ఈలోపుగా భోజనంచేస్తే? బాగానే వుంటుంది. కొంతసేపైనా గడిచిపోతుంది. రుక్మిణి వాకిలితలుపు గడియవేసి, వంటయింట్లోకి వెళ్ళింది. వంటయిల్లు అంటే ఆ పక్కగది అన్నమాట. ఆ గదిలోకి వెళ్ళి విస్తరివేసుకున్నది. అన్నం వడ్డించుకున్నది. రషీద్ రుక్మిణిదగ్గర భోజనంచెయ్యడు. ప్రతిరోజూ ఉదయం ఆరుగంటలకి వెళ్ళిపోతాడు. రాత్రి భోజనంచేసి తొమ్మిదిగంటలకల్లా వస్తాడు. అప్పటికల్లా రోజూ రుక్మిణి భోజనంచేసేస్తుంది. కాని ఆరోజు ఎందుకో తొమ్మిదిగంటలకిలోపుగా భోజనంచేయడానికి రుక్మిణికి మనస్కరించలేదు.

ఎందుకో భోజనం మానేదామనుకుంది. కాని ఎంతకీ రషీదు రాకపోవడంతో కొంత సైమన్నా గడుస్తుందనే ఉద్దేశంతో భోజనంచేయడానికి నిశ్చయించుకుంది. అన్నం వడ్డించుకుని, భోజనానికి కూచుందామనేసరికి, ఏదో అడుగుల చప్పుడు అయింది. వెంటనే లేచి చెయ్యి కడుక్కొని రుక్మిణి వాకిలితలుపు తీసింది. కాని, కనుచూపుమేరలో ఎవ్వరూ కనబడలేదు. రషీదు కనిపించకపోవడంతో ఎందుకో, రుక్మిణి హృదయం అమాంతంగా క్రుంగిపోయినట్లనిపించింది. ఏమీతోచక అక్కడే ఆ గుమ్మంలోనే కొంతసేపు నిలబడిపోయింది. గుమ్మంలో ఎంతసేపని నిలబడుతుంది? తలుపు వేసి లోపలికి వెళుదామనుకుంది. కాని ఇంతలోకే రషీద్ వస్తే? భోజనంమధ్యలో లేవవలసివస్తుంది. తలుపు దగ్గరగా వేసివుంచితే? నిజమే, బాగానేవుంటుంది.

తలుపు దగ్గరగా వేసి రుక్మిణి లోపలికి వెళ్ళింది. భోజనానికి కూర్చున్నది. అన్నంలో ఆవకాయకలిపి నోట్లో ఒకముద్ద పెట్టుకున్నది. నోరంతా చేదు. రుక్మిణి ముద్ద మింగలేకపోయింది. నోట్లో ముద్ద ఊసేయడం ఇష్టంలేక గ్లాసెడునీళ్ళతో దాన్ని బలవంతంగా మింగింది. ఎందుకో నీళ్ళుకూడా చేదుగానే తోచాయి. ముద్ద చేదుగా ఉండడం వల్ల నీళ్ళుకూడా చేదనిపించాయేమో! ఈసారి విడిగా నీళ్ళు తాగి చూచింది. సందేహం లేదు. నీళ్ళుకూడా చేదుగానే ఉన్నాయి. ఉదయంనించి కుడికన్ను అదురుతున్నది. దానికి తోడు నోరు చేదుగావుంది. ఏదైనా కీడు జరుగదుకద! తెల్లవారుఝామునవచ్చినకలకీ ఈసంఘటనలకీ ఏమీ సంబంధంలేదుకదా! లేకపోతే తనకు అంతభయంకరమైన కల ఎందుకు రావాలి? తాను కలలో కెవ్వునకేకపెట్టి ఉలికిపడి లేచింది. లేచీలేవడంతోనే రషీద్‌ని చుట్టేసుకొని గొల్లున ఏడ్చింది. ఆ కేకకి రషీదుకికూడా మెలుకువవచ్చింది. అదాటుపాటున తాను అతనిమెడని చుట్టేసుకొని ఏడవడం గమనించి రషీదు మొదట బిత్తరపోయాడు. ఉత్తరక్షణంలో కోలుకొని 'రుక్కూ! ఎందుకు ఏడుస్తున్నా'వని అడిగాడు. 'రషీదుని ఎవరో కత్తితో నరుకుతున్నట్లు తనకు కలవచ్చిం' దని తను అతనితో ఎల్లా చెప్పగలుగుతుంది? తను మొదట సమాధాన మేమీ చెప్పలేదు. అతను బుజ్జగించాడు. లాలించాడు. 'నా రుక్కూవి కదు! నాకు చెప్పవూ! నీకు ఏమి కల వచ్చిందో' అని బతిమిలాడాడు. అతను అల్లా బతిమిలాడుతుంటే తనకు మరీ ఏడుపువచ్చింది. అతను ఎంతసేపని బతిమి

లాడుతాడు ? చివరకి అతనికి విసుగు వేసింది. 'చెప్పవుకదూ!' అని కొద్దిగా సిష్టూరానికి దిగాడు. అప్పుడు తనకు ఏదో ఒకటి చెప్పక తప్పిందికాదు. జీవితంలో మొదటిసారిగా 'మాఅమ్మ కలలోకి వచ్చిం'దని అబద్ధంచెప్పింది. అబద్ధం చెప్పకూడదని మనస్సు ఒక చెంప పీకినా అబద్ధంచెప్పక తప్పిందికాదు.

చిన్నప్పుడు ఒకసారి తనతల్లి చనిపోయినట్లు రుక్మిణికి కలవచ్చింది. నిజంగా కొన్నిరోజులకి తనతల్లి చనిపోయింది. ఆ కలకూడా తెల్లవారుఝామునే వచ్చింది. ఆరోజునకూడా తాను కెవ్వున కేకవేసి లేచింది. లేచి ఏడ్వడం మొదలెట్టింది. 'ఎందుకు ఏడుస్తున్నా' వని అడిగితే, 'అమ్మ చచ్చిపోయి నట్లు కలవచ్చిం' దని చెప్పింది. అప్పుడు తనతల్లి జబ్బుగా ఉంది. 'చచ్చిపోయినట్లు కల వస్తే తప్పక తన తల్లిజబ్బు నయమౌతుం' దని అందరూ సంతోషించారు. కాని జబ్బు నయంకాలేదు. రోజురోజుకు మరీ హెచ్చింది. ఒకరోజున తనతల్లి చనిపోయింది. రషీద్ చనిపోడుగదా ఈసారి తనకల నిజం కాకూడదని 33 కోట్లదేవుళ్ళకి రుక్మిణి మొక్కుకుంది. తనకలలు నిజంకాకుండా ఎన్నడూ వుండ లేదు. అందులో ముఖ్యంగా తెల్లవారుఝామున వచ్చిన కలలు. ఎందుకో రుక్మిణికి తన కల నిజమౌతుందనే అనుమానం వేసింది. అందుకోసమే రషీదు ఆ వుదయం వెడు తుండగా 'మీరు ఈరోజు ఎక్కడికీ వెళ్ళవ'ద్దని చెప్పింది. 'ఎందుకని' అని అతడడిగాడు. 'ఈరోజు మంచిరోజుకాదు. మీరువెళ్ళవద్దు' అన్నది. 'ఈ అనుమానాలన్నీ మీ హిందువులకేగాని, మా తురకలకే ఏమీ వుండవు' అని

అతను అన్నాడు. 'అయినా, మీరు వెళ్ళడానికి వీలులేదు' అని తను మొండికేసింది. 'మరి సిగరెట్ ఫ్యాక్టరీకి వెళ్ళకపోతే ఎల్లా?' అని అతను అడిగాడు. 'వెళ్ళకపోతే అంతమునిగిపోయేది ఏమీలే' దని తను సమాధానం చెప్పింది. 'నీవుకూడా ఈరోజు పనికి వెళ్ళవా?' అని అతను అడిగాడు. 'వెళ్ళనని ఆమె జవాబుచెప్పింది. 'వద్దంటే సిగరెట్ ఫ్యాక్టరీకి వెళ్ళను. పోనీ, నన్ను ఇంటికైనా వెళ్ళనివ్వ' మని అతను దీనంగా అడిగాడు. 'ఏమిటి ఇంట్లో విశేషం?' అని తను సిగ్గూబిడియంకూడా లేకుండా అడిగింది. 'ఏమీలేదు, మా వాళ్ళంతా ఈ రోజు ఎక్కడికో బంధువుల యింటికి వెడుతున్నారు' అన్నాడు. మీరు తప్ప అందరూ వెడుతున్నారా?' అని అడిగింది. 'లేదు వహీదా వెళ్ళడంలేదు' అని ఏ దాపరికం లేకుండా చెప్పాడు.

వహీదా రషీదు చిన్నాయనకూతురు. ఇద్దరికీ సంబంధం నిశ్చయమైంది. ఇంట్లో ఎవ్వరూ లేనిది చూచుకొని, రషీదు వహీదాని ఒంటరిగా కలుసుకొని, ప్రేమకలాపాలు జరుపదలచుకున్నాడు. వహీదా అంటే రషీదుకు ఎంతో యిష్టం వహీదాకూడా తనని ఎంతో ప్రేమిస్తోందని చెబుతాడు. ఇట్టిపరిస్థితుల్లో తను రషీదుని ఇంటికి వెళ్ళనియ్యకుండా ఎల్లా ఆపివేయగలుగుతుంది? నేరుగా ఇంటికి వెళ్ళే షరతుపైన తను రషీదుని వదిలింది.

కాని రషీదు వెళ్ళిపోయినప్పటినుంచీ, తనమనస్సులో మనస్సు లేదు. ఏదో ప్రమాదం జరిగితీరుతుందని మనస్సు పదేపదే చెబుతున్నది. మనస్సు చికాకుగా వుండడం వల్ల

తాను ఆరోజు పనికి వెళ్ళలేదు. రషీదుతో తనకు సంబంధం ఏర్పడినప్పటినుంచీ తాను సిగరెట్ ఫ్యాక్టరీలో పని చేస్తూనే వుంది. పని మానేసెయ్యమని తనకు రషీదు ఎన్నిసార్లో చెప్పాడు. కాని తాను మానెయ్యలేదు. ప్రొద్దుగడవడానికి ఏదైనా వ్యాపకం వుండడం అవసరమని భావించి తాను రోజూ సిగరెట్ ఫ్యాక్టరీకి వెడుతూనే వుంది. ఇంతలోకే వాకిలిగుమ్మం తెరిచినట్లు ఏదో అలికిడైంది. పక్కమీది లేచి వెంటనే చెయ్యికడుక్కుంది. వాకిలి గుమ్మంలోకి వెళ్ళింది. కాని ఎవ్వరూ కనపడలేదు.

ఇంతరాత్రివరకూ రషీదు ఎక్కడికి వెళ్ళినట్లు? పోనీ షైంఅయినా కనుక్కుందామని రెండుఅడుగులు ఎల్లమ్మఇంటి వేపు వేసింది. ఎల్లమ్మయింట్లో దీపమైనా లేదు. భోజనాలు చేసి అందరూ పడుకున్నారేమో! ఎల్లమ్మకొడుకు ఆరుబయట పడుకొని ఉన్నాడు. అతన్ని లేపి 'రషీదుసంగతి కనుక్కోడానికి పంపిద్దామా?' అనుకుంది. వెళ్ళిన యింటివాళ్ళు ఎవ్వరూ తిరిగిరాకపోవడంతో వహీదా ఒంటరిగా వుంటుం దని రషీదు తోడుగా వుండిపోలేదుకద! ఏమో, అల్లా జరిగినా జరిగివుండవచ్చు. ఎల్లమ్మకొడుకుని లేపితే, తాను రషీదు కోసం అంతగా ఆందోళనపడడంచూచి అతను ఏమనుకుం టాడో! తనజీవితం ఇదివరకే అందరికీ బట్టబయలు అయింది. ఇరుగుపొరుగుకంతా, తనకూ రషీదుకీ గల సంబంధం తెలుసు. విధిలేక తను రషీదుకు లొంగిపోవాల్సివచ్చిందని కూడా తెలుసు. ఇట్టి పరిస్థితుల్లో తనకు రషీదుపైన ప్రేమవున్నట్లు బయటపడితే? తనకు ఎంతో తలవంపులుగా వుంటుంది. ఆ

భావం కలగడంతోనే రుక్మిణి గిరుక్కున వెనక్కి మళ్ళింది. అనాలోచితంగా వాకిలిగుమ్మం చేరుకుంది. త్రుటికాలం వరకు గుమ్మంలో నిలచి వీధంతా కలయజూచింది. ఎక్కడా ఏఅలికిడీ లేదు. వీధంతా సుఖంగా హాయిగా నిద్రపోతున్నది. నిద్రపోనిది తను ఒక్కతే. ప్రపంచానికి లేని ఆరాటం తనని ఒక్కదాన్నే పట్టి వేధించటమెందుకు? అది ఒకొకరికర్మ!

కొందరు ప్రపంచంలో కష్టాలు అనుభవించడానికే పుడతారు. వారిని ఏదివ్యశక్తులుకూడా కష్టాలనుంచి తప్పించి వేయలేవు. వారు కష్టాలతోనే పుడతారు. కష్టాలమధ్యనే పెరిగి పెద్దవారవుతారు. కష్టాలతోనే అంతమొందుతారు. తనుకూడా సరిగా ఈకోవకుచెందినమనిషే. రుక్మిణి కనుచూపు మేరవరకూ, వీధిని ఒకమారుకలయజూచింది. రషీదుకనపడక పోవడంతో, అనాలోచితంగా తలుపువేసుకుంది. ఎందుకో ఇంక రషీదు తిరిగిరాడనే అనుమానం కలిగింది. రుక్మిణి నిలువునా కృంగిపోయింది. రజాకార్లు, రషీదుని హత్యచేయ లేదుకదా! ఏమో! కొన్ని రోజులనుంచి, తనను వదిలివేయ మని రషీద్‌కి వాళ్ళు ఆకాశరామన్న ఉత్తరాలు వ్రాస్తు న్నారు. కాని రషీదు ఆ ఉత్తరాల్ని లక్ష్యంచేయడంలేదు. ఉత్తరాలతో పనిజరుగక, ఒకనాడు, ఒక రజాకార్ రషీదుని ఆఫీసుకువచ్చి కలుసుకున్నాడు. తమఉద్యమానికి అయిదు వేలవిరాళం ఫ్యాక్టరీతరఫున యిప్పించమని అడిగాడు. రషీదు విరాళం ఇవ్వడానికి నిరాకరించడంతో, అతను ఉగ్రుడై నాడు. రషీదు ఒకహిందూస్త్రీని ఉంచుకున్న సంగతి తనకు తెలుసునని, బెదిరించాడు. తెలుస్తే 'ఏంచేస్తారేమిటి?' అని

రషీదు, ముక్కుసూటిగా ఆరజాకార్ని ప్రశ్నించాడు. 'ఏమి చేస్తామా? ఏమిచేసేదీ ముందుముందు కాని తెలియదు' అని ఆ రజాకార్ రషీద్కి హెచ్చరికచేశాడు. మీదుమిక్కిలి 'ఆ హిందూస్త్రీ మతం మార్పించి తురకలలోచేర్చు. లేకపోతే, నీప్రాణాలమీదికే వస్తుం'దని రజాకార్, ఆగ్రహావేశంతో గట్టిగాఅరిచాడు. 'వస్తే, అప్పుడు చూచుకోవచ్చులె'మ్మని రషీదు అతనికి నిర్లక్ష్యంగా సమాధానంచెప్పాడు. 'పదిహేను రోజులలోపుగా నీవు డబ్బుచెల్లించి, ఆ హిందూస్త్రీని తురకలలో కలపకపోతే, నీప్రాణాలు నిలువునా ఎగిరిపోతాయి' అని అతను బెదిరించాడు. రషీద్ ఆబెదిరింపులకి చలించలేదు. కాగా, మొన్నటితో రజాకార్లుపెట్టినగడువుకూడా దాటిపోయింది. ఏమికీడు సంభవిస్తుందో నని రుక్మిణి ఆందోళన పడింది. పది దాటి వుంటుంది. ఇంకా రషీదు రాలేదు. ఉత్తరక్షణంలో రషీద్ తనకళ్ళకి కనపడితే ఎంతబావుంటుంది! అప్పటిమట్టుకు తనఆందోళనంతా మటుమాయమైపోతుంది. రషీద్ వెంటనే తిరిగిరావాలని, తిరిగి ఇంకొకసారి రుక్మిణి 33 కోట్లదేవతల్ని ప్రార్థించింది. ... ... ...కాని ఏ దేవతా రుక్మిణికి అడ్డుపడలేదు. క్షణక్షణం ఒకయుగంగా గడుస్తున్నది. ఎంతకీ రషీదు తిరిగిరావడంలేదు... ... ...ఇంక తిరిగి రాడా? ... ...ఇంక ఎన్నడూ తనకి కనపడడా? ... ...తిరిగి రాకపోతేమానె... ... కనపడకపోతేమానె ... ... ఎక్కడో అక్కడ అతను సురక్షితంగావుంటే, తనకు అంతే చాలు... ఏహిందూని పెళ్ళిచేసుకొని, అతను సుఖంగావుంటే చాలు... తను ఇంకేమీ కోరుకోదు... ...

ఇప్పుడు రుక్మిణి తనపొట్ట తాను పోసుకుంటున్నది. ఇప్పుడు తనకు ఎవ్వరిసహాయం అక్కరలేదు. ఎవ్వరిసానుభూతీ అవసరంలేదు. ఏ విశ్వేశ్వరరావులు, రామనాథాలు, రషీదులు తనకు అక్కరలేదు. నిజంవిచారిస్తే వీళ్ళంతా తనకు అన్యాయం చేసినవాళ్ళే. తనజీవితాన్ని దుఃఖభూయిష్టం చేసినవాళ్ళే. తనని బలవంతంగా రచ్చకీడ్చి, తన బ్రతుకును బండపాలుచేసిన వాళ్ళే. అసలు, తనకీ, ఈరషీదుకీ గల సంబంధం ఏమిటి? నిజం విచారిస్తే ఏమీలేదు. మరి ఎందుకు అతనికోసం ఈరోజున అంతగా ఆందోళనపడడం? అతనిరాకకై అంతగా నిరీక్షించడం? రుక్మిణి తనకీ, రషీదుకీ గల సంబంధాన్ని వితరణదృష్టితో చూడలేకపోయింది. విచక్షణతో పరిశీలించలేకపోయింది. అది దైహికసంబంధంమాత్రమేకాదని ఆలోచించలేకపోయింది. ఆ సంబంధం ఇదమిత్థమని నిర్ణయించుకోలేకపోయింది......

రుక్మిణి రషీదుకి లొంగిపోయినప్పటినించీ, అతనికి రజాకార్ల దగ్గరనుంచి ఆకాశరామన్న ఉత్తరాలు వస్తూనే ఉన్నాయి. అప్పట్లో రజాకార్ ఉద్యమంకూడా అంతఉధృతంగా లేదు. నిజంవిచారిస్తే అప్పట్లో, ఇత్తెహాద్ ముసల్మీన్ వారి కోశంలో రజాకార్ పదానికి నేటి అర్థం కాదు ఉన్నది. ఇత్తెహాద్ఉద్యమం రజాకార్ స్వరూపాన్ని దాల్చడం ఈమధ్యనే జరిగింది. అప్పట్లో రజాకార్లు ఉన్నా, వారు తమ మాతృసంస్థకి స్వచ్ఛంద సేవకులుగా వ్యవహరించేవారు. అప్పట్లో సైనికవిన్యాసాలు ఇంకా ప్రారంభం కాలేదు. విధ్వంసకచర్యలు ఇంకా తలెత్తలేదు. ఉద్యమం

ద్విజాతిసిద్ధాంతంవరకు మాత్రమే పరిమితంగా ఉండేది. వివిధమతాలమధ్య విద్వేషాల్ని పురికొల్పడంవరకుమాత్రమే ఇత్తుహాద్ ఉద్యమావధిగా వుండింది. ఆరోజులలో ఇత్తెహాద్ సభ్యులు, రుక్మిణిని తురకలలో కలపవలసిందిగా రషీదుకి హితవు చెప్పారు. అతన్ని ఇత్తెహాద్ ముసల్‌మీన్ సంస్థలో చేరవలసిందిగా ఒత్తిడికలుగజేశారు. రుక్మిణిని తురకలలో చేర్చడానికిగాని, తను ఇత్తెహాద్‌లో చేరడానికిగాని రషీదు అంగీకరించలేదు. కాగా, అతను ద్విజాతిసిద్ధాంతాన్ని ఒప్పుకోలేదు. 'భారతదేశంపై తురకలు దండెత్తి వచ్చినప్పుడు ఏ కొద్దిమందో వచ్చారనీ ఆతరువాత వారు స్థానికులతో సంబంధబాంధవ్యాలు పెంచి, తమసంఖ్యాబలాన్ని హెచ్చించుకున్నారనీ' అతను వాదించాడు. పైగా సిసలైన ముస్లింరక్తం ఎవ్వరిలోనూ ప్రవహించడంలేదనీ, హిందువులరక్తంతో అది సమ్మిశ్రమమై, భారతీయరక్తంగా పరిణామంపొందిందనీ అతను విస్పష్టంగా ప్రకటించాడు. మీదుమిక్కిలి 'నేను హిందువుననీ, ముస్లింననీ చెప్పుకోవడానికి ఎవ్వరికీ హక్కులేదనీ, మనం భారతీయులమని చెప్పుకోవడం మన ధర్మ'మనీ అతను తీవ్రంగావాదించాడు. ఈ జాతీయభావాలు ఇత్తెహాద్ ముసల్‌మీన్ సభ్యులకు నచ్చలేదు.

ఇంతలోనే బ్రిటిషుఇండియాలో ప్రత్యక్షచర్య పేరట ముస్లింలీగ్ మతకలహాలు ప్రారంభించింది. ఈ కలహాలు ఇత్తెహాద్ సభ్యులకు సంస్థానంలో విధ్వంసకచర్యలు జరపడానికి ప్రోత్సాహకారణమైనాయి. లీగ్ పాకిస్తాన్ తనధ్యేయంగా ప్రకటించినప్పటినుంచే ఇత్తెహాద్‌సభ్యుల ఉధృతం

హెచ్చింది. లీగ్ పత్యక్షచర్యతో ఈ ఉధృతం పరాకాష్ఠ పొందింది. భారతస్వాతంత్ర్యంలో హైదరాబాదు సంస్థానం సర్వస్వతంత్ర్యరాజ్యంగా రూపొందుతుందనే కలలు కనడం మొదలుపెట్టారు. ఇత్తెహాద్‌సభ్యులు జిన్నాతో సంప్రదిస్తే హైదరాబాదును ఒకస్వతంత్ర్యరాజ్యంగా ప్రకటించవలసిందిగా అతను ఇత్తెహాద్‌నాయకులను ప్రోత్సహించాడు ఈ మధ్య ఇత్తెహాద్ ముసల్మీన్‌సంస్థ ఖాసిం రజ్వీపుణ్యమా అని, ఒక సైనికసంస్థగా రూపొందింది. దానితో ఇత్తెహాద్ సభ్యులకు సంస్థానంలో పట్టపగ్గాలులేకుండా పోయినాయి. హిందువులపైనా, జాతీయముస్లింలపైనా కసితీర్చుకోవడం ఆరంభించారు. అందులో ముఖ్యంగా హైదరాబాదు ఒక స్వతంత్రరాజ్యంగా మారడానికి వీలులేదని ప్రకటించినవారు పరమశత్రువులైనారు

రషీదు ఒక హిందూస్త్రీతో కాపరంచేస్తున్నాడు. మీదుమిక్కిలి ఇత్తెహాద్‌ఉద్యమాన్ని చిన్నచూపు చూస్తున్నాడు. రాజాకార్లలో కొంతమంది రషీదు క్లాసుమేట్లు కూడా ఉన్నారు. వాళ్ళకి రషీదు, ఇత్తెహాద్‌ఉద్యమాన్ని చిన్నచూపుచూడడం కంటకంగా తోచింది. ఏవిధంగానైనా అతనిపై పగ సాధించడానికి సమకట్టారు. ఇత్తెహాద్‌సంస్థ సైనికస్వరూపం దాల్చడంలో రజాకార్లు ప్రతీకారానికి పూనుకున్నారు. రుక్మిణిని ముస్లింమతంలో చేర్చవలసిందని కోరుతూ ఆకాశరామన్న ఉత్తరాలు వ్రాయడం మొదలుపెట్టారు. ఆ ఉత్తరాలలో రషీదుకి నయానా, భయానా చెప్పిచూచారు. కాని, రషీదు ఆఉత్తరాలనులక్ష్యంచేయలేదు.

ఇత్తెహాద్‌సంస్థకి విరాళం ఇవ్వకపోతే రుక్మిణి మతం మార్చకపోతే అతన్ని హత్యగావిస్తామని బెదరించారు. దానితో రుక్మిణికి నవనాడులు క్రుంగిపోయినాయి. తనమూలకంగా, రషీదు ప్రాణంమీదికి తెచ్చుకుంటున్నాడని తోచి, రుక్మిణి గిలగిల లాడింది. మీరు మిక్కిలి రజాకార్లు చెప్పినట్లు చేసితీరుతారని ఎల్లమ్మద్వారా విని, నిలువునా నీరైంది. తనకోసం రషీదు ప్రాణాలకి తెగించడం ఆమెకు ఏమాత్రం మనస్కరించలేదు. తనని వదలివేసెయ్యమని రషీదుని అనేకసార్లు ప్రాధేయపడింది. కాని రషీదు ఆమె ప్రార్థనల్ని పెడచెవిని పెట్టాడు. ఇత్తెహాద్‌సంస్థని దూషించడంమాని వేసి, వాళ్ళ మొహాన ఏదో ఇంతడబ్బుకొట్టి, తననివదలివేసి సుఖపడమని మరీమరీ చెప్పింది. తాను తురకల్లో చేరడమంటేనే, రుక్మిణికి ఎంతో ఎబ్బెట్టుగా తోచింది. హైందవమతమంటే ఏమిటో ఆమెకు తెలియదు. ముస్లింమతమంటే అంతకన్నా తెలియదు. ఏ మతంలో ఏం విశిష్టత వుందో తెలుసుకోవడానికి ఆమెకు చదువురాదు.

చదువురానివాళ్ళకి అన్నిమతాలూ ఒక్కటే. బాగా చదువుకున్నవాళ్ళకికూడా సర్వమతసారం ఒకటిగానే కనపడుతుంది. ఎటొచ్చీ మిడిమిడిజ్ఞానంకలవాళ్ళకే ఈ మతాల పట్టింపులూ కులాలపట్టింపులూను. హైందవస్త్రీగా వుండి రుక్మిణి ఏంసాధించిందని, మతంమార్చుకొని, ఏదో సాధించ తలపెట్టడం? ఎందుకో మతంమార్చుకోవడం ఆమెకి అంత సమంజసంగా తోచలేదు. రుక్మిణి ఏదో బ్రతుకునీడుస్తున్నది. నిజంవిచారిస్తే అదొక బ్రతుకు అనడానికికూడా వీలులేదు.

ఆమెది కుక్క-బ్రతుకుకన్నా కనాకష్టం. ఇట్టిపరిస్థితుల్లో ఆమెకు మతం మార్చుకోవడం ఏహ్యంగాతోచింది. ఏమతం తన బ్రతుకుని తీర్చిదిద్దింది ? ఒకమతంవదిలి ఇంకొకమతం పుచ్చుకోవడానికి. రషీద్‌కూడా ఆమెను ఎన్నడూ మతంమార్చుకొమ్మని బలవంతంచెయ్యలేదు. పైగా మతంమార్చుకోవడం అర్థరహితమైనవిషయమనికూడా అతడనేకసార్లు అభిప్రాయపడ్డాడు. తురకవాడై ఉండికూడా రషీద్ అంతటి న్యాయబుద్ధితో ప్రవర్తించడం రుక్మిణికి ఆశ్చర్యాన్ని కలిగించింది. మీదుమిక్కిలి రషీద్ రుక్మిణికోసం తనప్రాణాల్నే బలిపెట్టడానికి సంసిద్ధపడడం, ఆమెని మరీ ఆశ్చర్యచకితురాల్ని చేసింది. తాను అంతటిత్యాగానికిఅనర్హురాలినని, రషీదుతో మరీమరీ చెప్పింది. నహీంబాను పెళ్ళిచేసుకొని తననువదిలివేసి సుఖపడమని రషీద్‌ని అనేకవిధాలుగా ప్రార్థించింది. అతడు ససేమిరా ఒప్పుకోలేదు. తనని వదిలివేయడానికి అంగీకరించలేదు. దానితో రుక్మిణికి మరీ చిరాకెత్తింది.

రషీదుని రజాకార్‌గండంనుంచి ఏవిధంగా తప్పించడమా అని ఆలోచించింది. తను ఏమిచేస్తే అతనిప్రాణాల్ని కాపాడడానికి వీలవుతుందో చెప్పమని ఒకనాడు ఎల్లమ్మని అడిగింది. రుక్మిణి మతంమార్చుకుంటే రషీదుకుగండంతప్పిపోతుందని ఎల్లమ్మ సలహాయిచ్చింది. రషీదు తననివదిలివేయడానికిఒప్పుకోనప్పుడుతనుమతంమార్చుకోవడమే సమంజసంగా రుక్మిణికికూడా తోచింది. తన బ్రతుకు ఇదివరకే బండలైంది. ఇప్పుడు దాన్ని తీర్చిదిద్దడానికి వీలులేనంతగా తన బ్రతుకు చెడిపోయింది. రుక్మిణికి ఇప్పుడు తన బ్రతుకువిషయంలో ఏచింతా

లేదు. ఆమెకు భూతభవిష్యద్వర్తమానాలు లేవు. ఆమెకు కాలం ఆగిపోయింది. ఇట్టి పరిస్థితుల్లో తను మతంమార్చు కుంటే ఏం? ఇదివరకే తను అన్నికులాలవారితో కలిసి మెలిసి భోజనంచేస్తున్నది. రేపు తను తురకలతో కలిసి భోజనంచేస్తే ఏం? మతంమార్చుకోవడమంటే, తురకలతో కలిసి భోజనం చేయడంమాత్రమేనని ఆమె అనుకుంది. రషీదుని కాపాడడం కోసం తురకలతోనే కాదు, ఎవరితోనైనా కలిసి భోజనం చెయ్యడానికి ఆమె నిశ్చయించింది. మతం మార్చుకోడానికి ఆమె సంసిద్ధపడింది. ఒకనాడు రషీదు రావడంతోనే తాను మతం మార్చుకోవడానికి నిశ్చయించుకున్నాననీ, తనకు ముస్లింమతం ఇప్పించవలసిందనీ, రుక్మిణి అతన్ని కోరింది. దానికి అతను గొల్లుమని నవ్వాడు. ఎందుకు నవ్వుతున్నాడో రుక్మిణికి అర్థంకాలేదు. ఎందుకు 'నవ్వుతున్నా' వని అడిగితే 'నేను ముస్లింనుకాను. అల్లాంటప్పుడు నీవు మతంమార్చుకుని ఏమిచేస్తా' వని ఎదురు ప్రశ్నవేశాడు. 'మరి నీవు ఎవరి' వని అడిగితే, 'నేను భారతీయుడను' అని సగర్వంగా చెప్పాడు. భారతీయుడంటే ఏమిటో రుక్మిణికి అర్థంకాలేదు. 'నవ్వు తాలు వదిలివేసి, నాకు ముస్లింమతం ఇప్పించడానికి ప్రయ త్నించు' మని రుక్మిణి గంభీరంగా చెప్పింది. దానికి 'మతం మార్చుకునేవాళ్ళని చూస్తే నాకు పరమఅసహ్యం' అని అతను అన్నాడు. 'నీకు అసహ్యమైనా నేను మతంమార్చు కోకతప్ప' దని రుక్మిణి నిక్కచ్చిగా చెప్పింది. 'నీవు మతం మార్చుకోనంతవరకే నీవంటే నాకు గౌరవం' అని రషీదు విస్పష్టపరచాడు. 'ఏమైనాసరే నేను మతం మార్చు

కోకతప్ప' దని రుక్మిణి మొండికేసింది. 'అయితే అవశ్యం మార్చుకో' మ్మని అతను అన్నాడు. అతను సహాయంచేయక పోతే రుక్మిణి మతం ఎల్లామార్చుకుంటుంది? రషీదు ఈవిషయంలో సహాయం చేయడానికి నిరాకరించాడు. దానితో రుక్మిణికికోపంవచ్చింది. 'ఈరోజునుంచీ, నీవు నాయింటికి రావడానికి వీలులే'దని అతనితో గట్టిగా చెప్పింది. దానికి అతను చిరునవ్వు నవ్వాడు. చిరునవ్వు నవ్వేవాళ్ళతో ఎల్లా వేగడమో రుక్మిణికి తోచిందికాదు. రుక్మిణికి చిరాకెత్తింది. అయినా ఏం చేస్తుంది. తన చిరాకంతా దిగమింగి తనని వదలివేయమని అతన్ని ప్రార్థించింది. రషీదు ఆమె ప్రార్థంపుల్ని పెడచెవిని పెట్టడమే కాకుండా 'ఈ బొందిలో ప్రాణాలుండగా నిన్ను వదల' నని శపథంచేశాడు. 'మరి వహీదాగతో?' అని అడిగింది. 'ఇద్దరినీ ఏలుకుంటా' నని అతను మొండిగా సమాధానంచెప్పాడు. వహీదాసొత్తును తాను అపహరించానని రుక్మిణి ఎన్నోసార్లు అనుకుంది. పోనీ, రషీదుకి చెప్పకుండా ఎక్కడికైనా వెళ్ళిపోతే! నిజమే, చాలా బాగుంటుంది. రషీదు నిండుప్రాణాలైనా దక్కుతాయి. అల్లా అనుకోవడమేగాని, తాను ఎక్కడికి వెళ్ళగలుగుతుంది? ఎల్లమ్మ పుణ్యమా అని తనకీ ఉద్యోగందొరికింది. ఎల్లమ్మని **వదిలి** తాను ఒంటరిగా ఏదైనా ఉద్యోగం సంపాయించగలదా? అది అసాధ్యం. తను అలా వెళ్ళిపోవడానికి ఎల్లమ్మ కూడా ఒప్పుకోదు. రుక్మిణికి ఏమీ తోచిందికాదు. తాను నిజంగా గొప్పదురదృష్టవంతురాలు. తన దురదృష్టం తనని సమీపించినవారందరికీ చుట్టుకుంటుంది. వారిని పట్టిపీడి

స్తుంది. వారి బ్రతుకును దుఃఖభాజనం చేస్తుంది. చివరకి వారి ప్రాణాలమీాదికి తెస్తుంది. తనవంటి దురదృష్టజాతకులు ప్రపంచంలో ఇంకొకరు వుండరు ఉండడానికి వీలులేదు కూడా.

పన్నెండు దాటివుంటుంది. రషీదు ఇంకా రాలేదు. సినిమా రెండవఆటకి వెళ్ళినా అతను ఈపాటికి రావలసిందే. మనస్సులో ఈ భావం మెదలడంతోనే అమాంతంగా రుక్మిణికి గుండెదడ ప్రారంభమైంది. క్షణ క్షణానికి అది ఎక్కువ కావడం మొదలెట్టింది. రషీద్‌ని ఎవ్వరూ హత్యగావించ లేదుగదా? ఏమో! ఇంక రషీద్ తనకు కనపడడా? ఏమో? ఎందుకో రుక్మిణికి గొంతులో ఉమ్మి మింగుడుపడడంలేదు. తనకికూడా కాలం ఆసన్నమైందా? ఏమో? రుక్మిణి కూచున్నది కూచున్నట్లే ఉండిపోయింది. కళ్ళు వాకిలితలుపుకేసి చూస్తున్నాయి. మెదడు పనిచేయడం మానివేసింది. తను స్పృహతప్పి పడిపోవడంలేదు కద ! ఏమో? ఆ వాకిలి గడపలో ఏమిటది? నాగుపాము కాదుకదా? ప్రేమావతీపేటలోని నాగుపాము తనని వెంటాడి ఇక్కడికి కూడా వచ్చిందా? అదేమిటి? అది పడగేనా? పాము పడగవిప్పి తన కేసే చూస్తున్నది. రుక్మిణిచేతులు అమాంతంగా లేచి పాముకి నమస్కారంచేశాయి. అయినా గడపలోంచి పాము కదలదే! అదేమిటి? పడగ నేలకేసి బాదుకుంటున్నదా? నమస్కారంచేసినా అక్కడినించి కదలదేం? తనేమితప్పు చేసిందని ఈపాము తనవెంటపడుతున్నది? ఇతరులు తనని మోసగిస్తే తను మోసపోయింది. అది తనతప్పా? గంపెడుఆశతో తాను

ప్రేమావతీపేటలోని తమఇంటినించి విశ్వేశ్వరరావుతో లేచి వచ్చింది. అతను పెళ్ళిచేసుకుంటానని తనని మోసగించాడు. ఇంటినించి కదిలిరావడం తనతప్పా? తప్పేకావచ్చు. కాని ఇప్పుడు ఆ మొదటితప్పని సరిదిద్దుకోవడానికి వీలులేదు. ఆరోజు నాగుపాము కనపడిందంటే కొంత అర్థముంది. తనని లేచిపోకండా అడ్డగించిందంటే కొంత అర్థముంది. తిరిగి నేడు నాగుపాము కనపడడంలో అర్థమేమిటాఉన్నట్లు రుక్మిణికి తోచ లేదు. ఇంతటితో తనజీవితం పరిసమాప్తమని తనకి చెప్ప డానికి వచ్చిందా? అయితే, మరీమంచిది. ఆరోజుకోసమే తను ఎదురుచూస్తున్నది. అయితే, తనని కాటువేయదెందుకని? తను నాగుపాముని చూచికూడా కూచున్నస్థలంనించి కదల లేదు. నమస్కారంచేస్తున్నచేతులు, ఇంకా నమస్కారం చేస్తూనేఉన్నాయి. ఏదీ? నాగుపాము ఏదీ? గడపలో ఎక్కడా కనపడదే? అప్పుడే అదృశ్యమైపోయిందా? లేక కాటువేయ డానికి తనవేపు మళ్ళిందా? ఏమో? రుక్మిణి ఊపిరిబిగబట్టి నాగుపాముకాటుకోసం ఎదురుచూచింది. ఒకనిముషం గడి చింది. రెండునిముషాలు గడిచాయి. ఇంక ఏక్షణానో కాటు వేస్తుంది. మూడు... నాలుగు... అయిదు... ఏదీ, నాగుపాము ఎక్కడా కనపడదే! రుక్మిణి లేచి నాగుపాముకోసం ఇల్లంతా వెతికింది. అది ఎక్కడా కనపడలేదు వెలుపలికి వెళ్ళిపోయి వుంటుందా? ఏమో! అది ఇదివరకు ఎవ్వరినీ కరవలేదు. తన వంటిపాపిష్టురాల్ని కాటువేయడం అటుంచి, తాకడానికికూడా అది తప్పక వెనుదీస్తుంది. నిజంగా నాగుపాము తనకు కన పడిందా? లేక వట్టిభ్రమా? ఏమో? ప్రేమావతీపేటనించి

ఇంతదూరం తనని వెంటాడివచ్చివుంటుందా? ఏమో? కాని, పాములు వెంటాడి అల్లా రావడం, తాను చిన్నతనంలో విన్నది. వచ్చినా వచ్చేవుంటుంది. ఏమో, అంతా అయోమయం!

రుక్మిణి ఆరాత్రంతా వివిధఆలోచనలతో గడిపింది. ఒకొకసారి రషీద్ ఇంటికి తిరిగివచ్చి తలుపుకొట్టినట్లూ, తాను లేచివెళ్ళి తలుపుతీసినట్లూ భ్రమపడ్డది. రషీద్ ఆకారం కళ్ళలో అమాంతంగా మెరిసి, ఆవెంటనే అదృశ్యమైనట్లు కూడా రుక్మిణి భ్రమపడ్డది. ఆరాత్రంతా పగటికలలుకంటూ, రుక్మిణి, నెత్తిన ఆలోచనలకుంపటితో గడిపింది. కుంపటి రాత్రంతా రాజుకున్నది. కొన్నిసార్లు పొగలు కక్కింది. మరి కొన్నిసార్లు మంటలు ప్రజ్వలింపజేసింది. రుక్మిణి, రాత్రంతా నెత్తిపై ఆలోచనలకుంపటితోనే గడిపింది. కూచున్నచోటు నించి కదలలేదు, మెదలలేదు. కాగా, ఒక్కక్షణంకూడా కన్నుమూయలేదు.

తెల్లవారింది. కరకర ప్రొద్దెక్కింది. రుక్మిణి కూచున్న చోటునించి లేవలేదు. ఇంతలోకే ఎవరో తలుపు దబదబ బాదుతున్నట్లు చప్పుడైంది. అయినా రుక్మిణి కదలలేదు. ఎల్లమ్మ వెలుపలినించి రుక్మిణమ్మగారూ, రుక్మిణమ్మగారూ! అని గట్టిగా అరుస్తున్నది. రుక్మిణి ఆ అరుపులకి విసుగెత్తి లేచింది. వెళ్ళి తలుపుతీసింది. తీసీతియ్యడంతోనే ఎల్లమ్మ "రషీద్‌ని రాత్రి రజాకార్లు చంపివేశా" రని చెప్పింది. రుక్మిణి ఉలకలేదు, పలకలేదు. ఎల్లమ్మ మోసుకొచ్చిన దుర్వార్త వింటూ నిలుచున్నది. ఎల్లమ్మ ఇంకా చెప్పూరు

పోతున్నది. ఆతురతగా తనధోరణిలో తానుపడి, రుక్మిణి నిశ్చలవదనం గమనించకండానే చెప్పుకుపోతున్నది. "రాత్రి రెండవఆటకి వహీదా, రషీద్‌లు కారులో సినిమాకు వెళ్ళారట. సినిమానించి తిరిగివస్తుండగా రజాకార్లు కారుని అడ్డగించారట. కారుఆగడంతోనే వాళ్ళు కారులోంచి రషీదుని చెయిపట్టుకొని వెలుపలికి లాగారట. ఆ లాగడంలో రషీదు కారులోంచి కిందపడ్డాడు. అదే అదనుగా ఎంచి డ్రైవర్ వహీదాని రక్షించేఉద్దేశంతో వెంటనే కారు స్టార్టుచేశాడట. కారు వాయువేగంతో ముందుకు సాగిందట. కారువెడుతుండడం చూచి, రజాకార్లు వెనకనించి పిస్టోళ్ళు పేల్చారట. డ్రైవర్ రషీదుఇంటికి వెళ్ళి వహీదాని దించి, మరికొందరితో కార్లో తిరిగివచ్చేసరికి రషీదుశవం నడివీధిలో పడివున్నదట, కాగా ఒకచెయ్యి నరికివేయబడివుందట!" అని ఎల్లమ్మ ఏకబిగిని రాత్రిజరిగినవిషయాలన్నీ చెప్పి కొంచెం కుదుటపడి రుక్మిణి వేపు పరీక్షగాచూచింది. రుక్మిణి మొహంలో ఆమెకు విచారంగాని, దుఃఖంగాని ఏమీ కనిపించలేదు. ఆమెమొహం నిశ్చలంగా వుండడంచూచి, ఎల్లమ్మ నిలువునా కంపించిపోయింది. రుక్మిణి ఏడ్వకండావుండడం మంచిదికాదని వెంటనేగ్రహించి, ఎల్లమ్మ ఆమె రెండు చెంపలపైన రెండు దెబ్బలు బలంకొద్దీ కొట్టింది. దానితో రుక్మిణికి వెల్లువగా దుఃఖంవచ్చింది. ఏకధారగా ఏడ్వడం మొదలుపెట్టింది. ఎల్లమ్మ రుక్మిణిని ఓదార్చలేదు. చేయిపట్టుకొని రుక్మిణిని ఇంట్లోనించి లాగి, ఇంటికి తాళంవేసి, ఆమెను ఒకరిక్షాలో

కూర్చోబెట్టి, తను పక్కనకూర్చొని ఎక్కడికివెళ్ళాల్సిందీ రిక్షావాడితో చెప్పింది. రిక్షా పోనివ్వమంది.

రిక్షా కదిలింది. దారిపొడుగునా రుక్మిణి మౌనంగా ఏడుస్తూనే ఉంది. రిక్షాలో ఎల్లమ్మ రుక్మిణితో ఏమీ మాట్లాడలేదు... ...రిక్షా ముందుకు సాగుతూనే వుంది... ఒకవీధిదాటి, ఇంకొకవీధికి వెడుతూనే వుంది... ...చివరికి రషీదుయింటిని చేరుకుంది. అక్కడ సిగరెట్ ఫ్యాక్టరీ కూలీ లంతా గుమిగూడి ఉన్నారు. జనం, ఇసుకవేసినా రాలకుండా ఉన్నారు. ఎక్కడా చడీచప్పుడూ లేదు. ఇంతలోకే ఎవరో ఇంట్లోంచి వెలుపలికి వచ్చి, రాత్రికిరాత్రే రషీదు శవాన్ని భూస్థాపితం చేయడం జరిగిందని చెప్పాడు. దానితో ఒక సమూహం కదిలింది. కూలీలు ఎవరియిండ్లకువాళ్ళు వెళ్ళడం మొదలెట్టారు. పోలీసులు రాత్రికిరాత్రే, శవాన్ని భూస్థాపితం చేయవలసిందిగా బలవంతపెట్టారని యిండ్లకి తిరిగివెడుతున్న కూలీలు తమలోతాము చెప్పుకోవడం ఎల్లమ్మకు వినపడింది. ఎల్లమ్మ రుక్మిణిని చెయ్యిపట్టుకొని, జనసమూహంలోంచి వెలుపలికి లాక్కొచ్చింది. ఇంటికి రిక్షా మాట్లాడి అందులో రుక్మిణినెక్కించి, తాను పక్కనకూచుంది. రిక్షా కదిలింది. వీథులతరువాత వీథులు దాటింది. చివరకి రుక్మిణి యింటికి వచ్చి, ఆమెనీ ఎల్లమ్మనీ దించింది. రుక్మిణిని ఇంట్లో దిగబెట్టి ఎల్లమ్మ తన ఇంట్లోకి వెళ్ళిపోయింది. రుక్మిణి ఇంట్లోకివెళ్ళి తిరిగి ఏడ్వడం మొదలెట్టింది. ఎంతసేపు ఏడ్చిందో ఆమెకే తెలియదు. ఏడ్చి, ఏడ్చి కళ్ళు జ్యోతులై పోయినాయి.

ఏవిధంగా కూర్చున్నది ఆవిధంగానే కూర్చుండిపోయింది. ఏడుస్తూనే ఉండిపోయింది. కాలచక్రం తిరుగుతూనే వుంది.

మధ్యాహ్నమైంది – ఒకటి... రెండు... మూడు... నాలుగు... నాలుగుగంటలైంది. దుఃఖంలోవున్న మనిషిని, ఓదార్చడానికి పోతే, మరీ దుఃఖపడుతుందని ఎల్లమ్మ ఆరోజున రుక్మిణి ఇంటిచాయలకే వెళ్ళలేదు. నాలుగుగంటలకి, రఘుబావని చూడాలనే భావం రుక్మిణి మెదడులో మెరుపులాగా మెరిసింది రఘుబావని చూడాలి... ...రఘుబావని చూడాలి... ... ... వేంకటరామయ్యమామకి నమస్కారం చెయ్యాలి... ...అల్లరి రమణతో మాట్లాడాలి—ఈభావం కలగడంతోనే రుక్మిణి దిగ్గున లేచింది. కొంగుతో కళ్ళు తుడ్చుకున్నది... ...కావల్సినడబ్బు తీసుకున్నది... ఇంటికి తాళంవేసింది... రుక్మిణి తనభావావేశంలో తను పతిత ననే సంగతే మరిచింది. తనకు ఏఇంట్లోకికూడా వెళ్ళడానికి అర్హత లేదన్నసంగతి విస్మరించింది... ... ...రుక్మిణికి ఏదో గొప్ప విపత్తు సంభవించడంతోనే తనవాళ్ళు జ్ఞాపకంవచ్చారు. తనని గాఢంగా ప్రేమించిన తనతల్లి లేదు. తనకీ తనతండ్రికీ మధ్య ఎట్టిప్రేమానురాగాలూ లేవు. తల్లితరువాత రఘుని ప్రేమించింది. వేంకటరామయ్యమామని పూజించింది. అల్లరి రమణని, తనలోని ఒకభాగంగా భావించింది. తనకీ రఘుబావకీ ఈడు కుదిరితే, తను రఘుబావని పెళ్ళిచేసుకొని వుండేది. ఇప్పుడు తనలో ఒకభాగమైన రమణ రఘుబావని పెళ్ళిచేసుకొనివుంటుంది. రమణకి పెళ్ళికాలేదన్నసంగతి ఆ అమాయక హృదయానికి తెలియదు. రఘుబావ పద్మ

అనే అమ్మాయిని పెళ్ళిచేసుకున్నసంగతి తెలియదు. చివరికి వేంకటరామయ్యమామ చనిపోయినాడన్నసంగతికూడా తెలియదు. ఆ అమాయకహృదయం భయంకరవిపత్తులో సాను భూతిని ఆశించింది. తనకు సన్నిహితులైనవారి జాలి కరుణల నాశించి, వైరిఆవేశంలో ఇంటినించి బయల్దేరింది. వేంకటరామయ్యమామ ఎక్కడో ఫీలుఖానాలో వుంటున్నా డని ఎన్నడో విన్నది. ఈమాత్రం సమాచారాన్ని ఆధారం చేసుకుని ఇంటినించి రిక్షా మాట్లాడుకొని ఫీలుఖానాకు బయల్దేరింది. రిక్షా ఎంతవేగంగా వెడుతున్నా రుక్మిణికి నెమ్మదిగానేవెడుతున్నట్లు తోచింది. సైకిల్ రిక్షావాడిని తొందరగా తొక్కమని మరీమరీ త్వరపెట్టింది. గాలిమీద ఎగురుతో రిక్షావాడు ఫీలుఖానాకి చేరుకున్నాడు. ఫీలుఖానాకి చేరుకోవడంతోనే రుక్మిణి రిక్షాదిగి ఎదురుగా వస్తున్న ఒకపెద్ద మనిషిని వేంకటరామయ్యగారు ఎక్కడవుంటారని అడిగింది. ఆ పెద్దమనిషి రుక్మిణిని ఎగాదిగా చూచి "ఆరు ఏడు సంవత్సరాలక్రితం చనిపోయినమనిషి, ఇప్పుడు ఎక్కడ వుంటా" డని రుక్మిణిని ఎదురుప్రశ్న వేశాడు. ఆవార్త విని రుక్మిణిహృదయం నిలువునా క్రుంగిపోయింది. కాస్త తేరుకొని "వారికుమారుడు రఘు ఎక్కడ వుంటాడో మీకు తెలుసునా?" అని అడిగింది. "కొంతకాలం పాటు ఈవీథిలోనే ఉండేవాడు. ఆతరువాత పెళ్ళిచేసుకొని, ఇంకేదోవీథికి వెళ్ళిపోయాడు" అని ఆపెద్దమనిషి రుక్మిణిఅడిగినప్రశ్నకు సమాధానంచెప్పాడు. ఆతరువాత తనదారిని తాను వెళ్ళాడు. రఘుబావ ఎక్కడవుంటాడో రుక్మిణికి

అంతుచిక్కలేదు. ఆవీధిలో ఎవ్వరిని అడిగినా లాభంలేక పోయింది. ఆమె తిరిగి రిక్షా ఎక్కింది. "ఎక్కడికని" రిక్షా వాడు అడిగాడు. "నాయిష్టమొచ్చినచోటుకి పోనివ్వ"మని ఆమె సమాధానంచెప్పింది. "ఎక్కడైనా దారిలో రఘుబావ తనకు కనపడుతాడేమో"నని ఆమెఆశ. రిక్షా వాడవాడలూ తిరిగింది, వీధివీధులూ తిరిగింది. ఎక్కడా రఘుబావ రుక్మిణికి కనపడలేదు. రఘుబావ కనపడకపోయినా, చివరకి తనకు పరిచితమైనమొహాలుకూడా కనపడలేదు. రిక్షావాడికి తిరిగి తిరిగి విసుగువేసింది. ఓపికఉన్నంతవరకూ రుక్మిణిని తిప్పాడు. చివరికి వాడు అలిసి 'ఇంక ఎక్కడికీ వెళ్ళలేనమ్మా' అని చెప్పాడు. అయితే ఇంటికి తీసుకువెళ్ళమని రుక్మిణి చెప్పింది. రిక్షా యింటిమొహంపట్టింది అప్పటికే రాత్రి తొమ్మిది గంటలు దాటింది. వీధుల్లోకొట్లన్నీ మూస్తున్నారు. ఒకొక్క వీధి దాటుతూ నెమ్మదిగా రిక్షా రుక్మిణియిల్లు చేరుకున్నది. రుక్మిణి రిక్షా దిగి రిక్షావాడిచేతిలో పదిరూపాయలనోటు పెట్టింది. మహాఎక్కువైతే, రెండు మూడు రూపాయలు యిస్తుం దనుకున్నాడు. రుక్మిణి పదిరూపాయలనోటు ఇవ్వడంతో, వాడు తనకళ్ళని తానే నమ్మలేకపోయాడు. రుక్మిణి పదిరూపాయలు యిచ్చినట్లు వాడికి నమ్మకం కుదరలేదు. 'చిల్లరలేదమ్మా' అని అన్నాడు. 'అక్కరలే'దని రుక్మిణి సమాధానంచెప్పింది. రిక్షావాడు తన చెవులనుతానే నమ్మలేక, ఇంక అక్కడ ఆలస్యంచేస్తే, డబ్బు అడుగుతుందేమోనని భయంవేసి, డబ్బు జేబులో వేసుకొని, రిక్షా చరచరా నడిపించుకొని వెళ్ళాడు. రుక్మిణి యింటితాళం తీసింది.

తలుపు తెరచి లోపలికి వెళ్ళింది. లోపలినించి తలుపు వేసు కుంది. దీపం వెలిగించలేదు. చీకట్లు చీలుస్తో లోపలికి వెళ్ళింది. చివరకి కటికి చీకట్లలో కూరుకొనిపోయింది.

# 21

సంస్థానంలో రజాకార్ల దురాగతాలు మిన్ను ముట్టాయి. దోపిడీలు, లూటీలు, గృహదహనాలు, హత్యలు, మానభంగాలు విచ్చలవిడిగా జరుగ సాగాయి. ఈ దురాగతాల్ని సహించలేక మీర్ లాయఖ్ ఆలీ మంత్రి వర్గంలోని యిద్దరు హిందూసభ్యులు తమపదవులకు రాజీ నామాలిచ్చారు. సంస్థానమంతా ప్రజల హాహాకారాలతో ప్రతిధ్వనించింది. సంస్థానప్రజాఘోష ఆసేతుహిమాచలం వరకు మారుమ్రోగింది. సంస్థానప్రజలు దర్భరమైనకష్టాల్ని అనుభవిస్తో, అతిదీనంగా ఢిల్లీపైన తమ చూపుల్ని కేంద్రీక రించారు. మానంగా భారతప్రభుత్వసహాయాన్నీ, కరుణనీ, జాలినీ అభ్యర్థించారు. ఇంతలోకే ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంస్థ అధ్యక్షుడు ఖాసిం రజ్వీ 'నేనే రాజును' అని ఒక ప్రకటన చేశాడు. దానితో ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంస్థపై ఆశలు పెట్టుకున్న నిజాం నిలువునా కృంగిపోయినాడు. పాముకు పాలుపోసి పెంచాడు. అది పెద్దదై నిజాంనే కాటు వేసింది. నిజాం హతాశుడై కింకర్తవ్యతావిమూఢుడైనాడు. ప్రవాహంలో పూచికపుల్లలకి మల్లే, అతనికి జిన్నా, చర్చిల్ లు దొరికారు. ఉభయులపై ఆశలు పెటుకున్నాడు. నిజాం

హైద్రాబాదు అభియోగాన్ని ఐక్యరాజ్యసమితిలో ప్రవేశ పెట్టడానికి నిశ్చయించుకున్నాడు. ఈవిషయంలో పాకిస్తాన్ సలహా తీసుకున్నాడు. పాకిస్తాన్ హైద్రాబాదు అభియోగాన్ని ఐక్యరాజ్యసమితిలో ప్రవేశపెట్టడాన్ని ప్రోత్సహించింది. మొయిన్ నవాజుజంగ్ నాయకత్వంలో ఒక రాయబారవర్గం ఏర్పాటుచేయబడింది. ఇతను చేతికందిన డబ్బు తీసుకొని, హైద్రాబాదు అభియోగాన్ని ఐక్యరాజ్యసమితిలో ప్రవేశపెట్టడానికై కరాచీమీదుగా ప్యారిస్‌కు ఒక విమానంలో బయల్దేరి వెళ్ళాడు. ఈమధ్యనే మీర్ లాయఖ్ ఆలీ, మరణశయ్యపై వున్న జిన్నాను కలుసుకొని హైద్రాబాదువిషయంలో అతన్ని సంప్రదించివచ్చాడు ఈ మధ్య భారతప్రభుత్వం హైద్రాబాదుపై ముట్టడి జరుపుతుందనే వదంతులు, సంస్థానమంతటా వ్యాపించాయి. సంస్థాన ప్రజలు, ఆ సుఘడియంకోసం తదేకదీక్షగా నిరీక్షిస్తున్నారు. భారతప్రభుత్వం హైద్రాబాదుపై ముట్టడి జరపడమే తటస్థిస్తే హైద్రాబాద్ పదిహేనురోజులనించి మూడుమాసాలవరకు భారతసేనలకు వ్యతిరేకంగా నిలదొక్కుకొని పోరాడే పక్షంలో పాకిస్థాన్ సహాయంచేస్తుందని, జిన్నా మీర్‌లాయఖ్ ఆలీకి వాగ్దానంచేసినట్లు వినికిడి. జిన్నా ఇచ్చినహామీతో, నిజాం యుద్ధానికి సమాయత్తపడడం ప్రారంభించాడు. సేనల్ని సమీకరించాడు. అరబ్బులనీ, రోహిలాలనీ యుద్ధానికి సంసిద్ధంచేశాడు.

1948 సెప్టెంబర్ 11 వ తేదీన జిన్నా మరణించాడు

సెప్టెంబర్ 13 వ తేదీన రజాకార్ల పాపం పండింది. ఆనాడు భారతసేనలు లెఫ్టినెంట్ జనరల్ మహారాజశ్రీ రాజేంద్రసింగ్ పర్యవేక్షణక్రింద, మూడువేపులనించి సంస్థానంపైన ముట్టడిజరిపాయి. ఈ పోలీసుచర్యకి మేజర్ జనరల్ జె. ఎన్. చౌదరీ నాయకత్వం వహించారు. భారతసేనలు క్రమపద్ధతిని మూడువేపులనించి సంస్థానరాజధానీనగరంపైకి పురోగమించాయి. ఒక్క నల్‌దుర్గులోతప్ప ఎక్కడా, ఎట్టి ప్రతిఘటనా లేదు. పోలీసుచర్య ప్రారంభంకావడంతోనే రాజధానీనగరంలో వీథులు నిర్మానుష్యమైనాయి. వీథుల్లో రజాకార్ల పెరేడ్లు ఆగిపోయినాయి. ఏదో కృత్రిమమైన నిశ్శబ్దత నగరాన్ని ఆవరించింది మతకలహాల భీతివల్ల నగరంలో జన సంచారం తగ్గింది. అస్తమానం ప్రజలు తలుపులు వేసుకొని ఇండ్లలోనే వుండిపోవడం మొదలుపెట్టారు. యెక్కడా యెలాటి ప్రతిఘటనా లేకపోవడం భారతసేనలకి ఆశ్చర్యాన్ని కలుగజేసింది. రజాకార్ల ప్రగల్భాలు యేమైనాయని భారతసైనికులు ఆశ్చర్యచకితులైనారు. యెక్కడో కొందరు రజాకార్ యువకులు నిరాయుధులుగా రణరంగానికి వెళ్ళి 'అల్లాహో అక్బర్' అని నినాదాలుచేస్తో టాంకుల ముందు పడుకున్నట్లు వినికిడి. భారత సైనికులు వారికి వ్యతిరేకంగా యెట్టిచర్య తీసుకోకుండా వారిని అరెస్టుచేసి, పోలీసు చర్యానంతరం వారిని వదలివేసినట్లు తెలిసింది. పోలీసుచర్య ప్రారంభంకావడంతోనే ముస్లింలు వేలకొలది సంఖ్యలో రోజూ రాజధానీ నగరానికి వెల్లువగా ప్రవహించడం మొదలెట్టారు. యెక్కడా అనవసరంగా యెట్టి రక్తపాతంజరగలేదు.

భారతసేనలు క్రమపద్ధతిని సాధ్యమైనంతవరకు రక్త పాతాన్ని తప్పించివేస్తూ, రాజధానీనగరంవేపు పురోగమిస్తూ వచ్చాయి. ఈమధ్య లెఫ్టినెంట్ జనరల్ మహారాజశ్రీ రాజేంద్రసింగ్ హైదరాబాదు సేనలకి ఆయుధాల్ని విసర్జించవలసిందిగా హెచ్చరికచేస్తూ ఒక బ్రాడ్‌కాస్ట్ చేశాడు. భారతసేనలు హైద్రాబాదునగరానికి 50 మైళ్ళ దూరంలో వుండగా హైద్రాబాదు సర్వసేనాని జనరల్ ఎల్. ఇద్రూస్ లొంగిపోవడం మంచిదని నిజాంకు హితవు చెప్పాడు. ఈ హితవుననుసరించి, నిజాం సెప్టెంబర్ 17 వ తేదీ ఉదయం హైద్రాబాదుసేనలు లొంగిపోయినట్లు ప్రకటించాడు. ఈవార్త విని ఖాసిం రజ్వీ వెంటనే మీర్‌లాయఖ్ ఆలీదగ్గరికి పరుగెత్తాడు. సంగతిసందర్భాలు తెలుసుకొని, మధ్యాహ్నం దక్కన్ రేడియోలో తను తలపెట్టినపని విఫలంపొందిందని వాపోయాడు. ముస్లింలను ప్రశాంతంగా వుండవలసిందిగా హెచ్చరికచేశాడు. ఆరోజున సాయంత్రం 5 గంటలకు నిజాంప్రభువు దక్కన్ రేడియోనుంచి బ్రాడ్‌కాస్టుచేస్తూ ఇటీవల జరిగిన దురాగతాలకన్నిటికి రజాకార్లు మాత్రమే బాధ్యులనీ, తను యెంతచెప్పినా వారు తమదురాగతాల్ని మానలేదనీ, హైద్రాబాదుసేనలు భారతసేనలకు లొంగిపోయినాయనీ, ప్రజల్ని ప్రశాంతంగా ఉండవలసిందనీ చెప్పాడు.

భారతప్రధాని పండిట్ నెహ్రూ ఢిల్లీలోని ఆల్‌ఇండియా రేడియోలో సెప్టెంబర్ 18 వ తేదీన మాట్లాడుతూ భారతదేశం అన్నిమతాలవారినీ సమంగా చూస్తుందనీ, మతం

వ్యక్తిగతమైనదనీ, దానికీ రాజకీయాలకూ యెట్టి సంబంధం ఉండకూడదనీ, భారతసేనలు హైద్రాబాదులో శాంతిని నెలకొల్పడమే తమప్రధానాశయంగా పెట్టుకొని పనిచేస్తాయనీ ప్రకటించారు. మేజర్ జనరల్ చౌదరీ సెప్టెంబర్ 19 వ తేదీన హైద్రాబాదు రేడియోలో మాట్లాడుతూ శాంతిని నెలకొల్పడంలో భారతసేనలకి తోడ్పడవలసిందిగా ప్రజల్ని అభ్యర్థించారు. సెప్టెంబర్ 18 వ తేదీ సాయంత్రం భారత సేనలు హైదాబాదునగరంలో ప్రవేశించాయి. ఆనాడు ప్రజలఉత్సాహాతిశయాలకు యెట్టి అవధులు లేవు. ఉభయ నగరాలలో ప్రజలు బారులుతీరి నిలబడి భారతసేనలకి ఘన మైన స్వాగతంఇచ్చారు. భారతసేనలపైన పుష్పవర్షం కురిపించారు. స్త్రీలు బంగళాలపైననిలబడి పైనించి భారతసైనికులపైన పుష్పాలు చల్లారు; మంగళహారతులు ఇచ్చారు. ఆనాడు హైద్రాబాదుసంస్థానం గొప్ప పండుగచేసుకున్నది. ఇండ్లకు మామిడితోరణాలు కట్టారు. వాకిళ్ళలో పెద్దపెద్ద ముగ్గులు వేశారు. భారత సైనికులతోపాటు స్టేటుకాంగ్రెస్‌నాయకులు సరిహద్దులనుంచి రాజధానీనగరానికి విచ్చేశారు. తమ ప్రియనాయకుల్ని చూడడంతోనే ప్రజల సంతోషాతిశయాలు గట్లుదాటి వెల్లువగా ప్రవహించాయి. ప్రజలు ఐక్యకంఠంతో స్టేటుకాంగ్రెస్‌కీ జై! భారతమాతకు జై! మహాత్మా గాంధీకీ జై! పండిత నెహ్రూకీ జై! సర్దార్ పటేల్‌కీ జై! అని జయజయధ్వానాలుచేస్తూ, భారతసేనలకీ స్టేటుకాంగ్రెస్ నాయకులకీ అఖండస్వాగతమిచ్చారు. మేజర్ జనరల్ చౌదరీనీ, స్టేటుకాంగ్రెస్‌నాయకుల్నీ పుష్పమాలాలం

కృతులను చేశారు. ఆనాడు హైద్రాబాదు దాస్యశృంఖలాలు భారతప్రభుత్వంపుణ్యమా అని పటాపంచలైనాయి. లోక కంటకుడైన ఖాసింరజ్వీఅరెస్టుతో ప్రజలుఆనాడు సంస్థానంలో ప్రప్రథమంగా స్వతంత్ర స్వేచ్ఛావాయువులు పీల్చారు. ఎట్టి విచారంలేకుండా ఆనాటిరాత్రి కంటినిండా నిద్రపోయినారు.

## 22

పద్మకి తొమ్మిదిమాసాలు నిండాయి. రమణ సహాయంతో సుఖప్రసవమైంది. అప్పటికి రమణ నర్సింగ్ కోర్సు పూర్తిఅయింది. పద్మకి కూతురు పుట్టింది. గర్భధారణ వల్ల పద్మ కాలేజీచదువు మానుకోవాల్సివచ్చింది. రఘు ఎల్. ఎల్ బి. ఫైనల్ చదువుతున్నాడు. ఆడపిల్ల పుడుతుందని తనూ, లేదు మొగపిల్లవాడు పుడుతాడని పద్మా లోగడ వాదించుకున్నారు. చివరకి రఘు జోస్యమే నిజమైంది. మనుమరాలు పుట్టడంతో ఆంజనేయులుగారి సంతోషానికి మేర లేదు. పెద్దపెట్టున 21వ రోజుక్కై సన్నాహాలు జరపడం మొదలుపెట్టారు. తెచ్చిన చీరెలకు రవికగుడ్డలకి లెఖ్ఖలేదు. ఆనాడు చేయించిన పిండివంటలకు అంతూపొంతూ లేదు. అల్లుడికి రెండు ఉలెన్‌సూట్లు కుట్టించారు. మనుమరాలికోసం ప్రత్యేకంగా శ్రద్ధతీసుకొని మెడలోకి ఒక కొత్త నమూనాలో బంగారుగొలుసూ, కాళ్ళకీ చేతులకీ బంగారు కడియాలూ, రెండుచేతులకు ఉంగరాలూ చేయించారు. గొలుసులోకి పచ్చరాళ్ళపతకం ఒకటి చేయించారు. ఊళ్ళనించి ఇదివరకే బంధువులు వచ్చి ఇంటినిండా దిగారు. వాళ్ళు వాళ్ళ వాళ్ళ

హోదాలనుబట్టి రఘు, పద్మలకీ, కూతురికీ కట్నాలు తెచ్చారు. సాయంత్రం అమ్మాయిని తొట్టిలో వేశారు. నామకరణమహోత్సవానికి రమణ, సుమన్, ఆయేషాలు వచ్చారు. ఆంజనేయులుగారు కూతురుకీ, అల్లుడికీ కట్నాలు చదివించారు. తదితర బంధువులంతా కానుక లిచ్చారు. ఆంజనేయులుగారు రమణ, సుమన్, ఆయేషాలకు చాలా ఖరీదైన చీరెలు పెట్టారు. వెంటనే కొత్తబట్టలు ధరించవలసిందిగా కూతురునీ, అల్లుడినీ బలవంతంచేశారు. రమణ, సుమన్ ఆయేషాలు కొత్తచీరలు కట్టుకొనేవరకూ అతను ఒకపట్టాన వదలలేదు. రంగురంగుల చీరలతో, రంగురంగుల దుస్తులతో ఇల్లంతా కలకలలాడుతున్నది. ఇంతలోనే నామకరణోత్సవం ప్రారంభమయింది. అమ్మాయికి ఎవరికి తోచిన పేరు వాళ్ళు సూచిస్తున్నారు. పేర్లుసూచించడంలో ఒకరితో ఒకరు పోటీ పడుతున్నారు. ఆంజనేయులుగారికి అందులో ఏ పేరూ నచ్చ లేదు. ఉష, ఇందు, సీత, సావిత్రి మొదలైనపేర్లు సూచించ బడుతున్నాయి. కాని ఆంజనేయులుగారికి ఒక్కటీ నచ్చడం లేదు. పోలీసుచర్యద్వారా లోకకళ్యాణం జరిగింది. హైదరాబాద్ సేనలు లొంగిపోయిననాడే అమ్మాయి పుట్టింది. ఆనాడు హైదరాబాదు గొప్ప పరివర్తన పొందింది. ఈ పరివర్తనను సూచించేదిగా ఏదైనా పేరుంటే బాగుండునని అతనికితోచింది. తన మనోగతభావాన్ని రమణని విడిగాపిల్చి చెప్పారు. రమణ ఆలోచించింది. లోకకళ్యాణంజరిగిన రోజున పుట్టింది కనక 'కళ్యాణి' అని పేరు పెడితే ఎల్లావుం టుందని, రమణ ఆంజనేయులుగారిని అడిగింది. ఓ,

భేషుగ్గా వుంటుందని 'అంజనేయులు గారు సమాధానం చెప్పారు. 'నీవే పేరుపెట్టు' మని రమణని కోరారు. పేరుపెట్ట డానికి రమణ అంగీకరించింది. ఊయలదగ్గరికి వెళ్ళింది. అమ్మాయిని కళ్యాణి అనే పేరుతో పిలిచింది. కళ్యాణి ఆ ధ్వనికి కండ్లు తెరిచింది. రమణ సంతోషంతో కళ్యాణిని ఎత్తు కుంది. కళ్యాణిని ముద్దుపెట్టుకుంటూ, డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్ళింది. అక్కడ రఘుబావ కూచునిఉన్నాడు. కల్యాణిని రఘుబావకి అందివ్వాలని ఆమె ఉబలాటం. సుమన్, ఆయెషాలు ఆమెను అనుసరించారు. పద్మకూడా నెమ్మదిగా కూర్చున్నచోటునుంచి లేచి, వాళ్ళ వెనకాల డ్రాయింగు రూము వేపు నడిచింది. రమణ డ్రాయింగ్‌రూముని సమీపిం చింది. ఆయెషా డ్రాయింగ్‌రూముకర్టెన్‌ను పక్కకు తొలగిం చింది. ఎదురుగా రఘు కూర్చునిఉన్నాడు. అతనిదృష్టి రమణ పైన పడింది. ఆమెచేతుల్లో కల్యాణి—

రఘుకి వెంటనే ఆనాడు ప్రేమావతీపేటలో నారాయణ రావుగారు జిల్లానుంచి తిరిగివచ్చిన తరువాత కనపడిన రమణ కళ్ళల్లో జిగేలున మెరిసింది. రమణ ఎర్రని సిల్కుచీరంగా వేసుకుంది. ఎర్రని పట్టుజాకెట్ తొడుక్కుంది. ఉల్లిపొరలాంటి ఎర్రనివోణీవేసుకుంది. అందాలను వొలికిస్తూ తనని సమీపిస్తు న్నది. చేతుల్లో కల్యాణి. అలనాటిదృశ్యం తిరిగి రఘుకళ్ళల్లో ఒక చిన్నిమార్పుతో ప్రత్యక్షమైంది. ఆనాడు చేతుల్లో కల్యాణి లేదు, ఈనాడు ఉంది. భేదం అంతే. రఘుకి ఆ

క్షణంలో తను పద్మని పెళ్ళిచేసుకున్నాననేజ్ఞానంఅంతరించింది. రమణనే పెళ్ళిచేసుకున్నట్లు తోచింది. తనభార్య తనకు తన కూతుర్ని అందివ్వడానికి వచ్చినట్లు తోచింది. ఉద్రేకంతో రఘుకింది పెదవి వణికింది. మొహం ఎర్రబారింది. రఘుకుడి చెయ్యి అమాంతంగా తనకుడిచెంపపైనవున్న మచ్చమీదికి వెళ్ళింది. చేతిమునివేళ్ళు మచ్చని మృదువుగా స్పృశిస్తు న్నాయి. తదేకదీక్షగా అతను రమణకళ్ళల్లోకి చూడడం మొదలెట్టాడు. రమణ మొహంపైనించి చూపులు తొలగించ కండా, తత్తరపాటుతో సోఫాలోంచి లేచాడు. ఒకఅడుగు ముందుకు వేశాడు. చూపులుతొలగించకుండా, కల్యాణిని అందుకోవడానికి సమాయత్తపడ్డాడు. రమణ రఘుఉద్రే కాన్ని గ్రహించింది. తత్తరపాటును పరిశీలించింది. ఒకత్రుటి కాలం ఆలోచించింది. కొంపతీసి రఘుబావ, తను రమణఅని తెలిసికూడా తన్నేఅతనిభార్యగా ఊహించుకోవడంలేదుకదా! తననే వివాహంచేసుకొని, తనకే కల్యాణి పుట్టినట్లు పగటి కలలు కనడంలేదుకదా! పద్మ తనభార్య అన్నసంగతి మరచి పోలేదు కదా! బహుశా అంతే జరిగివుంటుంది. లేకపోతే, ఆ తత్తరపాటుకుగాని, ఆచూపులకుగాని అర్థంలేదు. ఎందుకో బాధ ఎదిగినట్లు తోచలేదు రమణకి. ఇంకా ఆ ఫ్యాన్సీలోనే కొట్టుకుపోతున్నాడు. ఇంకా ఆ ఏడుసంవత్సరాలక్రిందటి పగటి కలలు కంటూనేఉన్నాడు. తనని రఘుబావ తనభార్యగా ఊహించుకుంటున్నాడు. మనుషులు ఒకదశలో ఆగిపోయి

ఎంత ఈడువచ్చినా ముందుకు సాగకపోవడం విచారకరం. యౌవనం అందించే పగటికలల్లో నిలిచిపోయి చుట్టూవున్న పరిస్థితుల్ని గమనించి అయినా పురోగమించకపోవడం చాలా విషాదకరమైన విషయం. రఘుబావకి ప్రాక్టికల్‌దృష్టి లేక్కపోవడం చూచి రమణ విచారించింది. "ఇతను క్లిష్టసమస్యలతో కూడుకొనివున్న ప్రపంచాన్ని ఎల్లా నెగ్గుకొస్తాడా" అని సందేహించింది.

"నీవు మొట్టమొదటిసారి నాకు ప్రేమావతీపేటలో కనపడినదశలోనే ఇంకా ఉన్నావు. అప్పటినించీ ఇప్పటికి ఏడుసంవత్సరాలు గడచినా నీవు ఏమాత్రం ఎదగలేదు" అని చప్పున వెనుదిరిగింది.

రఘుకి ఉత్తరక్షణంలో మైకం వదిలింది. రమ మాటలు హృదయంలో సూటిగా గుచ్చుకున్నాయి. "ఆ" అని మాత్రం అనగలిగాడు.

రమణ వెనుదిరిగి కల్యాణిని పద్మకి అందించింది. చప్పున డ్రాయింగ్‌రూమ్‌లోంచి వెళ్ళిపోయింది.

రమణ వెళ్ళిపోతూంటేరఘుచూపులు రమణవీపుమీద పడ్డాయి. ఆమె తెల్లనిపట్టుచీర ధరించి, తెల్లనిపట్టుజాకెట్ తొడుక్కున్నట్లు అప్పుడు గ్రహించాడు రఘు.

ఎర్రనిసిల్కులంగా, ఎర్రనిజాకెట్, ఎర్రనివోణి ఏవీ ?

